# సర్వ సిద్ధాంత [illegible]

## శ్రీ శంకరానంతరాద్వైతము






"సాధన రహస్యా"ది బహు గ్రంథకర్తలు,

శ్రీరామకృష్ణాశ్రమములు (బాపట్ల & భీమునిపట్నము)

సంస్థాపకులు ;

పరమహంస - పరివ్రాజకాచార్య

**శ్రీ అనుభవానంద స్వాములవారు**

పదునైదవ కుసుమము

సర్వహక్కులు ప్రకాశకులవి

ద్వితీయ ముద్రణ : 1985

వెల : రు. 20-00



"This Book is Published with the financial assistance of
TIRUMALA TIRUPATHI DEVASTANAMS
Under their Scheme aid Pu lish religious books."

ప్రతులకు :

శ్రీ అనుభవానంద గ్రంథమాల

బాపట్ల - 522 101 గుంటూరు (జిల్లా)

మరియు

పరమహంస కార్యాలయము

భీమునిపట్నము - 531 163 విశాఖ (జిల్లా)

# ద్వితీయ ముద్రణము

నుభవముతోకూడిన వచన రచనములు సాధనాపటిమచే గలిగిన వలన సాధ్యము. ఆ ఏకాగ్రతచే జ్ఞానమును, 'ఏక విజ్ఞానేన ానం భవతి' అ జ్ఞానముచే సర్వ విజ్ఞానములు కలుగుచున్నవని ,ము. అదికూడ పూర్వజన్మ సుకృతలభ్యమే!

ు అనుభవానంద స్వాములవారు, సకల సమన్వయావతారమగు కృష్ణ దేవుని సర్వాదర్శమూర్తిగా ఆరాధించిన మహనీయులగు , వారి వచన రచనములందు ఆ సమత్వము వ్యక్తమగుచుం ఆ సమత్వము వారి సకల గ్రంథములలో ప్రవహించుచుండును. ంథమే 'సర్వ సిద్ధాంత సౌరభము', ఆ పేరులోనే ఆ సమరస ్యక్తము.

సర్వ వేదాంత సిద్ధాంత సారసంగ్రహము"ను శ్రీ శంకరులును, ద్ధాంత లేశ సంగ్రహము"ను శ్రీ అప్పయ్య దీక్షితులును రచిం 'సర్వ సిద్ధాంత సౌరభము'ను శ్రీ అనుభవానంద స్వాముల రచించిరి. పుష్పముల సువాసన నాఘ్రాణించినవారు, ఆ కుసు ఎచ్చట నున్నదో అని అన్వేషించి, ఆ వృక్షమును కనుగొని చినట్లు సిద్ధాంతమను పుష్ప సౌరభమును గాంచినవారుకూడ గవేష లిపి, ఆ సిద్ధాంత వృక్షరాజమును కనుగొని ఆనందించవలయు స్వాములవారి ఉద్దేశము. ఏ పూవు విలువ సుగంధములు అట్లే ఏ సిద్ధాంత విశిష్టత దానిదే! ఆ సమత్వ గ్రహణము

[illegible] నకే యీ 'సౌరభ' రచనము. ఆ సామరస్యముచే [illegible] ను కాసి, పర మత దూషణముల మాని, విశాలమును [illegible] నగు ఆనందమును పొందనగును.

[illegible] శ్రీ రామకృష్ణ దేవుని ప్రత్యేక సాధనా విధానము; [illegible] పరీక్ష అనుభవస్థితి; సాధనలనేకములుగాని అనుభవము [illegible]; సిద్ధాంతములు బహుళములుగాని గమ్యమొక్కటే; సకలాను [illegible] ైన శ్రీరామకృష్ణుని సమస్త సాధనా విధానములను, సర్వ [illegible] సామరస్యమును, సకలానుభవ రహస్యములను వ్యక్తము చేయుటకే [illegible] శ్రీ అనుభవానంద గ్రంథములను శ్రీ అనుభవానంద స్వాములవారు [illegible].

ఈ గ్రంథ ముద్రణమునకు శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము [illegible] లు ఆర్థిక సహాయము చేసి, మా గ్రంథమాల కృషికి [illegible] వారికి మా కృతజ్ఞతలు.

పాఠకులు దీనిని పఠించి, మన మహర్షుల భౌతికాభౌతిక విజ్ఞాన [illegible], మన ప్రాచీన భారతీయాధ్యాత్మిక సంస్కృతీ [illegible], యథార్థ భారతీయులై మనెదరుగాక!

మాతాజీ

[illegible]

శ్రీ శారదారామకృష్ణాభ్యాం నమః

# సర్వసిద్ధాంత సౌరభము

## షష్ఠమ భాగము

## ముఖప్రబంధము

వేదాహమేతం పురుషం మహాంతం
ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్
తమేవ విదిత్వాఽతిమృత్యుమేతి
నాన్యః పంథా విద్యతేఽయనాయ॥

యజుర్వేద – వాజసనేయ-31–18.

అంధకారమున కావలగల సూర్యతేజోస్వరూపుడును సర్వవ్యాపకుడును అగు ఆ పురుషుని నే గ్రహించితిని. అతని నెరింగి మృత్యువును దరింపగల్గుదురు. ఆ స్థితికి జ్ఞానము వినా అన్యమార్గాంతరము శూన్యము, అని ప్రపంచ క్షణికత్వ అల్పత్వముల జూచి, నిత్య బుద్ధ ముక్త ఆనంద స్వరూపమైన సర్వాజ్ఞానవిదూరమైన వేదప్రోక్తమైన బ్రహ్మమును పొందుటయే శరణ్యమని విశ్వసించి, కృషి సల్పి, సాధించి, అనుభవించి, ఆనందాతిరేకమున దోడి మానవాదర్శమునకై ఒక వైదిక మహర్షి పుంగవుడు ఎలుగెత్తి వేదమున బ్రకటించియున్నాడు. ఈ మహాసూక్తి రాజమున సర్వగమ్యమైన ఆ పురుషుడు, సృష్టియు, నందుగల అనుభూతులవలె నల్పము గాక సర్వవ్యాప్తమైన మహద్రూపమనియు, అఖిలవర్ణముల కధిష్ఠానమై

పరిపూర్ణ భాను తేజోస్వరూపుడనియు, మరియు, లోకమున గాననగు వివిధ తమోసంచయమునకు అతీతుడనియు ప్రకటింపబడియున్నది. ఇట్లు ఆ పురుష స్వరూపమును అభివర్ణించి, ఆతని గ్రహించిమాత్రమే మృత్యుపరంపరా మూలమగు భవసాగరమును దరించుటయని అందలి అమృతత్వమునుగూడ వ్యక్తమొనరించినది. అట్టి స్థితిని బొంద జ్ఞానమార్గముగాక మార్గాంతరము లేదు అనియు నిస్సంశయముగా దీర్మానించుటచే, సాధనసిద్ధి అనుభవముల నీయొక్క శ్లోకము వివరించుచు, జ్ఞానమార్గ ప్రాశస్త్యమును ప్రస్ఫుటక్రియ వెల్లడించియున్నది.

ఈ పరమరహస్యము నందుకొనిన మహర్షి చంద్రులనేకులు తమ సర్వస్వముల త్యజించి అఖండబ్రహ్మానుభూతిని సాధించి, ఆనందించి ఉపని షత్తుల చర్చించి ఆయానంద పీయూషరుచుల ననేకుల కనుభూత మొనరించి చరితార్థులై విరాజిల్లి యుండిరి. సర్వశాస్త్రముల నీ యనంత అద్వైత బ్రహ్మతత్త్వ ప్రతిపాదనము బహుళముగ వ్యాప్తమై, సర్వశాస్త్ర గమ్యమై సర్వముముక్షుకోటి హృదయజ్యోతియై వెలుగుచు, మానవ జీవనమున కాద ర్శమై యొప్పియున్నదనుటకు నెట్టి సందియమును గానరాదు.

— ० —

## అద్వైత ఖండము

ఈ విధముగ ననాదికాల పరంపరాగత అద్వైత అఖండ జ్యోతిని, సత్వతత్త్వ శాస్త్రపాదపములైన షడ్దర్శన వివరణానంతరము మన సౌరభ

అందుకొనినదై తన నాలుగవ భాగమునుండి ఆరవ భాగము
ద్వైత ఖండమునా వివరింపబూనియున్నదని ఎల్లరకు విదితము.
పూర్వాద్వైతమను అద్వైతఖండ ప్రథమ భాగము, ఋగ్వేదమున
సూక్తాది అద్వైత విషయములతో ప్రారంభించి, వేద, ఉపని
త్, స్మృతి, పురాణ, ఇతిహాసాదుల గల అద్వైత భావముల
అద్వయ సిద్ధాంతమైన బౌద్ధమున అద్వైతమును గ్రహించి,
పాదాచార్యుని మాండూక్య కారికల ద్వారమున శ్రీ శంకర భగ
వత్పాదుని అమృత హస్తమునకు జేరికొన్నది. అందు, అద్వైత
సర్వతోముఖాదర్శము, సర్వసంశయ విచ్ఛేదకత్వము, నిఖిల మాన
ము నిఃశ్రేయస కారకత్వము: పూర్వాధున భావసంచయ సమన్వ
ః సర్వగమ్యత్వము, మొదలగు అసంఖ్యాక అద్వైత వైశిష్ట్య
భాగమున సౌరభము వెలువరించి యున్నది. "అద్వైతం పర
హం" అని నిర్ధారించినది. అద్వైత సిద్ధాంత సింహముతోబాటు
నా యద్వైతవాణినజేయ తారకమంత్రముగ రూపొందించి, సర్వా
నముఃన దాని నధిష్ఠింపజేసి యున్నది.

ద్వైత సిద్ధాంత శ్రేష్ఠత్వమును బాల్యముననే గ్రహించి, ఏతన్మ
ాస్వాదనాపేక్షాభరిత చిత్తమున, సర్వత్యాగమున బాలసన్న్యాసియై,
ర్యయన మహోదధుల సద్గురు పరమసన్నిధి మునింగి, విద్యాప
ఐహ్మతేజో విభూషితుడై, సర్వజ్ఞుడై బ్రహ్మవిద్యారణ్య కేసరియై;
విజ్ఞానలక్ష్మికి మహదలంకారమై ప్రకాశించు, శ్రీ శంకర భగ
వత్పాదుని అద్వైతవాద ప్రతిపాదనావిధాన పరిశీలనమునకు,

సౌరభము, అద్వైతఖండ ద్వితీయ భాగమున బ్రవేశించినది. శ్రీశంకరావ
తార, కాల నిర్ణయముల నిర్ణయించి, శంకరునితో ఆ బాల్య మహాసమాధి
పర్యంతము బర్యటించి, ఆ యద్భుత జీవితమున గల ఔచిత్యానౌచి
త్యముల జర్చించి, హేయముల ద్రోసి. కొంతవరకు శంకరు సాహచర్య
మహాభాగ్యము నొందియున్నది. అంత, శంకర రచనముల దుమికి
అందలి అశేష, అద్వితీయ, ఆనందరసముల ద్రావి, సంశయముల ద్రోసి,
శ్రీ శంకర హృదయ మాధుర్యమును జవిజూచి ఆనందించినది.

అంతటితో దృప్తిగాంచక మన సౌరభము, యీ అద్వైత ఖండ
తృతీయ భాగముద్వారమున శ్రీ శంకర శిష్యకోటి ననుసరించి, వారిలో
నుద్భవించిన "వివరణ ప్రస్థాన" "భామతీ ప్రస్థాన" భేదముల దిలకించి,
అవగాహనమొనరించికొని, వ్యత్యాస కారణముల నారసి వివరించి చూపి
నది. అందును ముఖ్య మూర్తులైన సురేశ్వర, విద్యారణ్య, వాచస్పతుల,
ప్రముఖ వాదముల గ్రహింప బూనుకొనుటయేగాక, ఆధునిక విద్వాంసు
లలో నొక యుత్తమ రచయితగ, పండితుడిగ పేరెన్నికగనిన సాధు నిశ్చల
దాస కృతులకూడ స్వీకరించి, అతని మతమును గొంతసంత సమీక్షించినది.

ఈవిధముగ అద్వైత ఖండము, సమగ్ర అద్వైతవాద ప్రతిపాద
నాంశముల జూపెట్టుచు నొప్పారుటచే, పూర్వమే వచింపబడినచందము
"పేరుకు తగినట్లు ఇది నిజంగా సర్వ సిద్ధాంత సౌరభం" అని, "విశ్వకోశ
మని", "విద్యార్థులకును, విద్వాంసులకును ఆనందమొసగగల"దనియు
పండితులచే గీర్తింపబడుటయే గాక, దక్షిణదేశమున అద్వైత పీఠాధ్యక్షు
లకుకూడ నత్యంత ప్రమోదమునకాకరమై యొప్పియున్నది. "ఎటువంటి

వారికి గూడ భ్రాంతి నివారకమై, అధ్యాత్మ శాస్త్రములలో రుచిపుట్టించు నదిగా నున్నది" అని జగద్గురు శ్రీ శృంగేరీ పీఠాధిపతులు శ్రీశ్రీ శ్రీమదభినవవిద్యాతీర్థ మహాస్వాములవారు అభినందింప, An Encyclopaedia of Indian Philosophy in Telugu. ఆంధ్రభాషలో భారతీయ తత్త్వశాస్త్ర విజ్ఞానసర్వస్వము అని జగద్గురు శ్రీ కామకోటి పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతీ మహాస్వాములవారు ఆనందించిరి. "ఎట్టి గ్రంథమొకటి ఆంధ్రులకు కావలయునని అనుకొంటినో ఆ యట్టి దిదియ అనియు నేననుకొనుచున్నా"నని శతావధాని శ్రీ వేలూరి శివరామ శాస్త్రిగారు సంతసించి వచింప, "శాస్త్రీయానుభవానంద సర్వ సిద్ధాంత సౌరభం। జీయాదాంధ్రవచో ముద్రాభద్రాయిత సదాశ్రయం॥ అని మహోపాధ్యాయ జమ్మలమడక మాధవరామశర్మగారు కీర్తించినారు. ఈ చందము ప్రామాణిక పండిత బృందము చేతను, అసంఖ్యాక ప్రజానీకముచేతను గొనియాడబడుచు, ప్రేమింపబడుచు, దెలుగునాట వ్యాప్తినొందుచున్న సౌరభ అద్వైతఖండము యొక్క అదృష్టమే అదృష్టము. ఈశ్వరకృపావిశేషము.

) — (

# సర్వసిద్ధాంత సౌరభము

సర్వ సిద్ధాంత సౌరభమున షష్ఠమ సంపుటముగను, అద్వైత ఖండమున దృతీయ భాగముగనున్న యీ ప్రస్తుత శ్రీశంకరానంతరాద్వైతముతో నీ జటిలమైన అద్వైత ఖండము శోభాయమానముగ ముగి

సినవి. ప్రస్తుత గ్రంథముగూడ, దన పూర్వభాగద్వయమువలె, దర్శన ఖండ భాగత్రయమువలెను, దేశవ్యాప్తితోబాటు నిర్మల కీర్తిసంపదల నార్జించి, అసంఖ్యాక ముముక్షుకోటికి సదా సేవానిరతి మన్నతనొంది తన ఆవిర్భావ మహదవకాశమును సార్థక్యమొనరించుకొనుగాక అని గాఢ విశ్వాసము. వేదాది నేటిపర్యంతము సౌరభవాటిచే నింతవరకు బ్రస్తావిత మైన, సూచితమైన మరియు బ్రస్తాపింపబడనట్టి అసంఖ్యాక దర్శన, అద్వైతాచార్య బృందము. సౌరభము నాశీర్వదించి, రానున్న వైష్ణవ, శైవ, శాక్త, బౌద్ధ, సమన్వయ ఖండములమూలమున, సౌరభముఖమున, అభివ్యక్తము కానిరీక్షించుచున్న అగణిత మహర్షి మండలినిగూడ సౌరభము నకు సేవించు మహాభాగ్య మొసంగుగాక యని ఆ పరమేశ్వరుని బ్రార్థించు చున్నారము. ముముక్షుజన సేవయే పరమాదర్శముగ దృక్పథమున నిడికొని, దేశముల బర్యటించు నీ "సర్వ సిద్ధాంత సౌరభము"ను, ఆంధ్ర ప్రజానీకము ప్రేమాదరముల స్వీకరించి, అభిమానించి, తమ అధ్యాత్మికాభివృద్ధికై యుపయోగించుకొందురుగాక! ఇందులకు భగవాన్ శ్రీరామ కృష్ణదేవుడు సర్వదా, సర్వదా, తన అనుగ్రహ వీక్షణముల మనపై బ్రసరింపజేయునుగాత !

మంగళమ్ మహత్.

) — (

# సర్వ సిద్ధాంత సౌరభము

## అద్వైత ఖండము

## శ్రీ శంకరానంతరాద్వైతము

ఓం శ్రీ శారదా రామకృష్ణాభ్యాం నమః

# శ్రీ శంకరానంతరాద్వైతము

## ఉపోద్ఘాతము

### ప్రస్తుత ప్రపంచము

Wonders are many, but there is no wonder wilder than Man. అద్భుతములనేకములు, కాని మానవునికంటె నద్భుతమైన విచిత్రము వేరొండులేదు అని గ్రీసుదేశ సుప్రసిద్ధ ప్రాచీన తత్వవేత్త యగు Sophocles సోఫకిల్సు సూక్తి. ఆదేవిధముగ Man is enchained by the very condition of his being, his finiteness and involvement in nature.... Man is thus his own greatest mystery. 1 తన వ్యక్తిత్వమున, తన సంకుచితత్వమున, ప్రకృతి బద్ధుడై మానవుడు బంధింపబడియున్నాడు. అట్లు మానవుడు తనకే అద్భుతః దుర్జ్ఞేయ తత్త్వమై యున్నాడు అని ఆధునిక భౌతికవిజ్ఞాన తత్త్వాచార్యుడైన లింకన్ బార్నెట్ వచనము. అందుచే, మానవతత్త్వ విచారముగాక యీ భౌతికతత్త్వ పరిశీలన మెందులకు అని గ్రీసుదేశ సుప్రశస్తజ్ఞాని సోక్రటీసు చింతించియున్నాడు. 2

1. Dr. Lincoln Barnett : The Universe and Dr. Einstein, p. 127.
2. Socrates.

అయినను The mind that split the atom is superior to the atom itself. 3 పరమాణువును భేదించిన మనస్సు ఆ యణువుకంటె శ్రేష్ఠమగుచు సచేతనములలో నద్భుతచేతన శక్తియై నా యచేతనమును సృజించి, పెంచి, ఉపయోగించి, నియమించి, నిరమింప జేయగల విచిత్ర శక్తితత్త్వమగుటచే నఘటనాఘటన సమర్థయై సృష్ట్యాది నేటివరకు విశ్వమున నగణిత అద్భుతముల గావించి, మరల మానవునికే ఆశ్చర్యముల గలుగజేయుచుండుట సర్వానుభవము. దాని శక్తి వివిధ రంగముల బ్రవేశించి అపూర్వము లనబడదగు ననేక వైచిత్ర్యముల గల్పించుచున్నది. అది అభౌతికముల సృజింప జాలకున్నను ఈశ్వరసృష్ట జగతిలోని తత్త్వముల సామాన్య రూపముల మార్చి, అసంఖ్యాక రూపాంతరముల బరిణమింపజేసి మానవుని సుఖసముపార్జనకార్యమున నుపయుక్తమగుచున్నది. అందుచేత నాస్తికులు సగర్వముగ బలుమారు సర్వత్ర ప్రకటించుకొనుచుండునట్లు, విశాల విశ్వదిమునకు నానాటికి అవధులు సంకుచిత పరుపబడి మానవుని చేతులకందుచున్నది. మానవుని హస్తములు కబంధ హస్తములై భూగోళ మునగల పర్వతాగ్రముల నధిష్ఠించుట, అగాధసాగరముల జొచ్చి మథించుట, చొరరాని ధృవసీమల దూరుట మొదలగు అమానుష కార్యము లనే గాక, ఆకసమున కెగసి, భూమండలమును నిముషములలో బ్రదక్షిణ మొనర్చుచు, నంతటితో దృప్తిగాంచక: ప్రాతఃసమయమున నరుణకాంతుల

3. Dr. S. Radhakrishnan : The Indian Institute of Culture, Bangalore 1955.

నెల్లెడల జిమ్ముచు, హిరణ్మయ రూపమున ఉదయాద్రి దోచిన బాల భాస్కరుని దిలకించి, చకితుడై అపూర్వ మధురఫలమని తలంచి, రివ్వున గగనవీధి బయనించి ముఖమున భాను గబళించిన జ్ఞాన విజ్ఞాన శౌర్యగాంభీర్య ఔదార్యభక్తి తన్మయమూర్తి హనుమంతునివలె, నేటి మానవుడు. భూమండలమును బరివృతమై భ్రమించుచున్న అసంఖ్యాకగ్రహ నక్షత్రములపై లంఘింప యత్నించుచున్నాడు. అపూర్వమైన భౌగోళిక సృష్టిరహస్యముల గ్రహింప భూమండలమునకు రంధ్రమును వేయ యత్నించుట మాత్రముగాక, చంద్రమండలమును జేర యత్నించుచున్నాడు. అంత గ్రహాంతరముల గబళింప జూచుచున్నాడు. ఇది యంతయు బూర్వము వచింపబడిన మానవునిలో నంతర్గతమై నిగూఢమై అంది అందని చిత్తవైచిత్ర్యమేగదా.

కాని, హనుమదాదర్శమునకు, నేటి మానవాదర్శమునకు హస్తిమశకక్రాంత తారతమ్యము. అతడు, జ్ఞానవిజ్ఞానతత్త్వముల సమరస సమన్వయమూర్తి. శౌర్యౌదార్యముల మేలు కలయిక. శక్తిభక్తుల అద్భుత సమ్మేళన స్వరూపము. అట్టి ఆదర్శము, ఆధునిక మానవునిలో నగోచరము. కాని, అది సంపూర్తిగ శూన్యముగాక, నంతరమై, అమూర్తము అవ్యక్తము. ప్రపంచమే మంచిచెడ్డల, పుణ్యాపాపముల సంయోగము. మానవుని దృష్టి చెడ్డపై బడినచో, చెడునే అతడు జేయును. మంచిపై దృష్టి సారింపగల్గుచో, సత్కార్యముల మాత్రమే ఆచరించును. అగ్ని ఎంతటి దాహకశక్తి గలదై సర్వసంహారము జేయగలదో, అటులే అది మహాప్రాణశక్తియై అనంతలీల జీవుల బోషించుచున్నది. కాన ప్రస్తుత ప్రపంచ

పరిస్థితి నాలోకించినచో, నాందోళనము కలుగకమానదు. ఎందుచేత ? Man has conquered everything outside of himself and has lost everything inside of himself. 4. మానవుడు తనకు బాహ్య జగత్తునంతటిని జయించెను. కాని, తన యంతరమున సర్వమును గోల్పోయెను. కావున the intellectual life of the whole of Western society is increasingly being split into two polar groups. At the one pole we have the literary intellectuals at the other scientists, and the most representative, the physical scientists. Between the two a gulf of mutual imcomprehension - some times (particularly among the young) hostility and dislike, but most of all lack of understanding. 5. పాశ్చాత్య ఖండమునగల ప్రజ్ఞానిధుల సంఘము ద్వివిధముగ జీలికలు ప్రబలముగ బొందియున్నది. ఒకప్రక్క శేముషీదురంధరులగు సాహిత్య సంపన్నులు, మరియొక దిక్కున భౌతిక విజ్ఞానవేత్తలు. ఈ యుభయులకు మధ్య పరస్పరాగోచరమగు అగాధము ఏర్పడి, ముఖ్యముగ యువకులలో ద్వేష దౌర్జన్యములను గూడ గలుగ జేయుచున్నది. ఎక్కువగ విషయ గ్రహణశక్తి లోపమే కారణము అని B. B. C లో విజ్ఞాన సాహిత్యవేత్త యగు స్నో పండితుడు వివరించి యున్నాడు. సాహిత్యపరులు విజ్ఞానవేత్తలకు

4. K. S. Ramaswami Sastry : Prabudha Bharata, 1952, p. 378.
5. Sir Charles Snow : B. B. C. Talk, The Mail, 31–7–1959.

మూర్ఖత్వ అహంకారముల నన్వయింప, విజ్ఞానపరులు సాహిత్యవేత్తల దూర దృష్టిశూన్యులనియు, నిందించుచున్నారు. వైజ్ఞానిక శాస్త్రమే ఒకరికి సంస్కృతి యగుచుండ, పారమార్థిక దృక్పథము సంస్కృతి యని ఇంకొకరు తలంతురు. వైజ్ఞానికులు అల్పసంగీతమునగాక, నితర కళా సాంగత్యములులేక, అనుక్షణము వస్త్రాన్న విషయముల తాపత్రయములతో మునిగి, They were impoverished by this mistaken idea. 5. యీ దోషదృష్టిచే హృదయ దారిద్ర్యమును బొందియున్నారు. రెండవ పక్షము గూడ నెక్కువగ బేదగనేయున్నది. అది ప్రాచీన సంస్కృతియే ముఖ్యమని విశ్వసించి, వైజ్ఞానికసంపద కాదని దాని నిరసించుచు, మానవ మేధా సంపదను గోల్పోవుచున్నారు. ఈ ద్వివిధ దృక్పథములు చింతనీయము. దీనిచే We are letting some of our best creative chances go by default. 5. అత్యుత్తమ నిర్మాణ శక్తుల, దోషదృష్టిచే మనము గోల్పోవుచున్నాము. అది దురదృష్టము, విచారము అని అతడు, ప్రస్తుత ప్రపంచ మేధావుల విశాల దృక్పథ రాహిత్యమునకు వాపోయి యున్నాడు. ఈ పరస్పర వైరుధ్య తత్త్వములును, భౌతికదృష్టియు, పారమార్థిక దృష్టియు, నెల్లకాలముల నుండి చార్వాక వేదాంతపక్షములు గవ్యవహరించుచున్నను, ప్రస్తుత ప్రపంచమున నవి అతివ్యాప్తమై, అపాయకర స్థితినందుకొని యున్నవి.

కేవలము విద్యావేత్తలు ఎట్టి హానియు ప్రపంచమున జేయజాలకున్నను, విజ్ఞానవేత్తలు మాత్రము బాహ్య ప్రకృతి శక్తుల నరికట్టి,

5. Sir Charles Snow : B. B. C. Talk, The Mail, 31-7-1959.

బంధించి, అందుండి అపూర్వ శక్తుల బిండి, మున్ను వచించియున్నరీతి మానవాభ్యుదయమునకుగాక, వినాశమునకు నుద్యుక్తులగుచుండుట చాల ప్రమాదకరమై, సర్వప్రపంచమున నొక సంక్షోభమునకు గారణమైనది. అఖిల భారత తత్త్వజ్ఞాన సభాధ్యక్ష స్థానమునుండి, ఆచార్య ఆత్రేయ హెచ్చరించినరీతి So, we have today cxperts and specialists who have the greatest acquaintance with the minutest things of a particular kind, and who know very little about other things in the world. They are apt to see the whole world with the glasses coloured by their experience in the narrowest field of nature. But there are general problems before man which concern his own nature and the world as a whole. 6. ఒక ప్రత్యేక విషయమున నతి సుసూక్ష్మ విషయములో నత్యంత పరిచయము నార్జించిన నిపుణులు మనకు గలరు. వారికి బ్రపంచమున నితర విషయములెవ్వియు దెలియవు సంకుచిత ప్రకృతి దృష్టులతో వారు, ప్రపంచ సర్వమును దిలకించుట సహజము. కాని తన సంపూర్ణ స్వభావమునకును, సర్వ ప్రపంచమునకును సంబంధించిన సామాన్య సమస్యలనేకము గలవుగదా! వానిని మాత్రము యీ వైజ్ఞానిక నిపుణుల సంఘము నిర్లక్ష్యము చేయుచున్నది అని అతని అమూల్యమైన హెచ్చరిక. కేవలము సంకుచిత దృష్టిలో, దమ ప్రత్యేక విషయ నైపుణ్యమునే ప్రధానముగ, స్వార్థబుద్ధిచే, సర్వతో ముఖ దృక్పథము లోపించుటచే నీ ప్రముఖులు, జీవలోక వినాశకర ప్రవృత్తుల

6. Dr. B. L. Atreya : President, The Indian Philosophical Congress 1959.

న్నారు. Knowledge devoid of values is a danger 7. నైతికాధారరహిత మైన జ్ఞానము హానికరమని గదా ! What is needed is wisdom and integrity to control those forces. 8 ఆ శక్తుల గట్టుబాటుల నుంపవలసిన వివేకము, విశిష్టత్వములుండవలెను. ఒక విధముగ మానవు మేధాశక్తియే యతనికి విరోధియై, హంతకచర్యకు న్ముఖమైనది. ఈ కారణమున Life is not merely a list of opportunities of self sastifaction, but a set of obligations for realizing spiritual good. 9. పారమార్థిక శ్రేష్ఠత్వ సిద్ధికై గల విధిసమూహము, జీవనముగాని, స్వార్థ విషయ సంతుష్టికై యున్న అవకాశపంక్తి కాదని నేటి మేధావంతులు విస్మరించి యుండుటచే, Forees like greed and avarice are stalking the world today, and it is more like a lunatic asvlum than a home of allmankind that it is meant to be. 10. అశాసూయాది శక్తులు నేటి ప్రపంచమును ముంచినవై, యిది మానవకోటికి వాసయోగ్య స్థలము గాక, ఉన్మత్తుల వసతి గృహముగ నున్నదని రాధాకృష్ణ పండితుడు స్పష్ట పరచెను. "అంధస్యైవాంధలగ్నస్య వినిపాతః పదేపదే" (భామతి) అంధునకు అంధుడు తోడై, పదే పదే పడుచుండుచందము ప్రపంచ పరిస్థితి ఏర్పడినది. వివేకదృష్టికిలేని మేధావంతులు ఎందరున్న ప్రయోజనమేమి ? వారివలన నింక అపాయమేగదా !

7. Dr. S. Radhakrishnan : Address, The Agra University 1958.
8. Dr. S. Radhakrishnan : Address, the Poona University, 1959.
9. Dr, S. Radhakrishnan : The Role o f Philosophy in Civilization, V. K. 1929, p, 250
10. Dr. S. Radhakrisnan : Address, St. John's College Agra, 1958.

అయిన, నిక కర్తవ్యమేమి ? The first task today, is that man has to protect himself from himself. 11. మానవుడు ప్రథమమున తనను తననుండి రక్షించుకొనవలెను. అతని విజ్ఞానోపకరణములు అతనిని మించిపోయినవి. అదియే అతని గమ్యము కానేరదు. ఆ విజ్ఞానమును వ్యక్తియొక్కయు, సంఘముయొక్కయు, జీవితమునకు అనుసంధింపవలెను. ఈ సంపూర్ణ విధానమున, necessarily includes eithics and religion. 11. అవసరముగ నైతిక దృక్పథము, మత జీవనములంతర్గతములని ఆర్టు వీలరు వాకొనియున్నాడు. అటులే ప్రస్తుత లోకము నెదుర్కొనుచున్న ప్రమాదము భౌతిక వైజ్ఞానికము కాదనియు వచించి, The crisis, therefore, is of moral values that of realising the meaning and purpose of life and that of making sacrifice. 12. ఆ ప్రమాదము ధార్మికమనియు, ననగా జీవితోద్దేశ పరమార్థములను గ్రహించి, త్యాగము గావించుటయే నాధార్మిక విధానమనియు, ఆగ్రాలో రాధాకృష్ణ పండితుడు విశదపరచెను. భౌతిక శాస్త్రము కేవల విజ్ఞానము నన్వేషింప, దత్త్వ శాస్త్రము వివేకము నొసంగును. అది విజ్ఞానముకంటె శ్రేష్ఠము. తత్త్వజ్ఞానము భౌతిక విజ్ఞానవములెగాక నభౌతిక రహస్యముల నన్వేషించును. అందే గదా మానవ సర్వజీవ సౌభాగ్య సంపత్తులు నిగూఢముగ నుండుట ! ఈ విషయముల గూలంకషముగ మననము గావించి Investment in

---

11. Dr. A. Artweiler : Address, The Madras University 91–10–1958.
12. Dr. S. Radhakrishnan : Address, St. John's College Agra, 1958.

industry and agriculture are all important but; investment in man is even more important. 13 కార్మిక, వ్యావసాయిక రంగముల నభివృద్ధి నొందించుట ముఖ్యమేగాని, మానవ త్వమున వినియోగించుట అతిప్రధానము. The real question ultimately, here and elsewhere, is the quality of human beings that we produce. 13 మనము తయారు చేయు చున్న మానవుని గుణవిశేషమే పర్యవసానమున, నిచ్చట, మరియు నితర దేశములగల యథార్థ సమస్యయని, జవహర్ లాల్ నెహ్రూ పండితుడు నొక్కి వక్కాణించి యుండెను.

అందుచే బ్రస్తుత ప్రపంచము నెదుర్కొనుచున్న మహా ప్రమాదము భౌతిక విజ్ఞానము గాక, దాని నుపయోగించు మానవ చిత్తమే యనియు, నాచిత్తమును నిరోధించి, సక్రమ మార్గమున నుంచి, స్వార్థముతో బరార్థదృష్టి గలిగింప, నా విజ్ఞానమునకుగాక పారమార్థిక ప్రాధ్యానము నుద్బోధించు తత్త్వశాస్త్రమున గలదనియు, నద్దానికై ఏకోన్ముఖముగ ప్రపంచగత మేధావులెల్లరు ఒక విధానము నాలోచించి తీర్చి దిద్ది ఆచరించి, ఆచరింపజేసినచో, సర్వ మానవాభ్యుదయ కారణమై, మానవుడు దేవుడై, ప్రపంచము శాంతి కాకరము కాగలదనియు ముఖ్య తాత్పర్యము



3, Pandit Jawaharlal Nehru : Press Conference. New Delh. 4-6-1958.

# తాత్త్విక దృష్టి-పారమార్థిక జీవనము

పై నుదాహరింబడిన విషమ పరిస్థితులేర్పడినప్పుడే, మానవునివ్యక్తి జీవనమునగాని. సాంఘిక జీవనమునగాని యొక సంస్కారమేర్పడి. ప్రాపంచిక జీవితమున నసంతృప్తి జనింప జేసి, it Points to something else. 14 దీనికన్యమైనదానిని సూచించునని జస్పర్సు స్పష్టపరచెను. మానవుడింత ఆనందసౌధముల నుయ్యల నూగుచున్నట్లు భావించుకొనినను, సత్యమాలోచించుచో Byron వాక్యముముల ప్రకారము అతడు A pendulum between a smile and a tear. సుఖదుఃఖముల మధ్య నూగు నాందోళకము. అందుచే క్షణము నవ్వు క్షణము ఏడ్పులమధ్య దందహ్యమానుడగుచు, అందందే తృప్తి నొందుచు, సమన్వయించుకొనుచు, యథార్థమును విస్మరించి జీవితమును గడుపుచుండును. సత్యమారయుచో వ్యక్తిజీవితములు, సంఘజీవితములు, సమష్టిమానవ జీవితవిధానములే యింత యని గ్రహింపగలము. అందులకు కేవలము తాత్కాలికోపశమనమునకై. అనుభవించు బాధను విస్మరించు నుపాయములకై ప్రాకులాడక, బుద్ధిమంతులు శాశ్వతనివారణమునకై గాని కాక దీర్ఘకాలిక నివారణోపాయమునకై గాని కృషిసల్పుట ఉచిత మగును. దానికై పైపైదోచు మెరుగులచే నాకర్షింపబడి, అందు మునింగి దుఃఖముల బారి బడుటగాక, తన యొక్క నిజతత్త్వము నెరింగి, అటులే తనకుపయోగార్థమని భావింపబడుచున్న బాహ్యవిశ్వమును తత్త్వతః గ్రహించి, పరస్పరసంబంధ బాంధవ్యముల బరిశీలించి, విమర్శించి. అవగాహన మొనరించుకొని, అవసర

14. Karl jaspers : Way to Wisdom, p. 22.

ముల స్వీకరించి, అనవసరముల ద్రోయుట విజ్ఞవిధానము. అట్టి విషమ పరిస్థితులు వ్యక్తిజీవితమునగాని ప్రపంచ జీవితమునగాని ఏర్పడినప్పుడు, Philosophy has avoided many of these pitfals and encouraged thought and enquiry 15 తత్త్వశాస్త్రము అనేకమైన అవకతవకముల దూరమొనర్చి, విచారణాయోచనల నభివృద్ధి పరచియున్నది. అట్టి సమయముల నాంతర్యముల గ్రహింప, దీవ్రతరమైన ఆకాంక్షయేగదా తత్త్వశాస్త్రము! అట్టి చింతనమేగదా తత్త్వార్థచింతనము! అందుచే నది, మానవ చిత్తప్రాతిపదికలనంటి చరించుచు, సంస్కరించుచు, భౌతిక శాస్త్రమువలె బాహ్యముపై దృష్టి బరికించి. బాహ్యమును సంస్కరించి, బాహ్యమును సుందరముగ గావించుకొని తృప్తి నొందునట్టిదిగాక, అంతరమున మార్పు గలిగించి, శాంతి సుఖములు బాహ్యములు గాక అంతరములని బోధించి, అందుచే బాహ్యదృష్టులుగాక అంతర్దృష్టులే శాంతిసుఖసంధాయకములని ప్రబోధించి, బాహ్యప్రకృతినిగాక, అంతర ప్రకృతిని బరిణమింపజేసి, మానవునికి యథార్థ సౌఖ్యసంధాతయై రూపొందియున్నది. అందుచే, నేటి భౌతికవిజ్ఞాన పరిశోధనల ఫలితముగ నేతెంచు అనేక యుపకరణములు ప్రాతక్రొత్తల విభేదముల గలిగియున్నను, నిన్నటిది యీ దినము అనుపయోగమై, క్రొత్తదానికి అవకాశమొసంగుచు నిత్యవికారములనున్నను, తత్త్వార్థముమాత్రము నిత్యయౌవనమై, సదా మంగళకరమై, సర్వమానవాభ్యుదయకారణమై యొప్పారుట సువిదితము. అందుచే ఆచార్య రాసవిహారిదాసు వచించునట్లు Our

15. Pandit Jawaharlal Nehru : The Discovery of India, P. 543.

old philosophers never become out of date 16 ఆ రహస్యముల నుద్ధరించిన మన ప్రాచీన తత్త్వవేత్తలు ఏనాటికైనను నిరుపయోగముకారు. వారు భోగముల గాలదన్ని, ప్రకృతిని ధిక్కరించి, మాయ నెదుర్కొని, కాలమును అతీతించి, చిత్తము నడంచి, బాహ్య ప్రవృత్తులకందరాని, అవగాహనముకాని, అగాధ మనోలోకమునుండి ఉద్ధరించి మానవాళికి వారు ప్రసాదించియున్న అమూల్య తత్త్వార్థరహస్యములు నిరుపయోగములై, out of date కాలగతములగు కాలమెద్ది? మానవునిలో మానవత్వము నశించినను, యీయద్భుతమైన Divine spark దివ్యజ్యోతి మరుగుపడినట్లు చూపబడినను, అవకాశము ననుసరించి అతని ఛైదముల ద్వారమున నచ్చటచ్చట నది తొంగిచూచుచునే యుండును. అది నిత్య శోభాయుక్తమై, నిత్యప్రవర్ధమానమై ప్రకాశించుచుండును దానికి వయో వృద్ధత్వములు, క్షీణత్వనాశనములు సుదూరములు. దాని లేకుండ జేయ యత్నింప మానవుడె లేకుండపోవలయునుగాని అతడుండి అది అంతరింపదు. అందుచేదాని గ్రహించి, ఆనందించి, అందు లయించిన తత్త్వవేత్తలు గూడ నిత్యులు, నిత్యనవీనులు. సదాశివంకరులు. ప్రశాంత సౌందర్య స్వరూపులు. జగతికాధారప్రదులు.

ఈ విధముగ పరిశీలించినచో, భౌతికమునకాధారమైన అధ్యాత్మము మానవుడు దాకినగాని, యథార్థమైన యానందము ననుభవింపనేరడు. ఆ యానందధామమును జేర నతనికి మార్గమెద్ది? అతని నిత్యవీర్యత్వమును గాపాడు సంజీవి ఏది? దానిని వివరించుచు, Some form of personal

16. Dr. Rasvihary Das : President, The Indian Philosophical Congress, 1956.

religion is essential in maintaining the vitality of the human spirit. 17 అట్టి మానవతత్త్వము యొక్క వీర్యత్వమును నిలుపుకొననేదో ఒకవిధమైన వ్యక్తిగత పారమార్థిక జీవన మవసరమని, క్రిప్సు అమెరికా న్యాయవాదుల సభలో వక్కాణించి యున్నాడు. నిఖిలదేశ సర్వకాల చరిత్రముల, నిష్పాక్షిక బుద్ధి బరిశీలించి నచో, we can see that, with all its drawbacks and defects it was religion that nurtured a sense of true values and fortified men against temptations of all kinds and gave them courage to live and work or die for good causes. 18. ఎన్ని లోపములున్నను, పారమార్థిక జీవనము మాత్రమే, మానవులకు సత్యతత్వదృష్టి నభివృద్ధి నొందించి, సర్వాకర్షణములనుండి రక్షించి, సత్కార్యనిరతి జీవించి, కృషించి, లేక మరణింప, వారికి ధైర్యోత్సాహ ముల నొసంగి యున్నదని రాజగోపాలాచారి మహాశయుడు ఆగ్రా విశ్వ కళాపరిషత్సభలో వివరించి, All civilization is rooted in religion. If we debar religion in schools, we discard what has proved effective throughout the ages for the development of character. 18. నాగరికత పారమార్థిక జీవనముపై నాధార పడియున్నది. పాఠశాలలో నా ధార్మిక జీవనమును బహిష్కరించినచో,

17. Sir Stafford Cripps : Address, Bar Association, San Francisco, 1948.
18. C. Rajagopalchary : Address, The Agra University, 1956.

ననేక యుగములనుండి మానవ ప్రవర్తన నభివృద్ధిపరచుకార్యమున సమర్థమని నిరూపింపబడిన దానిని, మనము నిరసించుచున్నట్లు అగును అనియు నతని అమూల్యమైన హెచ్చరిక. ఈ విషయమున బహుళ కృషి గావించి, చారిత్రాత్మక దృష్టి బరిశీలించిన సుప్రసిద్ధ సాహిత్యవేత్తయు ప్రపంచచరితా గవేషణ రచనాశీలుడును అయిన టాయిన్ బి కూడ ఢిల్లీలో ప్రసంగించుచు, **Religion and civilization from the earliest time, these two were inextricably intertwined with each other. Religion was one of the spiritual necessities of human life, which mankind could never do without.** **19.** పారమార్థిక జీవనము, నాగరకతయు, ప్రాచీనకాలమునుండి రెండును అవినాభావసంబంధమున మేళవించి యున్నవి. పారమార్థిక ప్రవృత్తి మానవుని జీవితమున నాధ్యాత్మికావసరము. దానిని వీడి మానవ లోకముండజాలదు అని యథార్థమును వెలిబుచ్చియున్నాడు.

కావున ఐహికము నభివృద్ధి గావించుకొనుచున్న మానవుడు, తనకు నైహికమునకు, ఆధారభూతమైయున్న తన నైజమును గుర్తెరింగినగాని, యథార్థమగు సుఖము చేకూరదని గ్రహించి, దాని సఫలతకై కృషిసల్పుట సముచితము అని దీని వలన బోధపడుచున్నది. మానవుడు శాశ్వతమును, సత్యమునైన ఆనందమునుబొంద గాంక్షించుచో, నింతకుమించి అన్య గత్యంతరమభావమని, అతి ప్రాచీన కాలమునుండి నేటివరకు గల అసంఖ్యాక తత్త్వానుభవసంపన్నుల యుద్ఘోష. **There is no direction**

**19. Dr. Arnold Toynbee : Sri Ramakrishna Mission, New Delhi 17 2-57.**

but one: in all the world's ten thousand years of search for help in her experiences of mightiest need, not at all adequate resource but one has ever been discovered. What is that ? I need tell no one of you who has observed, no one of you who has read history, no one of you who has a human heart that that resource is religion, the personal experience of religion in the soul, the conscious ,purposeful, earnest opening of the soul's doors to the incoming spirit of God, the power of God, the peace of God, the life of God. 20 ఒకేమార్గముగాక అన్యము లేదు. అత్యావశ్యకమైన తన అనుభవ కాలముల సహాయమునకై, దశ సహస్రాధిక సంవత్సరముల తనయన్వేషణములో, ప్రపంచమునకు ఒక్కటిగాక ఉచితమార్గాంతరము ఎద్దియు లభింపలేదు. అది ఎద్ది? పరిశీలనాసంపన్నులగు మీకు, చరిత్రాధ్యయన శీలురగు మీకు, మానవహృదయముగల మీకు, ఆ మార్గము పారమార్థిక జీవితమని నేను తెలుప నవసరము లేదు. అది ఆత్మలో వ్యక్తిగత పారమార్థికానుభవసంపద. సచేతన, సకారణ, సహృదయముగ, భగవత్తత్త్వమును, భగవచ్ఛక్తిని, భగవచ్ఛాంతిని, భగవత్ ప్రేమను, భగవజ్జీవనమునకు హృదయ కవాటముల దెరచుటయే యగును అని సండర్లాండు మహాశయుడు ప్రాచీన తత్త్వాచార్య వాణిని ప్రతిధ్వనింపజేసియున్నాడు. అనాదికాలగతమైన ఆ యమానుషవాణిని, సంగ్రహించి అర్షప్రబోధల నాలకించి, అంతర అజ్ఞాత సంస్కారముల మేల్కొలిపి, హృదయ పద్మమును వికసింపజేసి, ఆ భగవదానందసుధాస్వాదనోత్సాహ

20. Dr. J. T. Suderland: Prabudha Bharata, 1952, P. 484

మున దన్మయత నృత్యమాడి, అందు జాల్గొన సర్వమానవకోటిని ఆహ్వానింప సంసిద్ధులమగుదుముగాక ! అనాదికాలమునుండి మన యందంతర్గతముగ ప్రవహించుచున్న ఆ పవిత్ర ఆర్ష రక్తము విజృంభించి, పైకుబికి, దేదీప్యమాన తేజోవిరాజితమై, యావత్ప్రపంచ మానవులకు దారణోపాయము నుద్బోధించుగాక !

) — (

## భారతవాణి

'వేదాహ మేతం పురుషం మహాంతం ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్' (య. వా. 31—18) అంధతామిస్రాది సర్వ అజ్ఞానములకతీతమైనది అసమాన కోటిసూర్యప్రకాశ సంపన్నమై, మహాద్భుతమైన అవాఙ్మానసగోచర పురుషుని గాంచితిని అను ఆర్షవాణి తన స్వార్థమున నట్లే ఆ యద్వితీయానంద పీయూషమును దనయందే యిముడ్చుకొని, జీర్ణింపజేసికొని అణగారి పోనీయక, 'యథే మాం వాచం కల్యాణీం అవదాని జన్యేభ్యః' (య. 26-2) నేనీ కళ్యాణప్రదమైన వచనముల సర్వజనులకు ప్రకటించెదనుగాక అని సంకల్పచిత్తులై 'కృణ్వంతు విశ్వం ఆర్యం' (ఋ. వేదము.) విశ్వమునంతటిని ఆర్యమయముగ, ననగ సత్పురుషమయముగ గావించెదముగాక అని నిర్ణయించుకొని, తత్ఫలితార్థమును వివరించుచు, 'తత్త్వజ్ఞానం సుదుర్లభం యేన విజ్ఞాతమాత్రేణ జీవన్ముక్తో భవిష్యసి' (అక్ష్యుపనిషత్తు) తత్త్వజ్ఞానము దుర్లభము. దాని గ్రహించి నంతమాత్రమున జీవన్ముక్తుడగుదువు అని ప్రబోధించియున్నది భారతీయ మహర్షివాణి. అంతనది ప్రవాహగతి ప్రజ్వలించి, 'సమాధిః ఆర్యాణాం ధ్వజా। ప్రజ్ఞా ఆర్యాణాం ధ్వజా। ముక్తిః ఆర్యాణాం ధ్వజా'। అనియు బుద్ధభగవానునిద్వార

మున నా యశరీరవాణి ప్రకటించి, సర్వమానవుల సమదృష్టి నుద్బోధించి నది. అంత నది పూర్వోక్తరీతి మహాశబ్దమై శ్రీ శంకరభగవత్పాద అమృతవాణియై, "భూపేంద్రత్వం ప్రాప్త మూర్వ్యాం తతః కిం॥ దేవేంద్రత్వం సంభృతం వా తతః కిం? మునీంద్రత్వం చోపలబ్ధం తతః కిం? యేన స్వాత్మానైవ సాక్షాత్కృతోఽభూత్" (అనాత్మ శ్రీవిగర్హణ ప్రకరణము—12) ఉర్వీతలమున రాజేంద్రత్వము లభించిన ప్రయోజనమేమి? ఆత్మసాక్షాత్కారము లేనివానికి దేవేంద్రత్వము సిద్ధించిన లాభమేమి? మునీంద్రత్వము సాధ్యమైన నేమి ఉపయోగము? అని ప్రపంచ నిష్ప్రయోజక స్వభావమును, ఆత్మసాక్షాత్కార లాభ పరమోత్కృష్టతల మానవుల ముందుంచినది. అటులే ఆ యద్భుతవాణి యింకను విజృంభించి, గ్రంథావధుల దాటి భాషలదూరి, భావముల లంఘించి, శుద్ధ అనుభవ స్వరూపమై, అసమాన అద్వితీయాదర్శమున **Know the one and you will know all. Ciphers placed after the number one, get the value of hundreds and thousands. But nothing remains if you wipe out the number one. The many have value only because of the One. First the one and then many. First God, and then the Jiva and Jagat.** 21 నీవు ఒక్క సంఖ్యనుగ్రహింపుము. అన్నియు నీకవగతమగును. ఒకటి తర్వాత నుంపబడిన సున్నలు శతసహస్రాధిక విలువను బొందుచున్నవి. ఒకటి సంఖ్యను రద్దు చేసినచో నేమియు నుండదు. నానాత్వమునకు నా ఒకటి ము వనుసరించియే విలువ యేర్పడినది. ప్రథమము ఏకము, పిమ్మట అనేకము.

21. Sri Ramakrishha : The Sayings of Sri Ramakrishna 27.

ప్రథమతః భగవంతుడు, తర్వాత జీవజగత్తులు అని శ్రీ రామకృష్ణ పరమ హంస దేవుని ద్వారమున నా అమృతవాణి బయల్వెడలి,

Let eyes grow dim and heart grow faint
And friendship fail and love betray,
Let Fate its hundred horrors send
And clotted darkness block the way—
All nature wear one angry frown
To crush you out-still know, my soul,
You are Divine. March on and on,
Nor right not left, but to goal ! 22

నేత్రములు మసకలు గ్రమ్మి, హృదయము బలహీనమై, మిత్రత్వము శంగమై, ప్రేమ మోసగించినను, తన శతాధిక కష్టముల దురదృష్టము దాడిచేసినను, విభిదాంధకారము మార్గము నడ్డగించినను, నిన్ను హత మొనర్ప సర్వప్రకృతియు నొక తీక్షదృష్టి ప్రసరింపజేసినను, నా ఆత్మ స్వరూపా, నీవు ఆత్మవని గుర్తెరుంగుము. ఎడమ దిక్కునకుగాని దక్షిణ దిశకుగాని తిరుగక, గమ్యస్థానమునకై ముందరుగుము అని వేదాంత కేసరియై దిక్కులు పిక్కటిల్ల, ప్రపంచము ప్రతిధ్వనింప, వివేకా నందముని ముఖతః నా అద్భుత భారతవాణి విశ్వము నావరించినది. అవిస్పష్టముగ 'కోహం' భావమున వంతరమున బుద్బుదమువలె జిత్తసాగరమున ప్రారంభించి, యీ ప్రపంచమునగల అహం, మమములు 'నాహం' అని విమర్శించి, తీర్మానించి, 'సోహం' స్థితులలో ముంచి, అనిర్వాచ్య అంతర్గత ప్రజ్ఞాశక్తమై, రమణమహర్షినుండి దశదిక్కుల నాక్రమించిన నీ పవిత్రవాణి.

22. Swami Vivekananda The Complete Works, Vol, 5, p. 149.

రాజకీయముల మున్గి, అమూల్య శక్తిసామర్థ్యముల వమ్ము గావించుచు, అంతరమునగల ఆనందామృత వాహిని గుర్తింపకున్న అరవిందుని, జరసాల నునిచి, సాంఘిక రాజకీయముల అప్రాధాన్యతను ఎరుకపరచి, బికారిని గావించి, మౌనమున ముంచి, సంగములనుండి సంఘములనుండి ఉద్ధరించి, అతనినుండి ప్రజ్ఞారూపమున, నా అశరీరవాణి ఖండ ఖండాంతరముల ప్రవహించినది. అద్దాని ఆధ్యాత్మిక శక్తి అజేయము, అద్భుతము, ఆశ్చర్యము. దాని ప్రాభవము నెవడు ఎదుర్కొనగలడు! దాని మధురాకర్షణమునకెవడు తలలొగ్గకుండును! Coming from Afar are the Voices of the Silence. Rarely are they heard, save by the Mystics and the Sages. And when one of these Voices becomes embodied as Sound audible to mortal hearing blessed is the time and blessed are those that hear, 23 ఆ నిశ్శబ్దవాణి అతిదూరమునుండి అరుదెంచుచున్నది. మహర్షులు అనుభవేత్తలచే గాక నది సామాన్యముగ అశ్రుతము. మానవ శ్రవణమున కనుకూలముగ నా వాణిలో నొక వాక్కు శ్రుతమైనప్పుడు ఆ కాలము ధన్యము. ఆ శ్రోతలు ధన్యులు.

పై విధముగ నా అవిస్పష్ట వాక్కును, అతిదూరాగతమైన వాక్కును, అనాదిసిద్ధాంతమైన పవిత్రవాక్కును, మానవోద్ధరణ దీక్షాదక్షమై, హృదయముల గదలించు నాపరిపూర్ణవాక్కును వినగలిగినవారు India is the land of knowledge and every kind of learning. 24 భారతదేశము జ్ఞానమునకును, సకల విద్యలకు మాతృభూమిఅనియు,

23. Swami Vivekananda : The Life of Swami Vol, 1, p. xvii. 24. Madame H. P. Blavatsky : The Secret Doctrine, Vol. 3, p. 18.

Aryavarta, the bright focus into which had been poured in the beginning of time the flames of Divine Wisdom, had become the centre from which radiated the "tongues of fire" into every portion of the globe. 25, అధ్యాత్మజ్ఞాన జ్వాలల ననాదికాలమున బ్రసరింపచేయబడిన తేజో కేంద్రమైన ఆర్యావర్తము, భూమండల సర్వభాగముల నాజ్యోతుల బ్రస రింపజేయ కేంద్రస్థానముగ నుండెను అని గ్రహించెదరు. అవిషయమును గమనించియే This is the most ancient land on earth where wisdom of the Loftiest Kind made its earliest home before it went into any other country. 26, ఇతరదేశముల కరుగక బూర్వము అత్యుత్తమమైన వివేకజ్ఞానము యీ అతిప్రాచీన దేశముననే తన ప్రథమ గృహముగ జేసికొనెను అనియు విజ్ఞుల ప్రవచనము.

అనాదికాలమునుండి ప్రవాహగతి అవిచ్ఛిన్నముగ నేగుదెంచుచున్న యీ జ్ఞానవాహినికి ఆధారమెద్ది ? కేంద్రస్థాన మెయ్యది ? ఇతర దేశము లందువలె, మహాపురుషుడై యుండినను మహాత్ముడై యుండినను అట్టి ఒక మానవమాత్రుడై యున్న వ్యక్తిగాక అతని జీవితోపదేశముఁగాక, పూర్వమే వచింపబడినట్లు అనాదికాలగత సర్వమానవ ఆధ్యాత్మిక ఆవేశ సంజనిత ఆకాంక్షాశబ్దములు. అభౌతిక అలౌకిక అవ్యయ అద్వితీయ ఆనంద అనుభవ సుధాస్రవంతీ తరంగ నినాదములు. సర్వాజ్ఞాన తిమిర సంపూర్ణ మాయాప్రపంచ అంధకార స్పర్శ విదూరమై సర్వద్వంద్వకబంధహస్త

25. Madame H. P. Blavatsky : The Secret Doctrine Vol 3. p. 311. 26, Editor : Prabuddha, 1952, p. 4.

వినాశకర పరిష్వంగ బంధాతీతమై అతిసూక్ష్మమై పరిశుద్ధమై బ్రహ్మ చైతన్యాకాశ విహారజన్య సంతోషనాద ప్రతినాదములు. అదియే మానవుని మలినముచే నంటబడని ఉపనిషద్వాణి. మానవకర్తృత్వ దోషమున కతీతమైన మహాజ్ఞానుల హృదయాంతరాళసంజనిత ఆధ్యాత్మిక జ్ఞానానందానుభవ ప్రతిధ్వనులు. కావున అవి have been aptly described as the Himalayas of the soul, heve been the source of the living waters that sustain our culture. 27, పారమార్థిక హిమాలయము లనియు నుచితముగ వర్ణింపబడి, మన సంస్కృతిని బోషించు సంజీవనోదక కాసారములై యున్నవి అని వచించి వాని మహత్వమును నుగ్గడించుచు Again and again, in times of blind ignorance and degradation, the Upanishads have come to our rescue. 27. మూఢ అజ్ఞానముచే క్షీణత్వమువ నున్న వేళల మరల మరల నా యుపనిషత్తులు మనల నుద్ధరించుచున్నవి అనియు, అందుచే We may be an emaciated race: our national wealth may be poor. But India is undying and lives in spite of unfavourable material conditions, because of the sustaining force of our heritage 27 మనము కృశించియున్న జాతి కానగును, మన ఐహిక సంపద అభావము కావచ్చును, కాని ఈ మన సాంప్రదాయిక జీవామృత శక్తిచే హిందూ దేశము చిరంజీవియై సజీవియై యున్నదని ఆచార్య మహాదేవన్ సువిస్పష్ట వివరణము.

అట్లగుటచే నీ ఆర్యావర్తము, కేవలము సాధు, సన్న్యాస, మహర్షుల భూమిమాత్రముగాక India had attained the heights of civilization at a time when a major part of the world was still

27. Dr. T. M. P. Mahadevan : Address, Sri Ramakrishna Institute of Culture, Calcutta, 1954.

steeped in ignorace and superstition. 28 ప్రపంచమున నధిక భాగము, అజ్ఞాన మూఢత్వముల మునిగి యుండు నాకాలముననే, హిందూ దేశము, నాగరికతయం దున్నత స్థానము నందుకొనియుండెను, అనేక విజ్ఞాన శాఖల పాండితీ సౌష్ఠవము నార్జించిన సి. పి. రామస్వామి అయ్యరు మహాశయుడు వచించినట్లు, Many of the thought-currents and developments outlined earlier had been foreshadowed and investigated in India during several centuries. 29 పూర్వము సూచింపబడిన అనేక భావ స్రవంతులు, పరిణామములు, అనేక శతాబ్దముల క్రితమే హిందూదేశమున బరిశీలింపబడి యున్నవి. కణాదుని అణుసిద్ధాంతము, లోకాయతికుల ప్రకృతివాదము, సాంఖ్య, బౌద్ధ, జైన సిద్ధాంతముల నిరీశ్వరవాదము, సగుణ దైవారాధనము, భక్తివిధానములు, అద్వైత సిద్ధాంతాదికమైన సర్వ మార్గములు యీ దేశమున జనించి, విస్తరించి, వికసించినవి అనియు, నతడు మద్రాసు మనోధర్మ శాస్త్ర మహాసభలో ప్రకటించెను. ఈ విషయము అనగా భారతి యొక్క సర్వతోముఖ, సర్వోన్నత విజ్ఞానవైభవమును గూర్చి, సౌరభము పూర్వము అనేక పర్యాయములు వివరించి, స్తుతించియే యున్నది. భారతి ప్రథమమునుండి అతి విశాల హృదయ సంపన్నగాన, జ్ఞాన విజ్ఞానములనొకే దృష్టి దిలకించి, సమస్థాయి నొసంగి, త్రివిధ సంస్కృతిని నిర్మించి, మానవకోటికి సర్వవిధ సుఖసంపదల బ్రసాదించియున్నది. కాని, దాని ప్రధాన తత్త్వము అలౌకికము. ఈ విషయమును స్పష్టపరచుచు నీ మధ్య, మన దేశమునగల వైష్ణవ, శైవ, మధ్వ, అద్వైత పీఠాధిపతులు,

28. Prof. Humayun Kabir : Adress, Annamalai University.

29. Dr. C. P. Ramaswami Aiyar : Adress. The Psychology Conference, Madras. 3-1-1959.

ఏక స్వరమున నొకే స్థానమునుండి, Bharatiya culture is founded on the twin glories of faith in God and the practice of religion. They constitute the root-system which nurtures the nation. 30 భగవద్విశ్వాసము, పారమార్థిక జీవనానుష్ఠానము అను శోభాద్వయముపై, భారతీయ సంస్కృతి నిర్మింపబడినది. దేశ పరిపోషణమునకు అవియే ఆధారములు అని, భారతీయ సంస్కృతీ వైభవ రహస్యమును ప్రకటించియున్నారు. దానినే కోల్పోయినచో If India forgets them, she will no longer remain India. 31. సాంప్రదాయిక మహర్షి గణ పరంపరా గత దాయ విజ్ఞాన సంపదను విస్మరించినచో హిందూదేశము యిక, హిందూదేశముగ మనజాలదు అని నెహ్రూ పండితుడు ఘంటాపథముగ వచించియున్నాడు. ఈ విషయ ప్రస్తావనమును గ్రిత శతాబ్దమున జేసి, భారతము తన సంస్కృతిని విస్మరించినచో భారతియే ప్రపంచమున నదృశ్యమగునని వివేకానందుడును హెచ్చరించియున్నాడు. 32

అట్లు, పారమార్థిక జీవన విధాన రహస్యమును అనాది కాలము నుండి ధరించి, ప్రపంచమెన్ని విధముల మార్పు జెందుచు రూపాంతరముల బొంది, సంపూర్ణ వైకల్యమును బొందుచున్నను, అచంచల, గాంభీర్య వైభవోన్నతుల భారతి మాత్రము అతి సూక్ష్మ, అలౌకిక పరబ్రహ్మాను భవ అవ్యయసంపదను బరిత్యజింపక గాపాడుకొనుచున్నది. కావున

30. The Four Acharyas : Press statement, 1–1–1959.
31. Pandit Jawaharlal Nehru : The Discovery of India, p. 542.
32. Swami Vivekananda.

As Western civilization makes for material progress, so Indian civilization makes for spiritual understanding. 33 పాశ్చాత్య నాగరికత భౌతిక పరిణామము నొందు చున్నటుల, భారతీయ నాగరికత పారమార్థిక విజ్ఞానమున నభివృద్ధి గాంచుచున్నది. అంతియగాక India holds within her bosom the sacred wisdom that the end and aim of human life is to know God. 33 మానవ జీవితాదర్శ కర్తవ్యము భగవదనుభూతియేయను, పరమ పవిత్ర వివేక జ్ఞానమును హిందూదేశము తన హృదయమున ధరించియున్నదనియు అతులానందుని యథార్థవచనము. ఈ పరమార్థమును గ్రహించి ఆల్ ఫ్రెడ్ ఈగర్టన్ Science held the key to the future of India—and India herself perhaps holds the key to man's destiny. 34 హిందూ దేశముయొక్క భవిష్యత్తునకు భౌతిక జ్ఞానము మూలము. అయినను మానవుని భవితవ్యమునకు మూలరహస్యము హిందూదేశమే కలిగియున్నది అని లండన్ నగరమున రాయల్ సొసైటీలో ప్రసంగించి, వివరించుచు, The civilization of the future is perhaps not along the extreme technology of the West, nor in the direction of despotic communism but in the hands of those whose ancient traditions and spiritual insight can perhaps give a fresh turn to the wheel which shapes man's future. 34 భవిష్యత్కాల నాగరికత పాశ్చాత్య ఖండమున గల అతియైన భౌతిక శాస్త్రోపకరణముల నను

33. Swami Atulananda : Vedanta Kesari, 1935, p. 143.
34. Sir Alfred Egerton : Address, The Royal Society of Arts, London, 1955.

సరించుటగాక, నిరంకుశ, కమ్యూనిజ తత్త్వానుసారముండుటయుగూడగాక
ఎవరి ప్రాచీన సంప్రదాయము, పారమార్థిక దృక్పథము భవిష్యన్మానవ
వికాస చక్రమున, వినూత్న పరిభ్రమణము గావింపజేయగలదో, అట్టి
వారి ఘనత సంగతమై యున్నదని యతడు స్పష్టపరచెను.

ఈ ప్రజావాణియే, నేటి ప్రపంచమున, సర్వ సమావేశముల ప్రతి
ధ్వనించుచుండుట సువిదితము. ఈ మధ్య, మద్రాసు నగరమున జరిగిన
వేత్తల సభలో, ప్రసంగించుచు, ప్రస్తుతకాలమున, అఖిల ప్రపంచ తత్త్వ
విధానముల సమన్వయ మావశ్యకమని వివరించుచు, ఆ సమన్వయపద్ధతి
పరస్పర సిద్ధాంతములుగల ఏకస్వనమని తెలిపి, India should take a
leading part in evolving the new world philosophy.
35 నవీన సర్వవిశ్వ తత్త్వశాస్త్రమును రూపింప, హిందూదేశము ప్రముఖ
పాత్రను స్వీకరింపవలయుననియు వచించి, అందులకు India's genius
for synthesis is well - known. 35 భారతదేశ ప్రజ్ఞావిశేషము
సుప్రఖ్యాతమనియు మిగుల స్తుతించిఆచార్య ఫ్రెడ్రిక్ అర్థించి యున్నాడు.
అదేవిధముగ ఢిల్లీనగరమున, అఖిల ప్రపంచ బౌద్ధ సంఘాధ్యక్షుడైన ఊ.
చాన్ టూన్ ప్రసంగించుచు, Buddhist fraternity, which
constituted about one, third of the human race, is
looking to India for spiritual leadership and guidance in
the present state of international fear and tension. 36
మానవకోటిలో మూడవ భాగముగనున్న బౌద్ధసంఘము, భయభ్రాంతముల
నున్న అఖిలప్రపంచప్రస్తుత విషమ పరిస్థితిలో, నాధ్యాత్మిక నాయకత్వమునకు
భారతదేశమును జూచుచున్నది. అటుల ఒక్క బౌద్ధసంఘము మాత్రముగాక

35. Prof. Frederick H Young : The Hindu, 27-10-1958.

The West is looking to the East, and the East n turni to India, for leadership at this critcal juncture. 36
పశ్చిమ ఖండము ప్రాగ్దేశకు వీక్షింప నా ప్రాగ్దేశము యీ పరిస్థితులలో, మార్గదర్శిగ హిందూదేశమునకై నిరీక్షించుచున్నదనియు, బర్మాదేశ న్యాయ స్థాన అధిపతి కావుటచే నతడు, సమ్యగాలోచనమున వక్కాణించెను బౌద్ధసంఘమునకు నిటీవల, టిబెట్, సింహళముల దగిలిన ప్రచండాఘాత ములకు సహించి, స్వక్రమ పారమార్థిక మార్గముల బునరుద్ధరణము గావింపుతోన నా బౌద్ధమునకు మాతృస్థానము వహించి, సహించి, సమ న్వయించుకొనిన అనాదికాల ప్రవాహగత సర్వతోముఖాధ్యాత్మిక అమృత సింధువు అవశ్యమత్యంతావసరమే యగును. సారనాథములో, బౌద్ధసంఘ మున నధికసంఖ్యాకులకు జగద్గురువైన, పరమ బుద్ధావతారమని పూజింప బడుచున్న దలైలామా అధ్వర్యముద జరుగనున్న అఖిల ప్రపంచ బౌద్ధ మహాసభము నందులకు శుభోదయమేమో ! అద్వయవాదమైన బౌద్ధము అద్వైతవాదమైన వేదాంతములు, మరల ఏకోన్ముఖములై, ఏకమై, ప్రస్తుత సంక్షుభిత ప్రపంచము నుద్ధరింప, దుష్టశక్తుల దమ పవిత్రాధ్యాత్మిక శక్తు లచే నెమకొనినచో ప్రపంచమున సర్వమానవకోటికి, శాంతి, అతి సన్నిహితము నిత్య అనుభూతము. అట్టి శుభముహూర్తమునకు వేచి యుందుముగాక.

అదేవిధమున, కేవలమలౌకికమగు పారమార్థిక రంగమునమాత్రము గాక, రాజకీయమునగూడ దన సంజీవనశక్తిని జూపించి అహింసా ధర్మ

36. U. Chan Htoon : The Mall, 13–1–1959, Press Statement, New Delhi.

ముల శాంతిసందేశము దశదిశల ప్రపంచమున వ్యాపింపజేసి, కన్నుగవమూ సిన అహింసా ధర్మమూర్తి, గాంధీమహాత్ముని అపూర్వ ఆధ్యాత్మిక శక్తి ఎచ్చటిది ? భారతాంబయొక్క పవిత్ర అభౌతిక శక్తిసంజనితముకాదా ! నేటి ప్రపంచ వాతావరణమున, నా సర్వశక్తియుక్తమైన భారతవాణి, తొలుత పాశ్చాత్యమునకు 1955 వ సంవత్సరమున నేగి, తన దివ్యవాణిని ప్రతి బింబింపజేయు నెహ్రూ పండితుని శాంతిదూత యని వేనోళ్ళ స్తుతింపజేసి నదిగదా. 1957 వ సంవత్సరమున జపానుదేశముగూడ, నాతని వాక్కును శాంతివాక్కుగ ఆహ్వానించి, The Man of Peace శాంతి సంధాత యనియు, The Pride of the East 37 ప్రాగ్దేశ గర్వకారణమనియు నుతించినది. ఆ అమరవాణి మహిమాతిశయ విశేషముననేగదా నెహ్రూ పండితునకు డెబ్బది వత్సరములు పూర్తియగు 1959 సం॥న, జన్మదిన సందర్భమున, సర్వ ప్రపంచమునగల అధినేతలు, రాజకీయవేత్తలు, ప్రజ్ఞా నిధులు, అతని శాంతిసంధాతగ గొనియాడుట! ఆ శక్తి బాహ్యచక్షువులకు గోచరింపకున్నను, నెహ్రూ పండితునికి గూడ తెలియబడకున్నను, సత్య మును నిరాకరింప నేరికిని జివరికి, ప్రస్తుతము భారతవాణి ప్రతిధ్వనిరూప మైన నెహ్రూ మహాశయునకుగూడ నసాధ్యము.

ఈ విషయమున మున్నే గన్ను దెరచి గ్రహించి, రానున్న మహో దయమును వేదాంత సింహమురీతి గంభీర వాక్యముల, వివేకానందుడు సర్వ ప్రపంచమునకు జాటి యున్నాడు. The eyes of the whole world are now turned towards this land of India for spiritual food,

37. Indian Express. 9-10-1957,

and India has to provide it for all the races. Here alone is the best ideal for mankind. 38 ఆధ్యాత్మికాహారమునకై సర్వ ప్రపంచముయొక్క నేత్రములు, యీ భారతదేశ దిశకు మరల్ప బడియున్నవి అఖిల జాతులకు హిందూదేశము, గాని సంసిద్ధ పరుపవలెయును, సర్వమానవ కోటికి ఉత్కృష్టాదర్శము యిచ్చుటనే లభింపగలదు అని అర్ధశతాబ్దికి ముందు వివేకానందుని అమరసందేశము. నాడు వివి అనుసరింపక పోయినను, నేటి సర్వప్రపంచ విషమ సమయమునందైన, ఆ అమరసందేశమును గర్ణపుటముల సోక నవకాశమొసంగి, అంతరమున జొచ్చుటకును, అందు జీర్ణమై, అనుభూతమై అతులజేగీయమానముగ బునః బహిర్గతమై, ఆవాణిసర్వమానవకోటి శ్రోత్రములనపూర్వముగ జొచ్చి, హృదయ పరివర్తనము గావించి, యీ ప్రపంచమును అమరభూమిగ నాచరింపజేయ భారతీయులు సంసిద్ధులు అగుట కుద్యుక్తులగుదురుగాక! ప్రాచీన కాలమువలె మరల భారతీయాధ్యాత్మిక పరమాదర్శ మాధుర్యము, సర్వమానవులకు సంతృప్తి నొసంగుగాక! ఎల్లెడల ప్రశాంత చంద్రికలు చిందులు ద్రొక్కుగాక! అందులకు పరమేశ్వరుడు అండదండయై యొప్పారుగాక!

అట్టి అద్భుత పరిణామమునకు మానవుడు, ప్రపంచమున గోచరించు సర్వ ప్రకృతి శక్తులకంటె నధికుడవ్వనియు, అంతియగాక దనను దావింకను ఏమియు గ్రహింప లేదనియు, Man is Fundamentally mor

38. Swami Vivekananda : The Complete Works, Vol. 3 p. 138.

than he can know about himself. 39 మానవుడు, తనను దా దెలిసికొన్నదానికంటె స్వతఃసిద్ధముగ నధికుడననియు గ్రహింపవలెను. సర్వ ప్రాకృతిక శక్తులకాధారమైయున్న Divine Spark ఆత్మకిరణము తనలో సమగ్రమూర్తిమత్వమున బ్రతిబింబించియుండి, సర్వశక్తుల నిరోధించి నియమించి, నిర్వహింపగలదనియు' నందుచే నతడు ఆ అజ్ఞానశక్తులవలె మూఢముగ, మూర్ఖముగ బ్రవర్తించుట, తన గౌరవమునకే లోపమనియు, నందుచే దన Human dignity మానవ గౌరవమున కనుకూల విధానమున నీ బ్రపంచమున దా బ్రవర్తింపవలెననియు బ్రథమతః గ్రహింపవలెను. అనగా ఆచార్య ఛటర్జీ వాక్యములలో Religion consists in man's unique experience of the spiritual Reality that lies within him and beyond him. 40 తనయందు, బాహ్యమునందు గల, పారమార్థిక సత్యము యొక్క అద్భుతానుభూతియే మతమగుచున్నది. ఈ సత్యమును, బ్రత్యగాత్మ పరమాత్మలను విభేదమును, శాస్త్రము బోధించి యున్నది. అందుచే కేవల పదార్థద్రష్టలచే నా పరమాత్మను గ్రహింప యత్నించినంతమాత్రమున, నా పరమాత్మతత్త్వము సమగ్రముగ నవగాహనము గానేరదు, గాన, నా పరమాత్మను నడిపించు బ్రత్యగాత్మయే యథార్థముగ ముఖ్యముగాన, నందుచే దృష్టుల మానవుడు, బాహ్యశక్తి పరీక్షణ, అనుసరణముల గావించి, ఉపయోగించుకొని ధన్యుడైనట్లు బ్రాంతి

39. Karl Jaspers : Way of Wisdom, p. 63.

40. Dr. S. C. Chattarjee : Can We Discard Religion : Prabuddha Bharata, 1952, p. 91.

నొందక, ఆ శక్తులకేకైక శక్తియై, తన యంతరమునగల ఆ
గ్రహింప యత్నించుచో నెంతటి అవ్యయానంద సంధానము
గలడో! ఆ శక్తి ప్రభావమునకు ఎదుటగల యీ అన్యశక్తు
స్వల్పములు రేణువులు. ఈ ప్రాకృత శక్తులు దోషయుక్తములై
వినాశమునకుగూడ వెనుదీయవుగాని, యీ ఆత్మశక్తి సదా సం
జీవామృతమై. నిర్దుష్టమై, పవిత్రమై యుండును. Though eve
man may claim to have found truth and poss
truth herself remains untouched. 41 సత్యదార్థమును
పొందినట్లు పలుమారు మానవుడు ప్రకటించుకొనుచుండినను, ఆ
మాత్రము సర్వదా అస్పర్శ్యముగనే ఉన్నది అని, పాశ్చాత్య
ఆచార్య ల్యూ వచించెను. దానిని గళంకము దరిజేర జాల
నిత్యపరిశుద్ధము. కాన దనను జేరి, ఆశ్రయించిన సర్వము
మొనర్చి, సర్వవిధ దోషపరిహారమొనర్పగల శక్తిసమన్విత
స్వరూపము. దాని నాశ్రయించినగాని, ప్రపంచము నానరి
దోషములు నివర్తింపజాలవు.

ఈ మహాకార్యమునకు కేవలాస్తిక్య భావనమమాత్రమనువ
'అస్తి బ్రహ్మేతి చేద్వేద' బ్రహ్మమున్నదని గ్రహించుట
మగుటచే నది సర్వ సమర్థముకాదు. 'అహం బ్రహ్మేతి చేదే
బ్రహ్మమునని గ్రహింపజేయు అపరోక్షజ్ఞానముగాని పూర్ణ
నిర్వహణ సమర్థముకాదు. అపుడుగాని మానవుడు తన యౌన్న

41. J. J. Der Leuw LLD : The Conquest of Ill

ఉత్కృష్టతను, గ్రహించుకొన గలిగి, తదనుగుణ ప్రవర్తనమున మానవాభ్యుదయ తత్త్వమున మెలగజాలడు. అపుడుగాని human dignity మానవ గౌరవము ప్రపంచమున ఉన్నతస్థాయి నందుకొననేరదు. కావున నీ మహాకార్య సాధనమునకు, శ్రుతి యుక్తి అనుభవములకాలవాలమై, అధునిక భౌతిక విజ్ఞానమును బూర్వమే లోవిముడ్చుకొనినదై, ఏట్టి మేధాసంపన్నుని నైన, కుతార్కికునైన నాకర్షించి, సమ్మతింపజేయగల అద్వైత వేదాంతము యొక్క సంపూర్ణజ్ఞానము అత్యవసరము. పూర్వశతాబ్దమున దన దివ్యదృష్టిచే గాంచి, రానున్న ఉపద్రవమును అవలోకించి, మనవివేకానందుడు ప్రవక్తయై, యిట్లు పలికి యున్నాడు. The salvation of Europe on a rationalistic religion, and Advaita-the non-duality, the Oneness, the idea of the Impersonal God-is the only religion that can have anv hold on any intellectual people. It comes whenever religion seems to disappear, and irreligion seems to prevail........42 ఐరోపాఖండ తారణోపాయము యౌక్తికమతముపై నాధారపడియున్నది. అద్వైతము, నిర్గుణ దైవభావము ఏకత్వములుమాత్రము ప్రజ్ఞాశీలురగు ప్రజానీకమును గ్రహింప గలదు. పారమార్థిక జీవనముఅంతరించునట్లును, మూర్ఖమతము అధిగమించునట్లుండు సమయముల నిది ముందునకేతెంచును. ఆ సమయమీకాలమున

42. Swami Vivekananda, The Complete Works. Vol. 2. p. 139.

నేర్పడినది గదా! అట్టి సర్వసమన్వయ సిద్ధాంతము సర్వత్ర తలెత్తి జూచు చున్నదిగదా! అద్దానికి మన హృదయ కవాటము బాహాటముగ దెరచి, ఘనస్వాగత మొసంగెదము గాక! 'ఈశ్వరానుగ్రహాత్ ఏవ పుంసాం అద్వైత వాసనా'(5—25) అని, 'ఖండన ఖండ ఖడ్గమున' శ్రీహర్ష చక్రవర్తి వచనము ననుసరించి, అదియు ఈశ్వరానుగ్రహ [illegible]. నట్టి మహోదయమునకు బరమేశ్వరుని నేకాంతముగ బ్రార్థించెదము గాక!

# శ్రీ శంకరానంతరాద్వైతము

## శ్రీ శంకర

శ్రుతిస్మృతిపురాణానామాలయం కరుణాలయం ।
నమామి భగవత్పాదం శంకరం లోకశంకరం॥

శ్రుతి స్మృతి పురాణములకాలయమును, దయానిలయమును అగు
లోకసుఖ ప్రదాతయైన శంకర భగవత్పాదునకు నమస్కరించుచున్నాను.

నత్వా విశుద్ధవిజ్ఞానం శంకరం కరుణానిధిం ।
(భాష్యం ప్రసన్నగంభీరం తత్ప్రణీతం విభజ్యతే)

వాచస్పతిమిశ్ర (భామతి).

విశుద్ధ విజ్ఞానమును, కృపాసాగరుడును అగు శంకరునికి ప్రణమిల్లి,
(తత్కృత సువిస్పష్ట గంభీరభాష్యమును వివరింప బూనెదముగాక)

యస్యేదం సకలామలేందుకిరణ ప్రఖ్యైర్యశోరశ్మిభి
ర్వ్యాప్తం యస్య కృపాళుతా పరవశశ్చక్రే హితం దుఃఖినాం।
యద్వాణీకులిశావరుగ్ణమతయః పేతుర్ద్విశస్తార్కికాః
భక్త్యా పూజ్యతమం ప్రణమ్య తమహం తద్భాష్యనీతో యతే॥

సురేశ్వరాచార్య (తై. వార్తిక)

నిర్మల శశికిరణములవలె నెవని యశోతేజో పుంజములచే సమస్త
విశ్వము ఆవరింపబడినదో, దయాపరవశత్వమున నెవడు దుఃఖితులకు

శ్రేయమును జేసెనో, ఎవని వాగ్వజ్రములచే బరా ఘాతులై తార్కికులు దిక్కులు బర్వెత్తిరో, అట్టి విశేష పూజ్యతమునకు భక్తి నమస్కరించి భాష్యార్థవివరణమునకై యత్నించెదను:

వాదివ్రాత గజేంద్ర దుర్మదఘటా దుర్గర్వసంకర్షణః
శ్రీమచ్ఛంకరదేశికేంద్రమృగరాడాయాతి సర్వార్థవిత్ ।
దూరంగచ్ఛత వాదిదుఃశరగజాః సన్న్యాసదంష్ట్రాయుధో
వేదాంతోరువనాశ్రయ స్తదపరం ద్వైతం వనం భక్షతి॥

(మాధవాచార్య)

దుష్టులైన ప్రతివాది గజములారా! వాచకంఠీరవగణ దుర్గర్వమును నశింపజేయునదియు, సర్వార్థవేదియు నగు శ్రీమత్ శంకర దేశికేంద్రకేసరి వేంచేయుచున్నది. దూరముగ బొండు. సన్న్యాసదంష్ట్రములను ఆయుధముల గలిగి, వేదాంతారణ్యము నాశ్రయించి అది యున్నది. కాన అన్యమగు ద్వైత వనమును భక్షింపనేగుడు.

స్తవం మోహతమస్తోమ భానువావమునే నుషః।
స్తుమ స్తాం భగవత్పాదాన్ భవరోగ భిషగ్వరాన్ ॥

సదాశివేంద్రసరస్వతి (సూత్రవృత్తి)

అజ్ఞానాంధకారమునకు భానుడును, భవరోగనివారక భిషగ్వర్యుడును అగు శ్రీశంకర భగవత్పాదులకు జేమోడ్చు చున్నాను.

కాషాయాంబరధారిణం సుదువకం వీరాసనాధ్యాసినం
ముద్రాం జ్ఞానమయీం దధానమపరే హస్తాంబుజే పుస్తకం ।
శిష్యాన్ పార్శ్వగతాన్ పుస్తకధరాన్ తేజోధికాన్ నిర్మలాన్
పశ్యంతం కరుణాకరం గుణనిధిం శ్రీ శంకరార్యం భజే॥

కాషాయ వస్త్రధరుని, వీరాసనోపవిష్టుని, జ్ఞానముద్రాంకితుని, పుస్తకపాణిని, అధిక తేజోమూర్తులై నిర్మలులై, పుస్తకహస్తులైన శిష్యుల పార్శ్వముల గలవాని, కరుణాకరుని, గుణనిధిని, గురువర్యుని శ్రీశంకరాచార్యుని భజించుచున్నాడను.

సర్వతంత్ర స్వతంత్రాయ సంతతాద్వైతవేదినే।
శ్రీమతే శంకరాచార్యాయ వేదాంతగురవే నమః.

సర్వతంత్ర స్వతంత్రునికి, సంతతాద్వైతవేదిక, వేదాంతాచార్యుడైన శ్రీ శంకరాచార్యునకు నమస్కరించుచున్నాను అని పలువిధముల స్తుతింప బడిన శ్రీశంకర భగవత్పాదాచార్య యతి సార్వభౌముని, జగదాలంకారుని, త్రిలోక సుఖంకరుని, జగద్గురుని ప్రతిభావిశేషముల మున్నే గాంచి యున్నాము. అతని మహిమాన్వితమైన జీవిత కార్యపరంపరకు ముగ్ధులమై, వినమ్ర ప్రణామముల సహస్రాధికముగ పూర్వమర్పించియున్నారము. అటులే ఆ యశోవిరాజితుని ప్రకాశచంద్రికా సంచయమున దేలి, యాడులాడి యుంటిమి. భవపరంపరాసంజనిత, అపార, అవిచ్ఛిన్న దుఃఖ ప్రవాహమునుండి నుద్ధరింపజాలు అతని వచనసరణిలో, దేలి ఆనందించితిమి. అతని ఔపనిషదమృతోపదేశముల నాస్వాదించి, మైమరచి, పరబ్రహ్మానందధామమున నృత్యమాడితిమి. అట్టి అనిదంపూర్వ మహాపురుషుని నింక నేమని, ఎంతని వర్ణింపగలము! ఎట్లని వచింపగలము! ఒక్క మాటలో this is greatness that we may appreciate, but cannot understand. 43 మనము కొనియాడగలిగి, గ్రహింపజాలని

43. Sister Nivedita: S. S. Suryanarayana Sastry's Sankaracharya, p. iii

నీ మహత్వమునకు ఆశ్చర్య చకితులము కాగలముగాని అనుభవింపజాలము.
అది ఒక మహాజ్ఞానజ్యోతి!

ఆ కారణమున, నా గురుగణాలంకారుని సన్నిహితులై, అనవరత సంభాషణ, శ్రవణ, స్పర్శన, సేవనాదిక, మహావకాశముల గలిగి, సేవించి, ఆనందించిన అతని ప్రముఖ శిష్యులలో, శంకర ప్రబోధిత సిద్ధాంతములలో భేదవాదములుద్భవించినవి. ఆ సంక్లిష్ట మూర్తిని, వారు సరిగ గ్రహింపజాలరైరి యని, వారి రచనములు విదితము గావించుచున్నవి. అంతియగాక శంకర రచనములగల ఉపమాన సందోహముల, సమన్వయ స్థానముల ప్రాధాన్యమును బోనాడి, 'న హి దృష్టాంత దార్ష్టాంతికయోః క్వచిత్కించిద్వివక్షితమంశం ముక్త్వా సర్వసారూప్యం కేనచిద్దర్శయితుం శక్యతే సర్వసారూప్యేహి దృష్టాంత దార్ష్టాంతిక భావోచ్ఛేద ఏవ స్యాత్ (బ్ర. సూ. భా. 3. 2. 20.) ఎక్కడనైన, దృష్టాంత దార్ష్టాంతికములకు వివక్షింపబడిన యెద్దియేనొక యంశమును విడిచి, సర్వసారూప్యమెవ్వని చేతను జూపింప శక్యముకాదుగదా ! సర్వవిధములనే సారూప్యము గలుగుచుండగా, దృష్టాంత దార్ష్టాంతిక భావమునకు విచ్ఛేదమే యగును, అను శ్రీ శంకర వాక్యములను విస్మరించి, 'ఏకదేశేన సదృశముపమానం న సర్వథా' (3. 10. 12) ఉపమానము ఒక విషయమున నన్వయముగాని, సర్వవిధములగాదను యోగవాశిష్ఠ వాక్యమును బెడజెవి నుంచి, ఉపమానోపమేయముల సామ్యత్వము పాక్షికముగ గొన్ని విషయములమాత్ర ముండునుగాని, సమగ్రముగ సర్వవిషయముల నుండదుగాన, వాని సర్వత్ర అన్వయింపరాదని శంకరుడు హెచ్చరిక గావించి యున్నను

దృష్టాంత, దార్ ష్టాంతికముల దమ తమ మేధానుసారముపయోగించి, సిద్ధాంతమును క్లిష్టతరము గావించి. సామాన్య ప్రజ్ఞాదూరము గావించిరి.

ఈ కారణమున వ్యాఖ్యాతలు తమ వ్యక్తిత్వ. సహజత్వముల గోల్పోయి, పూర్వ గ్రంథములకు భాష్యముల, వ్యాఖ్యల, వార్తికముల, టీక మొదలగు వృత్తుల రచించెదరు అను అపవాదును రచయితలు అపవాద మొనరించిరి. విమలానందుడు వచించునట్లు, In Philosophic tradition of this country we notice that in spite of the great respect and admiration Which the pupil had for the teacher the latter was not often an exact copy of the former. 44 అపార భయ భక్తులు గురువుపై శిష్యునకున్నను, శిష్యుడు గురువునకు సదా కేవల ప్రతిరూపము గాదని మన దేశ, శాస్త్రసంప్రదాయమున గోచరము. ఈ సత్యము ననుసరించియే New significances were discovered and expressed in originai form by brilliant disciples, like Padmapada, Sureswara, Vachaspati, Chitsu kha and Appaya who also at times framed novel concepts and arguments with great critical awareness. 44 పద్మపాద, సురేశ్వర, వాచస్పతి, చిత్సుఖ, అప్పయ్య మొదలగు ప్రజ్ఞాధురీణులగు శిష్య గణము, స్వతఃసిద్ధముగ వినూత్న విషయములను గమనించి వివరించిరి. కొన్ని వేళలవారు, అపార విమర్శనా కౌశల్యమున, అద్భుత సిద్ధాంతముల నిర్మించిరి అనియు విమలానందుని సంస్తుతి. వీరు గురుదేవుని ప్రతిరూపులు-గారని నిరూపింప అప్పయ్యదీక్షితుని 'సిద్ధాంత లేశసంగ్రహ' పఠనము

44. swami vimalananda: Indian Expreas, 30—7 1958.

గాలునని సూర్యనారాయణశాస్త్రి సూచించెను. Bound as the Writers no doubt felt themselves to be by the doctrines of the VEDANTA SUTRAS as interpreted by Sankara, they yet show considerable variation and originality in tackling the varius problems in detail. 45 నిస్సందేహముగ నా రచయితలు వేదాంత సూత్ర సిద్ధాంతముల, శంకర వ్యాఖ్యానము ననుసరింప బద్ధులై యుండియు, వివిధ సమస్యల వివరించు సమయముల, అత్యంత విభిన్నత్వమును, స్వతఃసిద్ధత్వమును ప్రకటించి యుండిరనియు నా ఆచార్యుని వచనము. కాని ఆ విభిన్నత్వములు ఆచార్య రాసవిహారి దాసు వచించినరీతి తరతమ విభేదములు గలిగిగాని, ఉత్తమ హేయత్వములు గలిగిగాని గాక, The different systems are not definitely true or definitely false, but merely represent different views of reality from different standpoints, corresponding to the philosophers' insight. 46 నా సిద్ధాంతములు తప్పక సత్యములుగాని అసత్యములుగానిగాక ఆ యా తత్త్వవేత్తయొక్క అంతర్దృష్టి ననుసరించి. ఆ సత్పదార్థమునుగూర్చి వివిధ దృక్పథములుమాత్ర మగును.

కావున శాస్త్రము బహుముఖాభివృద్ధినొంది, ధీమంతుల మేధాసంపత్తి నుపయోగించుకొని విజృంభించి, This metaphysical standpoint of

45. Prof. S. S. Suryanaeayana Sastry : The Siddhanta Lesa Sangaraha, p. 5.
46. Dr. Rasvihary Das : Address, The Indian Philosophical Congress, 1956.

Absolute Monism in Shankara's system had given rise to a well established dialectical literature. 47 శంకర అద్వైత సిద్ధాంతము, సుస్థిర సిద్ధాంత వాఙ్మయమునకవకాశ మొసంగినది. ఈవిధము ఆచార్య వ్యాఖ్యా వాక్యములలో, పాశ్చాత్యతత్వశాస్త్రమున కంటె the brief Eas tern treatises are like a refereshing breath from heaven. 48 ప్రాగ్దేశసిద్ధాంత సంగ్రహములు, దివినుండి వీ తెంచు ప్రాణ ప్రద మలయమారుతములై విరాజిల్లినవి. అదియు నొక అపూర్వ మహిమ యేగదా! ప్రముఖార్యమేగదా !

-- )( —

## అద్వైత ప్రస్థాన ద్వయము

ఈ విధముగ శ్రీ భగవత్పాద శిష్యులలో స్వతఃసిద్ధ వ్యత్యాసము లేర్పడి, పూర్వోక్తచందము శంకర ముఖ్య శిష్యుడైన పద్మపాదా చార్యుని పంచపాదికా గ్రంథముతో ప్రారంభమైన భావజాలములో ఒక విధానముగను, వాచస్పతిమిశ్ర కృతభామతీ భావపరంపర యొక మార్గము గను ఏర్పడినవి. పంచపాదికా గ్రంథమునకు, పంచపాదికా వివరణమను ప్రకాశాత్మని గ్రంథము మూలగ్రంథమునకు మించిన ప్రసిద్ధినార్జించి, శ్రీ శంకర భావములలో వివరణ ప్రస్థానముగ నేర్పడియున్నది. అటులే శంకర సమకాలికుడై, శంకర పూర్వ అద్వైత్వభావముల గొంతవరకు

47. Bratindra Kumar Sen Gupta : Prabuddha Bharata, 1953, p. 177.

48. J. J. Der Leuw LLD : The Conquest of Illusion.

గ్రంథస్థము గావించి, 'బ్రహ్మసిద్ధి' అను ప్రఖ్యాత గ్రంథమును వివరించిన మండన మిశ్రుడు రెండవశాఖకు మూలపురుషుడై యున్నను, ఆ భావముల జాలవరకు స్వీకరించి, తన భామతీ గ్రంథమున నవసరమగు సమయముల ముఖ్యముగ శంకర భాష్యమునకు దన భావముల నన్వయించు నవకాశము గలుగువేళల, ఆ మండన భావ సముచ్చయమును చేర్చి, వివరించి, 'బ్రహ్మసిద్ధికి' కి మించిన ప్రశస్తిని 'భామతి' కి ఆర్జించి యుంచుటచే, వాచస్పతి యీ ద్వితీయ పక్షమునకు నాయకుడైనట్లు, "భామతీ" విధానమే ముఖ్యమనునట్లు, ద్వితీయ శాఖ "భామతీ ప్రస్థాన" మని పేరు సంపాదించినది. 49 ఈ విషయమున దొలి వాకొనినరీతి, Vachaspati owes the major part of what is distinctive in his teaching to Mandana's BRAHMASIDDHI ... Vachaspati draws largely on the BRAHMASIDDHI, and sometimes on the PANCHAPADIKA, whenever necessary or possible. 49 వాచస్పతి తన సిద్ధాంతమున నధికభాగము మండనుని బ్రహ్మసిద్ధిపై నాధారపడెను. అటుల "బ్రహ్మసిద్ధి" నుండి అధికభాగము గ్రహించియున్నను, అవసరమగుచోట అవకాశమున్నవేళ, పంచపాదిక నుండికూడ విషయముల గ్రహించెను. అట్లు శ్రీ శంకర బ్రహ్మ సూత్ర భాష్యము నాధారముగ గొని, అందుండి జనించిన 'వివరణ ప్రస్థానము'నకు 1). పద్మపాదుని 'పంచపాదిక. 2) క్రీ. శ. 1200 సంవత్సరము వాడైన,

49. Prof. S. S. Suryanarayana Sastry : The Bhamati p. xii.

ప్రకాశాత్ముని 'పంచపాదికా వివరణము,3). విద్యారణ్యుని 'వివరణప్రమేయ సంగ్రహము, 4). క్రీ. శ. 1552 సంవత్సరమునకు జెందిన అద్వైత విద్యాచార్యుని 'వివరణ దర్పణము' 5). క్రీ. శ. 1400 సంవత్సరపు ప్రాంతముల వాడైన భారతీ తీర్థుని 'వివరణోపన్యాసము, 6). క్రీ. శ. 1300 సంవత్సరముల వాడైన అఖండానందుని 'తత్త్వదీపనము, ప్రముఖ గ్రంథములై యుండ, నా శంకరభాష్యమునే ప్రాణాధారముగ గొని ప్రారంభించిన భామతీ ప్రస్థానమునకు 1). క్రీ. శ, 840 సంవత్సరము నకు జెందిన వాచస్పతి మిశ్రుని 'భామతి' 2). క్రీ శ 1250 సంవత్సరమునకు జెందిన అమలానందుని "వేదాంత కల్పతరువు" 3) క్రీ. శ. 1552 సంవత్సరము నకు జెందిన అప్పయ్యదీక్షితుని "కల్పతరు పరిమళము" ప్రబలాధారములు. ఈ విషయమునుసమీక్షించుచు, శంకరభాష్యమునకు నీ రెండు శాఖలు గల వనియు, పండిత వి. సుబ్రహ్మణ్యశాస్త్రి వచించి, మధుసూదనుని తాత్పర్య మున సూత్ర, భాష్య, భామతి, కల్పతరు, పరిమళములు వేదాంత శాస్త్రమున కాధారములని వాకొనియున్నాడు. 50. మధుసూదనుడుగూడ భామతీ విధాన మును అభిమానించినట్లు దీన వ్యక్తము. అందుచే నితని"అద్వైతసిద్ధి"యంది గొన్ని సిద్ధాంతములు. నీ వేం థా ననుసరించినట్లు ముందు గాంచెదము. కొన్ని స్థానముల, సురేశ్వ రు ప్రమాణముగ గూడ వాచస్పతి స్వీకరించి, అతని దన భావముల కన్వయించు కొనును.

ఈ ప్రస్థాన ద్వయమేగాక, నిక ననేక వేత్తలు అనేక రీతుల నడచి, శంకరు ధిక్కరించినట్లుండక, అతని సిద్ధాంతముల దమకన్వ

50. V. Subrahmanya Sastry : The Hindu, 9–12–1956.

యించుకొనుచు, దాము శంకరతాత్పర్య వివరణము గావించుచున్నట్లుగ గూడ బ్రకటించుకొనిరి. ఈ వివిధ విషయముల సమీక్షించి, విభేదముల జూపించి, అవసరముల వివరించుట బహు ప్రయాసలతోడను, పాండిత్యము తోడను గూడిన కార్యమైయున్నది. పై బేర్కొనిన గ్రంథములన్నియు, నద్వైత సిద్ధాంత శాస్త్రమున గడు జటిల గ్రంథములని బేర్వడసి, సామాన్య ప్రజ్ఞాదూరములై అస్పర్శములై యున్నవి. కొన్ని యింకను బ్రకటింపబడక లిఖితరూపమునగూడ నుండుటచే వ్యాప్తి నార్జింపక, గ్రంథాలయముల నిద్రించుచున్నవి. అట్టి కొన్నింటి నధ్యయనము గావించి, విభేదముల కాశ్చర్యచకితుడై' నీ విభేద భావముల గ్రోడీకరింప నుద్యుక్తుడై, కృతకృత్యుడైన ప్రథమ విద్వన్మణి అప్పయ్యదీక్షితుడు. అతడు క్రీ. శ. 1552 సంవత్సరమునుండి 1624 సంవత్సరమువరకు జీవించియున్నట్లు నిర్ణయము. 51 ఇతడు బహుశాస్త్ర పాండిత్యము నార్జించిన వాడై, సుమారు అయిదు వందల శిష్యులచే బరివృతుడైయుండెడి వాడట. ఇతని రచనములు సర్వ శాస్త్రములవిషయించుచు, శతాధికమని ప్రతీతి. అతని అసంఖ్యాక రచనములలో మనకు ముఖ్యముగ నాధారమైనది 'సిద్ధాంత లేశ సంగ్రహము; అతడిందు, అద్వైతసిద్ధాంతమునగల విభిన్న దృక్పథముల జిత్రించుటయే గాక వివరించియున్నాడు. While showing undoubted mastery of the varieties of Advaita doctrine, it exhibits very little of his own genius, 51 కాని అద్వైత సిద్ధాంత వ్యత్యాసముల

51. prof. S. S. suryanaraya Sastry : The Siddhanta Lesa Sangraha, p. 3.

1గూర్చి నిస్సంశయ పాండిత్యమును జూపించియు, అతని అసాధారణ ప్రజ్ఞను ఆ గ్రంథము ప్రకటింపలేదని, సూర్యనారాయణశాస్త్రి వచించెను. తనకు లభ్యమానమైన యీ పాండిత్యమంతయు, దన తండ్రియొక్క ప్రసాదమే అని అతడు చెప్పికొనెను. 61 అట్టి యసాధారణ ప్రజ్ఞాసంపన్నుని 'సిద్ధాంతలేశము' మన "సౌరభము"నకు బ్రస్తుతము ఆధారము.

అటులే, సర్వ శాస్త్రముల, గూలంకష పాండిత్యమును గడించి, వ్యాఖ్యారచనమునకు దృష్టి గాంచక, ప్రత్యేక గ్రంథముల హిందీభాషలో నిర్మించి, అత్యంత కీర్తినార్జించిన పండిత నిశ్చలదాసుని "విచారసాగర", "వృత్తిప్రభాకరము" లను యీ రచనమునకు మిగుల దోడ్పడినవి.

అందుచే నీ పండిత ద్వయమును ముందుంచుకొని, అద్వైత సిద్ధాంతమున, విభిన్న దృక్పథములని సుమంత గ్రహింప యత్నించెదముగాక. వారి ప్రత్యేక గ్రంథములే అసమగ్రములనియు, అసంతృప్తికరములనియు గొందరు భావింప, నిక నీ 'సౌరభ' ప్రయత్నమెంత అసంపూర్ణమో వేరుగ వచింపవలయునా? ఏనాటికైన అంసపూర్ణత్వమ్ము సంపూర్ణత నొందగలదు గదా అను ఆకాంక్షచే నీయత్నము గావింపబడినది. ఈ రచనము పాఠకుల నా యా గ్రంథములపై దృష్టుల బ్రసరింపజేసి, వాని యధ్యయనమునకు ఉత్సాహప్రోత్సాహముల గలిగించినచో బ్రస్తుతమునకు నదియే సంపూర్ణతవముగ 'సౌరభము' విశ్వసించి సంతృప్తి గాంచును,

-- )( —

# వివిధాద్వైతవాద సమీక్ష

ఇంతదనుక, మన అద్వైతవాద విచారణా సందర్భమున. నీ అద్వైత సిద్ధాంతము వేదములంతా నిర్వచించి, ప్రాచీన భారతీయ వివిధ సాహిత్యముల ప్రవహించి, శ్రీ శంకర భగవత్పాదాచార్య స్వర్శామాహాత్మ్యమున అవధుల నతీతించు పెను వెల్లువయై ఏకోన్ముఖముగ జూపబడినను, అందందు నాసిద్ధాంత ప్రతిపాదనా వివరణములలో సూక్ష్మ విభిన్నత్వములు శ్రీశంకర పూర్వాద్వైతమున లేకపోలేదు. గౌడపాద శంకరులకును, మండన శంకరులకును, యీ విభేదములు ప్రస్ఫుటములని విజ్ఞుల అభిప్రాయము. ఆ తారతమ్యముల గవేషించి, గ్రహించుటయు నతి మసూక్ష్మమనిపించును.

కాని శ్రీ శంకరానంతర అద్వైతరంగమున, నీ విభిన్నమార్గముల ద్రొక్కి, కేవలము బ్రహ్మనిర్వచనము, సృష్టి స్థితిలయ విచారము, జీవత్వ నిర్ణయము, ఈశ్వరస్థితి, ముక్తిస్థానము మొదలగు సిద్ధాంత విషయముల మాత్రమేగాక, ఆ విషయగ్రహణవిధానమున, గమ్య సాధనోపమార్గముల గూడ అనేక వ్యత్యాసములు పొడసూపి, శ్రీ శంకరానంతరాద్వైత వాతావరణమును పెక్కు సమస్యలకు, మిగుల సంక్షోభమునకు, దారి దీసియున్నవని కొంతవరకు బూర్వము గ్రహించి యున్నారము. ఈవిభేదములు కేవలము వివరణ ప్రస్థానభామతీ ప్రస్థానములుగ బాహ్యమునకు స్థూలముగ గోచరించినను, లోతునకు దిగిపరిశీలించినచో ప్రఖ్యాతములుకాని అసంఖ్యాక, విభిన్న సిద్ధాంత ప్రతిపాదనములు బహుళముగ రూపొంది, అద్వైతశాస్త్ర బృహత్త్వమునకు అవకాశమొసంగియున్నవి. అందు ముఖ్యమైన వాని మాత్రము

సింహావలోకనము గావించి, గ్రహింప యత్నించెదముగాక! అందులకు స్థూలమునుండి సూక్ష్మము నెరుంగ యత్నించుట యనుమంత సులభమగుటచే సృష్టినుండి ప్రారంభించెదముగాక!

— o —

# ఉపాదానకారణము

ఏదేని సృష్టికార్యము జరుగుటకు, ముఖ్యముగ ద్వివిధకారణముల వసరముగ బూర్వము గ్రహించి యున్నారము. సృష్టికి స్థూలముగ, వస్తుత్వ రూపమగు గారణమును ఉపాదాన కారణమని యందురు. ఈ కారణము కార్యరూపము ధరించి, కార్యమునందంతర్గతమై ప్రత్యక్షముగ గార్యమున, నవినాభావ సంబంధముగ నుండును. రెండవది యగు నిమిత్తకారణము సూక్ష్మమై, చేతనమై, స్థూలముగనున్న ఉపాదానమును గార్యరూపము నొందింప ప్రబలకారణమగుచున్నది. అది సర్వదా చేతనము ఉపాదానము ఎల్ల వేళల అచేతనముగ నుండును. కార్యమునకు నిమిత్తము బాహ్యము, ఉపాదానము ఆంతరమనియు గ్రహించియున్నారము. వీని నాధారముగ గొని, విశ్వమునకు సృష్టి స్థితి లయ కారణమును అనుమానించి, శాస్త్రాధారముగ దీర్మానించి, పరబ్రహ్మను బరోక్షముగ నెరుంగుటయే శాస్త్రవిధానము. కాని, నిమిత్తకారణము కార్యమునందుండక బరోక్షముగ నుండుటచే, బ్రధ

మతః కార్యమునందిమిడియున్న ఉపాదానమును గ్రహింప యత్నించెదము గాక! మరియు నీ యుపాదాన నిర్ణయమున, వివిధాద్వైతవాదములగూడ గొంచెము తిలకించెదముగాక.

ఈ సర్వ సృష్టికి నుపాదానకారణముగ శుద్ధబ్రహ్మముగలదా? ఈశ్వరరూపద్వారమున బ్రహ్మమా? ఈశ్వరుడా? జీవరూపమునా? జీవుడా? మొదలగు అనేక సందేహములు పుట్టొందును.

వీని విమర్శించి "యతో వా ఇమాని భూతాని జాయంతే' అను తైత్తిరీయక శ్రుతివాక్యము ననుసరించియు, 'జన్మాద్యస్య యతః' అను బ్రహ్మసూత్రము ననుసరించియు, నీ సర్వజగత్తునకు జన్మ స్థితి లయ కారణ మైనది బ్రహ్మము అని నిర్వచనము. అనగా నా బ్రహ్మముమాత్రమే, యీ సృష్టికి సృష్టికారణము, స్థితికారణము, లయకారణముగూడ నని 13 వ శతాబ్దమునకు జెందిన రామద్వయాచార్యుడు తన 'వేదాంత కౌముది," అను గ్రంథమున వాకొనెను.

కావి, సృష్టి స్థితి లయరూపమున గల కారణత్రయమున, సృష్టి స్థితి కారణములు రెండును, నిమిత్తకారణమునకన్వయ మగుచు, సామాన్యముగాపు టనే తైత్తిరీయక శ్రుతివాక్యమున, 'యం ప్రయంత్యభిశంవిశంతి. అను వాక్యమును జేర్చి ఆ శ్రుతి లయ కారణమునుగూడ బ్రస్తావించి, బ్రహ్మ మునకు ఉపాదాన కారణత్వమునుగూడ నన్వయించినది. ఘటమునకు గుమ్మలా డుడు సృష్టికారణమైనట్లును, భూపాలుడు రాజ్యమునకు స్థితికారణమైనట్లును, నీ సృష్టికి బ్రహ్మేతర తత్త్వము సృష్టి స్థితి కారణములగుచున్నదా?

అనియు మరల సంశయించి, ఆ రెండుకారణముల నుపాదానముతో బాటు బ్రహ్మమునకుమాత్రమే శ్రుతి మేళవించినది. ఆవిధముగ సృష్టి స్థితి లయములేకముగ నన్వయింప, శుద్ధ బ్రహ్మముమాత్రమే యీ యనంత సృష్టికినిమిత్తోపాదానకారణములగుచున్నది అని భామతీకారుడైన వాచస్పతి మిశ్రుడును, తద్వ్యాఖ్యాత 'వేదాంత కల్పతరు', కారుడైన (13 వ శతాబ్దమునకు బెందిన) అమలానందుడును భావించిరి.

అటుల, 'జన్మాద్యస్య యతః' అను సూత్రమున, దానికి భాష్యకారుడైన శంకర తాత్పర్యమున, శుద్ధబ్రహ్మమే ఉపాదాన కారణముగ వచింపబడినదనియు, నందుచేతనే 9 వశతాబ్దమునకు జెందిన 'సంక్షేప శారీరక' గ్రంథకర్త యగు సర్వజ్ఞాత్మముని భావముగ, నతని అనుచరులు కొందరు తలంచెదరు.

ఈ విధముగ బ్రహ్మమునకు నన్వయింపబడిచ ఉపాదానత్వము, వైశేషికుల పరమాణువులవలెను, సాంఖ్యుల ప్రధానమువలెనుగాక, అవిద్యాబలమున, బంచ భూతాత్మకముగ వివర్త విధానమున నగుచున్నది, సమసత్తాకమైన ఉపాదానత్వము పరిణామ రూపమగుచుండ, అన్యసత్తాకమైనది వివర్తరూపమగును. కారణమున నభిన్నకార్యమున్నచో నది పరిణామరూపమగును. విభిన్నత్వమున అవినాభావమై యున్నను, నది వివర్తరూపమని వివరింపబడినది.

ప్రాణ, మన, ఇంద్రియములు, ఆకాశాది మహాభూతములు, ఏతస్మాజ్జాయతే' దీనినుండి జనితములని ముండకోపనిషత్తు తెలుపుచుండుటచేత,

నీ వ్యావహారిక ప్రపంచమునకు బ్రహ్మముమాత్రమే ఉపాదానకారణము. కాని యా ఉపాదానత్వము వివర్తరూపముగ నగుచున్నది. ఎట్లన, ప్రాతి భాసికరూపమైన స్వప్నప్రపంచమునకు, జీవుడు ఉపాదానకారణ మగుచు న్నాడు. అట్లు బ్రహ్మము, యీ సృష్టికి నుపాదాన కారణము కాగలదు. బ్రహ్మ మఖండమగుటచే, అతని ఒక భాగము ప్రపంచమున కుపాదానము కానేరదు. కాన సంపూర్ణ ముగ బ్రహ్మమే ఉపాదానమైన దనినచో, కార్య సృష్టి అనంతరము బ్రహ్మ మభావము కావలెను. అనగా నా బ్రహ్మము రూపాంతరమునొంది, తన యధార్థస్థితిని గోల్పోవలెను. కాన అట్లు కావు ట చెల్లదు. అందుచే, స్వప్నమున సుప్తుడగు జీవు డెట్లు పరిణమింపక స్వప్నదృశ్యముల ననుభవించునో, అట్లు, బ్రహ్మము నిర్వికారముగ, సృష్టికి ఉపాదానకారణ మగుచున్నా డని కొందరు వివరించిరి.

అట్లుగాక. మాయా బ్రహ్మములు రెండును జగత్తున కుపాదానము లని 11 వ శతాబ్దమునకు జెంది "ప్రకటార్థత త్త్వ నిర్ణయము"ను రచించిన ఆనందానుభవుని వాదము. అతని సిద్ధాంతము ననుసరించి, యీ సృష్టిలోగల సత్తా జడత్వములు రెండును, బ్రహ్మ మాయలచే నేర్పడినవని వివరణము. అందు బ్రహ్మము వివర్తరూపముగ నుపాదానమగుచుండ, అవిద్యయగు మాయ పరిణామరూపమున నుపాదానకారణము కాగలదు. ఇచట వివర్తాధి ష్ఠానము పారిభాషికముగ నుపాదానముగాక, కార్యజనకత్వమున నగునని అతని తాత్పర్యము.

ఈ వాదమునకు సమ్మతించి, వివర్తపరిణామమున నన్వయించి కొందరు, ఒకే నిర్వచనము గావించిరి. స్వాభిన్న కార్య జనకత్వముమాత్రమే ఉపాదానత్వమని వారి తీర్మానము. ప్రపంచము వివర్తముగ బ్రహ్మములో ననన్యముగ నుండి, జడమైన అజ్ఞానముతో బరిణామముగ ననన్యమగును "ఘట మున్నది," అను వ్యవహారమున, "ఉన్నది" వివర్తముగ బ్రహ్మ మునకన్వయింప, "ఘటము జడము" అను వాక్యమున జడత్వము పరిణామ రూపమున మాయకన్వయము. ఇచట అనన్యత్వమనగ ఆరంభణముగాక, వ్యతిరేకాభావను. అనగా అభేదత్వముగాక, భేదరాహిత్యముగ అర్థము అందుచే, జగమునకు బ్రహ్మము అభేదముగాక, నా రెండింటికి సమసత్త లేకుండుటచే, శుక్తి రజతములకువలె, అధిష్ఠానాధ్యస్తములకు వలె భేద రాహిత్యము ప్రతిపాదితముగ, గొందరు అన్వయించుకొనిరి.

అట్లుగాక, బ్రహ్మమే ఉపాదానకారణమని సర్వజ్ఞాత్మముని పూర్వ రీతి వచించి, కూటస్థుడైన బ్రహ్మము స్వతః కారణముకా నసందర్భమై నచో, మాయాద్వారమున నుపాదానమగునని సమర్థించును. ద్వారకారణముగ నైకొనబడిన యీ మాయ సాక్షాత్తు కారణము కాకున్నను, కార్యములో ప్రవేశించి, ఘటమున మృత్తువలెనుండునని అతడు వివరించును.

అదియునుగాక, జీవాశ్రయమైన మాయకు, అధిష్ఠానమైన బ్రహ్మము ఉపాదానకారణమగును. అనగ నా బ్రహ్మము వివర్తమానముగ, ప్రపంచా కారమున వోచి, ఉపాదానకారణమగును. అందుచే నీ మాయ కార్యాను

గతమైన ద్వార కారణముగాక, సహకారికారణముమాత్రమగునని వాచస్పతి మిశ్రుని సిద్ధాంతము.

మరియు, మాయ విశ్వసృష్టికి బరిణామరూప ఉపాదానత్వము వహింప, బ్రహ్మము వివర్తోదానమనియు, ఆ బ్రహ్మము మాయోపహిత చైతన్యమనియు విద్యారణ్యముని తాత్పర్యము.

శ్రుతులు బ్రహ్మమును, పూర్వాపరములు లేనిదనియు; "న తస కార్యం కరణం చ విద్యతే" అనియు వివరించు చుండుటచే, నా సర్వాతీత బ్రహ్మము ఎట్టుగూడ నుపాదానకారణము కానేరదు. కావున మాయాశక్తియే ఉపాదానకారణమనియు, గాని బ్రహ్మము మాయ కధిష్ఠానముగ నుండుటచే నౌపచారికముగ మాత్రము జగమునకు ఉపాదానముగ బ్రహ్మము వచింప బడినదనియు "సిద్ధాంతముక్తావళి" గ్రంథకర్త యగు ప్రకాశానందుని మతము.

"అంతః స్తద్ధర్మోపదేశాత్" మొదలైన వేదాంత సూత్రములు "సైవ ఋగ్" మొదలైన శ్రుతులు, జీవేతరమైన ఈశ్వరుని సృష్టికుపాదానముగ బ్రతిపాదించి యున్నవి. అందుచే సర్వజ్ఞత్వ, సర్వశక్తిత్వ, లక్షణములుగల మాయాశబలితముగ నున్న ఈశ్వరరూపమున బ్రహ్మము ఉపాదానకారణముగ "వివరణ" గ్రంథకర్త యగు ప్రకాశాత్ముని అనుచరబృందము భావించెదరు. జీవేశ్వరులకు సామాన్యమైన చైతన్యముపాదానమైనచో, నది ఈశ్వరుడుగాక శాఖాచంద్రన్యాయమున ఈశ్వర రూపమున బ్రహ్మమునకన్వయించి, బ్రహ్మము నుపాదానముగ చెలుపునని వీరి వాదము.

అట్లుగాక, వియదాది ప్రపంచము ఈశ్వరాశ్రితమగు మాయా పరిణామముగాన ఈశ్వరుడే ఉపాదానముగుచున్నాడు. మరియు, ఈశ్వరాశ్రిత మాయా కార్యములైన స్థూలభూతములతో నేకమై, జీవుని అవిద్యా జనితమైన సూక్ష్మభూతములచే నంతఃకరణము ఉద్భూతముగాన, జీవేశ్వరులుభయులును సర్వసృష్టికి ఉపాదానకారణములగుదురు. దీనిని వివరించుచు, శ్రుతులు షోడశకలా ప్రస్తావమున, కళాశబ్ద వాచ్యములుగ ప్రాణ. మనః ప్రభృతులు తెలుపబడినవనియు. నటులే, విద్వాంసుడు విదేహకైవల్యము నొంద, విద్యచే నివి అవిద్యా కార్యములుగ నంతరించుచున్నట్లు వాకొనబడినదనియు, మరియు నొక మంత్రమున బదునైదు కళలు, వాని యుపాదాన కారణములైన భూతములలో లయించుననియు, నీ విద్యచే నా మహాభూత కారణమైన మాయమాత్రము అప్పుడు నివర్తింపదనియు వివరించి మాయా అవిద్యలకు భేదమును గొందరు భావించిరి. అందుచే నీ వాదము వారికి జీవేశ్వరు లిరువురు ఉపాదాన కారణములగుదురని గ్రాహ్యము.

పై వాదము నంగీకరింపనివారు కొందరు గలరు. ప్రపంచమునకు ఈశ్వరుడు ఉపాదానముకాగ, అంతఃకరణము జీవునితోనాత్మ్యప్రతీతముగ నుండుటచే వానికి జీవుడు ఉపాదానముగ నుండుననియు, జీవునిపై నంతఃకరణాధ్యాస శ్రీ శంకర అధ్యాసభాష్యమున నిందుచేత బ్రతిపాదింపబడినదనియు వారి తలంపు.

పూర్వోక్తముగ బ్రహ్మ, ఈశ్వరులుగాక, జీవుడు, స్వప్నద్రష్టవలె, నన్నింటికి బ్రభువుచందము సర్వ కారణుడని కొందరుతలంచెదరు.

అట్లునుగాక, "మాయంతు ప్రకృతిం విద్యాత్" మొదలగు శ్రుతులు ఘటాదులకు మృత్తు ఉపాదానమైనట్లు, మాయమే జగత్తునకు ఉపాదాన కారణమనుట జెల్లుగాని బ్రహ్మమెట్లు అని కొందరు సంశయించెదరు.

అదియునుగాక, ఈ మిథ్యా ప్రపంచమునకు అజ్ఞానము ఉపాదానమ్మ్యే కానగును. ఈ విజ్ఞాన కారణమునమాత్రమే బ్రహ్మమును ఉపాదానకారణముగ దలంచుటకవకాశమేర్పడుచున్నదని "అద్వైత సిద్ధి" గ్రంథకర్త యగు మధుసూదన సరస్వతి వాదించును.

—o—

## నిమిత్తకారణము

ఇంతవరకు, సృష్టికి వస్తురూపమున గారణమైన ఉపాదానత్వమును గూర్చి, వివిధాద్వైతవాదులలో గల అభిప్రాయభేదముల నతి క్లుప్తముగ జూపియున్నారము. ఇక, గార్యమునకు ముఖ్యకారణమైన చేతనరూపమున గలుగు నిమిత్తకారణ విషయమును బరిశీలించెదముగాక !

నిమిత్తకారణమనగ, గార్యానుకూల జ్ఞానరూపము గల కారణముగ, 'తదైక్షత' మొదలగు శ్రుతుల నాధారముగ గొని కొందరు వాకొనిరి.

అటులైనచో, నట్టి సంకల్పరూప ఆకాంక్షకు మరియొక పూర్వసంకల్ప మాధారముగ నుండుచు, మరల దానికి వేరొకటుండుచు, నీ పరంపరకు అంతములేక, నది అనవస్థా దోషముగ జెల్వొందును. కాన నీ కార్యానుకూల జ్ఞానము, ఏ యితర చైతన్యమునకు జెందక, బ్రహ్మమునకుమాత్రమే చెందు నని కొందరి వాదము. ఈ జ్ఞానము బ్రహ్మముయొక్క స్వరూపముకాన నది కార్యము కాదని యందురు.

కర్తృత్వమన గార్యానుకూలమై సృష్టియొక్క జ్ఞానవత్వమగునుకాని కేవలము కార్యానుకూల జ్ఞానవత్వము కానేరదు. భ్రాంతి, స్వప్నదృష్టాంత ముల వాయథ్యాసకనుకూల అధిష్ఠాన జ్ఞానముచే జీవునకు గర్తృత్వము గలుగు చందము, ఈ ఈశ్వర కర్తృత్వముగూడ నౌపచారికము మాత్రమే యగును గాని సత్యముగాదని కొందరు తలంచెదరు.

'శాస్త్ర యోనిత్వాత్' అను బ్రహ్మసూత్రమున, అఖిల ప్రపంచ రచనా కర్తృత్వము, సర్వజ్ఞుడైన బ్రహ్మమున కన్వయించుచున్నది. మరియు వేదకర్తృత్వముగూడ నతనికే యన్వయింపబడునని కొందరు సిద్ధాంతుల మతము.

అంత, నతనికి నంతఃకరణమభావమగుటచే సర్వజ్ఞత్వమెట్లుండును? అని నంశయము. కాని సర్వవస్తువిషయ, సకలప్రాణ, ధీ వాసనాయుక్త అజ్ఞాన ఉపాధికుడు ఈశ్వరుడగుచుండ, నతడు సర్వజ్ఞుడనియు, నతడే స్వరవిషయ వాసనాసాక్షియై, సర్వజ్ఞత్వ లక్షితుడనియు భారతీ తీర్థ మొదలైన వారి వచనము

సర్వసృష్టి రచనా సామర్థ్యమునకు ముఖ్యకారణమైన సర్వజ్ఞత్వమును గూర్చి చర్చించుచు, ఎట్లు జీవుడు తనకుపాధియైన అంతఃకరణ పరిణామముచే, దద్యోగముచే ప్రతిబింబములేర్పడి, వాని గ్రహించుచుండునో అట్లు మాయాపరిణామముచే జిత్ప్రతిబింబము లేర్పడి, ఈశ్వరునకు సర్వజ్ఞత్వము గలుగునని 'ప్రకటార్థ' కారుని వాదము,

బ్రహ్మమునకు వర్తమాన ప్రపంచజ్ఞానము అవశ్యము సంభవము. అటులే భూతవిషయ సంస్మరణము, తత్ జ్ఞానము గూడ సాధ్యము. సృష్టికి మూలము అదృష్ట జీవవాసనాచయముగూడ నతనికి జ్ఞానముగాన, భవిష్యత్తుగూడ నతనికి గ్రాహ్యము. అందుచే బ్రహ్మము మాయోపాధికః సర్వజ్ఞుడు అవి "తత్త్వశుద్ధి." కర్త జ్ఞానఘనపాదుని తాత్పర్యము.

బ్రహ్మమునకు స్వరూపజ్ఞానముండుటచే, దనచే సృజింపబడు సర్వమునకు సర్వజ్ఞుడగును. భూతభవిష్యత్తులు రెండును వాసనారూపముగా సిద్ధము. వానికై వృత్తిజ్ఞానమనవసరము. అందుచే నా విషయ జ్ఞానాత్మకత్వముననుని స్పష్టము. విజ్ఞాతృత్వము జీవునకన్వయింప, సర్వజ్ఞత్వము, జ్ఞానస్వరూపత్వము బ్రహ్మమునకన్వయముగ 'వేదాంత కౌముది' కర్త రామద్వయాచార్యుని మతము.

మరియు, బ్రహ్మము స్వరూపచైతన్యముచే, దనచే సృజింపబడిన దానిని ప్రకాశింపజేయుచున్నను, ఆ జ్ఞానము కార్యము కాకున్నను, దిన

బ్రహ్మకార్యముగ నిర్వచింపబడి, సర్వజ్ఞత్వము నాబడును. జ్ఞానజనీన కర్తృత్వముచే సర్వజ్ఞత్వము అని వాచస్పతి సిద్ధాంతము.

— ) ( —

## జీవుడు

ఇంతవరకు సృష్టికి అవసరమైన నిమిత్తోపాదానకారణముల విచారించి చూచియున్నారము. జడాత్మక సృష్టికి, భోక్తయగు జీవుని స్వరూప నిర్ణయముగూడ నవసరము. జీవతత్త్వ విచారణమున, అద్వైతవాదులలో గల తారతమ్యముల గాంచెదముగాక! ఇచట జీవచైతన్యముతో బాటు ఈశ్వరుడనబడు ఈశ్వరచైతన్య నిర్ణయముగూడ గొంత జరుగును. ఇరువురును చైతన్యరూపలేగదా! జీవనిర్మాణమున బ్రతిబింబవాద, అవచ్ఛేద వాద, వివర్తవాదములని ముఖ్యముగ మూడు వాదములు గోచరము. మరియు బ్రతిబింబవాదమునగూడ, జీవుడు బ్రహ్మ ప్రతిబింబమనియు, ఈశ్వరప్రతిబింబమనియు, మరల ద్వివిధ వాదములు గలవు. వీనిని మాత్రమేగాక, మరి యితరములగూడ బ్రస్తావనసమయమున గాంచెదము గాక !

అనాది అనిర్వాచ్యతత్త్వమై, భూతముల ప్రకృతియు ననగా ఉపాదానకారణమును, జిన్మాత్రసంబంధియనగు మాయ గలదు. అందు

చిత్ ప్రతిబింబింప నీశ్వరుడు ఏర్పడు చున్నాడు. ఆ మాయలో ఆవరణ, విక్షేపశక్తి గల అనంత పరిచ్ఛిన్న అవిద్యా భాగములు గలవు. ఆ అవిద్యా భాగములలో నా చిత్ప్రహ్మ చైతన్యము యొక్క ప్రతిబింబములు జీవులని 'ప్రకటార్థవివరణ' కారుడు 12 శతాబ్దములో వివరించెను.

'పంచదశి' తత్త్వవివేకప్రకరణమున విద్యారణ్యుడు, మూలప్రకృతిని సత్త్వ రజస్తమోగుణ విశిష్టముగ వివరించి యున్నాడు. ఆ మూలప్రకృతి, జీవేశుల నాధానములుగ గల్పించి, తా మాయా, అవిద్యలుగ నగుచున్నదను నృసింహోత్తరతాపినీ వాక్యము నాధారముగ వచించి, అందు రజస్తమములు లేని శుద్ధసత్వాంశము మాయ యనియు, ఆ గుణ ద్వయమునకు లొంగిన సత్వము, అనగ మలినసత్వాంశము అవిద్యఅనియు, అవిద్యా మాయలకు తారతమ్యమును రూపించి, ఆ మాయా ప్రతిబింబచైతన్యము ఈశ్వరుడనియు, అవిద్యా ప్రతిబింబ చైతన్యము జీవుడుగను విద్యారణ్యుడు వచించెను.

విక్షేపశక్తి, ప్రధానముగ మూలప్రకృతియే మాయ యనబడి ఈశ్వరోపాధి యగుచుండ, ఆవరణశక్తి ప్రాధాన్యమున నా మూలప్రకృతి అవిద్య నాబడి, జీవోపాధి యగును. జీవునకు చైతన్య సంబంధమున్నను, పై అవిద్యాసంబంధముచే నతడు 'అజ్ఞోస్మి' అని తలంచుకొనునుగాని, ఈశ్వరుడు మాత్రము అటుల భావింపడు అని జీవేశ్వర విభేదమును విక్షేపావరణశక్తిమూలమున గల్పించి కొందరు భావించెదరు.

'కార్యోపాధిరయం జీవః కారణోపాధిరీశ్వరః' అను శ్రుతివచన ప్రామాణ్యముగ, అవిద్యా చిత్ప్రతిబింబము ఈశ్వరుడనియు, అంతఃకరణ

చిత్ప్రతిబింబము జీవుడనియు, 'సంక్షేపశారీరకము' తెలుపును. ఇందు అవచ్ఛేదవాదము నిరాకరింపబడి, ఘటముచే నాకాశము అవచ్ఛిన్నమైన ట్టుల, నంతఃకరణముచే చైతన్యమవచ్ఛిన్నమైనట్లు వచింపరాదని హెచ్చ రించి, ప్రతిబింబములు జీవేశ్వరులు కారనియు, కేవల ప్రతిబింబములకు జీవత్వ ఈశ్వరత్వముల నన్వయింపక, ప్రతిబింబత్వ విశిష్ట చైతన్యమునకు అన్వయింపనగుననియు వివరింపబడినది.

పై వచింపబడిన నాలుగు విధముల, జీవేశ్వరులు ప్రతిబింబములై యుండ, బ్రహ్మము బింబమై పరిశుద్ధమై,, యుండి, ముక్త ప్రాప్యముగ జెల్వొందును. ఈ వాదముల బింబ, ప్రతిబింబములకు అభేదత్వముగలదు. ప్రతిబింబము మిథ్యగాక, ప్రతిబింబత్వధర్మము మిథ్య యగును. స్వరూ పము మిథ్యకాదు. ఈ పక్షముల ముక్త జీవులకు, బ్రహ్మముతో సాక్షా త్సంబంధముండును. ఇచట జీవుడు బ్రహ్మప్రతిబింబముగదా. జీవునివలె నీశ్వరుడుగూడ బ్రహ్మప్రతిబింబమగుటచే, జీవునికి ఈశ్వరునితో బింబ ప్రతిబింబసంబంధము లేదు. కావున ముక్తిచే జీవ ప్రతిబింబభంగమున, బింబమైన బ్రహ్మములో నది లయించునుగాని మరియొక ప్రతిబింబమైన ఈశ్వరునిలో లయింపదని యీ వాదముల తాత్పర్యము.

విద్యారణ్యుడు చిత్రదీపమున చైతన్య చతుష్టయమును గల్పించి, విభేదముల వివరించి అన్వయించెను. మహాకాశ, ఘటాకాశ, మేఘాకాశ, జలాకాశములవలె బ్రహ్మ, కూటస్థ, ఈశ్వర, జీవచైతన్యములు యిచట అన్వయింపబడినవి. స్థూల, సూక్ష్మ శరీరములకధిష్ఠాన చైతన్యము కూట

స్థము నాబడినది. నిరవచ్ఛిన్న చైతన్యము బ్రహ్మమగును. శరీరరూప ఘటమునందుగల బుద్ధిరూప జలములో చేతనముయొక్క ప్రతిబింబము జీవుడని నిర్ణయము. మాయారూపమై మేఘ, జల, కణరూప బుద్ధివాసనలో చైతన్య ప్రతిబింబము ఈశ్వరుడు అని విద్యారణ్యుని వివరణము. మరియు దాని వివరించుచు, సుషుప్తిలోగల సూక్ష్మబుద్ధియే వాసన యనియు, నా వాసనలు నానాత్మముగ నుండుననియు, నా బుద్ధివాసనావిశిష్ట అజ్ఞానమున జిత్ప్రతిబింబము ఈశ్వరుడనియు తెలుపబడినది. అటులే జాగ్రత్స్వప్నముల త్తూలాంతఃకరణము విజ్ఞానముగాన, దాని యందుండు చిత్ప్రతిబింబము విజ్ఞానమయము. ఆ విజ్ఞానమయమే జీవుడు. ఆనందమయుడు ఈశ్వరుడు. మాండూక్యముగూడ నిట్లే తెలుపును. కూటస్థ జీవులకు అన్యోన్యాధ్యాస వచింపబడ, బ్రహ్మ ఈశ్వరులకు అన్యోన్యాధ్యాస తెలుపబడినది. కాన జీవునియందు గూటస్థ ధర్మములు ఆరోపింపబడి, పారమార్థిక బ్రహ్మత్వ మును, ఈశ్వరునియందు బ్రహ్మము మధ్యసింపుటచే వేదాంత వేద్యత్వాది ధర్మములతనికి అన్వయింపబడినవి. ఇది విద్యారణ్య విధానము.

కాని, బుద్ధివాసనా ప్రతిబింబము ఈశ్వరుడు కానేరడని కొందరి వాదము. అందుచే ఆనందమయత్వము ఈశ్వరునకు వీరు నిరాకరించిరి. కేవలము అజ్ఞానమే ఈశ్వరునకుపాధి యని వీరి మతము. విజ్ఞానమయు డైన జీవుడే సుషుప్తియందు ఆనందమయాఖ్యుడుగాని ఈశ్వరుడు గానే రడు. ఆనందమయము జీవుని కోశపంచకమున నుండునుగదా! విశ్వ, తైజస, ప్రాజ్ఞులవలె ఈశ్వరునకు విరాట్, హిరణ్యగర్భ ఈశ్వరరూప

ంలు గలవు. అందు విరాట్టు స్థూలము, హిరణ్యగర్భుడు సూక్ష్మము. రిరువురికి సర్వజ్ఞత్వము లేదు. వీరు జీవులనియే శాస్త్రతాత్పర్యము. య్యును, స్థూలసృష్టి ప్రేరకుడు విరాట్టుగను, సూక్ష్మసృష్టి ప్రేరకుడు హిరణ్యగర్భుడుగను ఉండుటచే, వీరికి ఈశ్వరత్వ మన్వయింపబడినది. దేవిధముగ జీవుడైన ఆనందమయునకు ఈశ్వరత్వము అన్వయింపబడి దేగాని అచట ఆనందమయుడు ఈశ్వరుడుగాడని మాండూక్య మంత్రార్థ ములనన్వయించి, యీ వాదులు నిశ్చయించుకొనిరి.

భారతీతీర్థుని 'దృగ్దృశ్యవివేకము' ననుసరించి చూచినచో, జీవుడు పారమార్థిక, వ్యావహారిక, ప్రాతిభాసికముగ త్రివిధము. అందు కూటస్థ చేతనము పారమార్థికము. అతనికి బ్రహ్మముతో ముఖ్యాభేదము గలదు. మా యచే నావృతకూటస్థమున గల్పిత అంతఃకరణములో, జీవుడు వ్యావహారి కుడు. అతడు దేహద్వయమున అభిమాని. అతనిరూపము బ్రహ్మజ్ఞానముతో అంతరించును. నిద్రారూప మాయచే, నావృత వ్యావహారిక జీవరూప అధిష్ఠా నమునందు గల్పితుడు ప్రాతి భాసికుడు. జాగ్రదవస్థతో నితడు అదృశ్యుడు. ఈవిధముగ త్రివిధముగ జీవుడు గలడనియు, జీవ, ఈశ్వర, శుద్ధచేత నములుగ త్రివిధ చేతనములు గలవనియు సర్వసమ్మతముగ, నిశ్చలదాస నిశ్చితాభిప్రాయము.

ఈ పై సిద్ధాంతములలో, జీవుడు మోక్షకాలమున బింబ రూపమైన బ్రహ్మములో లయించునుగాని ఈశ్వరునితో నైక్యము నొందడు. కాని 'వివరణ' కారుడైన ప్రకాశాత్ముని తాత్పర్యమున, జీవుడు ముక్తస్థితిలో

ఈశ్వరునితో నైక్యమగును. అనగ జీవుడు పూర్వోక్తచందము బ్రహ్మ ప్రతిబింబము కాక, ఈశ్వర ప్రతిబింబమగుచున్నాడు. అందుచే బ్రహ్మమున గాక. ఈశ్వరునిలో లయించుచున్నాడని ఈవాద తాత్పర్యము.

ఈ సిద్ధాంతము ప్రకారము, జీవేశ్వరులకుపాధి అజ్ఞానము. ఆ యజ్ఞానమున బ్రతిబింబము జీవుడు. ఆ ప్రతిబింబమునకు బింబము ఈశ్వరుడు ఆవరణ లక్షణముచే జీవునకు అల్పత్వము సిద్ధముగాని, ఈశ్వరునకు మాత్రము సర్వజ్ఞత్వము రాదగును.

ఇంక, ఈశ్వరుడు కేవలము జీవుడుగాక అధికుడు. అతడే సృష్టికర్త. అతడాప్తకాముడుగాన, సృష్టి ప్రయోజనము అతనికి ఆవంతయు నుండజాలదు. [illegible]కొరకు సృష్టికార్యము గావించి, అతడు బ్రహ్మ ప్రతిబింబమై, హిరణ్యగర్భుడై యుండ, నితరులుజీవులు అనియు, ప్రతిబింబములు అనియు కొందరి భావన.

పై [illegible]హరింపబడిన ప్రతిబింబవాదమును నిరాకరించి, అందలి అసామంజస్యముల జూపించి, అవచ్ఛేదవాదమును గొందరు ప్రతిపాదించిరి. వారి మత ప్రకారము అంతఃకరణ ప్రతిబింబచైతన్యముగాక అంతఃకరణావచ్ఛిన్న చైతన్యము. జీవుడనియు, వటులే అనవచ్ఛిన్న చేతనుడు ఈశ్వరుడు గను సిద్ధాంతము. ప్రతిబింబవాద ఖండనమున, రూపరహిత బ్రహ్మచేతనము నకు ప్రతిబింబమెట్లు సంభవమని ప్రశ్నించెదరు. రూపరహితాకాశ ప్రతిబింబ

మును విరాకరించి, ఆకాశమునకు రూపము లేకున్నను, నీలత్వ [illegible] లత్వములు దానిపై నారోపింపబడి, అవి జలమున ప్రతిబింబింప, [illegible] ప్రతిబింబించినట్లు తలంపు జరుగు చున్నదని వారి వాదము. అట్టి [illegible] రోపమైనను బ్రహ్మమున లేదుగదా! ఇక దాని ప్రతిబింబ[illegible] ? మరియు నవిద్యాంతఃకరణములుగూడ రూపరహితములుగదా ! రూపములేని [illegible] ప్రతిబింబమెట్లు ? కాన ప్రతిబింబవాదము యుక్తి బాహ్యము. అందుచే అంతఃకరణావచ్ఛిన్న చేతనము జీవుడై యుండ, అం[illegible]వచ్ఛిన్న చైతన్యము ఈశ్వరుడని, అవచ్ఛేదవాదులు తలంచెదరు.

కాని బ్రహ్మాండమునందు అనంత జీవుల యొక్క అనంతాంతఃకరణ సముదాయముండుటచే, అనవచ్ఛిన్న ఈశ్వర చైతన్యము [illegible] ముగ నుండవలెను. అయినచో నీశ్వరుడు అంతర్యామి ఎట్లు కాగలడు ? అందుచే ఈశ్వరుడు అనవచ్ఛిన్నచైతన్యముగాక. మాయావచ్ఛిన్న చైతన్యము ఈశ్వరుడనియు, అంతఃకరణావచ్ఛిన్నచైతన్యము జీవుడనియు గొందరివాదము. మాయ సర్వవ్యాపకత్వము గలదగుటచే నీశ్వరునకు నంతర్యామిత్వము సిద్ధించును. మరియు, అంతఃకరణావచ్ఛిన్న చేతనము జీవుడు గాదు. అట్లైనచో కృతనాశ అకృత ప్రాప్తదోషము వాటిల్లును. అందుచే అవిద్యావచ్ఛిన్న చేతనము జీవుడనియు వీరివాద [illegible] ప్రతిబింబవాదమునగల బింబ, ప్రతిబింబ, మాయాది అద్వైతవాద [illegible] నానాత్వము వీరికి అసమ్మతము. బింబమునకన్యమగు ప్రతిబింబపదము నంతః కరణాదికము ద్వైతముగదా !

ఈ అవచ్ఛేదవాద సిద్ధాంతమును భామతీ ప్రస్థానవాదులు అవలంబించి, పూర్వోక్త ప్రతిబింబవాదమును ఖండించెదరు.

ఈ ప్రతిబింబ, అవచ్ఛేద వాదద్వయమును త్రోసి. "సిద్ధాంత ముక్తావళి" కర్తయగు ప్రకాశానందుడు, అన్యముగ భావించుచున్నాడు. దృష్టాంతముగ కుంతీపుత్రుడైన కర్ణునిగైకొని, అతడు రాజకుమారుడై యుండియు మిథ్యగ రాధాసుతునిగ భావించుచు, మిథ్యావ్యవహారము గలిగియున్న చందము చిదానంద ఘనస్వరూప బ్రహ్మమునందు జీవ భావము మిథ్యాప్రతీతి గోచరముగ నున్నదని వివరించును. నిత్యానంద, ముక్త బ్రహ్మమున, గల్పిత అవిద్యచే ప్రతిబింబత్వముగాని, అవచ్ఛిన్న త్వముగాని అసంభవము. సత్తా అసత్తులకు సంబంధమెట్లు ? అని ప్రశ్న. అందుచే అజ్ఞానముయొక్క కల్పితసంబంధము లేకయే, బ్రహ్మము నందు జీవత్వము ప్రతీతమగును. అనాద్య విద్యాప్రభావముచే స్వకీయ బ్రహ్మ భావము యొక్క ఆవరణముచే, జీవత్వభ్రాంతి గలుగుచున్నది. తత్త్వమ స్యాది మహావాక్యములచే నిది నివారింపబడును. యథార్థమున నా బ్రహ్మము నిత్యముక్త చిదానంద స్వరూపముగ నున్నది గాని అందే మార్పును [illegible]. అని 'వార్తిక' కారుడైన సురేశ్వరుడును వివరించెను. ఇది అద్వైత సిద్ధాంతము నిశ్చయముగ నిశ్చలదాసు విశ్వసించును.

జీవులు ఏకులా ? అనేకులా ? యను విషయమున గూడ సిద్ధాంతములలో భావభేదములుత్పన్నమై యున్నవి. ఈశ్వరుడుమాత్ర మొక్కడనిదే సర్వసిద్ధాంత నిశ్చయము, కాని జీవ విషయమున వ్యత్యా

_క్తము. అజ్ఞానములు నానాత్వమున జీవాశ్రితములై, బ్రహ్మా
ులై, ఈశ్వర జగముల గల్పించుచున్నవని వాచస్పతిమిశ్రుని సిద్ధాం
యినను అజ్ఞానకల్పితుడైన ఈశ్వరుడు ఆవరణ రహితుడై,
ుయే 'భామతి'. కాని జీవులు నా॥ అజ్ఞానములచే, నానా సంఖ్యల
ి యీ సిద్ధాంతము.

వుడొకడై యుండ, నితర జీవులు స్వప్నస్థ పురుషులవలె నతని
'పులగుదురు. అతని అజ్ఞానప్రాబల్యమున జగము గోచరము.
ము అవిద్య యుండునో అంత కాలము బద్ధ ముక్త జీవులకు
ుడుననియు, స్వప్న దృష్టాంతము నాధారముగ గొని కొందరు
రు.

ారణ్యగర్భులు, కల్పకల్పమునకు మారుచుండుటచే నే హిరణ్య
పతిబింబములో నా యా జీవులని వచించుట గష్టసాధ్యము, అందుచే
డు అనేక దేహముల నధిష్టించి, ఒక శరీరగత స్మృతులు ఇతరులకు
కునట్లు చరించును. పూర్వజన్మ వృత్తాంతము యీ శరీరస్థ జీవుడు
కాలనియటుల, శరీరభేదమున ఆ విస్మృతి సహజమని కొందరు
రు.

ఈ సిద్ధాంతమున, బద్ధత్వ ముక్తత్వములకు దారతమ్యము అగో
ుచే నసంతృప్తులై కొందరు, భాష్యమున బంధమోక్షప్రస్తావన
ి నుండుటచే, నానా జీవవాదమును బ్రతిపాదించి, అంతఃకరణము
్వకరించి, బంధ మోక్ష విభేదమును నిలిపికొనిరి.

శుద్ధబ్రహ్మము నాశ్రయముగను, విషయముగను గలిగిన అజ్ఞానము సంసారినిలో గంధమాత్రముగ నుండి, జ్ఞానిలో నభావమై ముక్తి నొసంగు చున్నది, అని కొందరి మతము.

అజ్ఞానమునకు శుద్ధబ్రహ్మము ఆశ్రయము కాదనియు, దానికాశ్రయ మాయయు జీవుడనియు, కాని బ్రహ్మము దాని విషయమనియు గొందరు తలంచిరి. వ్యష్టిలో జాతి ధర్మము లుండునట్లు, ఆ అతఃకరణ ప్రతిబింబు లైన సర్వజీవులలో నది యుండుచు, వ్యష్టితో జాతిధర్మము నశించినట్లు, ముక్తునిలో నది నశించుచున్నది అని వారి సిద్ధాంతము.

ప్రతి జీవునకు ఒక్కొక అవిద్య నంగీకరించి, ఆ యజ్ఞాన కలిమిచే బద్ధుడనియు, దాని లేమిచే ముక్తుడనియు గొందరందురు.

ఏ సంసృతి అవిద్యవలనగాక, సమష్టి అవిద్యచే నీజగతి సృజింపు బడినదనియు, దారముల ప్రోగు వస్త్రమగుట దృష్టాంతముగ గొందరు, దెలిపెదరు. అందుచే నొకడు ముక్తుడగుచో, నతని అజ్ఞానము నశించి, ఇతరుల అజ్ఞానమునకు కనుగుణముగ సృష్టి యుండుననియు వారు వాదించెదరు. ఒక దారము నశించినచో వస్త్రమంతయు నశింపదుగదా! వ

వివిధాజ్ఞానములచే ప్రాతిభాసిక రజతము కల్పింపబడిన చందము వ్యష్టి అజ్ఞానములచే జనితమైన వియదాది సృష్టి, జీవ జీవునకు విభిన్నమై, సమానత్వభ్రాంతి నొసంగుచున్నది అని మండనమిశ్ర, వాచస్పత్యాదులు తలంచెదరు.

జీవాశ్రితమైన అజ్ఞానములకు అన్యమై, ఈశ్వరుని ఆశ్రయించియున్న మాయ సృష్టికారణము. జీవాశ్రితమైన అవిద్య ఆవరణమాత్రమునై, ప్రాతిభాసిక శుక్తిరజతాది భ్రాంతిసృష్టికి గారణముమాత్రమగుననియు గొందరు వాకొందురు.

) o (

## సాక్షి ఎవరు?

జీవునకధికుడుగ వచింపబడుచున్న సాక్షి, చైతన్యమెవరు ?

శరీరద్వయమునకు అధిష్ఠానభూతమై, వాని నవలోకించుచు, నిర్వికారముగనున్న కూటస్థచైతన్యమే సాక్షి యని, కూటస్థదీపమున విద్యారణ్య నిర్ణయము. జీవచైతన్యము సాక్షికాదని భావము. ఈ విషయము ఇట్లు వివరింపబడి యున్నది. నాటకశాలలో గల యజమాని కర్తృత్వభోక్తృత్వములచే, నహం మమలచే నుండుచందము జీవుడు గలడు. కాని, నాటకశాలలోని జ్యోతి నాటకశాలను బ్రకాశింపజేయుచు, సమత్వమున నెల్లర పై బ్రసరించుచు, నెట్టి కర్తృత్వములు లేకనుండును. అదేవిధముగ గూటస్థుడు అవస్థాదులకు సాక్షి యని అతని వివరణము. అట్లు సాక్షి, జీవుడు కాక, బ్రహ్మముతో గూడ నన్వయింపక, జీవేశ్వరులకన్యముగు చైతన్యమైన కూటస్థుడని గ్రాహ్యము.

'తత్త్వప్రదీపికా'కారుడైన చిత్సుఖాచార్యుడు, అట్లుభావింపడు. మాయాశబలుడై, సగుణుడైన పరమేశ్వరునియందు 'కేవలో నిర్గుణః' అను విశేషణముల అనిర్వచనీయమైనటుల, ప్రత్యగాత్మయగు విశుద్ధబ్రహ్మము జీవునితో అభేదమున సాక్షి యగుచున్నాడని అతడు తలంచును.

'ఏకో దేవః సర్వభూతేషు గూఢః....సాక్షీ....అను శ్రుతివాక్యమును ప్రమాణముగ స్వీకరించి, జీవుని ప్రవృత్తి నివృత్తుల గ్రహించుచు, నుదాసీనుడై సాక్షియైయున్న పరమేశ్వరరూపుడే సాక్షి యని రామద్వయాచార్యుని 'కౌముది' నిర్వచనము. సుషుప్తికాలమున జీవుని అదిష్ఠించియున్నవాడా సాక్షియే యనియు దెలుపబడినది.

'తత్త్వశుద్ధి' గ్రంథమున జ్ఞానఘనపాదుడు, 'ఇదంరజతం' అను చోట 'ఇదం' శబ్దము శుక్తమున కన్వయింపవలసియున్నను, రజతమున కెట్లు చెందుచున్నదో, అట్లు సాక్షి యథార్థముగ బ్రహ్మమై యున్నను జీవునికన్వయింపబడుచు జీవవ్యవహారమున నుపయుక్తమగుచున్నదని వచించియున్నాడు.

సాక్షాత్ ద్రష్ట కావున, అవిద్యోపాధికుడైన జీవుడే సాక్షి యని కొందరి భావము. కర్తృత్వములేని ద్రష్టృత్వమే సాక్షిత్వముగా లోకప్రసిద్ధము. ద్రష్టయైన జీవునికే అది సాధ్యము. అంతఃకరణ తాదాత్మ్యభావమున కర్తృత్వము గలిగినను, 'ఏకో దేవః' అను మంత్రము ప్రకారము బ్రహ్మము జీవభావమున సాక్షిత్వమును బొందునని యీ సిద్ధాంతులమతము

జీవుడే సాక్షి యగునుకాని, సర్వగత అవిద్యోపహిత తత్త్వ-ముచేమాత్రము గాదని కొందరు తలంచెదరు. అందుచే అంతఃకరణమును ఉపాధిగ గలిగిన జీవుడే సాక్షి యగును. సుషుప్తిలో ద్రష్టలేకున్నను, సాక్షి గలడు. విశేషణము, ఉపాధులకుగల వ్యత్యాసమువలె, అంతః-కరణవిశిష్టుడు ప్రమాతయై యుండ, అంతఃకరణోపాధికుడు సాక్షి యగునని కొందరు సిద్ధాంతీకరించిరి.

— ० —

# జ్ఞానమార్గము

ఇతఃపూర్వము వివరింపబడిన బ్రహ్మప్రాప్తికి, కేవలము జ్ఞానమే ప్రధానమగునా? లేక జ్ఞాన కర్మసముచ్చయమగునా? యనియు సంశయము గలుగును. కంఠగతమై యున్నను విస్మరింపబడిన ఆభరణ-ప్రాప్తివలె, బ్రహ్మప్రాప్తి నిత్యసిద్ధముగాన, విద్యాతిరిక్త సాధనమసం-భవమగును. అందుచే బరంపర రూపమున గర్మ, బ్రహ్మప్రాప్తి కుపయుక్తమని కొందరు సిద్ధాంతులు తలంచెదరు.

కాని భామతీ ప్రస్థానపరులు వేరుగా వచించెదరు. 'తమేతం వేదానువచనేన' మొదలగు వాక్యములచే శ్రుతి, విద్యాసంపాదనము ద్వారమున, బ్రహ్మప్రాప్తికి వివిధిషాదు లుపయుక్తములని బోధించును. శమదమాదులు బ్రహ్మజిజ్ఞాసకు సన్నిహితములు. యజ్ఞాది కర్మలు దానికి సుదూరములు. నిత్య, నైమిత్తిక కర్మల బూర్వజన్మల నిష్కామముగ

నాచరించి, సచ్చిదానందబ్రహ్మము గలదని పరోక్షముగ గ్రహించినచో జిజ్ఞాసను బొందగలరు. అయినను, పూర్వకర్మ విశేషముచే బ్రహ్మజ్ఞాన హేతువైన శ్రవణాదులపై బుద్ధి ప్రసరింపదు. కాన అట్టి ప్రతిబంధ వినాశపూర్వకముగ జిజ్ఞాసా సంపాదనమునకై యజ్ఞయాగాదులుపయు క్తము లని వీరు వాదించెదరు.

వివరణ ప్రస్థానవాదులు 'తదన్వేష్టవ్యం తద్వా విజిజ్ఞాసితవ్యం' 'మంతవ్యో నిదిధ్యాసితవ్యః' మొదలగు శ్రుతుల నాధారముగ గైకొని, యజ్ఞాదులు జ్ఞానోపకరణములు మాత్రమగునని తీర్మానించి, శ్రవణాదికము నకు ప్రాధాన్య మొసంగిరి.

అటులైన, జ్ఞానోదయపర్యంతము కర్మాచరణమవసర మేర్పడును. అంత 'త్యజ దైవ హితత్ జ్ఞేయం' అను సన్న్యాస, విధి వాక్యములకు వైరుధ్యమేర్పడునుగదా. కాని విత్తనముల నాటుటకు పూర్వము దున్నుట అవసరము. అనంతరమనవసరము. అందుచే ధాన్యఫలితము దున్నుట దున్నకుండుటయొక్క ఫలితమగును. అటుల యోగము గోరువానికి గర్మకారణము. అతనికే, యోగియైనచో, శమాదులు కారణము అను శ్రుతి గలదు. చిత్తశుద్ధి గలిగి, వివిదిష గలుగుపర్యంతము కర్మ అవసరము. అంత సన్న్యాసము అవసరము. అట్లు కర్మ జ్ఞానములచే జ్ఞానోద్భవమనియు వచింపబడెను. కాన జ్ఞాన జిజ్ఞాస కలుగు నంతవరకు గర్మాచరణము అవసరము. కర్మ చిత్తశుద్ధి కారణము మాత్రమేకాని, జ్ఞాన వివిదిషార్థము కానేరదని కొందరు భావించెదరు.

అట్లయిన నేకర్మలవసరము? 'వేదాను వచనేన' అను వాక్యమున, బ్రహ్మచారి ధర్మములు సూచితములు. యజ్ఞేన దానేన' అనునవి గృహస్థ ధర్మములు. 'తపసా నాశకేన' అను లక్షణములు వానప్రస్థునికన్వయము. అందుచే వివిధాశ్రమ కర్మలు, విద్యోపయోగములు అని కొందరు భావించెదరు.

'కల్పతరు' కారుడైన అమలానందునిభావమున, ఆశ్రమ ధర్మములు మాత్రము జ్ఞానకారణము కావు. భార్యావిరహితులగు విధురాదులకు, అనాశ్రమలకు గూడ జ్ఞానజిజ్ఞాస అన్వయింపవలెను. ఆశ్రమస్థులై యున్నప్పటికి కార్యాచరణముచే జ్ఞానజిజ్ఞాస గలిగినవారికా వాక్యములన్వయమనుటకు అవకాశము గానరాదు. అందు అనాశ్రములు చేయు జపాదిక నిత్యకర్మయు, దీన నంతర్గతము అని అతని వాద విధానము.

అంతియగాక, నిత్య నైమిత్తికకర్మలు రెండును, దీనచేర్పవలయునని 'సంక్షేపశారీరక' కర్త సర్వజ్ఞాత్ముని సమన్వయము.

— o —

# సన్న్యాసము

చిత్తశుద్ధికారణముగ గర్మ విద్యోపయుక్తముగనుండ నిక సన్న్యాసమెట్లు అవకాశము అని సంశయము. జ్ఞానోత్పత్తికి ప్రతిబంధకములగు దురితములు అసంఖ్యాకములగుటచే, నందు గొన్ని కర్మచే నివారితములగును కొన్ని సన్న్యాసముచే నివృత్తములు. కాన సన్న్యాసముగూడ గర్మవలె

చిత్తశుద్ధి ద్వారమున జ్ఞానోపయోగమని కొందరి భావము. కర్మలమధ్య శ్రవణాదుల నాచరించు గృహస్థులు, యీ జన్మమునగాక పోయినను మరియొక జన్మమునైన సన్న్యసించినగాని జ్ఞానముదయింపదు. జనకాదులు ప్రస్తుతము గృహస్థులై యున్నను, పూర్వజన్మ సన్న్యాసముచే జ్ఞానము లభించినది. అందుచే జ్ఞానసిద్ధికై సన్న్యాస సామర్థ్యశంక అనవసరమని వారి నిశ్చయము.

'శాంతో దాంత 'ఉపరతః' అను వాక్యమున ఉపరతి శబ్దము సన్న్యాసమున నన్వయము ఆనియు, అదియే 'మౌన' శబ్దమున శ్రుతుల గోచరమనియు, కొందరు పలుకుదురు. అందుచే అపూర్వమైన సన్న్యాసము శ్రవణాధికారియైనవానికి ప్రత్యేక అర్హతనియు, 'వార్తిక' కారుడైన సురేశ్వరాచార్య వాదుల సిద్ధాంతము.

సన్న్యాసము శ్రవణాంగమై, జ్ఞానోపలబ్ధిని గలుగజేయు ననియుండుట చే నిరాటంక శ్రవణకార్య సౌకర్యార్థము సన్న్యాసమవసరమని వివరణ కారుడైన ప్రకాశాత్మని అనుచరుల నిర్ణయము.

బ్రాహ్మణ శబ్దము కేవలము బ్రాహ్మణులకుమాత్రమే అన్వయించుచో సన్న్యాసమునకు క్షత్రియ, వైశ్యులకు అర్హత గలదా? అని ప్రశ్నగలుగును. కాని ఆ శబ్దము బ్రహ్మణులకు మాత్రము శ్రుతి అన్వయించుచున్నది. అందుచే సన్న్యాసము క్షత్రియ వైశ్యులకు లేదు అని కొందరి నిశ్చయము

బ్రహ్మచర్యాది ఏ ఆశ్రమమునుండియైన సన్న్యసింప వగుననియు 'బ్రాహ్మణో క్షత్రియో వాపి వైశ్యోవా ప్రవ్రజేత్ గృహాత్। త్రయాణామపి వర్ణానామమీ చత్వారఆశ్రమాః॥' అను మంత్రముల, అగ్రవర్ణములవారు ఏ ఆశ్రమమునకు జెందినను సన్న్యసింప నధికార–మొసగబడియున్నది. అందుచే క్షత్రియ, వైశ్యులుగూడ బ్రాహ్మణ శబ్దమునకన్వయమని తాత్పర్యము. దీనికి 'వార్తిక' కారుడుగూడ అంగీకరించెను.

బ్రాహ్మణ శబ్దము, అనేక ప్రమాణముల నొక బ్రాహ్మణ వర్ణమునకుమాత్రమే అన్వయము. వారికి సన్న్యాసమును విధించెను. సన్న్యాసకాలమున యజ్ఞోపవీతరహితుడు బ్రాహ్మణుడెట్లు అగును అని శ్రుతి ప్రశ్నించుచున్నది. అందుచే బ్రాహ్మణునకే సన్న్యాసార్హత. వార్తికకారుని తాత్పర్యమున జ్ఞాని ఏవర్ణము వాడైనను సన్న్యసింపనగును. కాని శ్రవణా–దులకొరకు కాదని భావము. కాన శ్రవణాంగమైన సన్న్యాసము బ్రాహ్మణులకు అన్వయింప, క్షత్రియ, వైశ్య, శూద్రులు, దాని అవసరము లేకయే శ్రవణము గావింపనగును.

'బ్రహ్మ సంస్థోఽమృతత్వమేతి' బ్రహ్మసంస్థుడై, అన్య వ్యాపార–శూన్యుడైనవానికి శ్రవణాదికముకధికారముగలదని కొందరి వాదము. శారీరకర్మల నాచరించుచున్నను, బ్రహ్మవిచారపరము గానివాడు మృతుడే అనియు, సుషుప్తిపర్యంతము, మరణపర్యంతము వేదాంతచింతన చేయ–వలయునను శాస్త్రోద్దేశము సన్న్యాసమునగాని సాధ్యముకాదు. గృహస్థుల కనేక ఆటంకములుండును. కాన వైశ్య, క్షత్రియులకు సన్న్యాసములేదుగాన,

శ్రవణాదికముగూడ లేదు. శూద్రులకువలె వీరికిని నిషేధము లేదుగాన విదురాదులకువలె వీరు ఉత్తర జన్మమున జ్ఞానప్రాప్తికొరకు శ్రవణము గావింపనగునని వారి సిద్ధాంతము.

) ० (

## శ్రవణాదికము

అట్లు, శ్రవణ మనన నిదిధ్యాస నానుష్ఠానములచే విద్యావాప్తి అని తాత్పర్యము. కాని 'ధ్యానదీపమున' భారతీతీర్థుడు మరియొక మార్గమును సూచించెను. 'సాంఖ్య యోగాధిగమ్యం' అనియు, 'యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే, అనియు శ్రుతి వాక్యములు. శ్రవణాదులతో గూడిన వేదాంతవిచారణము నాడు సాంఖ్యమువలెనే, యోగమనెడు నిర్గుణబ్రహ్మోపాసనముగూడ బ్రహ్మజ్ఞానప్రాప్తికి ఉపయుక్తము. సచ్చిదానంద లక్షణములే నిర్గుణముగ, సూత్రకారుడు వచించియున్నాడు. అస్థూలత్వాదులు నిర్గుణము. నిరాటంక సంస్కారములు గలవానికి శ్రవణమాత్రముచేత బ్రహ్మజ్ఞానము గలుగును. అట్టివానికి సాంఖ్యముత్తమము. యోగము ద్వారమున బ్రహ్మసాక్షాత్కారమున విలంబన మేర్పడును. అందుచే యోగము సాంఖ్యముకంటె మందము.

అయిన నిక, బ్రహ్మ సాక్షాత్కార కారణమెద్ది ? 'ప్రత్యయాభ్యాసరూపం ప్రసంఖ్యానమేవ' అనగా ప్రథమమునుండి యోగమార్గావలంబ

సమునగాని, సాంఖ్యమునగాని ఇది లభ్యము. అది బ్రహ్మసాక్షాత్కార హేతువు కాదని ప్రమాణము లేదు. 'తతస్తు తం పశ్యతే నిష్కలం ధ్యాయమానః' అను శ్రుతి వాక్యము ననుసరించి, ధ్యానము అవసరమగు-చున్నదని కొందరు భావించిరి. దానినే ప్రసంఖ్యానమనియు వాకొందురు.

ఈ ప్రసంఖ్యానము, బ్రహ్మసాక్షాత్కారమునకు మార్గముగ బరిగణింపబడలేదని కొందరు వాదించెదరు. ఉపాసనా వృత్తివలె ఆహార్య వృత్తియు, జ్ఞాన భిన్నమైన మానసక్రియా రూపము. కాన దానికి బ్రామాణ్యత్వము లేదని కొందరు త్రోసిపుచ్చిరి.

కాని 'ఆత్మా చేతసా వేదితవ్యః' మొదలగు శ్రుతులనాధారముగ గొని కొందరు, బ్రహ్మసాక్షాత్కారమునకు మనస్సునే ముఖ్య కారణముగ గైకొనిరి. ఈ మనస్సునకు బ్రసంఖ్యానము సహకారిమాత్రము అగునుగాని, స్వయముగ బ్రసంఖ్యానము సాక్షాత్కార కారణముగాదని వీరి వాదము.

ఆచార్యోపదేశానంతరమున బ్రహ్మ సాక్షాత్కార ముదయించుట' జీవన్ముక్త స్థితి సిద్ధించుటయు శ్రుతి వచించుటచే 'వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థాః' అనియు బ్రమాణము లుండుటచే, ఉపనిషత్తులే బ్రహ్మ సాక్షాతార్కార కారణములు గాని మనస్సు కాదని మరికొందరు తలంచు-చున్నారు.

దీనిచే, బరోక్షజ్ఞానమును గలుగజేయు శబ్దప్రమాణము ఎట్లు అపరోక్షత్వమును గలిగించును ? అను ప్రశ్న ఉదయించును.

శబ్దమి స్వతః అపరోక్ష హేతువు కాకున్నను,శాస్త్రీయ శ్రవణ మనన, నిదిధ్యాసనాది జనిత సంస్కారముచే, బ్రహ్మైకాగ్ర్యము గలిగిన

చిత్తమువలన నపరోక్షత్వమును గలుగజేయ గలదని కొంద
కర్తృత్వాధ్యాస అపరోక్షముచేగాని నివర్తిల్లదు. ఉపనిషత్త్
మైన బ్రహ్మము, శబ్దప్రమాణముచే సాక్షాత్కార సాధ్యము
అన్యప్రమాణమెద్దియు ముక్తికి హేతువు కానేరదని గ్రాహ్య

దృష్టవస్తువు భావనాప్రచయముచే గోచరించినను, ఽ
కానట్లు, శబ్దము అపరోక్షజ్ఞానజనకము కానేరదని కొందరం
అనేకవిధములైన వాదోపవాదములు సప్రామాణికము జరిగి

బ్రహ్మజ్ఞానముగూడ నంతమున బ్రహ్మైక్యానుసంధా
కారణమగుటచే, నీ జ్ఞానము నంతమొందించు తత్త్వ మెద్ది
టచే, నిది ఎట్లు అదృశ్యమగుట యను సంశయము పొడగ
వి_త్తనముయొక్క గంధము మురికినీట నుంచినచో, ఆ
నదియు నడుగు జేరుచందము బ్రహ్మజ్ఞానము అజ్ఞానమును
తాగూడి నదృశ్యమగునని సమాధానమీయబడెను.

అటులే, అగ్నిని జల్లార్చిన నీరము అదృశ్య
గడ్డిగుట్టను దహించిన అగ్ని తాగూడ జల్లారినట్లు అనియు, ను
వచింపబడియున్నవి.

ఈ కారణములుమాత్రముగాక కాల, అదృష్ట, ఈశ్వరే
బ్రహ్మజ్ఞానమంతమొందుటకు గారణము లని కొందరు విశ్వసి

బ్రహ్మజ్ఞానము వృత్తిరూపమగుటచే, అజ్ఞానమును, ఉ
ప్రపంచమును, నివారింపజాలదనియు గొందరి నమ్మకము.

అంధమువలె ప్రకాశతుల్యజ్ఞానముచే నివారితముగాని జడవృత్తిచే గానేరదని తాత్పర్యము. ఆ వృత్తితో నారూఢమైన చైతన్యముచే నది నివృత్తము. తృణమును ప్రకాశింపజేయు సూర్యప్రకాశము, సూర్యకాంతమణి సహాయమున నా తృణమును దహించురీతి, గాష్ఠము నాశ్రయించి గ్రాదుల దహింపజేయు నగ్ని ఆ కాష్ఠమునుగూడ దహించునట్లు, చరమ వృత్తి నారోహించి, నిఖిల ప్రపంచమును నిర్మూలించి, అఖండ చైతన్యప్రకాశమున నివర్తించునని కొందరు వక్కాణించెదరు.

జ్ఞానాజ్ఞానముల వైరుధ్యముండుటచే, బ్రహ్మజ్ఞానము అజ్ఞానమును నిర్మూలించును. ప్రపంచము తన ఉపాదాన కారణము నశించినగాని అంత రింపదు. బ్రహజ్ఞానము ప్రపంచాంతర్గతము గాన, ప్రపంచముతో నదియు నంతర్హిత మగును అని మరికొందరు భావించెదరు. జ్ఞానముచే నివర్తిల్ల కున్న ప్రపంచము మిథ్యాభూత మెట్లు అగును ? కాన, జ్ఞానముచే అజ్ఞానము, తత్కార్యమైన ప్రపంచము, తదంతర్గత బ్రహ్మజ్ఞానము నశించునని, యి ఉద్దేశ్యము.

) ० (

# జీవన్ముక్తి

శుద్ధబ్రహ్మము ఆశ్రయముగను, విషయముగను గలిగిన అజ్ఞానము ఏకమై, తన్నివారణము మోక్షమై యున్నను. జీవన్ముక్తిత్వము కించిదజ్ఞానము శేషించియుండునని కొందరి తాత్పర్యము. అది అభావమై, జ్ఞానులకు ముక్తి నొసంగుచు అజ్ఞానుల నది యంటియేయుండును.

తత్త్వసాక్షాత్కారానంతరముగూడ, జీవన్ముక్తునకు దేహముండుట ప్రతిపాదింపబడియున్నది. అది ప్రారబ్ధకర్మ హేతువు అని కొందరు విశ్వసించెదరు. బ్రహ్మజ్ఞానమున బ్రపంచము అదృశ్యమగుచో నీ జీవన్ముక్తస్థితి అసందర్భమగునుగదా. విరోధి యగు బ్రహ్మసాక్షాత్కారమున్నచో నికనీ ప్రారబ్ధమెచ్చట ? అని ప్రశ్న. అందుచే నీ ప్రారబ్ధముండ జాలదని నిశ్చయము.

కించిదజ్ఞానముండి జీవన్ముక్తికవకాశమొసంగుచున్న దని కొందరందురు. కాని జీవన్ముక్తి కారణమైన యీ అవిద్యా లేశమెట్టిది? ఆవరణ, విక్షేపశక్తియుక్తమైన మాయా, అవిద్యలలో బ్రారబ్ధకర్మానుగతమైన విక్షేపశక్తి యంశము జీవన్ముక్తి దేహమున గలదని వారి భావము.

ఉల్లిరసపాత్రమును ఎంత శుభ్రపరచినను, దాని గంధముండుటవలె, అవిద్యా సంస్కారము ప్రారబ్ధరూపమున జీవన్ముక్తునిలో నుండునని కొందరు సమర్థించిరి.

దగ్ధపటమున ఆకారమువలె, మూలావిద్యయే ప్రారబ్ధరూపమున జీవన్ముక్తుని ఆశ్రయించి యుండునని, కొందరు తలంచెదరు.

వ్యతిరేకమైన జ్ఞానోదయమున అజ్ఞానలేశమైన నుండ జాలదు. కాని జీవన్ముక్త శ్రుతులు, శ్రవణాదికమును స్తుతి చేయుటకొరకు అర్థవాద-మాత్రములుగ నుండును. ఇంతకంటె జీవన్ముక్తి విషయమున శ్రుతి తాత్పర్యము కానరాదని, సర్వజ్ఞాత్మముని వాకొనును. అందుచే నృత నిదిధ్యాసనపరునకు, బ్రహ్మసాక్షాత్కార మాత్రముచే వాసనాసహితముగ నవిద్య నివృత్తమగునని అతని నిశ్చితార్థము.

— o —

## ముక్తి

'బ్రహ్మసిద్ధి' కారుడైన మండనమిశ్రుడు, అవిద్యానివృత్తి యన ఆత్మయే అని వచించెను. అది నిత్యసిద్ధము. అయినను జ్ఞానాభావమున అవిద్య అవిద్య అనర్థమై తిష్ఠ వహించును. ఆయజ్ఞాన వినాశము ఆత్మ స్వభావము అగును.

అవిద్యా నివృత్తి నిశ్చయముగ, ఆత్మకన్యముగ, 'న్యాయమకరంద' కర్త ఆనందబోధ సిద్ధాంతము. అవిద్య సత్యము కాదు. అది సత్యమైన నద్వైతమునకే భంగము వాటిల్లును. మరియు నది అసత్యముగూడ కాదు.

అయినచో జ్ఞానముచే నంతరింపనేరదు. అది సదసత్తుగూడ కాదు. సదసత్తులు వ్యత్యస్తములుగదా. మరియు నది అనిర్వాచ్యముగూడ కాదు. అనిర్వాచ్యము సాదియై, అజ్ఞానము నుపాదానముగ గలిగి, జ్ఞానముచే నివర్తించును. అందుచే యీ నాలుగు విధములగాక, నీ అవిద్య పంచమరూపము అని అతని మతము.

అవిద్యవలె, అవిద్యా నివృత్తియు ననిర్వాచ్యమైయున్నది. దాని నివృత్తియున్నచో, దాని యుపాదానకారణమైన అజ్ఞానముగూడ నుండును. ఉత్పత్తి యన ప్రథమ సమయమున సద్వికారమైనటుల, నివృత్తియు జరమ సమయమున సద్వికారమే యగును. కాన ప్రాగభావముగాని. ప్రధ్వంసాభావముగాని లేదు. మధ్యలో ననిర్వచనీయ సృష్టి స్థితి లయములు అధ్యసించియున్నవి. అందుచే అవిద్యా నివృత్తియు బ్రహ్మసాక్షాత్కారోదయానంతర క్షణవర్తినియై భావవికారమే యగుచున్నది. అందుచే నది ముక్తునిలో అనువర్తింపనేరదు. కాన నది అనిర్వాచ్యమని అద్వైతవిద్యాచార్యుని వివరణము.

ఈ అవిద్యానివృత్తి క్షణికమైనచో, ముక్తి నిత్యము కాకపోవలయును. అవిద్యా నివృత్తి పురుషార్థమనికాక, జ్ఞానముచే గలుగుచున్నది. అది సుఖదుఃఖేతరస్థితి యగును. అఖండానందము నావరించు సంసారదుఃఖహేతువైన అవిద్య భేదింపబడ, అఖండానందస్ఫురణము' సంసారదుఃఖనాశము గలుగును. అందుచే అజ్ఞాన నివృత్తి జ్ఞానముచే నగునని తాత్పర్యము.

మోక్షస్థితిలో దుఃఖనివృత్తి స్వతః పురుషార్థము కాదు. పరమానంద ప్రాప్తికి అది ద్వితీయ పక్షమై, పరమానందప్రాప్తియే స్వతః పురుషార్థమని చిత్సుఖాచార్యుని వివరణము. జ్ఞానము దుఃఖనివృత్తికి గారణమైనంత - మాత్రమున నా దుఃఖాభావమును, బురుషార్థముగ భావింప వీలులేదు. అందుచే ముక్తిలో సంసార దుఃఖనివృత్తి, అవిద్యానివృత్తివలె నప్రధానమై, అనవచ్ఛిన్న ఆనందప్రాప్తియే స్వతః పురుషార్థమని అతని భావము.

కాని, అనవచ్ఛిన్న ఆనందము ప్రత్యగ్రూపమగుటచే, నిత్యప్రాప్తమే యగుచున్నది. దాని ధాని అవిద్యాజనిత సంసారము మరుగుపరచి, తద్విపరీ-తార్థముల బ్రదర్శించుచున్నది. అందుచే నా యానందము ప్రాప్తము కానిదానివలె నున్నది. అజ్ఞాననివృత్తితో తద్వ్యతిరేకార్థము అంతరింప, నా యానందము పొందబడినట్లు తలంపబడును. కాని ఆ యానందప్రాప్తి కేవలము ఔపచారికమే యగుననని కొందరు నిశ్చయించిరి.

సంసారదశలో ఆ యానందము లేదనియు, దనకు అలభ్యమనియు, అవిద్యావరణ ప్రాబల్యమున జీవుడు తలంచుచున్నాడు. ఎంతకాలము ఆ యవిద్య యుండునో అంతకాలము ఆనందరాహిత్య భ్రాంతి యుండును. అజ్ఞాననాశమున నా భ్రాంతియు నశించి, ఆనందప్రాప్తిసిద్ధించునుగాన నది ఔపచారికము కానేరదని మరికొందరు విమర్శించిరి.

విదితముకానిది పురుషార్థము కానేరదు కావున, సంసారదశలో బరమానందము అవిదితముగాన, నది పురుషార్థము కానేరదు. తత్త్వ-

సాక్షాత్కార కాలమున, నావృతాంశము లేకుండుటచే నిరతిశయానందమను పురుషార్థము విద్యా ప్రాప్తము అని కొందరు వాదించిరి.

)o(

## సర్వముక్తి

విద్యోదయమున ఉపాధి లయమైనపిమ్మట, జీవత్వమును నిరాస మొనరించినవాడు, ఈశ్వరత్వము నొందునా ? శుద్ధ చైతన్యమాత్రరూపము నొందునా ? అను విషయము వివేచనీ యాంశము.

ఏక జీవవాదము ప్రకారము, జీవునికి జ్ఞానోదయమగుటలో జీవేశ్వర భేదరూప సర్వ ప్రపంచము విలయమై, నిర్విశేష చైతన్యమున నుండునని కొందరు తలంచెదరు.

అనేక జీవవాదము రీతిగ, నొకడు ముక్తుడైనను, బద్ధముక్త విభేదము అంగీకృతముగాన, అతని అవిద్యాకృత ప్రపంచమదృశ్యమై, యితర బద్ధజీవుల అవిద్యాకృత సంసారము అటులనే యుండును. మరియు జీవేశ్వరులుభయులుగూడ శుద్ధచైతన్య ప్రతిబింబములుగాన, జీవుడు ముక్తదశలో దనబింబభూతుడైన శుద్ధ బ్రహ్మచైతన్యమున లయించును. ప్రతిబింబము, బింబమున లయించునుగాని మరియొక ప్రతిబింబమున నేకము కాదుగదా ! ప్రతిబింబమున లయించుట యగుచో, ప్రతిబింబత్వమే బంధముగాన, ముక్తుడు మరల బంధమున నున్నట్లు అని కొందరి వాదము.

కాని జీవుడు ఈశ్వరుని ప్రతిబింబమై, మరల నా ఈశ్వరుడు శుద్ధచైతన్య ప్రతిబింబముగ దలంచువారి మతమున, ముక్తదశలో జీవ ప్రతిబింబము, తనకు బింబతుల్యమగు ఈశ్వరునిలో లయించి, సర్వజీవులు ముక్తులగునంతవరకు ఈశ్వరునిలో నుండి, అతనివలె సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వ, సర్వేశ్వరత్వ, సత్యకామత్వాది గుణముల గలిగి యుండును. అనేక అంతఃకరణముల ప్రతిబింబించిన ఈశ్వరుడు, ఒక జీవుడు ముక్తి నొందినను, యితర అంతఃకరణములుండుటచే దా బింబస్థానమున నింకను నుండును. అందుచే నా బింబ ప్రతిబింబ సంబంధము పోయినగాని నిత్యముక్తి కానేరదు. అదియే సర్వముక్తి యని వాచస్పతి మిశ్ర సిద్ధాంతము.

ముక్తుడు అవిద్యారహితుడగుటచే నింక నా ముక్తదశలో నవిద్యా–కార్యములైన సర్వజ్ఞత్వ, సత్యకామత్వాది ధర్మములు అతనికుండజాలవు. అతనికి అవిద్యారాహిత్యము కలిగినను బద్ధజీవుల అజ్ఞానములు అటులే యున్నవి. ఈశ్వరుని సత్యకామత్వాదికము యీ అజ్ఞానములచే గలుగు–చున్నవి. అతడు నిరంజనుడుగదా.

సగుణోపాసకులుగూడ ఈశ్వరైక్యము నొందుదురనిశ్రుతి. వారికి అజ్ఞాననివృత్తి పూర్తిగా గాదు. కావున వారికి అనవచ్ఛిన్న ఆనందము గలుగదు. వారికి ఈశ్వరభోగసామ్యత్వ ముండును. వారు తమ సంకల్ప-శక్తిచే దివ్య దేహములను, భోగసాధనముల సృజించుకొని భోగించెదరు. కాని వారికి నిరవగ్రహమైన ఐశ్వర్యము ఈశ్వరుచందము లేదు. ప్రపంచ సృష్టి స్థితి లయములు వారికుండవు. కాని ముక్తులుమాత్రము యీ శక్తుల

గాడ బొందెదరు. అందుచే ముక్తులకును, సగుణోపాసనా సిద్ధులకును,
ంతగ వ్యత్యాసము గలదని తాత్పర్యము.

ముక్తదశలో నీశ్వరత్వము నొందిన ముక్తులకు మరల బంధత్వము
లుగనేరదు. ఈశ్వరుడు బద్ధుడు కాదు. అందుచే నా పరమేశ్వరునిలో
ఖుంచి, సర్వజీవముక్తి గలుగుపర్యంతము ముక్తులు అందుండురనుటలో
ట్టి దోషము లేదని సర్వముక్తివాదుల వాదతత్త్వము. ఇదియే వేదాంత,
ూత్ర, భాష్య, తాత్పర్యమని వీరి విశ్వాసము. ఇది భామతీ ప్రస్థానవాదుల
ుఖ్య సిద్ధాంతము.

ఇంతవరకు అద్వైతవాదులలో, ముఖ్యముగ శ్రీశంకర భగవత్పాదా–
ర్యుని పిమ్మట, సిద్ధాంత ప్రతిపాదనా, వివరణములలో, భాష్యప్రధానముగ
ధారముగ నున్నను ఎట్టి విభిన్న అభిప్రాయములు ఉద్భవించి, వివిధముగ
జృంభించి యున్నదియు గాంచియున్నారము. అయినను బూర్వోక్తచందము
ందు కేవలము అతి క్లుప్తపరచి, భావ వ్యత్యాసములుమాత్రమే
ూచింపబడియున్నవిగాని వివరములకు ఉచిత ప్రమాణములకు 'సౌరభము'
త్నింపజాలదయ్యెను. అట్లే గావింపజూచుచోనది అతి బృహద్గ్రంధము
కమానదు. అట్టి రచనము ప్రస్తుతము 'సౌరభ' తాత్పర్యము కాదుగదా!
ందుచే బాఠకులు వివిధాద్వైతవాద సారమును ఇసుమంత గ్రహించి,
ఏరుచి బెంపొందింపజేసికొని, మూలగ్రంథ అధ్యయనమునకు బూను
ందురుగాక అని 'సౌరభ' గ్రంథము విశ్వసించుచున్నది.

అయినను శ్రీశంకరానంతర అద్వైతవాదులలో ననేక అసమాన శేముషీదురంధరులుండి, అసమ గ్రంథ రచనములు గావించియున్నను, సురేశ్వర, విద్యారణ్య వాచస్పతి, నిశ్చలదాసులమాత్రము 'సౌరభము' ప్రస్తుతము గ్రహించి, వారి సిద్ధాంత విచారణము నిసుమంత యిది గావించి యున్నది. అపారమైన, అద్వైత వాఙ్మయసాగరమున, నివి కొన్ని తరంగములు మాత్రమే యగును. అయియున్నను అవి ప్రముఖములుగాన వాని అధ్యయనము పాఠకుల అభిలాషను అభివృద్ధిగావించి, తీవ్రవఠనము నకు మార్గగామి యగుగాక అని విశ్వాసము.

— o —

# శ్రీ సురేశ్వరాచార్యులు

## జీవిత సంగ్రహము

న స్తౌమి తం వ్యాసమశేషమర్థం
సమ్యఙ్న సూత్రైరపి యో బబంధ।
వినాపి తైస్సంగ్రథితాఖిలార్థౌ
తం శంకరం నౌమి సురేశ్వరంచ॥

(సిద్ధాంతబిందు)

అఖిలార్థముల రచించిన శంకర, సురేశ్వరుల నమస్కరింపక, అశేషార్థరచనాశీలుడైన వ్యాసునకు శ్రేష్ఠముగ సూత్రముల నిర్మించియున్నను నేను నమస్కరింపను, అని మధుసూదన సరస్వతిచే శంకర సమస్థాన మీయబడుచు, శ్లో॥ ఆవనమ్య మను సురేశ్వర యోగీశ్వర తీవ్రకిరణ గురుచరణాన్। శాస్త్రాణాం వ్యాకర్తౄన్ కర్తౄనపి దేవతా నిఖిలాః' అను సురేశ్వర, యాజ్ఞవల్క్య యోగీశ్వరాది గురుచరణులకును, శాస్త్రకార, శాస్త్రవ్యాఖ్యలకును, అఖిల దేవతలకును నమస్కరించి అను వాక్యమున మన్వాది స్మృతికర్తలతోడగనేగాక, దేవతాగణముతో గూడ సమానస్థానము నలంకరించి 'బాలక్రీడా వ్యాకరణ' మైన "వచనమాల"లో బొందియున్న "భవభూతిః సురేశ్వరాఖ్యం విశ్వరూపం ప్రణమ్యతం" (విభావనల) సాక్షాత్తు శివశ్వరూపుడైన సురేశ్వరనామక విశ్వరూపునకు నమస్కరించి అని, విశ్వరూపకృత "బాలక్రీడ" యను యాజ్ఞవల్క్యస్మృతి వ్యాఖ్యకు వివరణమునందు నమస్కరింపబడిన యీ సురేశ్వరాచార్య

విషయము, పూర్వము శ్రీశంకరాద్వైత గ్రంధమున నిసుమంత గాంచియున్నారము. వైదిక కర్మకాండ ప్రబోధక మీమాంసాశాస్త్ర ప్రచారమున నజేయుడై, సుధన్వాధి రాజాధిరాజుల యాస్థానముల బండిత ప్రకాండుల నోడించి, దిగ్విజయ యాత్ర గావించిన నాటి భారతీయ వాతావరణము నుండి కర్మకాండ వ్యతిరేకసిద్ధాంత ప్రబోధకమైన బౌద్ధ, జైనాది వాదముల రూపమడంచి, వైదిక కర్మోద్ధారక చక్రవర్తి యగు కుమారిల భట్టాచార్యుని శిష్యాగ్రగణ్యుడై, చిర ప్రసిద్ధి గాంచియుండినట్టి మండనుడే, యీ సురేశ్వరాచార్యుడని అందు జూచియున్నాము. అతడే విశ్వరూప నామమున బూర్వాశ్రమమున బ్రఖ్యాతుడై యుండెననియు, గుమారిలునకు బావమరిది సంబంధముగూడ గలదనియు, "గుమారిలుడే" తనతో శాస్త్రచర్చ గావింప నేతెంచియున్న అద్వైతాచార్యా సార్వభౌముడైన, అపర శివస్వరూపుడైన. శంకరాచార్యు సంబోధించి, అట్టి అసమాన విద్యా-వైశారద్యముగల శంకరునితో జర్చింపగల సామర్థ్యము గలవాడొక్క-విశ్వరూపుడే యని విశ్వసించి, "శిష్యో మమాస్తి మగధేషు సవిశ్వరూపా" (2.45) మగధరాజ్యమున నాకొక శిష్యుడుగలడతడు విశ్వరూపుడని తెలపి, శంకరు నచ్చుటకు బంపియుండుట విశ్వరూపునియొక్క- నాటి అసాధారణ ప్రశస్తి విరూపితము. పూర్వమే "సౌరభము" వాకొనినట్లు క్రీ. పూ 509 సంవత్సరమున జనించి, క్రీ. పూ. 477 సంవత్సరమున బ్రహ్మైక్యము నొందియున్న శ్రీ శంకర భగవత్పాదుని జీవితచరితా కథనము, క్రీ. త. 1267–1386 సంవత్సరముల ఎదురులేని పాండిత్యముచే నలంకృతుడై,

ప్రఖ్యాతి గడించియున్న విద్యారణ్య యతీంద్రుని కాల ప్రాంతములలో [illegible], నాటికి అర్థ్యమైన గాథల సమన్వయించుచు, నాటికి బ్రజ్వరిల్లియుండిన [illegible] పరస్పర వైషమ్యములవలన, పరస్పరాధిక్యతలకొరకై, స్వప్రయోజన సిద్ధికై, ఆ శంకర విజయ గ్రంథములు కృతములు గావున, వానిలో [illegible] క్లిష్ట సమస్యలు జనించియున్నవి. కాలవ్యత్యాసముల దాటింపను, శంకరప్రఖ్యాతి వినుమడింపజేయు నుద్దేశ్యమున, శంకరపూర్వ [illegible] వ్యాస, శుక, గౌడపాదాది ప్రాచీనులనే గాక, శంకరా నంతరులై క్రీ. శ. 11వ 13వ శతాబ్దములకు జెంది, విశిష్టాద్వైత, ద్వైతముల ధరించి అద్వైత ఖండనము గావించియున్న రామానుజ మధ్వాచార్యులనుగూడ శంకరునితో సంబంధముచేసి, చారిత్రాత్మక దృష్టికి గీడు గావించిరి నాటి "విజయ" కర్తలు. అదేవిధముగ శంకర పూర్వాద్వైత గ్రంథములలో సుప్రశస్తమై, కాలాంతరమున సర్వశాస్త్ర వ్యాఖ్యాతయై, అపార పాండితీగరిమచే [illegible]పై రాజిల్లిన వాచస్పతి మిశ్రాదులకు అద్వైతసిద్ధాంత వివరణ కార్యమున నాదర్శమై వెలుగొందు "బ్రహ్మసిద్ధి" అను ప్రసిద్ధ గ్రంథకర్త యగు మండన మిశ్రుని, గేవల మండన నామమునను, విశ్వరూపుడుగను [illegible]యుండిన మాహిష్మతీ పండితవర్యునకు నభేదకల్పనము గావించి, చరిత్రల కర్తలు చిత్రించిరి. "బ్రహ్మసిద్ధి" అద్వైత గ్రంథము, మండన మిశ్రుడు అద్వైతి అని పండితభావము. కాని కుమారిల శిష్యుడైన విశ్వరూపుడను అపర నామము గల మండనుడు గాఢ మీమాంసికధర్మవిశ్వాసి, బద్ధ అద్వైత సిద్ధాంత ప్రత్యర్థి. మండన, విశ్వరూప వ్యక్తిత్వమునను, విశ్వ

రూప, సురేశ్వర ఏకత్వమునను బండితులలో ననేక సిద్ధాంత భేదములు గోచరములు కాని గురువంశ కావ్యము' విశ్వరూపుడే సురేశ్వరుడైనట్లు (2.51) దెలుపుచున్నది. అంతియగాక 'సురేశ్వరాఖ్యం విశ్వరూపం' (విభావన) అని బాలక్రీడ వ్యాఖ్యాతయు, 'ద్వాదశమహావాక్య సిద్ధాంత' కర్త వైకుంఠపురియు శంకర శిష్యనామముల దెలుపుచు, 'విశ్వరూప పద్మనాభ తోటక హస్తామలకాచార్యాః' అనుచు సురేశ్వర మునిని విశ్వరూపుడని పూర్వాశ్రమనామమున బ్రస్తావించియున్నాడు. ఆ విధముగనే 'మానసోల్లాస కారికా' కారుడైన రామతీర్థుడును 'తచ్ఛిష్యైః విశ్వరూపాచార్యైః సురేశ్వరాపరనామభిః' సురేశ్వర నామము విశ్వరూపునకు బరనామముగ దెలిపియున్నాడు. ఇటులే విద్యారణ్యుడును 'ఇదం చ వాక్యం నిత్యకర్మ-విషయత్వేన వార్తికే విశ్వరూపాచార్య ఉదాజహార' (97) ఈ వాక్యము నిత్యకర్మ విషయముగ వార్తికలో విశ్వ రూపాచార్యుడు ఉదాహరించెను అని సురేశ్వరాచార్య కృతబృహదారణ్యక వార్తికనుండి ప్రమాణమును గైకొనెను. అటులే తన 'వివరణప్రమేయ సంగ్రహము' నగూడ విద్యార ణ్యుడు 'తదుక్తమాక్షేపపూర్వకం విశ్వరూపాచార్యైః' (1.82) పూర్వపక్ష పూర్వకముగ నిది విశ్వరూపాచార్యునిచే జెప్పబడినది అనియు, 'విశ్వ-రూపాచార్యైఃదర్శితం' (1.152) విశ్వరూపా చార్యునిచే జూపబడినదనియు, విశ్వరూపుని నామమును దెలిపి, సురేశ్వరుని వార్తికనుండి ప్రమాణముల గొనియుండుటయు, నటులే 'తదుక్తం సురేశ్వరవార్తికే, (1.93) సురేశ్వరుని వార్తికమున నిది తెలుపబడినది అని ఆ వార్తిక గ్రంథమును గైకొనియుండుటచే విద్యారణ్యదృష్టికిగూడ విశ్వరూప, సురేశ్వరులకు అన్యత్వము గోచరింపక,

నొకరికే నామద్వయముగ దోచినట్లు ప్రస్ఫుటము. 'జీవన్ముక్తప్రకాశిక'లో గూడ విద్యారణ్యుడు 'తదాహుః విశ్వరూపాచార్యః' విశ్వరూపాచార్యుడిట్లు తెలుపును అని నైష్కర్మ్యసిద్ధిలోని 41వ శ్లోకమును గైకొనెను. నైష్కర్మ్య సిద్ధి సురేశ్వర ప్రణీతముగదా ! అటులే ద్వారకాపీఠమునకు సుధన్వమహారాజు దత్తము గావించిన శాసనమున, 'విశ్వరూపా పరనామ సురేశ్వరాచార్యాన్' అనుచు యీ నామద్వయము ఒక వ్యక్తి కన్వయములే అని వ్యక్తపరచు చున్నది. గోవర్ధనపీఠగురుపరంపరలో 'పంచపాదిక కర్తారం పద్మపాదం సనందన। వార్తికాది గ్రంథకారం విశ్వరూపం సురేశ్వరం॥ పృథ్వీధరాఖ్యం శ్రీమద్హస్తామలకయోగినం। తోటకం చానందగిరి. ప్రణమామి జగద్గురుం॥ అను శ్లోకమున శంకరాచార్యుని, నలుగురు శిష్యముఖ్యులను, ఆశ్రమ–పట్టములతో, పూర్వాశ్రమ నామములగూడ జేర్చి వచించుట గమనార్హము. అందు సంశయవిచ్ఛేదకముగ విశ్వరూప సురేశ్వరులు ఒక్కరే యనియు. అతడే వార్తికకారుడనియు స్పష్టపరచి యుండుటచే నెట్టి సందేహమునకు అవకాశము గానరాదు.

ఇక మండన పదమును మాధవుడు తన శంకరవిజయమున బహుళముగ నుపయోగించి, 'మండన పండితః' (8. 1, 4) మొదలగు సందర్భముల మండనునికి కేవలము 'పండిత' విశేషణమునుమాత్రమన్వ-యించియు, 'మండనమిశ్రః' (10.74) మొదలగు స్థలముల ఉపయోగించి యున్నాడు. కాని 'బ్రహ్మసిద్ధి' కర్తను అన్వయించి పలికెనో, కాక విశ్వ రూపాఖ్యునకు "మండన" సహ "మిశ్ర" పదముగూడ నున్నదో ప్రస్ఫుట

ప్రమాణము లభ్యపడునంతవరకు మండనమిశ్ర పదముతో 'బ్రహ్మసిద్ధి' కర్తను శంకరుసన్నిధానమునకు మాధవుడు లాగికొని వచ్చెనను అపవాదు అన్వయింపదు. మిశ్ర కుటుంబమున, నిరువురు మండనులుండి ఒకరు మీమాంసికుడుగను మరియొకడు అద్వైతిగ నుండరాదా ? మరియు 'గురువంశము' న శంకరుడు మాహిష్మతీ నగరమునకై వెడలుచుండ, మార్గమధ్యమున మండన మిశ్రుడు శంకరుని గౌరవించి, అద్వైత-సిద్ధాంతమున దన సందేహముల గొన్నింటి నివారణము గావించు కొనినట్లు గలదు. ఇతడు 'బ్రహ్మసిద్ధి' కర్తయయి యుండనగును. పిమ్మట శంకరుడు, మీమాంసికుడైన మండనుని గలిసి, వాదించి, యోడించినట్లు అచట గోచరించును. అటుల శంకర, మండన, మండనమిశ్రులు సమ కాలికులేయై యుండవచ్చును. శంకరునకు బూర్వమో, లేక ఆ కాలముననో 'బ్రహ్మసిద్ధి' రచనమును మిశ్రుడు గావించి యుండవచ్చును. విషయ నిర్ధారణము ఇంకను గవేషణీయముకాన నంతవరకు 'బ్రహ్మసిద్ధి' రచయితను బ్రత్యేకించి మండన, విశ్వరూప, సురేశ్వర నామములు వార్తికకారుడైన శంకరశిష్యునకే అన్వయించునని దలంచెదముగాక.

ఇతని కాలము, విషయము, శ్రీ శంకరాద్వైత గ్రంథమున శంకర కాలనిర్ణయముతో నిర్ణయమయి యున్నది. శంకరునకు బదునైదవ వర్ష ప్రాయమున గుమారిలుని గలిసియుండుటచే, నా వత్సరమున శంకరుడు విశ్వరూపునితో వాదించియుండును. అనగ క్రీ. పూ. 494 వ సంవత్సరమున వీరికి వాదము జరిగియుండును. నాటికే యతడు అసాధారణ

ప్రజ్ఞాసౌష్ఠవమును, పాండితీవైదుష్యమును గడించి, దేశవ్యాప్త ప్రశస్తి గడించి, మగధరాజాధిపతికి గురువర్యుడై చెల్వొందుటచే శంకరునికంటె పెద్దవాడై యుండుననుట నిస్సంశయము. మగధరాజధానియైన మాహిష్మతీ నగరమున (మాధవీయ శంకరవిజయము, గురువంశకావ్యము) కాక నర్మదా నదీతీర పట్టణమున రాజగురువై, రాజగురు వైభవమున మిగుల సంపద్విశేషములతో దులదూగు రాజగృహమున వాసంబుండుచు, ఆవరణమంతయు వైదిక సంబంధ మంత్రఘోషచే నిండియుండ చేయుటయేగాక, ద్వారమున నున్న చిలుకలుగూడ వైదికమంత్రమునుచ్చరించునట్లు జేసియుండుటచే, శంకరుడుగూడ ఆనందముచే ముగ్ధుడైపోయెను. మాధవుని గ్రంథము ననుసరించినచో, ఔచిత్యము బాటింపని సంభాషణము వారిరువురికి ప్రథమతః జరిగియుండెను. పితృకార్యమగుటచే ద్వారములు బంధించియున్న గృహమును, శంకరుడు కామరూపమున గృహముయొక్క ఊర్ధ్వభాగము నుండి ప్రవేశించుట అసందర్భము. అట్లు ప్రవేశించిన సన్న్యాసిని అగౌరవపరచి 'ముండి' అని దూషణముల బల్కి, మండనుడు తన విద్యకే అగౌరవము గావించుకొన, శంకరుడు తన సన్న్యాసమునకు, అద్వైతగౌరవమునకు భంగమువాటిల్లు విధముగ దూషణవాక్యముల బలుకుట చాల అనౌచిత్యము. అట్టి విద్యాధికులు గ్రామీణులవలె నొకరినొకరు దూషించుకొనుట సభ్యతకే లోపము వాటిల్లునట్లగుచున్నది. కాని 'గురువంశకావ్యము' పై సమాగమ విశేషమును జాల శీవిలో ప్రస్తావించియున్నది. శంకరు విషయము అతఃపూర్వమే వినియుండి యుండనగును, మండనుడు శంకరుని మిగుల గౌరవముగ నాహ్వానించియతికి గావింపవలసిన భిక్షావందనాదుల

గావించి, తన గృహస్థ ధర్మమును నెరవేర్చి, పిమ్మట శంకరునితో బ్రహ్మ కర్మముల జర్చింప నుద్యుక్తుడై యుండెను. ఈ ప్రవర్తనమెంతయో సమంజసముగనున్నది.

అంత, శంకర, విశ్వరూపుల వాదవిషయము పూర్వ గ్రంథమున జూచియున్నారము. వారిరువురు తమ వివాదమునకు మధ్యవర్తినిగ, మండనుని భార్యయైన ఉభయభారతి నెన్నుకొని, ఏడు దినములు చర్చించిరి చివరకు, మండనుడు బరాజయము నొందుటయు, నంత ఉభయభారతి తమ యోటమి కియ్యకొని శంకరు ననుసరించుటయు, బూర్వగ్రంథమున గాంచి యున్నాము. ఈ సందర్భమున చరిత్రకారుల చిత్రణమువగల అసందర్భ ముల నిరూపించి, ఉభయభారతి శంకరునితో జర్చించియుండదనియు, నొకవేళ జర్చించియున్నను కామశాస్త్ర ప్రశ్నము గావించియుండదనియు, వచించి, ఆ సందర్భమున జరిగియున్నట్లు రచించబడియున్న శంకరునిచే బరకీయ ప్రవేశ, వృత్తాంతము అభూత కల్పనమనియు, దీర్మానించి యున్నాము. జగద్గురుని కీర్తి వినుమడింపజేయ సంకల్పించిన గ్రంథకర్తలు అతనికపకీర్తినే సంపాదించి పెట్టిరనియు వాకొనియుంటిమి. వేదాంత, కర్మ విచారమున గామశాస్త్రప్రసంగమతిప్రసంగము. దానికై పుట్టు బ్రహ్మ చారి, ఆదర్శ యతివర్యుడు, వ్యతిరిక్తముగ వ్యవహరించుట కేవలము అప్రస్తుతము, అస్వాభావికము.

ఇట్లు పరాభూతుడైన విశ్వరూపుడు, శంకరాచార్యుని శిష్యుడై, కర్మసిద్ధాంత త్యాగమును, అద్వైతసిద్ధాంత స్వీకారమును గావించి, శంక రు

సన్నిధానమున అద్వైతసిద్ధాంత పరిపాలనమునకవశ్యమైనసన్యాసాశ్రమమును గై కొని, సురేశ్వరాచార్య పట్టమున విరాజిల్లెను. కాని పూర్వాశ్రమమున విశ్వరూపాచార్యుడుగా, బ్రఖ్యాతి గొని, దేశవ్యాప్త కీర్తినార్జించి యుండు టచే, దన తురీయాశ్రమ నామమైన సురేశ్వరనామముతోబాటు బూర్వా శ్రమ నామమైన విశ్వరూపాచార్య నామముగూడ వ్యాప్తిలో నుండియుండు టచే గాలాంతర గ్రంథకారులు, యీ రెండు నామముల అభేదదృష్టి బహుళ ముగా వాడియుండిరి. కాని విశ్వరూప నామమువలె మండన నామము, సురే శ్వరపదమున, భేదవృత్తి నుపయుక్తము కాకుండుటయు విచారణీయము.

ఈ విధముగ క్రీ. పూ. 491 సంవత్సరమున విశ్వరూపుడు సురేశ్వ రాచార్యుడై, గురుపాదుడైన శంకరునితో దేశపర్యటనము గావించుచు, దక్షిణదేశమునకరుదెంచెను. తుంగభద్రానదీతీరమున శృంగగిరిప్రాంతమతి రమణీయముగనుండి, తపోయోగ్యముగ నుండుటచే, శంకరుడు అట నొక మఠమును స్థాపించెను. నాటి యా దేశపాలకుడు వీరసేనుడు, శంకరునకు మఠస్థాపనమున మిగుల దోడ్పడినట్లు ఆనందగిరి కథనము. ఆ మఠమునకు దన శిష్యులలో నఖండ పాండిత్యప్రకర్షము, బ్రఖ్యాతియు గడించి, వయస్సున జ్యేష్ఠుడైన సురేశ్వరుని అధిపతిగ శంకరుడు నియోగించెను. శృంగగిరి పీఠమునకు సురేశ్వరుడే ప్రథమాధిపతి యనుటకు బహుళాధార ములు గలవు. అతడు అందే మరణించుటయు, నతనికి అచ్చట సమాధి నిర్మింపబడి నేటికి నది అందుండుటయు, బ్రబల సాక్ష్యము. కాని సుధన్వ

మహారాజు ద్వారకాపీఠమునకొసంగియున్న దాన శాసనమున, సురేశ్వరా చార్యుని నామముండుటచే, సురేశ్వరుడు ద్వారకాపీఠమునకు ప్రథమాచార్యు డని వారు వాదించెదరు. పద్మపాదుడు శృంగగిరి యధ్యక్షుడని వారి తాత్పర్యము. అటులే కామకోటిపీఠమువారు తమ పీఠమునకు సురేశ్వరుడే ప్రథమాధిపతిగ వక్కాణించెదరు. కామకోటి పీఠస్థాపనకాలమున, సురేశ్వ రుడు శంకరు సన్నిధానమున నుండెననియు, నంత శంకరుడు తామ్రపర్ణ నదీతీర వాసియైన సర్వజ్ఞముని యను యువకుని జేర్చి, సన్న్యాసమొసంగి, నతని కామకోటిపీఠాధిపతిగా గావించి, అతనికి వ్యవహర్తగ సురేశ్వరుని నియమించినట్లును వాకొందురు. మరియు సురేశ్వరుని ఏ పీఠమునకు నియోగింపక, శంకర పీఠములన్నింటికి పైన అధిపతిగ శంకరుడు నియమిం చినట్లును గొందరి వాదము. ఎట్లు అయినను అతడు ప్రఖ్యాతుడగుటచే, నతని శంకరపీఠములన్నియు దమవాడనియే అన్వయించుకొన యత్నించి నట్లు విదితము. కాని అతడు శృంగగిరి పీఠమునకే ప్రథమాచార్యుడనితోచును.

తా రచించియున్న ప్రస్థానత్రయ భాష్యములకు వివరణ గ్రంథ ములు రచింప సురేశ్వరుని సమర్థునిగా నమ్మి, శంకరుడు శిష్యునికాజ్ఞాపింప, సహచరులైన పద్మపాదాదులు అతని విశ్వసింపక, నతడు పూర్వాశ్రమ మున మీమాంసావలంబకుడగుటచే భాష్యద్వైవివరణములలో నద్వైతభావ ఖండము గావించు నను నెపమున, శంకరు తాత్పర్యమునకు విరుద్ధముగ దలంచి, గురుసన్నిధి దమ భావమును వ్యక్తపరుప, శంకరుడు తనపూర్వ సంకల్పమును మార్చి పద్మపాదునకు శారీరకభాష్య వివరణమును రచింప నాననిడి, సురేశ్వరునకు అద్వైతసిద్ధాంతప్రబోధకమైన యొక

ప్రత్యేక గ్రంథమును, బృహదారణ్యకభాష్యాదులకు వార్తికలనురచింప నానడి వట్లు కథనము. ఇది చింతనీయము. సర్వశాస్త్రపారంగతుడైన సురేశ్వరుడే శంకర గ్రంథములకు వ్యాఖ్యల రచించియున్నచో నెట్లుండెడిదో! ఈ సంఘటనము చిత్తమున నుంచుకొనియుండి యగును, ఉపాసనచే గలిగిన ఫలము, కర్మలయొక్క ఫలము 'ద్రవిడేష్వివ సంగతం' (నై.3. 320) ద్రవిడులయందు చేసిన స్నేహమువలె స్థిరమైనది కాదని సురేశ్వరుడు వాకొనియున్నాడు. పద్మపాదుడు చిదంబరవాసి యగుట నతని కన్వనీయమే మో! శంకరశిష్యులలో నితడేగదా ద్రవిడుడు!

పై విధముగ గురువర్యుని యాదేశమును శిరసావహించి సురేశ్వరాచార్యుడు, 'అశేషవేదాంత సారసంగ్రహ ప్రకరణమిదం' (నై. 1.13) అని ప్రతిజ్ఞ జేయుచు, 'వేదాంతోదరసం గూఢం సంసారోత్సారి వస్తుగం । జ్ఞానం వ్యాకృతమన్యైర్వక్ష్యే గుర్వనుశిక్షయా ॥' (నై, 1.19) ఉపనిషత్తులయొక్క గర్భమున రహస్యముగ నుంచబడినదియు, సంసారమును నిరాకరించునదియు పరమార్థవస్తువును బోధించునదియు నైన జ్ఞానమును, ఇతర పండితులచే వివరింప బడినదైనను గురువుల యాజ్ఞచే జెప్పుచున్నాను అని గుర్వాజ్ఞను, గ్రంథము యొక్క ఆవశ్యకతను బలుకుచు, ప్రత్యేకముగ, నొకప్రకరణ గ్రంథమును నిర్మించెను. అదియే 'నైష్కర్మ్యసిద్ధి' యని, పండిత పామర రంజకముగ సుప్రసిద్ధి గాంచియున్నది. అంత శంకరాజ్ఞ ననుసరించి, 'ఉక్తానుక్త దురుక్తార్థవ్యక్తకారి తువార్తికం, వచించిన దానిని వివరించుట, తెలుపక వదలిన దాని వచించుట, నక్రమరీతి వాకొనబడినదాని దెల్పు.

నది వార్తిక యను లక్షణము ప్రకారము సురేశ్వరుడు, శంకరాచార్యుని బృహదారణ్యక, తైత్తిరీయ భాష్యములకు వార్తికలను, to explain improve and amplify and suppliment the teachings of Sankaracharya. 52 వివరించుట, సవరించుట విస్తరింపజేయుట, పూరించుటలు గావించుటకుద్యుక్తుడయ్యెను. అందు బృహదారణ్య వార్తికమద్భుతమై is held to be no less authority than the bhashya itself and is more frequently cited by later writers on all knotty points of Advaita, as expounding its philosophy with greater precision. 52 భాష్యము కంటె ననల్ప ప్రామాణికత్వమున బరిగణింపబడినదై అద్వైత వాదమున క్లిష్ట విషయముల వివరణమున నధికతర నిర్దుష్టముగ, ననంతర రచయితలచే గ్రహింపబడినది. తైత్తిరీయక వార్తికమంతటి ప్రఖ్యాతము కాకున్నను, ఆ యుపనిషత్ప్రాధాన్యముచే నదియు ప్రసిద్ధము. అందుచే, నతని అద్భుత వివరణ విధానము సుప్రఖ్యాతము. కాన శంకరుడు భాష్యకారుడని కీర్తినార్జింప, సురేశ్వరుడు వార్తికకారుడని ప్రశస్తి గడించియుండుట విదితము. అదేవిధముగ నతడు, శంకరుని పంచీకరణమునకు వార్తికను నిర్మించి, శంకరుని శ్రీదక్షిణామూర్తిస్తోత్రమునకు 'మాన సోల్లాస' మనెడు వార్తికా గ్రంథమును 'ప్రణవవార్తిక", యను నొక ప్రత్యేక గ్రంథమును విరచించెను. 'మానసోల్లాస", నామము ననుసరించి,ఆ గ్రంథ మాధుర్యము వ్యక్తమగుచున్నది.

52. A. Mahadeva Sastry:The Taithiriya Upanishad, p. iv.

సురేశ్వరుడు వార్తికారూప రచనము గావించినను, కాక ప్రత్యేక కృతిని నిర్మించినను, అతని రచనాపద్ధతి is often so very original and through out marked with such thoroughness, precision and clearness that it forms a very valuable supplement to the teachings of the Upanishads: and its authority on all knotty points is acknowledged and with due reverence and submission by all the Advaitic writers of later days. 53 తరచు సహజసిద్ధమై, అంతటను సంపూర్ణ, విపుల స్పష్టత్వములచే శోభిల్లుచు, ఉపనిషత్సిద్ధాంతములకు అమూల్య పూరణముగా రూపొంది యున్నది. సర్వవిషమ సమస్యలపై, దాని ప్రామాణికత్వము గుర్తింపబడి తర్వాత అద్వైత కర్తలమంది గౌరవ విధేయతల నార్జించి యున్నదని, మహదేవశాస్త్రి వచనము.

సురేశ్వరుడు శంకరు జేరకపూర్వము, 'యాజ్ఞవల్క్యస్మృతి' కి 'బాలక్రీడ' యను వ్యాఖ్యానమును సృజించెను. ఆ కాలమున మీమాంసాపరమైన 'విధివివేకమును", వ్యాకరణగ్రంథమైన "స్ఫోటసిద్ధి' అను ఉత్తమ గ్రంథముల నిర్మించియుండెను.

— o —

## నైష్కర్మ్యసిద్ధి

సురేశ్వర కృత గ్రంథములలో ప్రత్యేకమై, సుప్రసిద్ధమైన గ్రంథము 'నైష్కర్మ్యసిద్ధి'. అది అతడే వచించినరీతి అశేష వేదాంత

53. A. Mahadeva Sastry :The Vedanta Doctrine p. ix

సారసంగ్రహప్రకరణ'ముగ (నై .1. 13) బేరొంది, అతడే చెప్పికొనినరీతి 'పరమార్థాత్మనిష్ఠం యత్సర్వవేదాంత నిశ్చితం। తమోఽపనుద్దియాం జ్ఞానం తదేతత్కథితం మయా॥' (నై . 4. 95) సకలోపనిషత్తులయందు నిశ్చితమై' అంతఃకరణగత అజ్ఞాన నివారకమై, పరమార్థరూప ఆత్మయందు నిష్ఠగల జ్ఞానము నాచే తెలుపబడినది అనురీతి, ఉపనిషత్తాత్పర్యముచే నలంకృతమై జెల్వొందును. ఈ గ్రంథము 'నఖ్యాతి లాభ పూజార్థం గ్రంథోఽస్మాభిరు- దీర్యతే। స్వబోధపరిశుద్ధ్యర్థం బ్రహ్మవిన్నికషాశ్మసు'(నై. 1. 25) ఖ్యాతికొరకు గౌరవముకొరకు మాచే రచింపబడలేదు. బ్రహ్మవిదులను సాన లపై మాజ్ఞానమును బరిశుద్ధి చేసి కొనుటకై ప్రవృత్తము అనియు, వేదాంత రసమును బూర్వ విద్వాంసులు అనేకరీతుల వెదజల్లియుండినను, 'గుర్వను శిక్షయా' (నై 1. 19) గురుసామదైన శంకరాజ్ఞ ననుసరించి రచించినట్లును దెలుపుచు, సురేశ్వరుడు తన నమ్రతను, గురుభక్తిని వెల్లడించి యున్నాడు. అట్లయ్యును తన రచనమును గురు గ్రంథములతో బోల్చికొనుచు, 'గురూక్తో వేదరాద్ధాంత స్తత్రనో వచ్మ్య శక్తితః। సహస్రకిరణవ్యాప్తే ఖద్యోతః కిం పకాశయేత్॥' (నై 1 . 23) వేదార్థ సిద్ధాంతము ఆచార్యులచే వచింపబడెను. తత్సిద్ధాంతమును నాకు సామర్థ్యమభావమగుటచే నేనేమియు దెలుపజాలను. భాస్కరునిచే ప్రకాశింపబడిన వస్తువును, మిణుగురుపుర్వేమి ప్రకాశింపజేయ గలదు అనియు సురేశ్వరుడు వినమ్రుడయ్యెను.

ఈ విధముగ విద్యావినయ సంపన్నతచే సురేశ్వరుడు రచించిన నైష్కర్మ్యసిద్ధి, అధ్యాయ చతుష్టయముతో విరాజిల్లుచు, నందు ప్రథమా ధ్యాయమున, నఖిల వేదాంతముల 'తత్వమస్యా'ది మహావాక్యజన్యమైన

తత్త్వజ్ఞానమే మోక్షసాధనమని ప్రతిపాదించుచుండుట యందు సమన్వితములై యున్నవనియు, ద్వితీయాధ్యాయమున, నన్వయ వ్యతిరేకములచే బదార్థ నిశ్చయము గావించుకొనినవానికి. వాక్య శ్రవణముచే దత్త్వజ్ఞానోత్పత్తియందు విరోధము కాన్పింపదనియు, దృతీయమున, దత్త్వజ్ఞానోదృత్పత్తికి దత్త్వమస్యాది వాక్య శ్రవణమే సాధన మనియు, జతుర్థో-ధ్యాయమున, దత్త్వజ్ఞాన ఫలమును వివరించుచున్నది.

గ్రంథాంతమున మరల 'శ్రీమచ్ఛంకర పాదపద్మయుగళం సంసేవ్య లబ్ధ్వోచివాన్। జ్ఞానం పారమహంస్యమేతదమలం స్వాంతాంధకారాపనుత్॥' (4. 140) జ్ఞానవైరాగ్యసంపన్నులగు శ్రీమచ్ఛంకరాచార్యుల పాదారవింద యుగ్మమును సేవించి, వారి కృపచే నుపదేశింపబడి, పరమహంస పరివ్రాజకులకే యోగ్యమై, శుద్ధమై, హృదయగత అజ్ఞానాంధనిరాసము గావించు తత్త్వజ్ఞానమును కరతలామలకముగ బోధించునీ గ్రంథమును నే జెప్పితిని అని, గురుచరణ స్మరణము గావించి, 'ఇమం గ్రంథముపాదిత్సురమానిత్వాదిసాధనః। యత్నతస్స్యాన్న దుర్వృత్తః ప్రత్యగర్థానుగో హ్యయం॥' (నై. 4.135) ఈ గ్రంథమును గ్రహింపగోరువాడు, ప్రయత్నముచే నమానిత్వాది గుణముల సాధకుడు గావలయును. దుర్గుణములు గలవాడు కాగూడదు. ఈ గ్రంథము ప్రత్యగాత్మ ననుసరించుచున్నది గదా అని అధికారి నిర్ణయము గావించి, మాన, దంభ, దర్పా సూయాది దుర్గుణములలో, నొక్క దానిని గలిగియున్నను అట్టివానికి గ్రంథము నుపదేశింరాదని స్పష్టపరుప, 'నావిరక్తాయ సంసారాన్నానిరస్తైషణాయచ। నచాయమవతే దేయం వేదాంతార్థప్రవేశనం॥' (నై. 4. 137) వేదాంతార్థమునందు

ప్రవేశము గలుగజేయుచున్న ఈ గ్రంథమును, సంసారమువలన విరక్తుడు కానివానికొసంగజనదు. ఈషణముల వర్జింపనివానికి నీయదగదు. యమ నియమ రహితునకుగూడ నొసంగరాదు అనిదెలిపి, 'నిరస్త సర్వకర్మాణః ప్రత్యక్ప్రవణబుద్ధయః। నిష్కామా యతయః శాంతా జానంతీదం యథోదితం॥' (నై. 4. 139) సర్వ కర్మ పరిత్యాగము గావించి, ప్రత్యగాత్మైక చిత్తముగలిగి, కామదూరులై, శాంతులైనవారే, దీని గ్రహింప నర్హులు అనియు స్పష్టపరచియున్నాడు. ఈ గ్రంథ ప్రాధాన్యమునుగూడ వచించుచు సురేశ్వరుడు "విష్ణోః పాదానుగాం యాం నిఖిలభవనుదం శంకరో ఽ। వాపయోగాత్। సర్వజ్ఞం బ్రహ్మసంస్థం మునిగణ సహితం సమ్యగభ్యర్చ్య, భక్త్యా। విద్యాం గంగామివాహం ప్రవరగుణనిధేః ప్రాప్య వేదాంతదీప్తాం కారుణ్యాత్తామశోచం జనిభృతినివహధ్యస్తయే దుఃఖితేభ్యః' (నై. 4. 142) వ్యాపకులైన బరమేశ్వరుని స్వరూపము ననుసరించి, సకల సంసార నివృత్తి గలుగజేయుచున్న శ్రీశంకర భగవత్పాదులు, తమ దివ్య జ్ఞానోపాయముచే, విష్ణుమూర్తియొక్క పాదాంగుష్ఠము ననుసరించియుండి, సంసార దుఃఖముల సకలము నివర్తింపజేయు గంగను శివుడు తన యోగ సామర్థ్యమున బొందినట్లు గాంచిరి. సర్వజ్ఞులై, బ్రహ్మనిష్ఠులై, యనేక బ్రహ్మవేత్తలతో గూడియున్న శ్రీ శంకరులవల్ల, సకల వేదాంత ప్రసిద్ధమైన ఆ బ్రహ్మవిద్యను భగీరథుడు ఈశ్వరుని ఆరాధించి, వేదమంత్రములచే బ్రతిపాదింపబడిన గంగను బొందినట్లు నేను బొంది, సంసారమున బడి దుఃఖితులైన జనుల

కొరకు, వారి జననమరణాది సంసారదోష నివారణమునకై ఆ బ్రహ్మ విద్యను, ఈ గ్రంథరూపమున జెప్పితిని అని వాకొని యున్నాడు. దీన, బ్రహ్మవిద్యాసంపాదనమెంత కష్టసాధ్యమో తెల్లము. అందుచే సురేశ్వర ప్రోక్త బ్రహ్మవిద్యాప్రాప్తికై, పూర్వ వ్యక్త అమానిత్వాదికమును గడించి, అర్హులమై, అతని బఠించి, తత్సిద్ధి గాంచెదముగాక.

— o —

ఓమ్

# శ్రీ సురేశ్వర తాత్పర్య సంగ్రహము

ఖానిలాగ్న్యబ్ధరిత్ర్యంత స్రక్ఫణీవోద్గతం యతః।
ధ్యాంతచ్ఛిదే నమ స్తస్మై హరయే బుద్ధిసాక్షిణే॥

నైష్కర్మ్యసిద్ధి (1.15)

ఆకాశ, వాయు,తేజో, జల, పృథివీ స్వరూపము పుష్పమాలిక వలన సర్పమువలె నెవనిచే జనించెనో, అట్టి యజ్ఞానాంధకారమును నివర్తింప జేయువాడును, అంతఃకరణ సాక్షియునైన పరమేశ్వరునకు నమస్కరించుచున్నాను. ఈ శ్లోకరాజమున సురేశ్వరుడు, తన గ్రంథ తాత్పార్య సర్వమును వ్యక్తపరచి యున్నాడు. సర్పభ్రాంతిచందము సృష్టి కార్యము. జనితమనియు, నా భ్రాంతిని పరమేశ్వరజ్ఞానమే నివర్తింపజేయు ననియు, నా బరమేశ్వరుడుదాసీనుడై, సాక్షియై, అంతఃకరణోత్పన్న సుఖదుఃఖాదికముతో నసంగుడై యుండుననియు, ముఖ్య వేదాంతార్థమును విశదము జేసెను. శ్రుతి స్మృతుల గల ద్వైతవాక్య బాహుళ్య దర్శనమున, ద్వైత సత్యత్వమసంగతమనుచు 'నచబాహుళ్యం ప్రామాణ్యే కారణభావం ప్రతిపద్యతే" (నై.1. 235) బహుత్వము ప్రామాణ్యమునందు హేతుత్వ మును బొందదని తెలిపి, "సిద్ధమద్వైతం ద్వైతబాధయా" (నై.2. 2ం7) ద్వైతనివృత్తిచే నద్వైతసిద్ధియని ద్వైతనిరాసమును సురేశ్వరుడు గావిం చెను. అద్వైత సిద్ధాంతమును బ్రతిష్ఠింపజేసెను. మానసోల్లాసమునగూడ

శివునితో నైక్యముగ నుండుటచే జీవులన్నియు, బ్రహ్మాయుక్తములనియు, నందుచే నీశ్వరైశ్వర్య సహితులై, శివస్వరూపమే అనియు (1.21) జీవులు ఈశ్వరశక్తి సంపన్నములగుటచే ఈశ్వరులే అనియు (2.44,45) నద్వైతవాదమును బలపరచెను. "దృశ్యాః శబ్దాదయః క్లృప్తాః ద్రష్టృ చ బ్రహ్మనిర్గుణం। అహం తదుభయం బిభ్రత్ భ్రాంతిమాత్మని యచ్ఛతి॥" (నై - 2. 99) శబ్దాది దృశ్యములు కల్పితములు ద్రష్ట యగు బ్రహ్మము నిర్గుణము. అహంకారమీద్వయమును ధరించి, ఆత్మయందు భ్రాంతిని గల్పించుచున్నదను వాక్యమున బ్రహ్మము నిర్గుణము, శబ్దాదికము కల్పితము. అహంకారముచే నీ భ్రాంతి కల్పితమని సురేశ్వరుడు స్పష్టపరచుచు, 'ఉత్పత్తి స్థితి నా శేషయోఽవగత్యైవ వర్తతే। జగదవికారయా వేహితమస్మీతిన నశ్వరం॥" (నై. 2.235) ప్రపంచముయొక్క ఉత్పత్తి, స్థితి, లయములందెవడు నిర్వికారమైన జ్ఞానస్వరూపముతో వర్తించు చున్నాడో, ఆ ఈశ్వరుడను నేనయితినని యెరుంగుము. నశించు పదార్థముల నెరుగకుము, అను శ్లోకమున జీవేశ్వరైకత్వమును దెలిపి, తత్త్వమసి వాక్యము నుపదేశించును. అయినచో నీ నానాత్వకల్పనమెట్లు? అని ప్రశ్నించుకొని, "తదేతదద్వయం బ్రహ్మ నిర్వికారం కుబుద్ధిభిః। జాత్యంధ గజదృష్ట్యైవ కోటిశః పరికల్ప్యతే॥' (నై. 2.189) పుట్టంధులు గజమును స్పృశించి, అనేకవిధముల గజరూపకల్పనము గావించునట్లు, సమ్యగ్ బుద్ధిలేని అజ్ఞానులు ఏకమై, నిర్వికారమై యొప్పు బ్రహ్మమునందు అనేకత్వమును గల్పించుచున్నారు అని సురేశ్వరుడు వాకొనెను. ఆకాశమున, గల్పితాంధకార, ధూమ, మేఘ, దూళి, మొదలగునవి లేనట్లు సర్వవిభేద రహితమైన బ్రహ్మము ఆత్మయే యనియు (మా. 4. 31), అవిద్యాబల

మున స్వయంసిద్ధమైన ఆత్మలో నసత్తగు జగము, శుక్తముపై రజతము రీతినూహింపబడినదనియు (మా. 7.28,29), నతడు "మానసోల్లాసము"న వివరించును.



## ఆత్మ



అట్టి ఆత్మ "నామాదిభ్యః పరో భూమా నిష్కలోఽ కారకోఽక్రియః స ఏవాత్మవతామాత్మా స్వతస్సిద్ధ స్సఏవ సః॥" (నై.2. 123) నామాదులకు విలక్షణమై, భూమయై, సాధ్యముకానిదై, సాధనములేనిదై క్రియాశూన్యమైన ఆత్మయే,తత్త్వవేత్తలకు లక్ష్యార్థమగుటయు, నదిమాకు స్వతఃసిద్ధమై చెలరారుటచే,నెల్లరకు దాని జ్ఞానమవశ్యమగుటచే,"యత్సిద్ధావిదమస్సిద్ధి యదసిద్ధానకించన। ప్రత్యగ్బ్రహ్మైక నిష్ఠస్య యాథాత్మ్యం వక్ష్యతే స్ఫుటం॥" (నై.1.21) దేని ప్రకాశముచే దేహేంద్రియాది జడ పదార్థములు ప్రకాశించునో, అది ప్రకాశింపనిచో నివియు ప్రకాశింపనేరవో, అట్టి దేహేంద్రియాదిక మునకు సర్వాంతరమై, సర్వ ప్రపంచాధ్యాసమునకధిష్ఠానమైయున్న, చిదాత్మయొక్క వాస్తవ స్వరూపము స్పష్టపరుబపడును అని సురేశ్వరుడు, గ్రంథమును ప్రారంభించియున్నాడు. అనగా నాత్మజ్ఞానముతో బ్రహ్మైత్మైకత్వముగాన బ్రహ్మజ్ఞానము, తత్స్వరూపమైన జీవస్వరూపజ్ఞానము, జీవాధ్యాసజ్ఞానము మొదలైన సర్వ వేదాంత తాత్పర్యజ్ఞానము బోధపడుట విస్పష్టముగదా।

కాని "యతో రాద్ధిః ప్రమాణానాం సకథం తైః ప్రసిధ్యతి ?" (నై. 2. 80) ప్రమాణములు ఎవనివలన గలుగుచున్నవో ఆ యాత్మ ప్రమాణములచే నెట్లు సిద్ధించును ? మరియు, "ప్రమాణవ్యవస్థాయాశ్చ అనుభవమాత్రాశ్రయత్వాత్" (నై. 1. 250) ప్రమాణములయొక్క సిద్ధి అనుభవము నాశ్రయించి యుండుటచే, ప్రమాణములచేత నాత్మస్వరూపము తెలియబడదు. ఎట్లన "దిదృక్షిత పరిచ్ఛిన్న పరాగ్రూపాది సంశ్రయాత్। విపరీతమతో దృష్ట్యా స్వతో బుద్ధం నపశ్యతి॥" (నై. 3. 169) దృశ్యమై, పరిచ్ఛిన్నమై, పరాగ్భూతమై, రూపాదిగుణములకాశ్రయమైయున్న విషయముకంటె ఆత్మ విలక్షణమై యున్నది. కాన, స్వయం ప్రకాశమైన ఆత్మను, ప్రమాణముచే గాంచ నవకాశము అగిది. అట్లుగాక, "వృత్తిభిర్వ్యక్ష్మదర్థాభిర్లక్షతే చేద్దృశిః పరః। అనాత్మత్వం భవేత్తస్య వితథం చవచః శ్రుతేః॥" (నై. 3. 345) అనాత్మ బోధకములైన వృత్తులచే, విలక్షణమైన దృక్కు అగు ఆత్మ బోధింపబడినచో, నా యాత్మకు అనాత్మత్వము సంభవము. అంత, శ్రుతి వచనములు నిరర్థకములగును. సంబంధము గుణము, క్రియ, జాతి, రూఢి యను నైదు కారణములు, శబ్దమునకన్వయములు. ఇవి ఆత్మయందు దభావము. కాన ఆత్మ వచింపబడదుగదా ! అంతియగాక "ద్రష్టృత్వం దృశ్యతాచైవ నైకస్మిన్నేకదా క్వచిత్। దృశ్యదృశో్ర్వ వచ ద్రష్టా ద్రష్టృ దర్శి దృశిర్నచ॥" (నై. 2.84) ద్రష్టృత్వ దృశ్యత్వము లొకచో నేకగాలమున సంభవింపవు, మరియు, ద్రష్ట. దృశ్యముచే జూడబడడు. అటులే దృక్కు ద్రష్టను గాంచజాలదు. విరుద్ధములైన ధర్మములకు, ఒక చోట ఉపపత్తి యుండజాలదు నై. 2. 105) కాన "నాత్మనాన తల్లం

శేనగుణః స్పష్టో೭వగమ్యతే!' (నై.2,53) నటులే నాత్మధర్మము ఆత్మ చేనైన గ్రహింపబడదు. అదేవిధముగా నింద్రియములకాధారమైన విజ్ఞానము గూడ భూతాదికమును జూచుచున్నను, 'నాత్మానం పరిపశ్యతి' (నై. 4.21) ఆత్మనుమాత్రము వీక్షింపజాలదు. నేత్రము శబ్దమును గ్రహించునా? అంతియగాక కరణములకధిష్ఠానమై, అధిపతియై యొప్పు అంతఃకరణము గూడ సదాసాక్షియైనఆత్మను 'ప్రత్యక్త్వాన్నాహమీక్షతే '(నై. 4. 23) సర్వ ప్రత్యగ్రూపుడగుటచే జూడజాలదు. ఇటుల'నిత్యావగతి రూపత్వాదన్యమానా నపేక్షణాత్! శబ్దాదిగుణహీనత్వాత్సంశయానవతారతః॥ తృష్ణార్థిష్ఠీవ నైర్నాత్మా ప్రత్యక్షాద్యైః ప్రమీయతేః॥ ప్రత్యగాత్మత్వ హేతోశ్చ స్వార్థ త్వాదప్రమేయత.॥'(నై. 3. 166,167) నిత్యమైన జ్ఞానమునుస్వరూపముగా గలిగి యున్నందున, ప్రమాణాంతరము నపేక్షింపనిదై యున్నందున, శబ్దాది గుణరహితమై యున్నందున, సర్వాంతరమైన ప్రత్యగాత్మ స్వరూప మైనందున, వ్యవధానశూన్యమై యున్నందున, అనుమానప్రమాణగోచరము కానందున,ఆశాబద్ధమై ప్రవర్తించు ప్రత్యక్షాది ప్రమాణములచేనాత్మ బోధింప బడదు. ఈ ప్రమాతృ, ప్రమాణ, ప్రమేయ వ్యవహారము సర్వము, బాహ్య వస్తువులమాత్రము విషయీకరించును గాని, 'న ప్రతీచీనమాత్మానమవగా హయితుమలం' (నై. 3. 173) ప్రత్యగ్రూపుడైన ఆత్మస్వరూపమును గూర్చి ప్రవేశించుటకు, సమర్థముకాదు అని తాత్పర్యము.

మరియు నీ యాత్మ, 'దృగేకా సర్వభూతేషు' (నై. 2. 101) సకల భూతములందొక్కటియై, నిత్యమై, 'శబ్దాద్యాకార నిర్భాసాః క్షణ ప్రధ్వంసినీః దృశా ! నిత్యో೭క్రమదృగాత్మైకో వ్యాప్నోతీవ ధియో

నిశం॥' (నై. 2. 147) నిత్యజ్ఞానస్వరూపుడై, ఒక్కడై, శబ్దాది స్వరూపములఁ బ్రకాశింపజేయుచున్న నిమేషమున, నశింప జేయుచున్న బుద్ధులను జ్ఞానము చేత నిరంతరము వ్యాపించి యుండును. అతడు 'జగద్ధియాంవృత్తం జ్యోతిరేకం సదేక్షతే, (నై. 2. 181) లోకమున గల సకల బుద్దివృత్తులను, ఏకాకారమగు ఆత్మజ్యోతిస్సు సాక్షిభూతమై చూచును. కాన 'ఏష ఆత్మా స్వయంజ్యోతిః' నీఆత్మ స్వయంజ్యోతి యనబడుచున్నది. అతడు సర్వమునకు సాక్షియై, వెలుగొందుచుండును. దేహేంద్రియాదులు ఘటము వలె దృశ్యములు. మనోబుద్ధులును దృశ్యములే యగుచున్నవి. కాని ఆత్మ సర్వ కార్యకారణములకు, వాని ఉత్పత్తి నాశములకు సాక్షియై యలరారుచున్నది (నై. 3. 182). ద్రష్టృదర్శన దృశ్యముల బ్రకాశింపజేయుచు వానికి సాక్షియై యుండుచు, 'హేయోపాదాన వర్జితః' (నై. 2.227) హేయోపాదేయరూపసంసారవర్జితమై, 'కారకక్రియాఫల విభాగసాక్షీ' (నై.2.225) యై, 'సర్వకారక క్రియాఫల విభాగాత్మక సంసారశూన్య ఆత్మేతిగమ్యతే' (నై. 2.224) సర్వవిధ సాధన, క్రియా, ఫలరూప సంసారము లేకుండుటచేనాత్మ యని తెలియబడుచుండును. 'సాక్షిత్వాత్మా ధ్రువస్సదా' (నై. 2. 223) సత్యమైనదగుటచే, సాక్షియై రాజిల్లుటచే నది నిత్యమైనది.

కావున అనాత్మత్వములకు విపరీతమైనదై (నై. 3. 183), ప్రమాణాపేక్షలేని అనుభవ సర్వరూపుడై (నై. 2. 208), 'స్మృతి స్వప్నప్రబోధేషు న కశ్చిత్ప్రత్యయోధిషుః! దృశాఽవ్యాప్తోఽస్త్యతో నిత్యమవికారీ స్వయం దృశి॥' (నై. 2. 170) బుద్ధిప్రత్యయములగు స్మృతి, స్వప్న

జాగ్రతలయందొకటియేమైనను, జ్ఞానస్వరూపుడగు ఆత్మచే వ్యాపింపకుండు నది లేదు. కావున స్వయంప్రజ్ఞుడైన ఆత్మ సదా నిర్వికారుడు. కావున, సచ్చిదానంద రూపుడగు ఆత్మకు, నిర్వికారత్వము సయుక్తికము (నై. 2. 169). అతడు సదా జ్ఞానమూర్తియై, కూటస్థుడై యుండును (నై. 4. 87) ఆగమాపాయినమయిన సుఖములో నతనికి సంబంధము లేక (నై. 1, 9), ఆత్మ యుండునని తాత్పర్యము. అనగా 'సామాన్యాచ్చ విశేషాచ్చ స్వమహిమ్నైవ యో భవేత్! వ్యావృత్తాయావ్యవికారీ స్యాత్కుంభాకాశాది వత్తు సః॥ (నై. 3. 85) ఏది ఘట ఆకాశాదులవలె సామాన్య విశేషాదులచే విభేదమును పొంది, స్వస్వభావముచేతనే ప్రకాశించుచుండునో అది అవికారి యని గదా నిర్వచనము. ఘటాది విషయములు బుద్ధి నాశ్రయించి ప్రకాశింప బుద్ధియు నిత్యాంసంవిద మాశ్రిత్య స్వతః సిద్ధామవిక్రియాం నై. 2. 243) నిత్యమై, స్వతస్సిద్ధమై నిర్వికారమైన చైతన్యము నాశ్రయించి ప్రకాశించును. శుద్ధ చైతన్యమైన ఆత్మకు స్వతఃసిద్ధత్వముచే వప్రవృత్తికారణాభావాత్ (నై. 1. 268) ప్రవృత్తి కారణమే లేదు. బుద్ధి వలె ప్రవృత్తి గలిగి,) వికారత్వము గలిగినచో సాక్షిత్వ మునకు భంగము గదా? (నై. 2. 159). అందుచే 'తస్మాదేష కూటస్థోన ద్వైతం మనాగపిస్పృశతి, యతః, (నై. 2. 146) నిత్య నిర్వి కారుడైన ఆత్మ, యీ ద్వైత ప్రపంచమును స్పృశింపక స్వతః సిద్ధ తేజము గలిగిన మాణిక్యము, తనచే ప్రకాశింపజేయబడు ఘటాదుల కలిమి లేములపై నాధారపడక ప్రకాశించు విధాన (నై. 2. 139, ధీవన్నాపేక్షితే సిద్ధిమాత్మాఽన్యస్మాదవిక్రియః. (నై. 2. 233) బుద్ధివలె తన ప్రకాశము

కారకు నితరముపై నాధారపడక, సర్వకాలముల నిర్వికారుడై, (నై. 4. 88) మహాకాశమువలె 'నిర్విశేషణః. (నై. 2. 192) విశేషణములు లేని వాడై, ఉత్పత్తి నాశములు లేనివాడై యుండును (నై. 2. 162). ఆత్మకు ,న ప్రకాశ క్రియా కాచిదస్య స్యాత్మని విద్యతే,. (నై. 2. 143) ప్రకాశక్రియా శూన్యము. ఉన్నదని వచించుట కేవలము ఔపచారికము మాత్రము అని సురేశ్వరుని ఆత్మ నిర్వచన వివరణములు.

## అ వి ద్య

అహో ధార్ష్ట్యమవిద్యాయాః నకశ్చిదతివర్తతే ! ప్రమాణం వస్తు నాదృత్య పరమాత్మేవ తిష్ఠతి॥, (నై. 3. 367) అజ్ఞానముయొక్క నిర్భయ ప్రవృత్తిని ఎవ్వడును అతిక్రమింపజాలడు. ప్రమాణమును, వస్తు స్వభావ మును ఆదరింపక, పరబ్రహ్మమువలె నిత్యముగా నున్నదిగదా! ఈ అవిద్య ఒక ప్రమాణమునకు గట్టుబడి యుండక, తన స్వభావము ననుసరింపకనై, దా నసత్యమైనను సత్యమువలె దోచును. కాని దీని నతిక్రమింప నేరికి గష్ట సాధ్యము. దీని ప్రతీతి సిద్ధమైయున్నను సత్యముకాదు. యథార్థముగ జ్ఞానం యస్య నిజం రూపం క్రియా కారకవర్జితం సంభావనాఽప్యవిద్యాయా స్తత్ర స్యాల్కేన హేతునా ॥, (నై. 3. 370) క్రియాకారక శూన్యస్వ రూపము గల ఆత్మలో, అవిద్యయొక్క యునికి ఎట్లును ఊహింపజాలము. అయినను ఉదయాస్తమయశూన్యమైన, చైతన్యమాత్రమైన ప్రత్యగాత్మ,

స్వయంప్రకాశుడై యుండియు, అవిచారకాలమున, ప్రసిద్ధమైన అజ్ఞానముచే నావృతుడై, అన్యప్రకాశాపేక్షకుని వలె గాంచబడును (నై. 3. 371). ఈ అవిద్య 'అతిదుఃస్థో ప్రబోధోఽత్ర, (నై. 3 .364) మిగుల దుఃస్థితమై యున్నది. దాని ప్రభావమువలన గూటస్థాత్మకును, మిథ్యాభూతమై 'అనాత్మన శ్చాజ్ఞాన ప్రసూత' (3. 11) అజ్ఞానజన్యమైన, అనాత్మరూప సంసారమునకు సంబంధము ఏర్పడుచున్నది, (నై. 3-2 3. 99). కాని యథార్థమున "న తు పరమార్థతః ఆత్మనోఽవిద్యయా తత్కార్యేణ వా సంబంధోఽభూదస్తి భవిష్యతి వా. (నై. 2. 114) పారమార్థికముగ ఆత్మకు, అవిద్య తత్కార్యములతో సంబంధము భూత, భవిష్యద్వర్తమాన కాలములలో గలుగుటలేదు. అయి, నను తస్యానవబోధః పిధానం. (నై. 1. 9) ఆత్మస్వరూప అజ్ఞానమే అవిద్యారూపమున నాచ్ఛాదించును. 'ప్రతిషేధాత్మకమజ్ఞానం, (3.10) జ్ఞానమును ప్రతిషేధించుటయే స్వరూపముగాగల అవిద్యఅవిద్యాజనిత అనాత్మ వస్తువునకు బూర్వకాలికమగుటచే, దాని నాశ్రయింపక, 'ఆత్మన ఏవాస్త్వజ్ఞానం, (3. 15) ఆత్మనే ఆశ్రయించియుండి, 'అజ్ఞోఽస్మి' (3. 16) నేను అజ్ఞుడనను భ్రాంతిని అత్మలో గలుగజేసి, 'దండస్యేవాప్సు వక్రతా (2.172) ఉదకమునందు, దండమునకు వక్రతలేకున్నను వక్రత గోచరించు విధాన, 'స్థాణుం చోరధియాఽలయ భీతో యద్వత్పలాయతే। బుద్ధ్యాదిభిస్తథాఽత్మానం భ్రాంతోఽధ్యారోప్య చేష్టతే॥, (1.157) స్థాణు దర్శనమున జోరబుద్ధి గలిగి, భీతుడై, పలాయన మైనట్లు, ఆత్మను బుద్ధ్యాదిరూపములతో నారోపించి, భ్రాంతుడై, అజ్ఞుడు ప్రవర్తించును. గజవిగ్రహమును.

నిజ గజముగ బాలుడు భావించి క్రీడించినట్లు (3. 154), 'వ్యోమ్ని ధూమ తుషారాభ్ర మలినానీవ దుర్ధియః। కల్పయేయుః, (3. 341) ఆకసమందు పొగను, మంచును, మేఘమును భ్రాంతులు మాలిన్యమువలె దలంచునట్లు, అభ్రయానం యథా మోహేచ్ఛశభృత్యధ్యవ స్యతి, (2. 212) మేఘ గమనమును అజ్ఞానమున. జంద్రునియం దెట్లు అధ్యసింపజేయబడుచున్నదో, ధగ్ధృత్వంచ యథా వహ్నేరయసో మన్యతేతు ధీః, (3.213) అగ్నియొక్క దాహక లక్షణము ఇనుమునకు నెట్లు మందబుద్ధులన్వయించుచుందురో, 'జలభాజనభేదేన మయూఖ స్రగ్విభేదవత్, (2. 101) జల పూర్ణ ఘటములచే నొక్క సూర్యుడనేకముగ దోచునటుల, 'మిత్రోదాసీన శత్రుత్వం యథైకస్యాన్యకల్పనాత్, (2. 103) పురుషునొక్కనికై యున్నను మిత్రత్వ, ఉదాసీనత్వ, శత్రుత్వములెట్లు సంభవించుచున్నవో, 'యాన విభ్రమాద్యద్వన్నగేషు గతికల్పనం, (2. 137) ఓడయొక్క గమనము చే నుత్పన్నమైన భ్రమచే వృక్షములందు గమనము దోచునట్లు, 'ఏవ మేతయో రాత్మానాత్మనోః స్వతః పరతః సిద్ధయార్లౌకిక రజ్జుసర్పాద్యా రోపవదవిద్యోపాశ్రయ ఏవేతరేతరాధ్యారోప ఇతి, (2. 211) ఈ ప్రకారము స్వయంప్రకాశమై పరాధీన ప్రకాశమైయున్న ఆత్మానాత్మలకు, లోకమునగల రజ్జుసర్పభ్రాంతి వలె, జరస్పరా ధ్యాసము అజ్ఞానముచే గల్పింపబడియున్నది. అందుచే అవిక్రి యస్య భోక్తృత్వం స్యాదహంబుద్ధి విభ్రమాత్, (2. 137) అవికారుడైన ఆత్మకు అహంకార జనిత భ్రాంతిచే భోక్తృత్వము కలిగెను.

'దుఃఖరాశేర్విచిత్రస్య నేయం భ్రాంతిశ్చిరంతనీ। మూలం సంసార

వృక్షస్య' (2.214) అనాదిసిద్ధమైన యీ భ్రాంతి అధ్యాసయే, దుఃఖ సముదాయముగల సంసార వృక్షమునకు మూలకారణమై యున్నది. దీని ప్రభావముచే ఆత్మ "అపశ్యన్ పశ్యతీం బుద్ధిమశృణ్వం శృణ్వతీం తథా। నిర్మలోఽవిక్రియోఽ నిచ్ఛన్ని చ్ఛంతీం చాప్యలుప్తదృక్ః" (2.151) తాను చూడనివాడై యుండియు, జూచుచున్న బుద్ధిని వీక్షించును. వినని వాడై యుండియు వినెడు బుద్ధిని ఆలకించును. నిర్మలుడై, నిర్వికారుడై యుండియు, నిశ్చయించు బుద్ధిని విలోకించును. అటుల బుద్ధి వృత్తు లన్నియు దనకు స్వతః అభావములై యున్నను, వాని బొందినట్లు గోచ రించును. అతడు సాక్షిగదా! అతనికే దుఃఖముండి, అతడు దుఃఖియై నచో, నతనికి "కస్సాక్షీ దుఃఖినోభవేత్" (2.157) సాక్షి ఎవడుండును? కాన 'దుఃఖినస్సాక్షితాయుక్తా సాక్షిణో దుఃఖితా తథా' (2.157) దుఃఖి సాక్షి యగుటగాని, సాక్షికి దుఃఖముండుటగాని అయుక్తము. అట్లు సర్వ సంగ శూన్యునియందు సర్వసంగముల దోపింపజేయునదీ అవిద్య. ఈ అవిద్య, అనాత్మ నాశ్రయించి యుండక, "తస్య హి స్వరూప మేవ హి అజ్ఞానం" (3.7) అనాత్మ అజ్ఞానస్వరూపమే కావున "ఏకాత్మా ప్రతి పత్తిర్యా స్వాత్మానుభవసంశ్రయా। సా విద్యా సంసృతేర్బీజం...... ..." (1.27) అనుభవస్వరూప పరిశుద్ధాత్మ నాశ్రయించి సంసారానర్థహేతు వగుచున్నది.

ఈ యజ్ఞానమును. "అవ్యక్తమవ్యాకృతమితీర్యతే" (పంచీకర ణము. వా. 40) బ్రహ్మము, అనంతావ్యయమై యుండియు, స్వీయ మాయాసంబంధముచే బీజమై, అవ్యాకృతమై యొప్పారుననియు (ప్రణవ

వార్త్తిక. 2). అది ఛాయవలె త్రికాళమునకు అన్యముగాక, అనన్యముగాక, అన్యానన్యమునుగాకయుండి (మానసోల్లాస. 8. 14), అనిర్వాచ్యమగుటచే మాయయనబడుచు (మానసోల్లాస. 8. 13), మన సర్వ సంసారమునకు గారణమై (మానసోల్లాస. 8. 12), సమ్యక్ జ్ఞానమున నదృశ్యమై (మానసోల్లాస. 8. 10) విరాజిల్లుచున్నది. ఆత్మలో నానాత్వదృష్టియే మిథ్య (మానసోల్లాస. 8. 9); దానితోడ బంధత్వము గలుగుచున్నది. (మానసోల్లాస 8. 2). అది అనిర్వచనీయమై సదసత్తులుగాక (మానసోల్లాస. 7. 27) రాజిల్లుచున్నదని తాత్పర్యము. కాని ఈ అవిద్య "నాసాగ్రే బదరం యథా" (నై. 3, 364) నాసికాగ్రమునందున్న రేగువండువలె సులభముగ దొలగింప సాధ్యము? అని, అవిద్యా స్వరూపమును సురేశ్వరుడు, వివిధరీతుల వివరించియున్నాడు.

## జీవుడు

ఆత్మ, అవిద్యా, వివరణమునందు కొంచెముగ, జీవస్వరూపము వ్యక్తమై యున్నది అవికారియు, నిస్సంగుడును, అనిర్వాచ్యమును, అయిన బ్రహ్మము నాబడు ఆత్మ, స్వీయ మాయాసంబంధమున జీవరూపుడై, భ్రాంతుడై, సంసారసముద్రమున బడుచున్నట్లుండునని పూర్వము గాంచియున్నాము. అట్లు ఆత్మ జీవత్వమునొంది సంసారి యగునట్లుదోచు

"సర్వస్యానర్థజాతస్య మూలమహంకార ఏవ" (2.112) ఈ యనర్థము లకు మూలహేతువు అహంకారమే యగుచున్నది. అదియే అవిద్య. ఈ అహంకారము అనాత్మాత్మలతో సంబంధించి, "దృశ్యానురక్తం తత్ ద్రష్టృ" (2.116) దృశ్యముతో సంబంధించినచో ద్రష్ట యగుచు, 'సర్వకారక క్రియా ఫల విభాగాత్మక సంసార' (2.224) మున జీవుడు బంధింపబడుచున్నాడు. ఈ అహంకారము 'చిన్నిభేయమహం వృతిః ప్రతీచీవాత్మనోన్యతః। (3·344) చిత్సదృశమై, ఆత్మవలె జీవునకు ప్రత్యగ్రూపమై యుండును.

కావున నేకుడై అనేక ఘటజలముల ననేకముగ బ్రకాశించునటు లుండు సూర్యునిచందము (2.104), బుద్ధివృత్తులతో స్వతః సంబంధము లేనివాడయ్యును సంబంధము గలుగజేసి కొనుచు (2.151), దాని నృత్య ముల వీక్షించుచు (2.125), ఓడ వేగమును వృక్షాదులకన్వయించునట్లు (2.137), ఆకసము నీలత్వాదులచే మలినమని దలంచునట్లు (3.141), స్థాణువును జోరునిగ భ్రమించి నట్లు (1.157), దేహాత్మ భ్రాంతి గలిగి జీవ త్వమును బొంది, 'బ్రాహ్మణ్యాద్యాత్మకే దేహేలాత్వా నాఽత్మేతి భావనాం। శ్రుతేః కిం కరతామేతి వాఙ్మనః కాయకర్మభిః॥' (1.119) పురుషుడు బ్రాహ్మణత్వాది ధర్మములతోగూడిన దేహమున నాత్మబుద్ధి బొంది, వాక్ మనశ్శరీరములచే నాచరింపబడు కర్మలకు దాసుడై, కర్తృత్వాదుల గలిగి, కర్మాధికారియై, విధినిషేధ బద్ధుడై (1.112), 'శుభైరాప్నోతి దేవత్వం నిషిద్ధైర్నారకీం గతిం। ఉభాభ్యాం పుణ్యపాపాభ్యాం మానుష్యం లభతేఽ

వశః॥' (1.113) పుణ్యకర్మలచేత దేవత్వమును, పాపకర్మలచేత నరకమును, మిశ్రమకర్మచే మనుష్య జన్మమును, అస్వతంత్రుడై పొందును. ఈ విధముగ, ఆబ్రహ్మస్తంబ పర్యంతమైన ఘోరమును, దుఃఖనిస్సాంద్రమును అగుసంసార సముద్రమున, ఘటీయంత్రమునగల నీతపుకుండవలె, ఊర్ధ్వాధోగమన రూపమున, ఉత్తమ మధ్యమ, అధమ సుఖదుఃఖ మోహముల సంపర్కమును బొందించు నానావిధ జన్మముల బొందుచున్నవాడై, ప్రచండ వాయు సంకులమైన మహాసముద్ర మధ్యమునగల చెంపు నౌరకాయ బుద్రవలె, పుణ్య పాప మిశ్రమ లనెడు వాయువుచే బ్రేరేపింపబడుచున్నవాడై, 'ఏవం చంక్రమ్యమాణోఽయమవిద్యా కామకర్మభిః। పాశితో జాయతే కామీమ్రియతే చాసుఖావృతః॥' (1.115) యీ ప్రకారము, అజ్ఞాన కామ కర్మలచే గట్టుబడి, కోరికలు గలవాడై జన్మించుచుండును. అనేక దుఃఖవృతమైన మరణమునొందును. అనగా జనన మరణరూప సంసార సాగరమున బరిభ్రమించుచుండును. అటుల జీవుడు, యథార్థమున బ్రహ్మముయొక్క అంశముగాని, వికారముగాని కాక కేవల బ్రహ్మమే యని విదితము (మానసోల్లాస. 3.19) మహాకాశమునగల ఘటాకాశమును బ్రత్యేకదృష్టి భ్రాంతిచే గాంచు విధాన, బ్రహ్మమునందు జీవుని విభేదమున జూచుచున్నామని యర్థము (మానసోల్లాస. 3.9).

# సృష్టి

'యథా విశుద్ధ ఆకాశే సహసైవాభ్రమండలం! భూత్వా విలీయతే తద్వదాత్మనీహాఖిలం జగత్'॥ (2. 145 ఎట్లు స్వచ్ఛ మగు ఆకాశమున శీఘ్రగతి, మేఘమండలము పుట్టుచు లయించుచున్నదో, అట్లు యీ యాత్మయందు సకల ప్రపంచము ఉత్పత్తి లయముల నొందుచున్నది. అందుచే నాకాశమునగల మేఘములవలె, నీజగత్తు వాస్తవము కానేరదు. ఆకాశమున గోచరించు ధూమ ధూళిని ఆకసమునకే యన్వయింప్ళి, ఆకాశము మలినమని భ్రాంతి గలుగునట్లు, ఆత్మయందు యీ జగతి కల్పిత ముగ నేర్పడుచున్నది (3. 341). 'ద్వైతస్యచశుక్తిరజతాది వత్, (1.7) ద్వైత ప్రపంచమునకు నధిష్ఠానముగ నాత్మ యుండ, శుక్తముపై రజతము భ్రాంతి గోచరమైనట్లు యీ సృష్టి కాననగును. అందుచేత 'దృశ్యాః శబ్దాదయః క్లుప్తాః ద్రష్టుచ బ్రహ్మ నిర్గుణం। అహం తదుభయం బిభ్రత్ భ్రాంతి మాత్మని యచ్ఛతి॥, (2. 99) శబ్దాది దృశ్యపదార్థములు కల్పితములు. ద్రష్ట యగు బ్రహ్మము నిర్గుణము. ఈ రెంటిటిని అహంకారము ధరించుచు, ప్రపంచ భ్రాంతిని గలుగజేయుచున్నది. అందుచే 'షష్ఠగోచర కల్పాస్తే విజ్ఞేయాః, (2. 241) పారమార్థికముగ నీదృశ్యముల మనో గోచర కల్పిత దృశ్యములనిమాత్రము గ్రహింపవలయును. ఈ దృశ్యములు ఆత్మకు భిన్నములుగగాని, అభిన్నములుగగాని నుండజాలవు గాన ఆత్మయందు గల్పితములు (2. 97). కాననీ ప్రపంచమంతయు 'అజ్ఞాన విజృంభితమేత్,

(2.98) అజ్ఞానకార్యమే యగుచున్నది. మరియు నది చిన్మాత్రముయొక్క ప్రతిబింబముగలిగి, అనిర్వచనీయమై, ఆత్మ నాశ్రయించి యున్న అజ్ఞానమును ఆశ్రయించియున్నది (2. 200). ఆ త్మేతరముల్లై దేహవ్యతిరిక్తములైన నీదృశ్యములకు, 'అనా త్మత్వం స్వతఃసిద్ధం, (4. 4) అనాత్మత్వము స్వతః సిద్ధమే యగును. ఆ కారణముచే 'అవగత్యాత్మనో యస్మాదాగ మాపాయి కుంభవత్। సాహంకారమిదం విశ్వం తస్మాత్తత్స్యాత్క్రాదివత్॥' (2. 195) జ్ఞానస్వరూపుడైన ఆత్మ సన్నిధానముచే అహంకార రహిత ప్రపంచము, ఘటాదికములవలె నుత్పత్తినాశముల గలిగి యుండుటచే, నీ ప్రపంచము, ఆకసమున గోచరించు కల్పిత సూక్ష్మాకారములవలె గల్పితముగ నిర్ణయింపబడినది. అందుచే 'ఏకమేతద్ధి రుగ్ జ్ఞేయం మిథ్యాసిద్ధమనాత్మకం। మోహమూలం సుదుర్బోధం ద్వైతం యుక్తిభి రాత్మనః॥, (2. 95) నీప్రకారము మిథ్యగా గాన్పించును, స్వరూపశూన్యమై, అజ్ఞానమే కారణముగాగల మన్ జ్ఞేయమైన యీ ద్వైత ప్రపంచము, ఆత్మకంటె భిన్నముగా, సయుక్తికముగా గ్రహింపవలెను. కాని 'దండావసాననిష్ఠః స్యాత్ దండ సర్పో యథాతథా। నిత్యావగతినిష్ఠం స్యాద్వాక్యాజ్జగదసంశయం॥, (4. 68) దండమున గల్పింపబడిన సర్పము, ఎట్లు అధిష్ఠాన దండరూపమునే బర్యవసానముగ గలిగియున్నదో అట్లే యీ ప్రపంచముగూడ వాక్యమువల్ల నిస్సంశయముగ నిత్యచిన్మాత్రనే అవధిగా గలిగియున్నది. అనగా అధిష్ఠాన దండ స్వరూప జ్ఞానముతో నందధ్యారోపితమైన సర్పము అదృశ్యమైనట్లు, ఆత్మాధిష్ఠానముగనున్న యీ కల్పిత జగత్తు ఆత్మ జ్ఞానము కలుగుటతో నదృశ్యమైపోవునని తాత్పర్యము.

స్వప్నదృశ్యములంతరములై యున్నను బాహ్యములవలె దోచు విధమున బాహ్య విశ్వముగూడ బాహ్యముగ స్థూలముగ నున్నట్లు దోచుచున్నది. (మానసోల్లాస. 1. 9). జాగ్రత్తునగూడ నూహాకల్పిత ప్రపంచము జాగ్రత్తులోని దేశకాలముల విస్మరింపజేయుట గలదుగదా! (మానసోల్లాస. 1.18). అట్లే యీ ప్రపంచమంతయు గల్పితమై, ఆత్మ స్వరూప విస్మృతిని గలుగజేయుచు, నన్యత్వభ్రాంతిని గలుగజేసి, దుఃఖ మూలమై యొప్పారుచున్నదని సారాంశము.

—o—

# సాధన

అతస్సర్వాశ్రమాణాం తు వాఙ్మనః కాయ కర్మభిః।
స్వనుష్ఠితైర్న ముక్తిః స్యాత్ జ్ఞానాదేవ తు సా యతః॥
(నై. 1.281)

కావున అన్ని యాశ్రమములయందు, వాఙ్మనః కాయములచే జేయబడిన కర్మలచే మోక్షము గలుగదు. జ్ఞానము చేత మాత్రమే గలుగును అని ముక్తిసాఫల్య హేతువులై, సాధన పద్ధతులలో జ్ఞానము వినా నన్యములు కావని సురేశ్వరాచార్యుని తాత్పర్యము. దాని నిరూపణార్థము అతడు నైష్కర్మ్యసిద్ధి ప్రథమాధ్యాయమున, గర్మ జ్ఞానముల ప్రత్యేకతను జర్చించి, వాని సముచ్చయ విధానముగూడ అసంభవమని సాకల్యముగ మీమాంసించి, పర్యవసానముగ పై వాక్యము నతడు పలికెను. అందు బ్రథమతః మోక్షప్రాప్తికి గర్మ సాధనము అసాధ్యమను విషయము చూచెదముగాక.

# కర్మ

'క్రియత ఇతి కర్మ' (1.63) చేయబడునది కర్మ అని వ్యుత్పత్తి. అది విధి నిషిద్ధ కర్మలకు గారణములైన (1.4) రాగద్వేషములచే జనించుచున్నది. ఆ [illegible]దులలోగూడ లోక విషయములందు గల్పింపబడిన సౌందర్యాసౌందర్యములపై నాధారపడి యుండును (1.5)

పూర్వ జన్మములందు యీ రాగాది ప్రవృత్తులచే బుట్టించిన పుణ్యపాపఫలముగ గలిగిన శరీరమే, సర్వదుఃఖములకు మూల కారణమగుచున్నది. (1, 2, 139), కావ శరీర మ్ముండునంతవరకు నీ దుఃఖస్రోత అనివార్యము. ఇట్లు సర్వవిషయ కారణమైయున్న యీ కర్మ "చతుర్విధః" (1. 63) ఉత్పత్తి, ప్రాప్తి, వికృతి. సంస్కారము అను రీతి జతుర్విధము. సాలెవాని తంతు సంయోగకర్మ వస్త్రమున కుత్పత్తిని గలుగ జేయుచున్నది. పాంథుని గమనము గ్రామ ప్రాప్తిని గలుగజేయును, క్షీరము మజ్జిగతో గలిసి దధివికారము బొందు చున్నది. దర్పణము మలిన నిర్మూలనమున సంస్కారమును గాంచుచున్నది. కర్మ యీ విధముగ జతుర్విధరూప ఫలితముల నొసంగుచున్నది. కాని "నైవం ముక్తిర్యత స్తస్మాత్కర్మ తస్యాన సాధనం (1. 139) మోక్షము యీ చతుర్విధ ఫలితాంశము కాకపోవుటచే గర్మసాధ్యము కాదు. మరియు, 'కర్మాఽజ్ఞాన సముత్థత్వాన్నాలం మోహాపనుత్తయే। సమ్యగ్ జ్ఞానం విరోధ్యస్య తామిస్రస్యాంశుమానివ।" (1. 92) కర్మ అజ్ఞానజనితమైనందున, అజ్ఞానమును నశింపజేయ సమర్థముగాదు. అందుచే అంధకారమునకు సూర్యునకువలె అజ్ఞానమునకు జ్ఞానము విరోధియగును. జ్ఞానము గురు శిష్య వ్యవహారాశ్రితముగాన నది గూడ అజ్ఞానమే యనుటకు అవకాశము శూన్యము. జ్ఞానము పరమ సత్యమైన ఆత్మను అవలంబించి అజ్ఞానమును తత్కార్యములగు కర్తృ కరణాది భేదసముదాయమును నశింపజేయ సమర్థము కదా! (1. 94). కాని కర్మ యెల్లకాలముల భేదమును ఆశ్రయించి యుండును. ఇది సద్యోఫలితమునుగూడ గ్రహింపజాలదు (1. 97)

అజ్ఞాన జన్యములైన యజ్ఞయాగాది కర్మసంచయము అజ్ఞానమునెట్లు సమయింపజాలును? (1. 29). అంతియగాక "ప్రమాణాఽసంభవాచ్చ" (1. 69) ప్రమాణము లేనందువలన మోక్షము కర్మసాధ్యముగాదు. అనగా సాధ్యసాధన భావోఽయం వచనాత్పారలౌకికః। నా శ్రౌషం మోక్షదం 'కర్మ శ్రుతేర్వక్త్రాత్కథంచన॥" (1. 70) పరలోక విషయమైన యీ కార్యకారణభావము, శాస్త్ర వాక్యములచే దెలియదగియున్నది. మోక్షము నొసంగునది కర్మయని వేదముఖమునుండి యే విధముగనైన నేను విని యుండలేదు అనియు గర్మ నిరాసమును సురేశ్వరుడు గావించెను.

## కర్మ జ్ఞాన సముచ్చయము

"సన్నిపత్య న చ జ్ఞానం కర్మజ్ఞానం నిరస్యతి। సాధ్య సాధన భావత్వాదేక కాలానవస్థితి॥" (1. 142) కార్య కారణ భావము గలవై యున్నవగుటచే, సమానకాలస్థితులు కాకుండుటచే, జ్ఞానమును అంగముగా బొందిన కర్మగాని, కర్మను అంగముగా బొందిన జ్ఞానముగాని. అజ్ఞాన నాశనము గావింపజాలదు. మరియు "బాధ్య బాధక భావాచ్చ పంచాస్యోరణ యోరివ। ఏకదేశానవస్థానాన్న సముచ్చయతా తయోః॥" (1. 144) నీ కర్మజ్ఞానముల రెండింటికి సింహమునకు గొఱ్ఱెకువలె బాధ్య బాధక భావ సంబంధము కలిగియున్నందున, రెండును ఒక చోట నుండ నవకాశము లేదు. ఎట్లన, కర్మ మిథ్యా వస్తువును విషయముగా గలిగియున్నది. జ్ఞానము సత్యవస్తు విషయముగలది. ఈ రెండింటికి అంధకార సూర్యకిరణ

సంబంధముగదా (1.146). కావున బ్రహ్మవిదునిపై నవి సామర్థ్యము లేక తన నియోజ్య స్వభావముచే యొప్పారును (1.146). కాన 'విపన్న కారక గ్రామం జ్ఞానం కర్మన ఢౌకతే' (1.166) కర్త్రాది సాధన సముదాయమును నశింపజేసిన జ్ఞానము కర్మను స్పృశింపదు. అంతియగాక 'హేతుస్వరూపకార్యాణి ప్రకాశ తమసోరివ। విరోధీని తతో నాస్తి సాంగత్యం జ్ఞానకర్మణోః॥' (1.168) జ్ఞానకర్మలయొక్క కారణము, స్వరూపము, కృత్యములు ప్రకాశ అంధకారములకువలె విరుద్ధములై యున్నవి. అందుచే జ్ఞానకర్మలకు సముచ్చయములేదు. ఈ అసంభవత్వమును మరల ప్రస్తావించి 'తమోఽంగత్వం యథా భానోరగ్నేః శీతాంగతా యథా। వారిణ శ్చోష్ణతా యద్వద్ జ్ఞాన స్యైవం క్రియాంగతా॥" (1. 204) సూర్యునకు అంధకారము అంగముగా నుండుటెట్లో అగ్నికి శీతలత్వ మంగమై యెట్లుండ గలదో, జ్ఞానమునకు గర్మ అంగముగా నుండుటయు' జ్ఞానము కర్మకు అంగముగా నుండుటయు నట్లే అని సురేశ్వరుడు కర్మ జ్ఞాన సముచ్చయవాదమును నిరసించెను.

## నిత్య నైమిత్తిక కర్మ

కాని 'న చ వయం జ్ఞాన కర్మణోఃసర్వత్రైవ సముచ్చయం ప్రత్యాచక్ష్మహే' (నై. 1. 155) మేము జ్ఞాన కర్మలకు సముచ్చయమును సర్వత్ర నిషేధింపము. నిత్యనైమిత్తిక భావములు ఎచ్చట జ్ఞానకర్మలకు గలిగియుండునో వాని నివారింప నశక్యము అని నిత్యనైమిత్తిక కర్మను

ష్ఠాన ప్రాధాన్యమును సురేశ్వరుడు ప్రస్ఫుటపరచెను. ఇట్లు నిత్య నైమిత్తిక కర్మానుష్ఠానముచే బ్రయోజనమేమి ? అను శంకను జూపించి, "శుధ్యమానం తు తచ్చిత్త మీశ్వరార్పిత కర్మభిః। వైరాగ్యం బ్రహ్మ లోకాదౌ వ్యనక్త్యథ సునిర్మలం॥" (నై. 1. 125) పరమేశ్వరుని యందు అర్పితకర్మలచేత సాధకుని చిత్తము పరిశుద్ధమై బ్రహ్మలోక సుఖవిషయము నందు నిర్మల వైరాగ్యమును బ్రకటించును. ఎట్లన రజస్తమోగుణమాలిన్య సంయుక్తమైన చిత్తము విషయాసక్తి యనెడు గాలముచే నాకర్షింపబడి శబ్దాదివిషయరూప మారణదేశముల జేర్పబడిన దగుచున్నది. అందుచే దర్పణతుల్యమగు చిత్తము, నిత్య నైమిత్తిక కర్మాచరణము అనెడు సమ్మార్జనమున రజస్తమోగుణరూప మాలిన్య రహితమై శుద్ధమై నిశ్చలమై, కడిగిన స్ఫటికమువలె బాహ్య విషయములు కారణముగల రాగ ద్వేషములచే నాకర్షింపబడక నిర్మలమై ఆత్మాసక్తి గలిగియుండును (1. 127) అట్టి సర్వకామ వివర్జిత బుద్ధి చిదాత్మ కభిముఖముగా బ్రవేశింప నిచ్చించుచుండును. అంత నా నిత్య నైమిత్తిక కర్మ లంతరించును (1. 129). అనగా 'ప్రత్యక్ ప్రవణతాం బుద్ధేః కర్మాణ్యుత్పాద్య శుద్ధితః। కృతార్థాన్యస్తమాయాంతి ప్రావృడంతే ఘనా ఇవ॥' (1. 139) నిత్య నైమిత్తిక కర్మలు బుద్ధికి బారిశుద్ధ్యమును సంపాదించి, ఆత్మయందాసక్తిని గలుగజేసి, చేయవలసిన గార్యములజేసి, వర్షర్తు పర్యవసానమున అస్త మించు మేఘములవలె నదృశ్యమగును. 'తస్మాత్ ముముక్షుభిః కార్య మాత్మజ్ఞానాభిలాషిభిః। నిత్యం నైమిత్తికం కర్మసదైవాఽత్మ విశుద్ధయే॥' (1. 132) కాన ఆత్మజ్ఞానాపేక్షగల ముముక్షువులచే నిత్య నైమిత్తిక

కర్మలు బుద్ధి శుద్ధికొరకు సదా అనుష్ఠింపబడవలయునని ముఖ్య తాత్ప ర్యము. ఎట్లన, నిత్యకర్మానుష్ఠానము వేదధర్మోత్పత్తియు, దానపాపనివృత్తియు వందుచే చిత్తశుద్ధియు గలుగును. తన్మూలమున సంసారముయొక్క అసత్యత్వము దెలియును. అంత వైరాగ్యము పుట్టొందును. దానిచే మోక్షే చ్ఛగలుగును. అంతట మోక్ష సాధనోపాయములకై విచారణము జరు గును. పిమ్మట సర్వకర్మ సన్న్యాసము గావించును. దానిచే యోగము నభ్యసించును. చిదాత్మయం దాసక్తిఅంత జనించును. దాన మహావాక్య తాత్పర్యబోధ కలుగును. దానితో నజ్ఞానము నివర్తించును. అందువలన స్వస్వరూపమునందు స్థిరత్వము సిద్ధించును (1. 135) అని సురేశ్వరుడు సాధనా సిద్ధి క్రమమును గూడ గ్రోడీకరించి వివరించెను. కావున 'పారం పర్యేణ కర్మైవం స్యాదవిద్యా నివృత్తయే। జ్ఞానవన్నావిరోధితా వ త్కర్మావిద్యాం నిరస్యతి॥" (1. 137) ఈ ప్రకారము కర్మ పరంపరా సంబంధముచే అజ్ఞానముయొక్కనివృత్తిని జేయుచున్నది. జ్ఞానముచందము కర్మ విరోధికానందున అజ్ఞానమును మాత్రము సాక్షాత్తుగ నివర్తింప చేయజాలదు అని పర్యవసాన వాక్యము.

## జ్ఞానమార్గము

'అజ్ఞాన నివృత్తేశ్చ సమ్యగ్ జ్ఞానస్వరూప లాభమాత్ర హేతు త్వాత్తదుపాదానం" (1. 11) అజ్ఞాన నివృత్తికి ఆత్మ యాథాత్మ్య జ్ఞానముయొక్క స్వరూపప్రాప్తి మాత్రమే కారణమైయున్నందున నా

సమ్యగ్ జ్ఞానమును గ్రహించుటయే యావశ్యకము. 'సిద్ధమద్వైతం ద్వైత బాధయా' (2. 227) ద్వైత మంతరింప అద్వైతసిద్ధి యను ముఖ్య తాత్ప ర్యమును గ్రహింపక బ్రాహ్మణత్వాది ధర్మములతో గూడిన దేహమున ఆత్మబుద్ధి వహించి మనోవాక్కాయకర్మల నాచరించునేని వేదదాసుడై కర్మబద్ధుడగును (1. 109) అంత విధినిషేధములమధ్య నిరికి కోవును. అట్లుగాక "దగ్ధాఖిలాధికారశ్చేద్ బ్రహ్మజ్ఞానాగ్నినామునిః। వర్తమానః శ్రుతేర్మూర్ధ్ని నైవ స్యాద్వేదకింకరః॥' (1. 111) బ్రహ్మవిచారపరుడు బ్రహ్మజ్ఞానమును వహ్నిచే సర్వకర్మాధికారముల దహించెనేని వేదము యొక్క శిరస్సునందున్నవాడై వేదమునకు దాసత్వము వహింపడు. ఆత్మ యందు స్థితమైయున్న అనాదిగత అజ్ఞానముయొక్క యథార్థ మెరింగినచో "నాసాగ్రే బదరం యథా' (3. 364) నాసాగ్ర మందున్న రేగుపండువలె అజ్ఞానము అతిసులభముగ జారి పోగలదు. అట్టి అజ్ఞాననివృత్తిహేతువైన జ్ఞానము "బలవద్ధి ప్రమాణోత్థం సమ్యగ్ జ్ఞానం న బాధ్యతే" (1 101) ప్రమాణ జనితమైన సమ్యక్ జ్ఞానము నివారింపబడదు, అనగా నది అం ప్రబలమై స్థిరమైయుండును. మరియు నది అట్టి సమీచీన జ్ఞానమై అజ్ఞాన నివృత్తికి ముఖ్యహేతువగుచున్నది (3. 239). ఈ అజ్ఞానము జ్ఞానముచే నట్లు నిరసింపబడి, "స్వాత్మబోధా ప్రదగ్ధం స్యాద్బీజం దగ్ధం యథా భవం' (4. 79) దగ్ధబీజమువలె మరల సంసారోత్పత్తికి కారణము కానేరదు. అందుచే 'అతస్సర్వానర్థ హేతు రాత్మానవబోధ ఏవ" (1. 8) సంసారరూప సర్వానర్థములకు గారణమైన అజ్ఞానము, అనగా "దుఃఖరాశే ర్విచిత్రస్య సేయం భ్రాంతిశ్చిరంతనీ। మూలం సంసారవృక్షస్య తద్బాధ

స్తత్త్వదర్శనాత్॥" (2. 214) నానావిధ దుఃఖసంచయముల సంసార వృక్షమునకు మూలకారణమై యున్నదీ అధ్యాస రూప అజ్ఞానము. అది పూర్వోక్త తత్త్వజ్ఞానముచే నశించు చున్నది. "తస్మాత్ సమ్యగ్ జ్ఞానం సుసర్వాప్తం' (1. 103) అందుచే నజ్ఞాననివారణమునకు ఆత్మజ్ఞానమే ప్రబలము. ఆసమ్యగ్ జ్ఞానమునకు 'సాధనాంతరం వాఽపేక్షతే' (1. 98) కర్మాది సాధనాంతరాపేక్ష అభావము, అది స్వాపేక్షికమై స్వతః సిద్ధమైన ఆత్మనే ఆశ్రయించియున్నది. (1. 94) దానిచేత దుఃఖనివృత్తియు బర మానందప్రాప్తియు సిద్ధించుచున్నది (1. 90).

ఆత్మజ్ఞానలాభమునకై ఆత్మవిచారణము ముఖ్యము. ఎట్లన, "ఘటాదివచ్చ దృశ్యత్వాత్ తైరేవ కరణైర్దృశేః। స్వాప్నే చానన్వయాత్ జ్ఞేయో దేహోఽనాత్మేతి సూరిభిః॥' (2. 34) ఆ ఇంద్రియములచేత చూడబడుచున్న శరీరము ఘటాదులవలె దృశ్యమై యుండుటచేతను, స్వప్నమున సంబంధము లేనిదగుటచేతను, దేహము ఆత్మకాదని బుధులచే గ్రహింప బడినది. అది సుషుప్తికాలమున నచేతనమై జాగ్రత్తున చేతన మైనట్లు వ్యవహరించుట విదితము (2. 36). అందుచే నది 'స్థూలం యుక్త్యా నిరస్యైవం నభసో నీలతామివ। దేహం సూక్ష్మం నిరాకుర్యాదతో యుక్తిభి రాత్మనః' (2. 38) ఆకాశమున నీలత్వమునువలె స్థూల దేహ మును యీ విధముగ యుక్తిచే నిరసించి యంత యుక్తులతో ఆత్మవలన సూక్ష్మ దేహమునుగూడ నిరాకరింపవలయును.

'అహం మమత్వయత్నేచ్ఛాఃనాత్మ ధర్మాఃకృశత్వవత్। కర్మత్వే నోపలభ్యత్వా దపాయత్వాచ్చ వస్త్రవత్॥' (2 40) విషయత్వముచే బొందబడుచు, గృశత్వమువలె క్షీణించుచున్నందుచే నహంకార మమకార ప్రయత్నేచ్ఛాదులు వస్త్రాదికమువలె నాత్మధర్మములు కానేరవు. అహంకారము "అహంపరిచ్ఛేదవ్యావృత్తౌ న కించి దవ్యావృత్తం। ద్వైతజాత మవశిష్యతే ద్వితీయసంబంధస్య త్మనూలత్వాత్॥" (2. 62) నివర్తింపగా ద్వైతము విశ్శేషముగ లోపించును. రెండవవస్తువుయొక్క సంబంధమునకు అహంకారమే కారణముగదా. అహం నివృత్తితో "మమధీః ప్రవిలీయతే" (2. 64) మమకారముగూడ నివర్తించుచున్నది. అహంకారము ఆత్మధర్మము కాదుగదా. అట్లైనచో సుషుప్తియందు మోక్షదశయందును అహంకారము అభావముగదా ! ఈ విధముగా అహంరూప సూక్ష్మశరీర నిరాసమునుగూడ గావింపవలెను. అంత "బోధాదేవ మసిద్ధత్వం బుద్ధ్యాదేః ప్రత్యగాత్మవః" (4. 91) జ్ఞానమువలన ప్రత్యగాత్మ కంటె భిన్నమైన అంతఃకరణాది వస్తువుయొక్క అప్రత్యక్షత్వము సిద్ధమగును. అనగా అంతఃకరణము దాని కార్యజాతమంతయు జ్ఞానోద్భవమున నంతరించును.

## మహావాక్య విచారణము

పై నుక్కడింపబడిన గమ్యమును ప్రాపిలజేసికొనుటకై మహావాక్య విచార మత్యపసరము. ఈ వేదాంత వాక్య జ్ఞానము ఒక పర్యాయము

ప్రవర్తించినమాత్రమున కర్తృకర్మాత్మక మైన అంతరించును. (1. 173). కావున 'వేదాంతా గమవాక్యాదేవ సమ్యగ్ జ్ఞానం' (1. 12) వేదాంత శాస్త్ర వాక్యజన్య జ్ఞానమువలనమాత్రమే సమ్యగ్జ్ఞానము కలుగు చున్నది. ఈ వేదాంతశాస్త్రమున నట్లు జ్ఞానోత్పత్తికి కారణములైన వాక్యములు మహావాక్యములని ప్రసిద్ధిజెంది జీవబ్రహ్మైక్య ప్రబోధకములై యొప్పారినవి 'తత్త్వమసి, అయమాత్మా బ్రహ్మ, అహంబ్రహ్మాస్మి, ప్రజ్ఞానం బ్రహ్మ' అనునవి నాలుగు కలవు. అందు సురేశ్వరుడు 'తత్త్వమసి" వాక్యమును ముఖ్యముగ స్వీకరించి 'నైష్కర్మ్యసిద్ధి" గ్రంథమున వివరించెను. మహావాక్యార్థ గ్రహణమునకై ఆత్మానాత్మ విలక్షణత్వమును గ్రహించి 'తత్త్వమసి' వాక్యద్వారమున సత్తాసత్తలకు సాక్షియై, బాహ్యాభ్యంతర పూర్ణుడై యున్న ఆత్మను మననపూర్వకముగా దెలియవలయును (4. 8). ఈ విషయ నిర్ణయమునకు రెండవ అధ్యాయమును సురేశ్వరుడువయోగించెను. మహావాక్య విచారణమునమాత్రమే ఆత్మజ్ఞానమని, 'అజ్ఞాతమమునాస్మృతే ప్రమాణం సదసీతి యే । బుభుత్సన్తోఽన్యతః కుర్యుస్తేఽక్ష్ణాపి రసవేదనం॥" (3. 384) అత్యంత నిశ్చితమైన 'తత్త్వమసి" యనువాక్య ప్రమాణము నాదరింపక నితర ప్రమాణముల నెవరు ఆత్మతత్త్వము నెరుంగ కాంక్షించె దరో వారు నేత్రముతో రసజ్ఞానమును చేయబూనినట్లగును అని నిరూపించియున్నాడు. అనగా ఏ ప్రమాణ మెట్టి జ్ఞానోత్పత్తి కవసరమో అదియే ఆ జ్ఞానమున కవసరముగాని అన్య మెట్లగును? అందుచే, తత్త్వమస్యాది వాక్యవిచారణముచేగాక నాత్మజ్ఞానమున కన్యమార్గాంతరము గాన రాదు (3. 235).

అందులకై 'తత్త్వమసి' వాక్యమునందలి "తత్పద పదార్థాభిజ్ఞస్య' (3. 32) పదపదార్థముల నెరింగినగాని వాక్యజ్ఞానము కలుగదు. ఈ వాక్యవ్యాఖ్యానమునకు మూడవ అధ్యాయమున నధికభాగమును సురేశ్వరు డుపయోగించి యున్నాడు. "తత్పదంప్రకృతార్థం స్యాత్త్వంపదం ప్రత్య గాత్మవిః నీలోత్పలవదేతాభ్యాం దుఃఖ్యనాత్మత్వ వారణే॥" (3. 38) 'తత్" పదము ప్రస్తుతమైన అర్థము గలిగియున్నది. 'త్వం" పదము జీవాత్మయంబు పర్తించును. ఇవి నీలోత్పల వాక్యమున వలె దుఃఖత్వ అనాత్మత్వముల నివారించును. ఎట్లన 'తత్" పదము అద్వితీయ బ్రహ్మ ప్రతిపాదితమైయుండ, 'త్వం' పదము ప్రత్యగాత్మను సూచించును. వీనికి "సామానాధికరణ్యం విశేషణ విశేష్యతా। లక్ష్య లక్షణసంబంధః పదార్థ ప్రత్యగాత్మనాం॥" (3. 41) పదములకు పదార్థములకు గ్రమముగ సామానాధికరణ్యము, విశేషణ విశేష్యభావ సంబంధము అగు చున్నది. ఇట్లు సామానాధికరణ్యముచే అన్యోన్యవిశేషణవిశేష్య భావసంబంధము గలవై "తత్" పదార్థమునందు కల్పిత అనాత్మత్వమును 'త్వం" పదము నివారింప, "త్వం" పదమున ప్రసక్తమైన దుఃఖత్వమును "తత్" పదము నివారించుచున్నవి. ఎట్లన నీలోత్పల దృష్టాంతము గలదు. ఆ పదమునగల నీల శబ్దము ఉత్పలమునుండి రక్తత్వాదివర్ణముల దూరమొనరింప ఉత్పల శబ్దము నీలమునందు ఉత్పలేతర ఘటాదిక వస్తుసము దాయమును వారించుచున్నది. ఇట్లు "నిర్దుఃఖిత్వం త్వమర్థస్య తదద్వైన విశేషణాత్। ప్రత్యక్త్వా చ తదర్థస్య త్వం పదే నాస్య సన్నిధేః॥" (3.72) 'త్వం' పదా

ర్థముతో విశేషింపబడినందున "త్వం" పదార్థమునకు సర్వదుఃఖరాహిత్యము సిద్ధించినది. "త్వం" పదార్థముతో తత్ పదార్థమునకు సన్నిధానము గలుగగా ఆత్మత్వము సిద్ధించినది. "తత్" పదము అప్రత్యక్ష సిద్ధమై యుండ "త్వం" పదము సంసారత్వమున భ్రమాతయై యున్నది. (3. 99, 100). ఈ విధముగ వాచ్యార్థమున తత్వం పదములు విశేష్య విశేషణ భావసంబంధమున నుండును గాని, "భేదసంసర్గరహితా వాక్యార్థ లక్షణమై వేత్యుపసంహారః" (3. 103) భేదసంసర్గశూన్యమైన వాక్యార్థము లక్షణావృత్తిచేత గలుగుచున్నదని పర్యవసానము. 'లక్షణం సర్పవద్ రజ్వాః ప్రతీచః స్యాదహం తథా। తద్బాధే నైవ వాక్యార్థం వేత్తి సోఽపి తదాశ్రయాత్ ॥, (3. 106) రజ్జువునకు సర్పమువలె ప్రత్యగాత్మకు అహంకారము లక్షణమై యున్నది. ఆ సర్పబాధచేత రజ్జుజ్ఞానము గలుగును. అట్లే ప్రత్యగాత్మ అహంకారము నాశ్రయించుటచే నా అహంకారము యొక్క నిరాసమునమాత్రమే వాక్యార్థము గోచరము. యావద్యావన్నిరస్యాయం దేహాదీన్ ప్రత్యగంచతి। తావత్తావత్తదర్థోఽపి త్వమర్థం ప్రవివక్షతి॥, (3. 109) శరీరము మొదలగు వాని నెంత నిరసించి ప్రత్యగాత్మనుబొందునో 'తత్, తత్' పదార్థముగూడ 'త్వం, త్వం' పదార్థమును ప్రవేశించును. అనగా సాధనచతుష్టయసంపన్నుడై ముముక్షువు దేహాత్మభ్రాంతిని అన్వయ వ్యతిరేకముల గ్రహురీతి దేహాదుల ననాత్మలుగనిశ్చయించుచు ప్రత్యగాత్మ నెంతెంత గ్రహించునో, అంతగ 'త్వం, పదార్థమైన ప్రత్యగాత్మ 'తత్, పదార్థమైన పరమార్థమేయని నిశ్చయించునని భావము. ప్రత్యగాత్మవిచారణమున నది పరమాత్మయేయని నిశ్చయజ్ఞానము గలుగునని యర్థము. ఇట్లు

వాక్యార్థపరిశీలనము హస్తామలకమురీతి అవ్యవహిత జ్ఞానసిద్ధిని గలుగ జేయును (3. 158). అట్టి జ్ఞానముగలిగిన వానికి నిక నెట్టి యుపాసనాదులు ననావశ్యకములు (3. 394).

## అధికారి

"సకల పురుషార్థ సమాప్తికారిణోఽస్యాత్మావబోధస్య కుతః ప్రసూతిరితి - ఉచ్యతే' (4. 126) సకల పురుషార్థ పర్యవసానమైన యీ యాత్మతత్త్వజ్ఞానముయొక్క ఉత్పత్తి దేనివలన గలుగునో తెలుప బడునని ప్రస్తావించి 'అమానిత్వాది నిష్ఠో యో యశ్చాద్వేష్టాదిసాధనః। జ్ఞానముత్పద్యతే తస్య న బహిర్ముఖచేతసః॥" (4. 127) ఏపురుషుడు అమానిత్వాది గుణములయందు నిష్ఠగలవాడై యుండునో, ఎవరు అద్వేష్టృత్వాది సాధనములు గలవాడై యుండునో, అట్టి వానికే తత్త్వ జ్ఞానము పుట్టును; బాహ్యవిషయములయం దాసక్త చిత్తునకు గలుగనేరదు అని దెలుపుచు, 'శమాదిసాధనః పశ్యేత్' (3. 50) శమన మాదిక విశిష్టగుణగణయుక్తి ఆత్మను జూడవలయునని తెలుపబడి యుండుటచే ఆత్మజ్ఞానప్రాప్తికి శమాదిక గుణముల ఆవశ్యకత నిరూపింపబడియున్నది. ఎందుచేతనన నావిరక్తస్య సంసారాన్నివివృత్సుతా భవేత్, న చాని వృత్త తృష్ణస్య పురుషస్య ముముక్షుతా॥" (2. 11) సంసార నివృత్తి హొందనివానికి ఆ సంసారము నివర్తింపవలయునను

ఇచ్ఛ జనింపదు. అట్టివానికి ముముక్షుత్వము కలుగనేరదు. అట్లు మోక్షేచ్ఛ లేనివానికి, గురుసన్నిధానము ప్రాప్తింపదు. అది లభింపకున్న వాక్యార్థ శ్రవణము ఘటిల్లదు. వాక్యార్థ జ్ఞానము కలుగనిచో అజ్ఞానము నశింపదు. అది నశింపకున్న పురుషార్థమగు మోక్షము సిద్ధింపదు. కాన పరిశుద్ధ బుద్ధుడై, వైరాగ్యసంపన్నుడై (1.121) యుండువానికి, ప్రత్యగాత్మ జ్ఞానమునందపేక్ష కలిగి (1. 128) 'బుద్ధ్యంతమపవిద్ధ్యైవం కోన్వహం స్యామితీక్షితుః। శ్రుతి స్తత్త్వమసీత్యాహ సర్వమానాతి గామినీ॥' (4.34) బుద్ధివరకు గల అనాత్మవర్గమును నిరసించి, "నేనెవడ నగుదు" నని యాలోచించువానికి, సర్వ ప్రమాణముల నతిక్రమించు 'తత్త్వమసి' అని శ్రుతి బోధించు చున్నది. అందుచే "యుష్మదర్థే పరిత్యక్తే పూర్వోక్తైర్హేతుభిః శ్రుతిః॥ వీక్షాపన్నస్య కోఽస్మీతి తత్త్వమిత్యాహ సౌహృదాత్॥"(3.51) పూర్వోక్త కారణములచే, ననాత్మ పదార్థము పరిత్యజింపబడిన పిమ్మట, 'నేనెవడను" అని పరిశీలనము చేయు చున్నవానికి 'తత్త్వమసి' అని శ్రుతి ఉపదేశించుచున్నది అని సురేశ్వరాచార్యుడు వచించుచు, గ్రంథాంతమున "ఇమం గ్రంథము పాదిత్సురమానిత్వాది సాధనః। యత్నతస్స్యాన్న దుర్వృత్తః ప్రత్యగ్ర్ధామనుగో హ్యయం॥" (4. 135) ఈ గ్రంథమును గ్రహింపదలచినవాడు ప్రయత్నపూర్వకముగా అమానిత్వాది గుణముల సాధింపవలెను. దుర్గుణోపేతుడు కాగూడదు. ఈ గ్రంథము ప్రత్యగాత్మ ననుసరించునుగదా అని తెలిపి, "నావిరక్తాయ సంసారా న్నా నిరస్తైషణాయ చ। న చాయ మవతే దేయం వేదాంతార్థ ప్రవేశనం॥" (4. 137) వేదాంతార్థ ప్రవేశము గలుగజేయుచున్న ఈ గ్రంథము, సంసారమునుండి విరక్తి జెందనివాని

కొసంగజనదు. ఈషణ సహితునకు యియ్యగూడదు. యమాదులు లేని వానికి దత్తము చేయరాదు. అంతియగాక దెలియ యత్నించినను అనధికారులకు అర్థము కాదని దెలుపుచు, జిపరివాక్యముగ 'నిరస్త సర్వ కర్మాణః ప్రత్యక్ప్రవణబుద్ధయః। నిష్కామా యతయః శాంతా జానంతీదం యథోదితం॥' (4. 139) సర్వకర్మ త్యాగము గలిగి, కామరహితులై శాంతులైన పురుషులు, దెలియజేయబడిన యీ తాత్పర్యమును గ్రహించెదరు అని సురేశ్వరాచార్యుడు, అధికారిత్వ ప్రాధాన్యమును నొక్కి వక్కాణించెను.

## సిద్ధుడు

"నాహం న చ మమాత్మత్వాత్సర్వదా నాత్మవర్జితః। భావావివ తమోఽధ్యాసోఽపన్హవశ్చ తథా మయి॥" (2.248) నేను జ్ఞానిమాత్ర స్వరూపము గలిగియున్నందున సదా అనాత్మసంబంధము లేనివాడను. సూర్యునియందు అంధకారముయొక్క ఆరోప నిరాసమువలె, నాయందు గూడ అహంకార మమకారములు లేవు. అదియే ఆత్మజ్ఞుని దృఢస్థితి. అతని సమ్యగ్ దృష్టిలో సర్వ విభేదములడగి, "నేహాత్మవిన్మదన్యోఽస్తిన మత్తోఽజ్ఞోఽస్తి కశ్చన। ఇత్యజానన్విజానాతి యః స బ్రహ్మవిదుత్తమః॥" (4 97) ఈ లోకమున నాకు వేరైనవాడు, ఆత్మజ్ఞానమున కాశ్రయమైన వాడు అన్యముగా లేదు. అటులే అజ్ఞానమున కాశ్రయమైనవాడు నాకు భిన్న

ముగా మరియొకడు లేడు. ఇట్లు తెలియనివాడై ఎవడు తెలిసికొనియుం డునో, వాడు బ్రహ్మవేత్తలలో ఉత్తముడు. అనగా అంతఃకరణాది జడ వస్తువులు జ్ఞానాజ్ఞానములకు విషయములుకాక, జ్ఞానస్వరూపుడైన ఆత్మకు విషయములగుచున్నవి. తనకు భిన్నముగ అన్య చిదాత్మలేడని నిశ్చయించు కొని, ఆత్మవృత్తిజ్ఞానమున కతీతముగను స్వయంప్రకాశముగ నెరింగిన వాడు, ఉత్తమ బ్రహ్మవేత్త యగును అని తాత్పర్యము. తనకన్యమెద్దియు లేదని స్థిరజ్ఞానము గల వాడు బ్రహ్మవేత్త యగుచున్నాడు.

ఆ స్థితిలో సర్వ సంసార కారణమైన అహంభావము నిరాకరణమై "నివృత్తాయామహంబుద్ధౌ మమధీః ప్రవిలీయతే। అహం బీజా హి సా సిద్ధ్యేత్ తమోఽభావే కుతః ఫణీ॥" (2. 64) అట్లు అహంకారము నివృత్తముకాగా, మమకారముగూడ నివర్తించుచున్నది. మమకార మహంకారమే కారణముగా గలిగియు డునుగదా ! అంత "అహంవరిచ్ఛేద వ్యావృత్తౌ వ కించి దవ్యావృత్తం। ద్వైతజాత మవశిష్యతే ద్వితీయ సంబం ధ్యస్య తన్మూలత్వాత్॥" (2. 62 అహంకారము అంతరింప, ద్వైత సమూహమంతయు నిశ్శేషముగ నంతరించును. రెండవ వస్తు సంబంధము నకు అహంకారమే కారణముగదా ! అనగా "బోధాదేవమసిద్ధత్వం బుద్ధ్యాదేః" ప్రత్యగాత్మనః' (4. 91) సమ్యగ్ జ్ఞానమువలన ప్రత్య గాత్మకంటె భిన్నమైన అంతఃకరణాది సర్వము అంతరించునని తాత్పర్యము.

అట్టి ఆత్మజ్ఞానికి, ఆత్మజ్ఞాన రహితునకుగల విధి నిషేధ శాస్త్ర మదృశ్యమై, అనగా ప్రాప్తప్రాప్తవ్య, అప్రాప్త ప్రాప్తవ్య, పరిహృత

పరిహార్య, అపరిహృత పరిహార్యము లనబడు చతుర్విధ ప్రవృత్తు లతనిలో సదృశ్యములగును. కంఠమున హారముండియు లేదను భ్రాంతిచే దాని బొందగోరుట ప్రాప్త ప్రాప్తవ్య ప్రవృత్తి. తనకు హారము లేకుండుటచే నార్జింప యత్నించుట అప్రాప్తప్రాప్తవ్య ప్రవృత్తి యగును. ఉన్నదాని నివారించుట అనగా వెంటనంటు సర్పమును పరిహరింప నిచ్ఛ అపరిహృత పరిహార్య ప్రవృత్తి యనబడును. భ్రాంతి సర్పమును నివారింప యత్నించుట పరిహృత పరిహార్య ప్రవృత్తి నాబడును. ఈ విధమైన నాలుగు ప్రవృత్తులా ఆత్మజ్ఞానియందుండ నేరవు.

మరియు నతనికి "త్వద్వేష్ట్ర త్వాదయోగుణాః। అయత్నతో భవంత్యస్య న తు సాధనరూపిణః॥' (4. 133) రాగద్వేషాది గుణములు సాధనరూపమున కాక, సహజముగ లేనివై యొప్పారును. పూర్వోక్త బంధము "అహం" "మమ"రూపములే అదృశ్యముకాగా, నింక రాగద్వేషాదుల కలిమి అసంభవము గదా (4. 89). 'యథా ప్రాజ్ఞేత థైవాయం స్వప్న జాగరి తాంతయోః। ప్రశ్యన్నవ్యవికారిత్వాద్ద్వితీయం నైవపశ్యతి॥" (4. 88) సుషుప్తి యందువలె, స్వప్నజాగ్రత్ కాలమునగూడ నతడు వికారరహితుడై, చూపుగలిగియు ద్వైత దృష్టిలేక నుండును. అట్లుకాక వికారియై దుఃఖాదుల బొందినచో సాక్షిత్వ మభావముగదా! ఆత్మజ్ఞానికి ఆత్మలక్షణమైన సాక్షిత్వము గలదు గదా (2. 159). అజ్ఞానము జ్ఞానము ను బాధింపనేరదు (1. 107). మరియు నతడు "అథాధ్యాత్మం పున ర్యాయాదాశ్రితో మూఢతాం భజేత్॥" (1. 193) దేహాభిమానమును

దిరిగి పొందెనేని, అజ్ఞానము నాశ్రయించినవాడగును. కర్మల నాచరించును. అజ్ఞానిని ఎవడు నివారింపగలడు! కావున సంపూర్ణజ్ఞానికి, "రిపౌ బంధౌ స్వదేహే చ సమైకాత్మ్యం ప్రపశ్యతః। వివేకినః కుతః కోపః స్వదేహావయవేష్వివ॥" (2.32) శత్రు బంధువులయొక్కయు, స్వదేహమునందును నిర్విశేషాత్మ యొకడేగలడని చూచు వివేకజ్ఞానికి, కోపమునకు అవకాశమెచ్చటిది? తన దేహావయవములందు కోపము కలుగునా? వాడు స్వప్న దృశ్యము లనువలె, గురుశాస్త్రాది వ్యవహారమును గూడ వీక్షించును. అనగా నవి అజ్ఞానదశలో నుపయుక్తములేగాని, జ్ఞానావస్థయందు గాదని ఔదాసీన్యము నొందును. అందుచేత బూర్వోక్తవిధముగ అమానిత్వాది గుణగణశోభితుడై, జ్ఞానియై, సర్వమాత్మవస్తువుగా గాంచు ఆత్మ జ్ఞానికి నెట్లు యథేష్టాచరణము సంభవము? (4. 124). "యో హి యత్ర విరక్తః స్యాన్నాసౌ తస్మై ప్రవర్తతే। లోకత్రయ విరక్తత్వాన్ముముక్షుః కిమితీహతే॥" (4. 121) ఎవ్వడు దేనియందు విరక్తుడై యుండెనో వాడు దాని కొరకు బ్రవర్తింపడు గదా! మోక్షేచ్ఛ గలవాడు త్రిలోకములయందును విరక్తుడై యున్నందున దేనిని గోరును? దేహాభిమాన మైనను, అజ్ఞానసంబంధమగుటచే నాత్మజ్ఞానికి అది కలుగ నేరదు (1. 191). అతనికి బ్రవృత్తి నివృత్తులు రెండు నుండవు (4. 100). వానికి శేషశేషిభావము (4. 104) నాబడు శాస్త్రావశ్యకత, అనగా విధి నిషేధరూప శాస్త్రము అనావశ్యకము. అతడు కృతకృత్యుడగుటచే జేయవలసిన కృత్యమావంతయు నుండ

జాలదు (4. 108). అట్టిచో వాడు దేని నుపాసించును? కాన అతనికి ఉపాసనావశ్యకతయు నభావము (3. 394).

కర్మజ్ఞానమునకు మేష సింహ సంబంధము కావున (1. 144), అంధ ప్రకాశ సంబంధము అగుటచే (1. 146), కర్మజ్ఞానసన్నిధానమున నుండజాలని దగుటచే, జ్ఞానికి గర్మ సంబంధముండజాలదు. అతనికి దేహాత్మభావమే లేదుగదా! (1. 152). అచట కర్మలు నిత్యనైమిత్తికములు గూడ "అస్తమాయాంతి ప్రావృడంతే ఘనా ఇవ' (1. 130) వర్షర్తువు పిమ్మట మేఘములదృశ్యమగునట్లు అంతరించును. అతనికి "కర్మణి కో హేతుః సర్వానన్యత్వదర్శినః' (1. 185) సర్వమును ఆత్మాభిన్నముగ జూచువానికి, గర్మయందు నిమిత్తమేమి ? అందుచే సూర్యునిలో నంధకార ముండనేరనట్లు, అగ్నిలో శీతలత్వముండజాలనిరీతి, అతనిలో గర్మ యుండనేరదు (1. 204). "తస్మాత్తదపనుత్తౌ ద్వైతానర్థాభావః" (3. 30) కావ అజ్ఞాన నివృత్తముకాగా, ద్వైత ప్రపంచమే నిరాకరింప బడుటచే, నాత్మజ్ఞానికి ద్వైతప్రపంచమే యుండజాలదని తాత్పర్యము.

## ప్రారబ్ధము

కావి, "నివృత్తసర్పః సర్పోత్థం యథా కంపం న ముంచతి। విధ్వస్తాఖిలమోహోఽపి మోహకార్యం తథాత్మవిత్॥" (4. 110) సర్ప భ్రాంతి నశించినను, సర్పమువలన గలిగిన కంపనాదు నెట్లు గలనో, అట్లు

తత్త్వవేత్త సకల అజ్ఞాన నివృత్తి గలిగినను, అజ్ఞానకార్యమును వీడ జాలడు. అయినను అతడు యథేష్టాచరణము గలిగియుండక (4. 114), ఆరంభింపబడిన గర్మల నవరోధింప సాధ్యముగాని, 'తత్ర యాన్యుప భుక్తఫలాన్యనారబ్ధ ఫలాని తానీశ్వరేణాపి కేనచిదపి న శక్యంతే పరిత్యక్తుం' (1. 211) వానిలో నేకర్మ లారంభింపబడని ఫలము కలవి యగునో అవి ఈశ్వరునిచేగాని, మరి యితరులచేగాని పరిత్యజింపబడజాలవు గనుక, నా ఆత్మవిదుడు ప్రారబ్ధకర్మ బద్ధుడై వ్యవహరించును. వాని ద్యజించుట అశక్యము (1. 212). అయినను, అందు బద్ధుడై అనురక్తుడై ప్రవర్తింప కుండుట గమనార్హము. అతనికి శరీరము 'ప్రతిభాసశ్శరీరస్య తదాఽప్రారబ్ధ సంక్షయాత్' (పంచీకరణ వార్తిక. 58) ప్రారబ్ధ క్షయమువరకు ఆభాసము వలె భాసించును. 'ప్రారబ్ధభోగశేషస్య సంక్షయే తదనంతరం॥ అవిద్యా తిమిరాతీతం సర్వాభాస వివర్జితం। చైతన్యమమలం శుద్ధం మనోవాచామ గోచరం॥ వాచ్యవాచక నిర్ముక్తం హేయోపాదేయవర్జితం। ప్రజ్ఞానఘన మానందం వైష్ణవం పదమశ్నుతే॥' (62) ఈ జీవన్ముక్తుడు, ప్రారబ్ధ శేషము భోగక్షయమైన పిమ్మట, దేహపాతానంతరము విదేహముక్తుడుగ అవిద్య యను చీకటిదాటి, సమస్త శారీరక భ్రమలు నశించి, మలరహితమగు నిష్కళమగు, శుద్ధమగు, వాఙ్మనస్సులకతీతమగు, అభిధాన అభిధేయ రహితమగు, నిష్క్రియమగు, ప్రజ్ఞానమాత్రమగు, పరమానందమగు, సర్వ వ్యాపనమగు విష్ణుస్థానమును బొందుచున్నాడు.

## ముక్తి

ముక్తి యనుటతో విడివడుట యగుటచే 'అతః తస్యాత్యంతోచ్ఛిత్తౌ అశేషపురుషార్థ పరిసమాప్తిః' (1.10) అజ్ఞాన నివృత్తి నిశ్శేషముగ గలుగ సకల పురుషార్థసిద్ధి గలుగునను చందము 'అజ్ఞానహీనమాత్రత్వాత్ ముక్తిః' (1. 64) అజ్ఞాన వినాశనమే ముక్తి యగుచున్నది. ముక్తి నొందిన పురుషుడు మరల పునరావృత్తిరూప జన్మపరంపరల బొందడని, 'న చ కైవల్యాత్పునరుత్థానం న్యాయ్యం' (3. 201) మోక్షమునుండి మరల జన్మించుట అయుక్తము అని తెలుపబడియున్నది, అజ్ఞాన వశమున దేహేంద్రియాదికముతో నహంభావమునను, పుత్ర మిత్ర కళత్ర పశు పక్షి వస్తు వాహనాదులతో మమకార భావమునను సంసారమును బెంచి, అందరికి సుఖదుఃఖ పరంపరాఘాతముల బీడింపబడి, క్రమముగ దోషమును గ్రహించి, అమానిత్వాది సద్గుణ సంపాదనమును గావించి, సద్గురూప దేశ భాగ్యమున మహావాక్యశ్రవణమాచరించి, జ్ఞానియై, ప్రారబ్ధశేషమున జీవన్ముక్తుడై, ప్రారబ్ధభోగావసానమున విదేహముక్తి నార్జించి బ్రహ్మాభేద స్థితి నుండుటయే ముక్తి యగుచున్నది. మోక్షప్రాప్తి నొందినవాడు సాక్షాద్బ్రహ్మమై యుండుటచే. నతడిక నీ సంసార చక్రమునకెట్టి సంబంధములేక నతీతుడై, పరబ్రహ్మమై సర్వాతీతుడై యుండును.

## సమాప్తి

ఈ విధముగ సురేశ్వరాచార్యుడు, మండన, విశ్వరూపాచార్య స్థితిలో ప్రబల మీ మాంసావలంబకుడై యుండి, కర్మ మార్గానువర్తియై

యుండియు, శంకరభగవత్పాదాచార్య కృపా విశేషమున బరమార్థతత్త్వ
మును గ్రహించి, వ్యావహారికరూప కర్మమార్గమును ద్యజించి, అద్వైతియై
ఆ యద్వైత సిద్ధాంత తాత్పర్యమును వార్తికాది గ్రంథములనేగాక, ముఖ్య
ప్రకరణ గ్రంథమైన నైష్కర్మ్యసిద్ధిలో నెట్లు వివరించెనో చూచియున్నా
రము. ఇందు సిద్ధాంతచర్చకంటె సాధన విచారమే యెక్కువ గోచరము.
బ్రహ్మవిచారము, సృష్టివిధానము, ముక్తి స్థితి మొదలగు ముఖ్య సిద్ధాంత
విషయములనిందు అతడు ప్రస్తావింపక, దాను పూర్వమాశ్రయించియుండిన
కర్మమార్గ నిష్ప్రయోజకత్వమును నిరూపించి, మహావాక్యార్థ విచారరూప
అద్వైత విచారమార్గమే సమ్మతముగ జర్చించి, నిరూపించి యుండుట గమ
నార్హము. అతనికి నింక నధికమైన అవకాశ మొసంగి యుండినచో, నెట్టి
యుద్గ్రంథమును నిర్మించియుండెడివాడో అని దోచెడిని. శ్రీ శంకర
భగవత్పాదాచార్య చరణ సేవావకాశ పూర్వము, శ్రీ కుమారిలభట్టాచార్య
శిష్యరత్నమై, మీమాంసాశాస్త్ర పాండిత్యము నామూలాగ్రము సంపాదించి,
గురువునకు మించిన శిష్యుడో యనునటుల దేశవ్యాప్త ప్రఖ్యాతి నార్జించి
నాటి పండితలోకమునకేగాక దేశపాలకులైన రాజేంద్రులకుగూడ గురు
వర్యుడై యాకర్షించి, ఆదర్శమూర్తియై విరాజిల్లు మండనుని అసాధారణ
ప్రజ్ఞావిశేషమును ప్రస్ఫుటపరచును. అంత, శ్రీ శంకరగురు విద్యానుభవ
వైభవమును దిలకించి, పరీక్షించి, గ్రహించి, అనుసరించి, అనుభవించి,
అద్వైతాచార్యులలో మేటి యని కీర్తి గడించి, సద్గురు ప్రేమాను
గ్రహములబొంది, ప్రముఖ గ్రంథకర్త యగుటయేగాక, శృంగేరీ పీఠాధి

పత్యమునుగూడ గురుదేవు సన్నిధానమున బొందియుండుటయు, నా అద్వితీయ విశాలతత్త్వ సంశోధితుని యోగ్యతకు ఎనలేని భూషణము. అట్లు అతుల ప్రశస్త విరాజితుడు కావుటచేత, శృంగేరీ పీఠమునకు మాత్రము అతడు ఆచార్యుడైనట్లు చరిత్ర పలుకుచుండ, నితర ద్వారకాది పీఠములు యితని తమ తమ పీఠాధిపతి యని జెప్పికొనినమాత్రమున తమ పీఠములకు అత్యధికతర యశము సంప్రాప్తముగ విశ్వసించి, కాలాంతరమున నతని దమ పీఠాధిపతిగ జిత్రించుకొని ఆనందించినవి. మరియు, నాతని శ్రీ శంకరుడు కేవలమొక పీఠమునకుమాత్ర మధిపతిగ నుంపక, సకల పీఠాధీశ్వరునిగ నెలకొల్పెననియు గొందరు, మన శ్రీ సురేశ్వరాచార్యుని అకుంఠిత ప్రతిభావిశేషముల వేనోళ్ళ గొనియాడి, అతని మానవాతీతునిగ నొనర్చియుండిరి. కాన నీ పండితవరేణ్యుని సర్వతోముఖ ప్రజ్ఞా, పాండిత్య, ప్రతిభా, యౌన్నత్యముల సాధారణములనుట సుప్రత్యక్షము, ప్రస్ఫుటము, సర్వాదర్శము. అది నిస్సందేహము. అట్టి మహానుభావునికి, శాస్త్రార్థ్యయన శీలురు ఎల్లరు చేమోడ్చి, ధన్యత నొందెదరుగాక! అట్టి సమరస గుణాలంకృత పండితగణమునకు గన్నతల్లి యగు మన భారతాంబ చరణకమలములకు, సహస్రాధిక సాష్టాంగ దండప్రణామము లర్పించెదముగాక.

— • —

# శ్రీ విద్యారణ్యస్వామి
## జీవితసంగ్రహము

So great was the impression that Vidyaranya made on his contemporaries and two or three generations, that in these legends the activities and work of more individuals than one, who were senior or junior contemporaries of Vidyaranya, have come to be attributed to him. 54 విద్యారణ్యుడు తన సమకాలీనుల పైనను తర్వాత రెండు మూడు తరములవారి పైనను అసామాన్య ప్రభావమును గలుగజేసెను. అందుచే నతనికి పిన్న పెద్దలగు పనేక వ్యక్తుల కార్య సంచయము ఆతని చరితాగాథలలో జేర్పబడి, ఆతని కన్వయింపబడి యున్నవి. ఆతని అసాధారణ ప్రఖ్యాతిచే నాటి సాహిత్య రాజకీయ గాథలనేకములు ఆతనికి మేళవింపబడి యున్నవి. తన అనిదంపూర్వ విద్యావైదుష్యముచేతను, అతుల ప్రజ్ఞావైశారద్యముచేతను, అద్భుత రాజకీయ చాతుర్యముచేతను, నాటి దేశీయ, సాంఘిక, రాజకీయ, సాహిత్య, వైజ్ఞానిక, ఆధ్యాత్మిక రంగముల నెల్లెడల దానై, అత్యద్భుత సమన్వయ మూర్తియై విరాజిల్లిన యీ విద్యారణ్య బిరుదాలంకృత మహావ్యక్తి ఎవరు? ఆతడు ప్రవేశింపని, జయశ్రీ గాంచని వ్యవస్థయే నాడు లేదా? ఆతని అపార, మహాజ్యోతిస్సునకు ముందు పిన్నలమాట అటులుండ, తనకాదర్శ ప్రాయులైన జేష్ఠులుగూడ కళావిహీనత నొంది అందు

54. Prof. G. S. Ghurye : Indian Sadhus,

లయించిరా ? ఆ యపూర్వ మహాత్మునిగూర్చి యిసుమంత గ్రహింప యత్నించెదము గాక !

'శ్రీమతీ జననీ యస్య సుకీర్తిర్మాయణః పితా। సాయణో యోగ (సోమ) నాథశ్చ మనోబుద్ధీ సహోదరౌ। యస్య బోధాయనం సూత్రం శాఖా యస్య చ యాజుషి। భారద్వాజం యస్య గోత్రం సర్వజ్ఞస్స హి మాధవః' ఎవనికి శ్రీమతి తల్లియు, కీర్తిమంతుడగు మాయణుడు తండ్రియో, సాయణ సోమనాధులు మనోబుద్ధులై సోదరులో ఎవనికి బోధాయన సూత్రము యజుర్వేదీయ శాఖయు నన్వయమో, భారద్వాజ గోత్రము ఎవనికి గలదో, వాడే సర్వజ్ఞుడైన మాధవుడు అని తన పరాశరస్మృతి వ్యాఖ్యానమున, దన పుట్టుపూర్వోత్తరములను మాధవుడు వివరించుకొనియున్నాడు. అంతియగాక, దాను సర్వజ్ఞుడ ననిగూడ సగర్వముగ జెప్పుకొనియుండుట విదితము. ఈతని జననీ జనకుల విషయమున, బండితలోకమున అభిప్రాయ భేదములు గానరావు కృష్ణయజుశ్శాఖ యని కోట వేంకటాచల మహాశయుని వచనము. కాని జననకాలమున గొంత భావ వ్యత్యాసము గోచరము. కలిశకము 4382 సంవత్సర ప్రాంతముల ననగా, గ్రీ. శ. 1280 సంవత్సరమున మాయణు నకు మాధవుడుద్భవించినట్లు వేంకటాచల పండితుని అభిప్రాయము కాగా, 55 క్రీ. శ. 1301 సంవత్సరము అని విమర్శక కోన వేంకటరాయ శర్మ భావముగ నున్నది. 56 'వేదాంత పంచదశి పీఠికా' కర్తయైన పండిత కామర్షి వెంకటసుబ్బయ్య అభిప్రాయమున, క్రీ. శ. 1267 సంవత్సరము జననముగ తెలుపబడి, అతడు 120 వర్షములవరకు జీవించెనని విదితమగుచున్నది. 57 సుమారు క్రీ. శ. 1350 సంవత్స రము ప్రాంతమువాడని దాను గుప్త వచనము. 58

అంతియగాక కర్ణాటక దేశమున, తుంగభద్రానదీ తీరమున, రామాయణకాలమున, గిష్కింధ యని ప్రశస్తమైన విజయపురమనియు విజయనగరమనియు పేరొందిన పట్నము మాధవుని జన్మభూమిగ వెంకటసుబ్బయాఖ్యుడు వచింప, విద్యారణ్యుడు తెలుగు దేశమునగల ములకనాడు వాడనియు, నది నెల్లూరు, కడప, మండలములనియు దెలుపుచు, వేద భాష్యకర్తయైన సాయణాచార్యునికి సన్మానపూర్వకముగ దత్తము చేయబడిన అగ్రహారము, కావలి ప్రాంతమునగల బ్రాహ్మణ కాక అగ్రహారమనియు, నదియు నెల్లూరు మండలముననే గలదనియు, మరియు నీ సాయణాచార్యపండితుడు సంగభూపాలుని ప్రధానమంత్రి యగుటయు, నా పృద్వీశుని పట్టణము మంగళ నిలయము నాబడి, నేడు గుంటూరు మండలమునగల నరసరాయనిపేటకు దగ్గరగల సంతమాగులూరనియు వచించి మాధవుని సంబంధమంతయు నెల్లూరు మండలమున గలదని వేంకటరాయశర్మ భావించెను. కాని కోట వేంకటాచల మహాశయుడు, విద్యారణ్యుని గృష్ణాతీర నివాసిగా వచించి యున్నాడు. 59 నరసరాయనిపేట ప్రాంతముగూడ కృష్ణాతీరమే యగుట, పై యభిప్రాయములు సమన్వయింపును. మరియు 'సాయణ' శబ్దము సోమనాధునితో జేర్చి మాధవుని సోదరుడుగా నధికసంఖ్యాక పండితులు అన్వయింప, వేంకటాచల పండితుడు, ఆ పదమును మాధవుని యింటిపేరుగ నన్వయించి, సాయన మాయనార్యునికి సోమనాథ మాధవులను ఇరువురు పుత్రులుగ దెలిపి

యున్నాడు. 60 ఇది ప్రామాణికము కాదేమో! మాధవునకు, సాయణ సోమనాధులను యిరువురు సోదరులని ప్రతీతి. తండ్రి మాయ ణుడు కంపభూపతికి మంత్రియై యొప్పార, మాధవవిద్యారణ్యుడు హరి హరబుక్కరాయలులకు బ్రగాన మంత్రియై చెల్వొంద, సాయణపండి తుడుగూడ సంగమరాజునకు మంత్రిగనుండెను. అంతియగాక బూర్వోక్త మైసూరు దానశాసనమున, వేదభాష్యకర్త నామము ప్రత్యేకముగ జిత్రింప బడియున్నది. అటులే, వేదభాష్య రచనమునకు బుక్కరాయ మహీపతి ప్రోత్సహింప, మాధవవిద్యారణ్యుడు. తన సోదరుడైన సాయణా చార్యుడే దానికి సమర్థుడు అని తెలిపి, ప్రభువుచే నాహ్వానింపజేసినప్పుడు "సహ్యేహ" నృపతిం రాజన్ సాయణార్యో మమానుజః। సర్వం వేత్యేష వేదానాం వాఖ్యాతృత్వే నియుజ్యతాం॥, తాను అ కార్యమునకు దగనని దెలిపి, తన సోదరుడైన సాయణాచార్యుని బిలిపించి, అతడు సర్వ వేదార్థములనెరింగి యుండుటచే నతని వియోగింప గోరెను ఇచ్చట తన సోదరుడుగ సాయణుని, మాధవుడు తెలుపుకొనెను. దాని ననుసరించియే బాల్యేపి ప్రతిబోధయన్య విహితం శ్రీ సంగమక్ష్మాపతిం। బోధైకాస్పద సాయణార్య భగవద్వ్యాసావతారస్వయం॥ అను వాక్యముఖమున, సాయ ణుడు కేవలము వ్యాసావతారమని కొనియాడబడి, మాధవ సోదరుడుగ తెలుపబడియున్నాడు. మరియు 'శ్రీపూర్వదక్షిణ పశ్చిమ సముద్రాధీశ్వర' శ్రీ కంపరాజసుత శ్రీసంగమ మహారాజ మహామంత్రిణా మాయనసుతేన మాధవ సహోదరేణ సాయణాచార్యేణ విరచితాయాం మాధవీయాం

ధాతువృత్తౌ' అని గద్యలో, ధా సంగమమహారాజ మంత్రిగను, మాయన సుతునిగను, మాధవాచార్య సహోదరుడుగను, తాను సాయనాచార్యునిగను 'ధాతువృత్తి' కర్త తన విశేషముల తెలుపుకొనెను. ఈ వచనమునగూడ సాయణ శబ్దము మాధవాచార్యుని సోదరునిగనే అన్వయింపబడుచున్నది. కాన మాధవునకు సాయన, భోగనాథులను యిర్వురు సోదరులు గలరనియే నిశ్చయము. మైసూరు శాసనమున, సాయణాచార్యుడు గరణకమ్మ నియోగులనియు దెలియుచున్నది. కాన మాధవుడు కరణకమ్మ నియోగి బ్రాహ్మణుడని వ్యక్తము.

'పారం గతం సకలదర్శనసాగరాణా మాత్మోపకార చరితార్థి నా సర్వలోకం। శ్రీశార్ఙ్గపాణితనయం నిఖిలాగమజ్ఞం సర్వజ్ఞవిష్ణు గురుమన్వహ మాశ్రయేహం॥' అను విద్యారణ్యుని 'సర్వదర్శన సంగ్రహ' వాక్యము రీతి, బాల్యమున మాధవుడు, సర్వజ్ఞవిష్ణు సన్నిధానమున శాస్త్రాధ్యయనము గావించియుండును. ఈ సర్వజ్ఞవిష్ణువే సన్న్యసించిన పిమ్మట విద్యాతీర్థుడై శృంగగిరి పీఠాధ్యక్షుడయ్యెను. అందుచేతనే మరల విద్యారణ్యుడు, "వివరణ ప్రమేయ సంగ్రహము" న "యద్విద్యా తీర్థ గురవే శుశ్రూషాన్యానరోచతే। తస్మాత్ అస్త్యేషా భక్తి యుక్తా శ్రీవిద్యా తీర్థపాదయోః సేవా॥" (9. 35) గురువర్యుడైన విద్యాతీర్థునకు ఇతర సేవావిధానము మోదకారణము కాకుండుటచే, భక్తియుక్తమైన యీ రచనము శ్రీ విద్యాతీర్థుని పాదసేవారూపము నొందుగాక అని యర్పించి యుండెనని. కొందరి తాత్పర్యము. విద్యాతీర్థ సన్నిధానమున శంకరానంద, వేదాంత దేశిక, మాధవాచార్య, సాయణాచార్యులు అంతేవాసులు.

నుండి. విద్యాధ్యయనము గావించి యుండిరనియు వేంకటరాయశర్మ తాత్పర్యము. శైవాచార్యుని యనంతరము, శంకరరానందుడు కామకోటి పీఠాధ్యక్షత వహింప, భారతీతీర్థుడు శృంగేరికి విద్యాతీర్థునిచే నియమింప బడినట్లును అతని వచనము. మాధవుగంటె విద్యాతీర్థ, శంకరానందులు, జ్యేష్ఠులగుటచే, మాధవుడు, యీ మువ్వురి దగ్గర విద్య "నేర్చియుండు ననియు, వందుచే శంకరానందుడు గురుస్థానమునసుండ, భారతీతీర్థుడు వరమ గురువగు ననియు, పరమేష్ఠి గురుస్థానము విద్యాతీర్థ దలంకరించి యుండుననీ పండిత శర్మ భావము. పై విషయములన్నియు వివాదగ్రస్త ములై యున్నవి. ఆ విషయము ముందు గాంచెదముగాక!

మాధవుడు, సర్వజ్ఞవిష్ణు చరణ సన్నిధి, తన అసాధారణ ప్రజ్ఞా పారీణతచే నల్పకాలమున, వేదవేదాంగ, సకల శాస్త్రముల పాండితిని గడించి, గృహముజేరి, జననీజనకుల కోరిక ననుసరించి, వాతాపి పుర మని ఆ కాలమున ప్రసిద్ధి వడసియుండిన నేటి బాదామి నగరమున కధి పతియైన చాళుక్య రాజునకు మంత్రియైన వీతి హోత్రుని పుత్రిక "వీతి హోత్రి" అను కన్యను వివాహమాడి గృహస్థాశ్రమమును స్వీకరించెను. నాటికి మాధవునకు 40, 59 వత్సరముల ప్రాయముండునని కామర్షివారి భావము. కాని 33 వ సంవత్సర ప్రాయమునకే మాధవుడు సన్న్యసించి, విద్యారణ్యులైనట్లు కొందరి అభిప్రాయము. కామర్షి వెంకట సుబ్బ యార్యుని తలంపుననుసరించి మాధవుడు, క్రీ. శ. 1267లో జనించుటచే నితరులతోబాటు నితడును మాధవుని సన్న్యాసకాలము 1331 అని నిశ్చయించి యుండుటచే, మాధవు ప్రాయగణమున నీ 31 వర్షముల

తారతమ్యము గోచరము. అతని లెక్కకు మాధవుడు 64 వ ఏట సన్న్యసించినట్లగుచున్నది.

అంత మాధవుడు, తన దారిద్ర్యభారముచే బాధపడుచు, తన్నివారణార్థమై హంపీక్షేత్రమునగల భువనేశ్వరీ ఆలయమున గల లక్ష్మీ ప్రసన్నము గాంక్షించి, ఘోర తపమాచరించెనని గాథ. కొంతకాలమునకు లక్ష్మి సాక్షాత్కరించి, అతని మనోరథము యీ జన్మలోగాక, పరజన్మలో సాధ్యమగునని వచించెనట. విద్యాసంపన్నుడగు మాధవుడు ఖిన్నుడై, వెంటనే యోచనాగ్రస్తుడై, ఆ దేవదేవిని సంబోధించి, యత్యాశ్రమ స్వీకారమున నీ జన్మ యంతరించి, పరజన్మప్రాప్తి నొందినట్లగునను శాస్త్రవచనముల నాధారముగ గైకొని, తురీయాశ్రమమును గైకొనిన తన యీప్సితమీడేరునుగదా యని ప్రశ్నించెనట. కాని యతికి, ఐహిక ధన సంపదగాక, జ్ఞానధనము ప్రధానమని విద్వాంసుడు గుర్తించి, ప్రథమతః తపోకారణమైన ధనాపేక్షను వదలి, శృంగగిరి నాశ్రయించి, యట శిష్యులకు అధ్యాత్మ విద్యాధనమును దా బంచి యిడునట్లు లక్ష్మీదేవిని గోరెనట కాని, మాధవుని ప్రథమ సంకల్పమునకే లక్ష్మీదేవి ప్రాధాన్యము నొసంగి, సన్న్యాసివైనను ఐశ్వర్యములతో దులతూగెదవుగాక యని వరమిడెనట. అందుల కాతడు, సదా ఐశ్వర్య మవసరము లేదనియు, ప్రజానీకమున కెప్పుడవసరమో అపుడు తా గోరెదననియు, ఆ సమయమున సంపదల నొసంగ మాధవుడు [illegible]ర్థింప, లక్ష్మియు వల్లె యని యంతర్థానమయ్యెనట ఈ వరము న[illegible]రించి చే, నొక కాలమున, విద్యానగరమున దారిద్ర్యము బాధించు[illegible]. చింతించి, విద్యారణ్య యతి లక్ష్మిని ప్రార్థింపనామె,

దేశమున సువర్ణ వృష్టిని గురిపించినట్లు గాధ. కాని యిది ఎంతవరకు సత్యమో దురూహ్యము. మాధవుడు సన్న్యసించియు, రాజవర్యులకు ప్రధానామాత్యపదవి స్వీకరించి, సకలైశ్వర్యముల దులదూగుచు నుండుటచే దాని సమర్థింప, నతని యాశ్రయించిన అనుయాయులు కాలాంతరమున గాథల నల్లియుందురని తోచెడినీ.

పిమ్మట, మాధవాచార్యుడు విద్యాతీర్థుని ప్రేరణచే క్రీ. శ. 1331 సంవత్సరమున దురీయాశ్రమమును స్వీకరించి, విద్యారణ్యస్వామి నామ మును ధరించినట్లు కొందరి భావము. సన్న్యాసకాల విషయమున నధి ప్రాయభేదములు లేకున్నను విద్యారణ్య నామముననే, అధిక వ్యత్యాసాభి ప్రాయములు గోచరము. సన్న్యసించిన మాధవుడు విద్యారణ్యుడై వెంటనే శృంగగిరియందు విద్యాతీర్థుని స్థానము నలంకరించి, పీఠాధిపతి యయ్యెనని కొందరందురు. కాని ప్రథమతః, అతడు విరూపాక్షపీఠము నధిష్ఠించి. విద్యాతీర్థుని తర్వాత పీఠాధ్యక్షుడైన భారతీతీర్థుని యనంత రము యితడు శృంగగిరిపీఠము నధిష్ఠించెనని కొందరు భావించెదరు, ఎట్లున్నను, "అంతఃప్రవిష్టశ్శాస్తేతి యోంతర్యామి శ్రుతీరితః। సోఽస్మా మ్ముఖ్యగురుః పాతు విద్యాతీర్థ మహేశ్వరః॥" అనుచు, 'అనుభూతి ప్రకాశిక" 12 వ అధ్యాయాంతమున విద్యారణ్యుడు వ్రాసికొని యుండు టచే, విద్యాతీర్థుడే ముఖ్య గురువని విదితము. కాని ముఖ్య గురువను ముఖ్య శబ్ద ప్రయోగమున మాతవునకు నింక నితర గురువులున్నట్లు వ్యక్తము. అయినను విద్యారణ్యుడు, ప్రథమమున విరూపాక్షమునసుండి

అట శృంగగిరికి ఉపపీఠముగ విరూపాక్షపీఠమును నెలకొల్పి, అందు ఎనమండుగురు బ్రహ్మచారులకు శిక్షణము నొసంగి, వారికై దక్షిణదేశమున నల్గడల, నెనిమిది ఉపమఠముల స్థాపించి, వారినందందు అధిపతులనుగ నియమించినట్లు తెలియుచున్నది. ఆ కాలముననే శృంగగిరిపీఠముకూడ మిగుల ప్రశస్తినార్జింప, విద్యారణ్యుడు విజయనగర సామ్రాజ్యాధిపతులైన బుక్కరాయలాదులకు ప్రధానామాత్యుడై యుండుటచే, నీ మఠమునకు సర్వవిధ సిరిసంపత్తుల నెలకొల్పి, సర్వ రాజలాంఛనముల నిర్మించినట్లు భాష్యాచార్యులుగూడ వాకొనియున్నారు. 61 రాజప్రాపకమును, అనమాన పాండితీ గరిమయు, అద్భుత నిర్మాణాత్మక శక్తియు, అనుపమాన నిర్వహణాప్రభావము గలిగి, నాటి దేశమున వైదిక మతము నుద్ధరించిన వ్యక్తులు, యీ సాయణ, విద్యారణ్య సోదరద్వయము. అందు అతి ముఖ్యుడు విద్యారణ్య యతి. విద్యా తీర్థుడని వాకొనబడినవాడే విద్యా శంకరతీర్థుడనియు, నాతనికి భోగనాథ మాధవులు శిష్యులనియు, నందు భోగనాథుడు సన్న్యసించి భారతీతీర్థ యనియు, భారతీకృష్ణతీర్థయనియు యోగపట్టమున శృంగగిరియందు క్రీ. శ. 1328–1380 వరకు వాసం బుండెననియు, విద్యారణ్యుడు క్రీ. శ. 1331–1386 వరకు అందుండి, విద్యాశంకరుని బిమ్మట భారతీకృష్ణతీర్థుడు మఠాధిపతికాగా, అతని యనంతరము విద్యారణ్యుడా స్థానము నలంకరించెననియు సూర్యనారాయణ శాస్త్రి అభిప్రాయము. 62 ఏదెట్లున్నను విద్యాతీర్థ, భారతీతీర్థుల కాలమునకంటె విద్యారణ్యుని కాలమున, శృంగగిరిపీఠముయొక్క పలుకు బడి, దక్షిణ దేశమెల్లెడల వ్యాపించి, వివిధ ఉపపీఠములేర్పడి, వానికి సుస్థి

రత్వము గలిగి, ఆర్షమతము బహుళవ్యాప్తి జెందియుండుట గమనార్హము. అందుచేత ఆ కాలమున శృంగగిరి పీఠస్థాపకుడైన శ్రీ శంకర భగవత్పాదుని రచనలున్నను, అతని అద్భుత చారిత్రము లేకుండుటచే, అనేక 'శంకర విజయ' నామక గ్రంథములు లిఖింపబడినవి. అన్నింట మాధవ విద్యారణ్య రచితమని ప్రచారముననున్న "శంకర దిగ్విజయము" ముఖ్యము. అదియు విద్యారణ్య నిర్మితము కాజాలదనియు, దీన సన్న్యాస నామము నుంపక, మాధవనామము నెట్లు విద్యారణ్యుడుంచెనో అవ్యక్తమనియు, మొదలగు విషయముల మనము శ్రీ శంకరాద్వైత భాగమున గాంచియున్నాము. విద్యారణ్యునకు సాయన మాధవ నామమున నిరువురు సోదరులుండ, వారి ఆత్మశాంతికై వేదభాష్య, శంకరవిజయముల రచించి వారి నామముల నందుంచెననియు భాష్యాచార్యుని తాత్పర్యము. 63 ఎట్లైనను విద్యారణ్యకాలమున వివిధ విధముల భారతీయ వైజ్ఞానిక సాహిత్య ప్రచారము, బహుళవ్యాప్తి జెందెనని సర్వాంగీకారము.

ఈతని కాలమున, దక్షిణ హిందూదేశమున దురుష్కరాజ్యము లేర్పడుచు, హిందూరాజుల బలమడంగుచుండెను. హరిహర బుక్కరాయలు అను సోదరులు ఓరుగల్లు రాజ్యాధిపతియైన ప్రతాపరుద్రుని కొల్వునందుండిరి. కాని, యీ రాజ్యమును గబళింప మహమ్మదీయులు యత్నించుచుండ, నీ సోదరులందుండి పలాయనము గావించిరి. కాని వారు, కంపిలరాజ్యముననుండ మొగలాయి సైన్యములు దాని నాక్రమించి, ఆ రాజునోడింప, నా సోదరులు బంధితులై నిరాశ్రయులైరి. కాని విద్యారణ్య సాయణులు, హిందూ సంస్కృతికి వాటిల్లుచుండిన

ఇక్కట్టులకు వాపోయి, దాని యుద్ధరణోపాయములకై యోచించుచుండిరి. మహమ్మదీయ పాలకుని బలాత్కారమున మతాంతరులైన హరిహర బుక్కరాయలు తమ స్థితికి జింతించి, మరల హిందూమత స్వీకరణమును గాంక్షించి, పంపాక్షేత్రమున గల విద్యారణ్యుని జేరిరి. విద్యారణ్యుడును గురువర్యుడైన విద్యాతీర్థునితో సంప్రదించి, హరిహర బుక్కరాయలకు శుద్ధి సంస్కారము గావించి, ఆ ధర్మమున జేర్పించి, పంపాక్షేత్రాధిపతి యైన విరూపాక్షస్వామికి బ్రతినిధులుగ వారి నేర్పరచి, మరల "గంపిలి" రాజ్యస్థాపనము గావించెను. ఇది క్రీ. శ. 1336 సంవత్సరమున జరిగెను. అందుచేత నితనికి "కర్ణాటక సామ్రాజ్య స్థాపనాచార్య" అనియు, "విద్యానగర సామ్రాజ్య స్థాపనాచార్య" అనియు బ్రఖ్యాతి గలిగెను. నాటినుండియు నా పంపాక్షేత్రము విద్యానగరమై పేరొందెను.

విజయనగరమనియు, బ్రఖ్యాతి నొందిన యీ విద్యానగరమును, విద్యారణ్యుడు స్థాపించెనని గొందరందురుగాని, పూర్వ పట్టణమును, రాజధాని నగరముగ నతడు రూపొందించెననిన యుక్తము. ఆ పట్టణమున శ్రీ విరూపాక్షుని సన్నిధానమున, అష్ట దిగ్గజాలంకృతమైన శ్రీ చక్రమును గూడ నతడు ప్రతిష్ఠించెను. నాటినుండి విద్యారణ్యుడే ఆ సామ్రాజ్యాధిపతులకు సచివుడై ప్రధానమంత్రియై సర్వవిషయముల దానే సర్వాధిపత్యము వహించి, పరిపాలనము నిర్వహించి యుండుటచే నతనికి, మహామాత్యుడనియు గీర్తి వ్యాప్తిచెందెను. రాయలకంటె మహామంత్రి మే ప్రజానీకమున బ్రభావము గలిగి యుండెను. విద్యానగరము 14×10=140

దవరపు పైశ్చ విస్తీర్ణము గలిగి, 30 లక్షల జనసంఖ్యతో, సకల విద్యా సంపద్వైభవములతో శోభిల్లియుండెను. హరిహరరాయలు క్రీ. శ. 1336-1350 వరకు పాలింప, నంత నతని సోదరుడు బుక్కరాయలు ప్రభుత్వము వహించి, క్రీ. శ. 1350-1377 వరకుండెను. అంత నతని కుమారుడు రెండవ హరిహరరాయలు, క్రీ. శ. 1377-1404 వరకు పాలించెను. హరిహరరాయలతో 1336 సంవత్సరమున ప్రారంభించి, క్రీ. శ. 1386 సంవత్సరమున పరమపదించువరకు, వరుసగ నీ ముగ్గురు ప్రభువులకు మహామంత్రియై, విద్యారణ్య యతిసార్వభౌముడు విజయనగర సామ్రాజ్యమును పాలించెను. ఆ ఏబది సంవత్సరములు దక్షిణాపథమునకు సువర్ణకాలమనిపించెను. ఒక్క దౌలతాబాదు దుర్గము మినహా నరేతర మహమ్మదీయ రాజ్యములు యీ విజయనగర సామ్రాజ్యమున నంతరింప, దక్షిణాపథమంతయు నీ సామ్రాజ్యమే విస్తరించెను. ఈ కాలమున విద్యారణ్యుడు రచించినవియు, విద్యారణ్య ప్రోత్సాహమున రచింపబడిన వైజ్ఞానిక ఆధ్యాత్మిక గ్రంథములు 1400 వరకు గలవని ప్రతీతి. ఈ గ్రంథ రచనముల దోడ్పడిన పండితులెల్లరికి, విరివిగ నగ్రహారప్రదానములంగూడ నాతడు గావించినట్లు తెలియుచున్నది. వేదభాష్య రచయితయైన సాయణాచార్యునికి బ్రాహ్మణకాక అగ్రహారమును ప్రదానము చేయుటయేగాక, తద్రచనమున దోడ్పడిన నారాయణ వాజపేయాజి, నరహరి సోమయాజి, పండరి దీక్షితులు మొదలగువారికి అగ్రహారములొసంగబడియున్నట్లు మైసూరు శాసనము లభుచున్నది. పూర్వోక్తము ప్రకారము వేదభాష్యము "వేదార్థప్రకాశన" నామమున మాధవ విద్యా

రణ్యుని ప్రోద్బలమున, సాయణాచార్యునిచే ననేక పండితబృంద సహాయమున నిర్మింపబడి, బుక్కరాయునకు అంకితమీయబడినది. ఈ విధముగ రచితములైన గ్రంథరాజములు, నాడు అతి ప్రధానముగ, సర్వరంగముల బ్రకాశించుచు, సర్వవిద్యాభివృద్ధికి బ్రోత్సాహము నిడుచు సత్కరించుచున్న మాధవ విద్యారణ్యునికే అన్వయమగుటచే, యథార్థ రచయితల నామములు మరుగుపడిపోయినట్లు దోచును. ఆ విషయము ముందు చూచెదము గాక !

ఈ విధముగ దిగంత ప్రఖ్యాతి గడించి, సమకాలీన విద్వద్వ రేణ్యులనే గాక, కాలాంతర విబుధులనుగూడ, తన అమానుష ప్రజ్ఞా తేజమున లయింపజేసికొని, దశదిశల తానెయై వెలుగొందిన విద్యారణ్య విద్వన్మణి, క్రీ. శ. 1386 వ సంవత్సరమున, బంపాక్షేత్రమున, శ్రీ విరూ పాక్షేశ్వర సన్నిధియందు, దన 88 వ సంవత్సర ప్రాయమున దివంగతు డయ్యెను. కొందరి మతమున క్రీ. శ. 1267 లో జనించి, 1386 న సిద్ధిబొందుటచే 120 వర్షములు జీవించినట్లు గలదు. మరికొందరు, విద్యా రణ్యుడు క్రీ. శ. 1301 లో జనించి, 1387 వ సంవత్సరమున బ్రహ్మై క్యము బొందినట్లు వాకొందురు.

## రచనలు

విద్యారణ్య యతి జీవితమున. గొన్ని భావభేదములు పండిత లోకమున గానవచ్చినట్లు, అతని రచనల విషయమున అధికతర విభిన్న త్వము గోచరము. అతడు రచించిన గ్రంథములు మాత్రమేగాక అతని

ఆచార్యమున, అతని ప్రోద్బలమున, లిఖితములైన గ్రంథములుగూడ అతనికే యన్వయింప బడియుండుటయే యీ కలవరమునకు గారణము. కాలాంతర రచయితలుగూడ దమ రచనల వ్యాపకమునకై తమ నామముల నిగూఢపరచి, విద్యారణ్యనామము నన్వయించి యుండుటయు గారణముగ నోపును. కావున విద్యారణ్య, మాధవ శబ్దముల దోచు గ్రంథము లన్నియు, నతని కృతములే యని పెక్కురు తలంచెదరు. ఆతని కన్వయ మగుచున్న గ్రంథములు 1800 లకు పైబడి యుండినను అందు ముఖ్య ములు, 1) వేదభాష్యము 2) అధికరణ రత్నమాల (ఉత్తరమీమాంస వ్యాఖ్య) 3) సర్వదర్శన సంగ్రహము 4) అనుభూతి ప్రకాశిక 5) బ్రహ్మ గీత 6) శ్రీ వేదాంత పంచదశి 7) జీవన్ముక్తివివేకము 8) దృగ్దృశ్య వివేక - టీక 9) అపరోక్షానుభూతి - టీక 10) ధాతువృత్తి (వ్యాకర ణము) 11) కాలమాధవీయము (ధర్మశాస్త్రము) 12) శతప్రశ్నకల్పలతిక (బ్రాహ్మణశాఖల వివరణము) 13) పరాశర మాధవీయము (పరాశర స్మృతివ్యాఖ్య) 14) జైమినీ న్యాయమాలా విస్తరము (పూర్వమీమాంసా శాస్త్రము) 15) ఆచార మాధవము (బ్రాహ్మణాచారములు) 16) వ్యవ హార మాధవము (న్యాయశాస్త్రము) 17) విద్యారణ్య కాలజ్ఞానము (జ్యోతిషము) 18) శంకర దిగ్విజయము 19) వేదాంతాశీర్వాదము. 20) వివరణప్రమేయ సంగ్రహము 21) వైయాసిక న్యాయమాల 22) పంచకోశ విచార 23) మహావాక్య వివరణము 24) వాక్యసుధ

25) బృహదారణ్యక వార్త్తికసార 26) నృసింహతాపినీ ఉపనిషద్దీపికా 27) ఐతరేయ ఉపనిషద్దీపికా.

కాని యిందు, వేదభాష్యము సాయణభాష్యమని స్పష్టమగుటయు. నా సాయణనామము విద్యారణ్య సౌదర నామమగుటయు, నా భాష్యరచనము విద్యారణ్య ప్రోత్సాహమున, బుక్కరాయనృపతి సాయణాచార్యులచే వ్రాయించెననియు. బూర్వము గాంచియున్నాము. మరియు తద్రచనమునకు ఇరువది నల్వురు మహావిద్వాంసులు తోడ్పడిరనియు, నందు మువ్వురు ప్రధానమనియు, నందుచే వారి కగ్రహారములు సాయణునితో బాటు ఒసంగబడినవనియు మైసూరు శాసనము తెలుపుచున్నట్లు గాంచియున్నాము. విద్యారణ్యుల సహాయమున మాత్రమే వేదభాష్య రచనము సాధ్యమైనట్లు సాయణాచార్యులు వచించుకొనినట్లు తెలియుచున్నది. అందుచే "వేదాన్త ప్రకాశము" విద్యారణ్య కృతము కాదని విదితమగుచున్నది. "అధికరణ రత్నమాల" "సర్వదర్శన సంగ్రహము"లుగూడ బరకృతములని పండితాభిప్రాయము. అటులే "బ్రహ్మగీత" "శంకర విజయము"లుగూడ విద్యారణ్య రచనములు గావని పూర్వమే నిశ్చయించితిమిగదా !

ముఖ్యముగ, "వివరణ ప్రమేయ సంగ్రహము" "వైయాసిక న్యాయమాల" 'పంచదశి' గ్రంథములగూర్చి అభిప్రాయ భేదములు, ఆధునికులలో మాత్రమేగాక బూర్వులలోగూడ నున్నట్లు స్పష్టమగుచున్నది. ఆ విషయ పరిశీలనమున, భారతీతీర్థ, విద్యారణ్య, మాధవ, శంకరానంద, నామములలో ననేక సందేహములు గలిగి, వ్యక్తిత్వమున మిగుల కిష్టత్వ

మేర్పడియున్నది. "వివరణప్రమేయ సంగ్రహ" కర్తృ విషయమున, "సిద్ధాంత లేశ సంగ్రహ" కర్తయైన అప్పయ్య దీక్షితులు, భారతీతీర్థున కన్వయింప, "వృత్తిప్రభాకర" కర్తయైన నిశ్చల దాసు విద్యారణ్యునకును, పురాతన గ్రంథభాండాగారములగల వ్రాతప్రతులలో గొన్నింట, భారతీ తీర్థ, విద్యారణ్యునకు అన్వయించిరి. అటులే "వైయాసిక న్యాయమాల" రచనము కొన్ని వ్రాతపతులు భారతీతీర్థునకును, తద్వ్యాఖ్యాత యగు రంగనాథుడు విద్యారణ్యునకు అన్వయించిరి. మరియు 'పంచదశీ' గ్రంథమున, అప్పయ్య దీక్షితుడు, తన 'సిద్ధాంత లేశ సంగ్రహము'న భారతీతీర్థునకు జిత్రదీపమును, ధ్యానదీపమును ముడివెట్టగ దృప్తిదీపమును భారతీ తీర్థునకు రామకృష్ణ వ్యాఖ్యాత అన్వయించెను. "పంచదశి" అంతయు విద్యారణ్య కృతముగ నిశ్చలదాసు తెలుప, గొన్ని వ్రాత గ్రంథములు దాని కర్తగ భారతీతీర్థ, విద్యారణ్యుల జేసివైచినవి. విద్యారణ్యుడు పంచదశీ మంత్రానుష్ఠాన పరుడగుటచే నీ గ్రంథమున, నా పదునైదింటి బీజాక్షరముల బ్రకరణములుగ జిత్రించియుండెననియు, నందుచే నిది 'పంచదశి' యనబడినదనియు గొందరి భావము. అట్లుగాక ప్రథమ షష్ఠ ప్రకరణములుమాత్రమే విద్యారణ్య కృతములనియు, శేష ప్రకరణ నవకము భారతీతీర్థ రచనములని గొందరి వాదము. మరియు "పంచదశి" వ్యాఖ్యాత యగు రామకృష్ణకవి ప్రతి ప్రకరణారంభమున "నత్వా శ్రీ భారతీతీర్థ విద్యారణ్య మునీశ్వరౌ" అని ప్రారంభించుచు, ప్రకరణాంతమున

"శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య శ్రీ మద్భారతీతీర్థ విద్యారణ్య మునివర్య కింకరేణ శ్రీరామకృష్ణాఖ్యేన" అని తెలుపుకొనుట గమనార్హము. ఈ వ్యాఖ్యాత భారతీతీర్థ విద్యారణ్యుల కాలము వాడనియు, వారిరువురి శిష్యుడనియు, దీన స్పష్టమగుచున్నట్లు కామక్షి వెంకట సుబ్బయార్యుని అభిప్రాయము. ఇందు విద్యారణ్య శబ్దము భారతీతీర్థున కన్వయించు బిరుదమా ? లేక యితరుని నామమా ? అను సంశయము గోచరము. అటులే "దృగ్దృశ్యవివేక" కర్త విషయమునగూడ సందేహము పొడముచున్నది. 'సిద్ధాంత లేశ సంగ్రహ' కర్త యగు అప్పయ్య దీక్షితులు, 2:3.4112 వాక్యమున, "విద్యారణ్యగురు ప్రభృతీనాం" అని ప్రస్తావించుచు, "దృగ్దృశ్యవివేక" వచనమును సూచించెను. ఇచ్చట విద్యారణ్యునకు గురువర్యుడైన భారతీతీర్థుడనియా, కాక గురువైన విద్యారణ్యుడనియా, అని సంశయము. అంతియగాక, భారతీతీర్థునికే విద్యారణ్య బిరుదముండెనా యనియు, అప్పయ్య దీక్షిత వచనముల స్ఫురించునని సూర్యనారాయణశాస్త్రి అనుమానము, 64 "వాక్యసుధ-టీక" రచయితయైన బ్రహ్మానంద భారతీయు, "పంచదశి" వ్యాఖ్యాత రామకృష్ణ కవియు, భారతీతీర్థ నామమును ద్వివిధముగ నుపయోగించి యుండిరి. ద్వంద్వసమాస పూర్వకముగ "భారతీతీర్థ విద్యారణ్య మునీశ్వరౌ" అనియు, కర్మధారయసమాస పూర్వకముగ "శ్రీ భారతీతీర్థగురుః, అనుటచే ఇందు ప్రథమ వచనమున భారతీతీర్థ, విద్యారణ మునీశ్వర అని విడదీయుట సముచితముకాని, భారతీతీర్థ విద్యారణ్య ముని + ఈశ్వర అనుట గాదని, సూర్యనారాయణశాస్త్రి నిర్ణయము. 64 భారతీతీర్థ, విద్యా

రణ్య, అని తెలుపు వ్రాతప్రతుల గద్య ప్రామాణికముగాదని అతని భావము.

"వివరణప్రమేయ సంగ్రహము" న "స్వమాత్రయానయదత్ర జంతూన్సర్వాత్మభావేన తథా పరత్ర। యచ్ఛంకరానందపదం హృదబ్జే విభ్రాజతే తద్యతయో విశంతి?" (1. 1) అను ప్రథమ ప్రార్థన శ్లోకమున శంకరానందుని, "యద్విద్యాతీర్థగురవే శుశ్రూషాన్యా నరోచతే తస్మాత్ అస్త్యేషా భక్తియుతా శ్రీ విద్యాతీర్థపాదయోః సేవా॥" (9. 35) అను పరిసమాప్తి శ్లోకమున విద్యాతీర్థుని గ్రంథకర్త స్మరించియున్నాడు. "దృగ్దృశ్య వివేకము"న గురుసంస్మరణము లేకుండ, మరల "పంచదశి" ప్రారంభమున "నమః శ్రీ శంకరానందగురుపాదాంబుజన్మనే" (1.1) అని శంకరానందనామము తెలుపబడియున్నది. "వైయాసిక రత్నమాల" విద్యాతీర్థుని ప్రస్తావించియున్నది. "వివరణప్రమేయము"న శంకరానంద, విద్యాతీర్థుల నామములు రెండును తెలుపబడియుండ, నితరములలో నొక్కొక్క నామమే వచియింవబడియుండుటకు గారణము అగోచరము. ఈ శంకరానందుడెవరో తెలియరాదు. శంకరానందుడు విద్యాతీర్థుడే యనియు, నతనికి విద్యాశంకరతీర్థ నామము పూర్తి నామమనియు, నతడు క్రీ. శ. 1228 నుండి 1333 వరకు శృంగగిరి పీఠాధ్యక్షుడనియు, గొందరి తలంపుగ సూర్యనారాయణశాస్త్రి కథనము. 64

విద్యాశంకరతీర్థునకు భోగనాథ, మాధవులు శిష్యులనియు, వారే భారతీకృష్ణతీర్థ, విద్యారణ్యులైరనియు, విద్యాశంకరుని పిమ్మట భారతీ కృష్ణుడు పీఠాధిపత్యము వహింప, నతనితర్వాత విద్యారణ్యుడు పీఠము

నవశిష్టించినట్లును వాడుక గలదు. ఈ విధముగ మాధవ. [illegible] భారతీతీర్థుల వ్యక్తిత్వము, పండితుల చాల కలవరపరచియున్నవి. కాని అప్పయ్య దీక్షితుని బ్రమాణముగ గొని, "వివరణప్రమేయ సంగ్రహ" కర్తృత్వము, భారతీతీర్థునికే సూర్యనారాయణశాస్త్రి, [illegible] నిర్ణయించినట్లు విదితము. 64 కాని యీ విషయముల [illegible] జర్చించి, ఆచార్య టి. ఎం. పి. మహాదేవన్ భారతీతీర్థ [illegible] "వివరణప్రమేయ సంగ్రహము" 'పంచదశి' 'దృగ్దృశ్యవివేకము' ల కర్త యనియు, "జీవన్ముక్తి ప్రకాశము" వకు మాధవ[illegible] రచయిత యనియు దెలిపి, భారతీతీర్థ మాధవులకు [illegible], విద్యా రణ్య నామము బిరుదముగ నుండెనవి దీర్మానించెను. 65 "సిద్ధాంత లేశము"న అప్పయ్య దీక్షితుల 'పంచదశి' ప్రమాణముల [illegible] సమయముల, పంచదశి నామమును బ్రస్తావించక, తత్త్వవివేక (1:[illegible] 3112), నాటకదీప (1:5. 14111); కూటస్థదీవ (1: 5. 1411[illegible] 1: 5. 14241), ధ్యానదీవ (3 : 3. 1) బ్రహ్మానంద (1:2. 3116 చిత్రదీప (1:2. 3116) అని తెలుపుటచే, నాకాలమున [illegible] అవి ప్రఖ్యాతముగాక వివిధముగ నుండియుండును. అంతి[illegible] యీ ప్రకరణముల కర్తృత్వమునుగూడ భారతీతీర్థ, [illegible] బంచినట్లు దోచును. మరియు జివరి అయిదు ప్రకరణముల [illegible] గ్రంథ నామమున వ్యవహరించి, అందు పంచదశి 11 వ [illegible] యోగానంద ప్రకరణమున "బ్రహ్మానందం ప్రవక్ష్యామి" [illegible]

[illegible] కాంతమున "బ్రహ్మానందాభి గ్రింథే" బ్రహ్మానంద
[illegible] మగ పెలుపుచు, ఆ ప్రకరణ ములబంచదశీ ప్రకరణ
[illegible] ప్రత్యేకముగ గణించుచు, గడపటిదగు విషయానందమున
[illegible] గ్రంథే పంచమోధ్యాయ ఈరితః। విషయానంద' అని
[illegible] యుండుటచే నీ బ్రహ్మానంద గ్రంథము పంచదశిలోనిదిగాదని
[illegible] కీర్తి కచనమనియు అభిప్రాయము (జీ ప్ర. 225).

[illegible] నీ "పంచదశి" అనబడు గ్రంథము ఒక కర్తచే వ్రాయబడినది
[illegible] కీర్తి మాధవులచే వ్రాయబడి యుండి, కాలాంతరముననో, కాక
[illegible] నో యీ యిరువురు గ్రంథకర్తలు దాని నొకదానిగజేసి వేదాంత
[illegible] నామమున వ్యవహరించియుందురని తోచెడిని. గృహస్థాశ్రమ
[illegible] మాధవుడు మహావిద్వాంసుడని ప్రబల ప్రఖ్యాతి నొందియుండుటచే
[illegible] మైన విద్యారణ్య శబ్దముకంటె మాధవ పదమే వ్యవహారమున
[illegible] యుండవచ్చును. అందు చేతనై యుండు గ్రంథముల మాధవనామము
[illegible] యున్నది. అట్లుకాక మాధవునకు బూర్వాశ్రమనామమే
[illegible] యుండి విద్యారణ్యపద్దము చేర్పబడియుండ వచ్చును. ఎట్లై
[illegible] పరరచనములగాని విద్యారణ్యుని నామము, అతని
[illegible] కాక గురువుల యొక్క నామములు ఒక్కవిధముగ వచింప
[illegible] మందుము, బ్రస్ఫుటముగ లేకుండుట చాల విచారకరము.
[illegible] విమర్శకులలో నింత భావవ్యత్యాసమునకు గారణమై
[illegible] ప్రరచనమున జూపిన శ్రద్ధావివేకములు యీ ముఖ్య
[illegible] విషయములు జూపకుండుట మిగుల చింత నీయము.

ఆయినను అది శంకరాచార్యుని పిమ్మట తుల్యమగు విద్యావైభవము నార్జించి, రాజసత్కారాది గౌరవశ్రీని గడించి, నాటి సర్వ విద్యావంతుల దిన అమృత విద్యాతేజో మండలమున అంతరింపజేసి, వైజ్ఞానికలోకమున బ్రహ్మాండ ప్రతిభాభాస్కరుచందము వెలుగొందిన నీ విద్యారణ్యునికి నాటి సంఘమేగాక నేటి లోకముగూడ కృతజ్ఞమై యుండక దప్పదుగదా! అతని ధీవిశాలత ఒక్క రంగమునగాక, సంఘమునగల సర్వవిషయముల బ్రవేశించి, గ్రహించి, ప్రావీణ్యము నార్జించి, అందు నాయకత్వము వహించి నాటి సంఘమును సర్వవిధముల నడిపించి ఆదర్శమై యలరారుట గాంచనగును. సన్న్యాసియైయుండియు కేవలము వేదాంతమున మునింగి యుండుటయే గాక రాజ్యపరిపాలనా నిర్వహణమునుగూడ వహించి, సన్న్యాసులు వ్యర్థులుకారని చాటిన అనుపమ ప్రతిభాసంపన్నుడు విద్యారణ్య యతి చక్రవర్తి. అందుచే నతడు కేవలము సన్న్యాసులకేగాక, గృహస్థుల కుగూడ సామాన్య ప్రజానీకమునకేగాక ప్రభువులకుగూడ, పామరులకే గాక పండితులకుగూడ, సాధువులకే గాక సిద్ధులకుగూడ అద్భుతాదర్శమును సృజించి, నిర్వహించి, చిరస్మరణీయుడై వందనీయుడై విరాజిల్లుట గడుంగడు గమనార్హము ప్రశంసనీయము అనుష్ఠేయము.

విద్యారణ్యప్రోక్తములని తెలుపబడుచున్న గ్రంథము లన్నింటిలో పంచదశియే ముఖ్యమై తత్త్వశాస్త్ర విషయ చర్చ చేసినదగుటచే దానినే యిట గ్రహించి 'సౌరభము' వచింప యత్నించుచున్నది. అతని రచనముల ముఖ్యములన బరగు 'వివరణప్రమేయ సంగ్రహము' 'జీవన్ముక్తిప్రకాశిక'

గ్రంథము ప్రథమము శంకరునిచే రచితమైన సూత్రభాష్యమునకు పద్మ పాదాచార్య రచితమైన 'పంచపాదికావ్యాఖ్య' ఆధారము. దానికి ప్రకాశాత్మునిచే నిర్మింప బడిన 'పంచపాదికా వివరణము' మొదలగు గ్రంథములు ప్రాతిపదికలు. అందుచే నచ్చటచ్చట నూత్నభావజాలములు గోచరించినను పూర్వాధారక గ్రంథముపై వివరణము కావుటచేత అది పంచదశివలె ప్రధానము కానేరదు. అది వర్ణకనామమున 9 అధ్యాయములు గలిగి క్రమముగ 1) అధ్యాసభాష్య 2, 3, 4 వర్ణకములలో అథాతో బ్రహ్మజిజ్ఞాసా విషయమును, 5) జన్మాద్యస్యయతః, 6, 7 వర్ణకములలో శాస్త్రయోనిత్వాత్ 8)9) వర్ణకములలో తత్తు సమన్వయాత్ అను విషయములు చర్చింపబడి, వేదాంత సూత్రములగల ప్రథమసూత్రచతుష్టయమునకు వివరణముగా వింపబడియున్నది. 'జీవన్ముక్తి ప్రకాశము' 'యోగవాసిష్ఠము' పైనాధారపడుచు, గీతా భాగవతముల ప్రమాణములు విరివిగ గైకొనుచు పంచప్రకరణములలో శోభిల్లును. అందు ప్రథమ ప్రకరణము జీవన్ముక్తి స్వరూపమును, రెండవది జీవన్ముక్తి సాధనములను, మూడవది తత్త్వజ్ఞాన సహితమైన మనోనాశమును, నాల్గవది జీవన్ముక్తి ప్రయోజనమును, అయిదవది విద్వత్సన్న్యాసముల జర్చించి, ముఖ్యముగ సాధన సన్న్యాస విషయముల వివరించియున్నది. కాని 'పంచదశి' అట్లుగాక తత్త్వజ్ఞానికి అవసరమైన సృష్టి స్థితి లయములు, సగుణ నిర్గుణ బ్రహ్మము, మాయ, జీవుడు, సాధన, సిద్ధుడు మొదలగుసర్వ విషయముల జర్చించి, సమగ్రముగ వివరించియున్న సంపూర్ణ గ్రంథము. అందుచే నది యిట గైకొనబడుట యుక్తము. ఇందుగల్గ్రవిషయ

భావ్యవ్యత్యాసము పండితులకు గోచరముగాని నిశ్చయసిద్ధాంత మభావమగు టచేతను, భారతీతీర్థ విద్యారణ్యులకు బరిచితుడనబరగు రామకృష్ణకవి యీ గ్రంథము నొక్కడానిగ గైకొని వ్యాఖ్యరచించుటచే నీ గ్రంథము యిట యథాతథముగ స్వీకరింపబడుటయు సముచితమని దోచును. కాన నిక పంచదశీ తాత్పర్యమును బరిశీలించెదము గాక !

పంచదశీ గ్రంథము 12 అధ్యాయములు గలదియై, యందు వివేక పంచకము, దీప పంచకము, ఆనంద పంచకములు గలదియై, 1) తత్త్వ వివేక 2) మహాభూత 3) పంచకోశ 4) ద్వైత 5) మహావాక్యములు వివేక పంచకమునను; 6) చిత్రదీప 7) తృప్తిదీప 8) కూటస్థదీప 9) ధ్యానదీప 10) నాటకదీపములు దీప పంచకమునను; 11) యోగా నంద 12) ఆత్మానంద 13) అద్వైతానంద 14) విద్యానంద 15) విష యానందములు అనంద పంచకమున విరాజిల్ల, సర్వతాత్త్విక విషయ వివరణ సమృద్ధమైన సమగ్ర గ్రంథముగ నొప్పారుచున్నది. సంపూర్ణ ముగ ఛందోబద్ధమై, మధురకవిత్వ శైలితో శోభిల్లునది యగుటచేత, నిది బహుళవ్యాప్తినొంది, సర్వేసర్వత్ర, అద్వైత ప్రతిపాదనపరములగు గ్రంథరాజములలో నుత్తమ శ్రేణికి జెందినదై, ప్రశస్తి గనియున్నది. దీని ప్రాముఖ్యము వేదాంత ప్రకరణ గ్రంథములలో నెంతయేని గలదు. దాని ప్రాతిపదికగ గొని, శ్రీ విద్యారణ్య భావ పరిశోధనము గావించెదము గాక !

—o—

ఓం

# శ్రీ విద్యారణ్య సిద్ధాంత తాత్పర్యము

## బ్రహ్మము

తరత్యవిద్యాం వితతా హృది యస్మిన్ని వేశితే।
యోగీ మాయామమేయాయ తస్మై విద్యాత్మనే నమః॥

(వివరణప్రమేయ సంగ్రహము. 1. 65)

యోగి హృదయమున నేది ప్రవేశించిన, యోగి యీ విస్తార మాయను దాటునో, ఆ యఖండ విద్యా స్వరూపమైన ఆత్మకు నమస్కారము.

"తదా స్తిమితగంభీరం న తేజో న తమస్తతం। అనాఖ్యమనభివ్యక్తం స త్కించిదవశిష్యతే॥" (పం. 2. 40) సృష్టికి బూర్వము నిశ్చలమై, గంభీరమై, ప్రకాశాంధకారములుకాక, భిన్నమై, సర్వవ్యాపకమై, అనామక అనిర్వాచ్యమై, ఇంద్రియాతీతమైన సత్పదార్థము మిగిలియుండుననియు, నది "మనో జృంభణరాహిత్యే యథా సాక్షి నిరాకులః। మాయాజృంభణతః పూర్వం స త్తథైవ నిరాకులం॥" (2. 46) అఖిల మనోవృత్తులంతరింప, సాక్షి, స్వస్వరూపమున నెట్లు నిశ్చలమై యున్నదో, అటులె మాయా విజృంభణమునకు బూర్వము నిర్మలమై, రాజిల్లుచుండును. కాన "చోద్యం వా పరిహారో వా క్రియతాం ద్వైతభాషయా। అద్వైతభాషయా చోద్యం నాస్తి నాపి తదుత్తరం॥" (2. 39) దానిగూర్చి ప్రశ్నోత్తరములు ద్వైతమున సాధ్యముగాని, అద్వైత విచారమున దానిగూర్చి పూర్వపక్ష,

సిద్ధాంతముల భావములు అని, బ్రహ్మవిషయక ప్రశ్నముగాని, సమాధాన రూప సిద్ధాంతముగాని ఉండనేరదని, విద్యారణ్యుడు ఉపనిషత్తాత్పర్యమును వ్యక్తపరచియున్నాడు.

కాని 'స్వతః పూర్ణః పరాత్మాత్ర బ్రహ్మశబ్దేన వర్ణితః' (5. 4) స్వాభావికముగ బూర్ణమైనదియై, పరమైన ఆత్మయే బ్రహ్మ శబ్దముచే వచింపబడియున్నది అను వచనమురీతి బూర్వోక్త అనిర్వాచ్య, అనాఖ్యమైన సత్త్వము, గురుశిష్య వ్యవహారార్థము వ్యావహారికముగ బ్రహ్మశబ్దమున వాచ్యమైయున్నది. ఎందుచేతనన, బ్రత్యక్షముగ, స్థూలముగ ముందు గోచరించు నీ ప్రపంచము గలదు కావున, దీనితో బోల్చియు, దీనితో సంబంధింపజేసియు, బ్రహ్మ యుపదేశింపబడునని, 'సదద్వైతం శ్రుతం యత్తత్పంచభూతవివేకతః। బోద్ధుం శక్యం' (2. 1) అద్వైతమైన ఏ సద్వాచ్య బ్రహ్మము వేదవర్ణితమై యున్నదో, అది, పంచభూత వివేక ముద్వారా గ్రాహ్యావాక్యమని దెలుపుచు, 'జగద్భ్రమస్య సర్వస్య యదధిష్ఠానమీరితం। త్రయ్యంతేషు తదత్ర స్యాద్బ్రహ్మశబ్ద వివక్షితం॥' (8. 49) సర్వ ప్రపంచ భ్రాంతికి నుపనిషత్తుల నేది అధిష్ఠానమని తెలుపబడినదో, అది అట బ్రహ్మశబ్దమున వచింపబడినది. మరియు నీ ప్రపంచ భ్రాంతి వివరణముగ, 'చతుర్ముఖేంద్రదేవేషు మనుష్యాశ్వగవాదిషు। చైతన్యమేకం బ్రహ్మ....॥' (5.2) బ్రహ్మేంద్రాది దేవతలయందును, మనుష్యులందును, అశ్వగవాది జంతుసముదాయము

నందును ఏకమై యొప్పు చైతన్యమే, బ్రహ్మమగుచున్నదనియు వాకొన బడియున్నది. అనగా నీ బ్రహ్మము సర్వాధిష్ఠానమై, సర్వశబ్ద వాచ్యమై, సర్వాతీతమై, చెల్వొందుచున్నదని తాత్పర్యము. అందుచే నది 'అద్వితీయం బ్రహ్మతత్త్వ మసంగం .... (6.214) తనకంటె నన్యవస్తువు లేనట్టిది, దేని తోడను సంబంధింపనిది యీ నిర్గుణ బ్రహ్మము అగుచున్నది. అది అద్వితీయమగుటచే, 'ఏకమేవాద్వితీయం బ్రహ్మ' అను ఉపనిషద్వాక్యము ననుసరించి సజాతీయ, విజాతీయ, స్వగతములను త్రివిధ భేదములు లేనిదే యగును. ఎట్లన 'వృక్షస్య స్వగతో భేదః పత్రపుష్పఫలాదిభిః। వృక్షాంతరాత్సజాతీయో విజాతీయశ్శిలాదితః॥' (2. 20) తథా సద్వస్తునో భేదత్రయం ప్రాప్తం నివార్యతే। ఐక్యావధారణ ద్వైత ప్రతిషేధైః త్రిభిఃక్రమాత్॥' (2. 21) వృక్షమునగల, పత్రపుష్ప ఫలాదికము స్వగత విభేదమును తెలుపును. వృక్ష వృక్షమునకుగల విభిన్నత్వము సజాతీయ భేదమును నిర్దేశించును. వృక్షశిలాదులకు విజాతీయ తాత్పర్యమును సూచించును. అట్లు, సద్వస్తువునందు, ఏకమనుటచేత స్వగతమును, ఏవ పదముచే సజాతీయత్వమును, అద్వితీయ శబ్దముచే విజాతీయత్వమును నిషేధించుచు, సర్వ విభేదశూన్య సంపూర్ణైకత్వము, బ్రహ్మమునకు అన్వయింపబడియున్నది. మరియు 'న వ్యాపిత్వాద్దేశతోఽంతో నిత్యత్వాన్నాపి కాలతః। న వస్తుతోఽపి సార్వాత్మ్యాదానంత్యం బ్రహ్మణి త్రిధా॥" 3. 35) సర్వవ్యాపకమగుటచే దేశముచే గాని, నిత్యమగుటచే గాలముచేగాని, సర్వాంతర్యామి యగుటచే వస్తువుచేగాని, బ్రహ్మమునందు అంతవతము అనగా నాశము లేకుండుటచే, బ్రహ్మము। అనంతమని విద్యారణ్య వివరణముగ విదితమగుచున్నది.

# సగుణ బ్రహ్మము

పైనుదాహరింపబడినటుల బ్రహ్మము సర్వాతీతమైయుండి నను 'కాలాభావే పురేత్యుక్తిః కాలవాసనయా యుతం। శిష్యం ప్రత్యేవ తేనాత్ర ద్వితీయం నహిశంక్యతే॥ (2.38) దానియందు కాలాదివిభేదము లేకున్నను, పూర్వమున అనెడు అనగా సృష్టికి పూర్వము అనెడు వ్యపదేశము, కాలసంస్కారము తో గూడియుండిన శిష్యునికొరకుమాత్రమే ఉపదేశింపబడుచున్నదగుటచే దత్పదార్థముగంటె భిన్నముగ ప్రపంచాదిక మున్నదని శంకిపరాదనుచందము, నిర్గుణాఖండ నిర్మలాద్వితీయ బ్రహ్మమునందు సగుణాదికముగల బ్రహ్మము అజ్ఞు నుద్దేశించి తెలుపబడుచున్నది గాని వాస్తవముగననగ పారమార్థికముగ నది సర్వాతీతమే యగుచున్నది. అట్టి కల్పితగుణములలో 'సచ్చిత్సుఖాత్మకం బ్రహ్మ, (13. 62) అనురీతి నది 'సత్యం జ్ఞాన మనంతం యద్ బ్రహ్మతద్వస్తు తస్యచిత్, (3. 37) సత్య జ్ఞానమనంతమగునదియే పారమార్థికబ్రహ్మముగగూడ వ్యవహరింపబడు చున్నది. నిత్యము అనిత్యముగ సంతతవికార భూయిష్ఠ ముగ గోచరించు నీ లోకమురీతి బ్రహ్మము కాదనుటకు 'సత్యత్వం బాధారాహిత్యం, (3, 29) అని సత్యత్వము నిర్వచింపబడి, గృహ ఘట పటాదికము విచ్ఛిన్నమగు చున్నను, వాని కధిష్ఠానమైన ఆకాశము అనవచ్ఛిన్నమై, నిర్వికారమై యొప్పునట్లు బ్రహ్మముగూడ ఆబ్రహ్మస్తంబపర్యంత సృష్టికి అధిష్ఠానమై త్రికాలములందు అబాధితమైయుండునని వివరణము. అటులే ప్రపంచము పర

ప్రకాశమానమగుటచే నట్లు బ్రహ్మము కాదనుచు "స్వయమేవానుభూతిత్వా ద్విద్యతే నానుభావ్యతా। జ్ఞాతృజ్ఞానాంతరాభావా దజ్ఞేయో న త్వసత్తయా॥" (3. 13) స్వయముగ ననుభవరూపమగుటచే బ్రహ్మము అనుభవవేద్యము కాజాలదు. తనకన్యమగు జ్ఞాతయు జ్ఞానము అభావమగుటచే నది జ్ఞేయము కాదు. అట్లగుటచే అజ్ఞేయముగూడ ననగా నభావముగూడ గాదు. కాన "స్వయం జ్యోతి ర్భవత్యేష పురోఽస్మాద్భాసతేఽఖిలాత్। తమేవ భాంత మన్వేతి తద్భాసా భాస్యజగత్॥" (3. 16) ఈ బ్రహ్మము స్వయంప్రకాశము. అఖిలజగత్తుకంటె బూర్వమే ప్రకాశించుచున్నది. ఈ సర్వము ప్రస్వకాశ భూయిష్ఠమైన బ్రహ్మము నాశ్రయించియే ప్రకాశించుచున్నది. ఆ బ్రహ్మ ప్రకాశముచేత యీ సృష్టియంతయు బ్రకాశింపజేయబడుచున్నది. ఆయాత్మ అగ్రాహ్యము (3. 17). అతడన్నింటి గ్రహించుచున్నాడు గాని అతని కన్యముగ వేత్తలేడు (3. 18). అందుచే యస్మిన్ యస్మిన్నస్తిలోకే బోధ స్తత్తదుపేక్షణే। యద్బోధమాత్రం తద్బ్రహ్మేత్యేవం ధీర్బ్రహ్మనిశ్చయః॥" (3. 21) లోకమున నేవస్తువునందు బోధగలుగుచున్నదో, ఆ ఘటాది విషయమును ద్రోసిపైవగా నే స్ఫురణమాత్రము శేషించునో ఆ స్ఫుర ణమే బ్రహ్మము అగునని నిర్ధారణము. అటుల లోకమున సర్వము దేశకాలవస్తువులచే నంతవంతమగుచున్నవి. బ్రహ్మము అట్లు విచ్ఛిన్నము గాక దేశకాలవస్తువిభేదశూన్యమై రాజిల్లుచున్నది. (3. 35). అందుచే నది నిరవయవియై నిరంశమై ఆకాశమువలె ననంతమై సర్వవ్యాపకత్వమున నుండువదియు నిశ్చయము (3. 22, 28).

# మాయ

పూర్వోక్తరీతి, 'న నిరోధో న చోత్పత్తిర్న బద్ధో నచ సాధకః। న ముముక్షుర్నవై ముక్త ఇత్యేషా పరమార్థతా॥' (6. 235) నాశోత్పత్తులు లేవు. బద్ధుడుగాని సాధకుడుగాని ముముక్షువుగాని లేడు. ముక్తుడుగూడ అభావము. ఇదియే పరమార్థము అని వేదాంత ముఖ్యతాత్పర్యమై యున్నను 'అచింత్య రచనాశక్తిబీజం మాయేతి నిశ్చను।" (6. 151) అచింత్యమై, సృష్టికల్పనాశక్తి గలిగిన కారణమే మాయగా గ్రహింపుము అనియు, 'న చోదనీయం మాయాయాం తస్యాశ్చోద్యైకరూపతః, (6. 137) ఆ మాయకు వైచిత్ర్యమే ముఖ్య స్వరూపముగాన నా మాయా విషయమూహింపరానిదనియు, "న నిరూపయితుం శక్యావిస్పష్టం భాసతే చ యా। సామాయేత్యింద్రజాలాదౌ లోకాస్సంప్రతిపేదిరే॥' (6.141) ఏది ఇంద్రజాల కాలమున నిరూపింప నశక్యమై స్పష్టమై ప్రకాశించుచున్నదో అది మాయ అని జనులు గ్రహించిరను వాక్యములరీతి, "అచింత్య శక్తిర్మాయా" (13. 65) అనుమొక శక్తియుండి, "నిరధిష్ఠానో న భ్రమ క్వచిదీక్ష్యతే" (2. 35) అధిష్ఠానమువినా భ్రమయుండజాలదుగాన, నది అద్వితీయ బ్రహ్మమునే ఆశ్రయించి యున్నది. సర్వభ్రాంతులకు గారణమైన యీ మాయ, 'న శూన్యం నాపి సద్యాదృక్తత్త్వమిహేష్యతాం" (2. 49) శూన్యా శూన్యములు గాదని నిశ్చయమనవట్లు, అది సదసద్విలక్షణమైనదై, అనిర్వాచ్యమై (6. 128), ప్రకాశమానమగుటచే నసత్తుగాక బాధితమగుటచే సత్తుగూడకాక, జ్ఞానదృష్టికి సదా లేనిదై (6. 129)

యొప్పుచున్నది. అట్టి "విస్మయైకశరీరాయా మాయాయాశ్చోద్య రూపతః। అన్వేష్యః పరిహారోఽ స్యా బుద్ధిమద్భిః ప్రయత్నతః॥" (6. 139) విస్మయత్వమే ఆకారముగాగం నీ మాయ చోద్యమైనదగుటచే బుద్ధిమంతులచే బ్రయత్న పూర్వకముగ, దీని పరిహారోపాయము యోచింప దగినది.

ఇది "అస్వతంత్రా హి మాయా స్యా దప్రతీతేర్వినాచితిం। స్వతంత్రాపి తథైవ స్యాదసంగస్యాన్యథాకృతేః॥" (6. 132) మాయ చిద్రూపుడైన ఆత్మను వదలి, స్ఫురింపక పోవుటవలన స్వాతంత్ర్యము లేనిదే యగుచున్నది. కాని నిస్సంగుడైన కూటస్థుని, సంగము గలవానివిగా జేయగలుగుటవలన స్వాతంత్ర్యము కలదియు నగుచున్నది. ఈ మాయ "నిస్తత్వా కార్యగమ్యాస్య శక్తిర్మాయాగ్నిశక్తివత్। న హి శక్తిః క్వచిత్కైశ్చిత్ బుధ్యతే కార్యతః పురా॥' (2. 47) సత్తేతర స్వరూపము లేనిదియు, ఆకాశాదుల ద్వారమున నూహింప బడవలసినదియు, సత్పదార్థమునకు అగ్నిశక్తివలెనున్న శక్తి, బ్రహ్మభిన్నముగ మాయ యని వ్యవహరింపబడుచున్నది. కార్యముకంటె బూర్వము కారణశక్తి వ్యక్తము కాదుగదా. ఇట్లు బ్రహ్మభిన్నముగాని మాయ "న లోకే చైత్రతచ్ఛక్త్యో ర్జీవితం లిఖ్యతే పృథక్" (2. 51) లోకమునందు చైత్రుడను వానికిని, వాని శక్తికిని, జీవితము అన్యముదుగా లిఖింపబడనట్లు, బ్రహ్మభిన్నత్వ ముండదు. అయినను అది బ్రహ్మముగాక "కార్యాదాశ్రయతశ్చైషా భవేచ్ఛక్తిర్విలక్షణా" (13. 29) ఈ మాయాశక్తి తనచే గల్పితమైన

జగత్తుకంటెను, తనకాధార మగు బ్రహ్మముకంటెను విలక్షణముగనే యుండుచున్నది. మరియు నిది, బ్రహ్మవస్తువున బూర్ణముగ వ్యాప్తమై యుండక, నేకదేశమున నుండుననియు గ్రాహ్యము (2. 54, 78).

ఇది చిత్ప్రతిబింబముతో గూడినదియై, 'తమోరజస్సత్త్వగుణా ప్రకృతి ర్ద్వివిధా చ సా॥' (1. 15) 'సత్త్వశుద్ధ్యవిశు ద్ధిభ్యాంమాయాఽవిద్యే చ తే మతే' (1.16) సత్త్వరజస్తమో గుణాత్మకమై, శుద్ధాశుద్ధ రూపమున ద్వివిధమై, మాయ అవిద్య లనబరగుచున్నది. అందు, 'మాయాబింబో వశీకృత్యతాం స్యాత్సర్వజ్ఞ ఈశ్వరః। (1. 16) అవిద్యావశగ స్త్వన్య స్త ద్వైచిత్ర్యా దనేకధా॥ (1. 17) శుద్ధసత్త్వప్రధానమై, మాయయందు బ్రతిబింబించిన బ్రహ్మ ప్రతిబింబము, తనకుపాధియైన మాయను వశపరచు కొని, సర్వజ్ఞత్వాది లక్షణములుగల ఈశ్వరుడు అగును. మలిన సత్త్వమున గల బ్రహ్మ ప్రతిబింబము, అవిద్యకు స్వాధీనమై, అవిద్యా విచిత్ర స్వభావముచే నానాత్వము నొందుచు జీవ వాచ్యముగ నగుచున్నది. ఈ 'మాయాఖ్యాయాః కామధేనోర్వత్సౌ జీవేశ్వరావుభౌ' (6. 236) మాయ నాబడు కామధేనువునకు జీవేశ్వరులిరువురు దూడలగుచున్నారు.

మరియు నీ మాయను, 'జడం మోహాత్మకం....అనంత్యం తస్య సాఽబ్రవీత్, (6. 126) జడమును మోహాత్మకమును, అనంతమును అని శ్రుతివచించెను. ఘటాదులవలె జడమును, బుద్ధికి గోచరమై భ్రమింపజే యుచు మోహాత్మకమును. మాయ అగుచున్నది (6. 127). అంతియగాక, నది 'తుచ్ఛాఽనిర్వచనీయా చవాస్తవీ, (6. 130) శ్రుతి, యుక్తి, అనుభవ

ములచే గాలత్రయమున లేనిదిగను, అనిర్వచనీయముగను, సత్యమై నదిగా దెలియబడుచున్నది. ఈ 'అనాదిరవివేకోయం మూలావిద్యేతి గమ్యతాం, (6.25) అనాది యగు యీ అవివేకము, మూలావిద్య యనియు గ్రహింపవగును. ఈ మాయాశక్తి 'వివిధాక్రియా జ్ఞానబలాత్మికా, (13. 13) జ్ఞానేచ్ఛా క్రియా రూప వివిధ శక్తులుగ వచింపబడుచున్నది. ఇదియే అవిద్యా రూపమై, 'విక్షేపావృతిరూపాభ్యాం ద్విధాఽవిద్యా వ్యవస్థితా' (6.26) విక్షేప ఆవరణరూపమున ద్వివిధమై, కూటస్థుని అభావభ్రాంతికి గారణముగ, ఆవరణముగను, శుక్తము పైరజత మునువలె నాత్మయందు 'అవిద్యావృత కూటస్థే దేహద్వయయుతా చితిః। శుక్తౌ రూప్యవదధ్యస్తా విక్షేపాధ్యాస ఏవ హి॥, (6.33) స్థూల, సూక్ష్మ దేహములచే నారోపింపబడిన చిదాభాసుడే విక్షేపమను అధ్యాసమై యుండును.

ఇట్లు, ఆవరణ, విక్షేప స్వరూపిణి యగు మాయ యను బ్రహ్మశక్తి 'మృచ్ఛక్తివత్, (13.85) ఘటశరావాదుల సృజింపగల మృచ్ఛక్తివలె, కావి నిద్రాశక్తి స్వప్నమును సృజించినట్లు 'అనేకానన్నృతాన్ సృజేత్, (13.85) నానావిధములైన అసత్య వస్తువుల గల్పించుచున్నది. అదియే 'ఆనందమయ మారభ్య గూఢా సర్వేషు వస్తుషు, (3.38) ఆనందమయ కోశమునుండి సర్వవస్తువుల గూఢముగ నుండి 'సర్వవస్తు నియామికా, (3. 38) సర్వమును నియమించుచున్నది. అట్లుకానిచో వస్తువులయందు, ధర్మసాంకర్యమేర్పడుచున్నది (3. 39). అట్లుసర్వనియంతృత్వ శక్తి 'చిచ్ఛాయావేశతః చేతనేవ విభాతి సా, (3. 40) చైతన్య ప్రవేశముచేత చేతనత్వమును బొందినదానివలె దోచుచున్నది. ఈ శక్తి సంబంధముచేత,

'బ్రహ్మో వేశ్వరతాం వ్రజేత్, (3. 40) బ్రహ్మము, ఈశ్వరుడై వ్యవహరించునుగదా! 'ప్రసారణాచ్చ సంకోచాద్యథా చిత్రపట స్తథా, (6. 131) వికాస సంకోచములచే జిత్రములుగల వస్త్రము, వాని యునికిలేముల నెట్లు వ్యక్తపరచునో, అట్లు 'అస్య సత్త్వ మస త్త్వంత చ జగతో దర్శయత్యసౌ, (6. 131) జగత్తుయొక్క అస్తిత్వనాస్తిత్వముల నది దర్శింపజేయుచున్నది. స్వప్నముల గల్పించు నిద్రాశక్తియొక్క ఘటనాఘటన సామర్థ్య మెటులో అటులే, 'మాయాశ క్తేరచింత్యోఽయం మహిమేతి కిమద్భుతం, (13. 89) మాయాశక్తియొక్క జగత్సృష్టి సామర్థ్యము అచింత్యమనుటలో ఏమి ఆశ్చర్యము! 'మాయా యాం సర్వసంభవాత్, (6. 159) మాయయందు సర్వము సంభవించుటవలన 'సర్వకల్పనశక్తాయా మాయాయా దుష్కరం నహి, (8. 62) సర్వ జగత్కల్పనము గావించుటయందు సమర్థమైన మాయకు సాధ్యముకానిది లేదుగదా! అది స్వప్నగతులైన జీవేశ్వరులను సృజించునుగదా! (8. 63). ఈశ్వరునకు సర్వజ్ఞాది గుణములగూడ గల్పించినది యగుటచే దానికేది అసాధ్యము? (8.64). అందుచే నీ మాయ 'భ్రామయ త్యఖిలాన్ జనాన్, (6. 238) అఖిలమును భ్రమింపజేయుచు, అద్వితీయ బ్రహ్మమును గ్రహింపనివారి నెల్లర భ్రాంతి ముంచుచు (6.217) వియదాదిక నామరూపముల గల్పించుచు (2. 34) 'ఐంద్రజాలిక శక్తివత్, (13. 10) జగమునకు సృష్టి స్థిత్యంతకారిణి (13. 86) అగుచున్నది. అందుచే 'అసత్తా జాడ్యదుఃఖే ద్వే మాయారూప త్రయంత్విదం, (15. 23) అసత్త్వ, జడత్వ, దుఃఖత్వములు మూడును దీవి విలక్షణములు. ఈ ధముగ నిది దుర్ఘటత్వ లక్షణము (9. 135), 'విద్యతే మోహశక్తిశ్చ,

(4. 12) మోహింపజేసెడు శక్తియు గలిగి, కారణశరీరమై (1. 17) చెల్వొందుచున్నది.

అంత 'సంసారః పరమార్థోయం సంలగ్నస్స్వాత్మ వస్తుని। ఇతి భ్రాంతిరవిద్యా స్యా ద్విద్యయైషా నివర్తతే॥" (6. 10) పరమాత్మయందు యీ సంసారము సత్యముగ సంబంధించి యున్నది యను భ్రాంతి, విద్యచే నివారించునను వాక్యము చందము, కూటస్థునిగూర్చి జ్ఞానము గలుగగ "మాయైషేత్యుపశామ్యతి" (6. 136) మాయ ఉపశమించు చున్నది. ఆవరణ, విక్షేపరూపమైన విద్య యిట్లు అంతముకాగ (6. 53), "భూత భౌతిక మాయానామసమత్వేఽత్యంత వాసితే। సద్వస్త్వద్వైతమిత్యేషా ధీర్విపర్యేతి న క్వచిత్॥" (2. 98) భూతకార్యములును, వాని కారణమైన మాయయు, నసత్తని చిత్తమున దృఢమయినచో, అద్వైతమే సద్వస్తు వనెడి బుద్ధి ఎప్పటికిని విపర్యయముకాదు. ఇట్టి అసత్తైన మాయను, 'నిరంశేఽప్యంశమారోప్యం కృత్స్నేంఽశే వేతిపృచ్ఛతః। తద్భాష యోత్తరం బ్రూతే శ్రుతిః శ్రోతృ హితైషిణీ॥" (2. 58) పారమార్థిక ముగ బ్రహ్మము నిరంశమై యున్నను, అంశమును గల్పించి, మాయ బ్రహ్మవ్యాప్తమా ? అంశమా ? యను భ్రాంతిచే ప్రశ్నించు శిష్యునకు, శ్రోతయొక్క హితమునుగోరు వేదము ఆ శిష్యునికొరకు భాషారూపమున ఉత్తరము వచించుచున్నది అనుచు, నీ మాయ వ్యావహారికముగ మాత్రము గలదని స్పష్టపరుపబడి యున్నది. పారమార్థికముగ నది సంపూర్ణముగ నభావమే యగుచున్నది.

# ఈశ్వరుడు

'మాయాం తు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహేశ్వరం।
అస్యావయవభూతైస్తు వ్యాప్తం సర్వమిదం జగత్॥" (6. 123) మాయను ప్రకృతిగా గ్రహింపుము. మాయోపాధికుడైనవాడే మహేశ్వరుడు. ఈ పరమేశ్వరుని అవయవ స్వరూపములైన సర్వ చరాచర జీవులచేత, యీ జగత్తు సమస్తము వ్యాప్తమై యున్నది. అతడే "సమిష్టిరీశస్సర్వేషాం స్వాత్మతాదాత్మ్యవేదనాత్" (1. 25) సర్వమును దనతో నొక్కటిగ గ్రహించి యుండుటచే, నితడు సమష్టి యనబడగుచున్నాడు. అట్టి భావము లేకుండుటచే జీవుడు, వ్యష్టిమాత్రముగ నుండును. పూర్వము 'సచ్చిత్సుఖాత్మకం" (13. 62) "సత్యం జ్ఞానమనంతం" (3. 37) అని వర్ణితమైన "స్వతఃపూర్ణఃపరాత్మ" (5.4) యగు బ్రహ్మమే. "మాయాధీనశ్చిదాభాసశ్శ్రుతౌ మాయీమహేశ్వరః" (6. 157) మాయయందు ప్రతిబింబించిన చిదాభాసుడు మహేశ్వరుడని వచింపబడుచున్నాడు. పారమార్థికమైన బ్రహ్మమునకు, మాయాఽవిద్యలనెడు ఉపాధులేర్పడుటచే, "ఈశ్వరత్వం చ జీవత్వముపాధిద్వయ కల్పితం" (3. 37) ఈశ్వరత్వ జీవత్వములుపాధి కల్పితములుగ నేర్పడుచున్నవి. ఈ యుపాధులు లేకున్న "అఖండం సచ్చిదానందం పరం బ్రహ్మైవ లక్ష్యతే" (1. 48) అఖండ సచ్చిదానంద బ్రహ్మమే తెలియబడుచున్నది,

ఆ మహేశ్వరుడే "అంతర్యామీచ సర్వజ్ఞో జగద్యోని స్స ఏవహి॥" (6. 157) అంతర్యామియై, సర్వజ్ఞత్వము గలిగి, జగత్సృష్టికి గారణ మగుచున్నాడు. అతడు విజ్ఞానమయాది కోశములలో, పృథివ్యాది భూతములందును, 'అంత స్తిష్ఠన్ యమయతి తేనాంతర్యామితాంవ్రజేత్" (6. 163) అంతరమునసుండి ప్రేరేపించువాడగుటచే నంతర్యామిత్వ భావమును బొందును. ఆ ఈశ్వరశక్తియే సర్వమును నియమించు చున్నది (3. 38). అటులే "సర్వోపాదాన రూపత్వాత్సర్వత్రాయమవ స్థితః" (6. 165) సర్వమునకు ఉపాదానకారణమగుటచేత అంతటనుండి, అంతర్యామిత్వమును బొందుచున్నాడు. 'ద్విత్ర్యాంతరత్వ కక్ష్యాణాం దర్శనే ఒప్యయ మాంతరః। న వీక్ష్యతే....' (6.167) రెండు మూడు అంతరువులు గలుగుటచేత, నీ అంతర్యామి సర్వాంతరుడై చూడబడుటలేదు. అతనికి సృష్టియే శరీరము (6. 168). అది అస్వతంత్రమై, అంతర్యామి ననుసరించి ప్రవర్తించుచుండును (6. 170). అందు చేతనే రవిచంద్రాదికములు అంతర్యామి ననుసరించుచున్నవి (6. 181). మరియు నతడు జగద్యోని. 'జగద్యోనిర్భవేదేష ప్రభవాప్యయకృత్త్వతః। ఆవిర్భావతిరోభావావుత్పత్తి ప్రళయౌ మతౌ॥' (6. 182) సృష్టి నియమము జేయుటవలన, ఈశ్వరుడు జగత్కారణమగును. ఉత్పత్తి ప్రళయములే ఆవిర్భావ తిరోభావములనియు, ఉత్పత్తి ప్రళయములనియు వచింపబడును. ఎట్లన 'ఆవిర్భావయతి స్వస్మిన్' విలీనం సకలం జగత్। ప్రాణి కర్మవశాదేష పటో యద్వత్ప్రసారితః॥ (6. 183) వస్త్రము విస్తరింపబడినదనదగుచు, దనయందు గల చిత్ర

ముల దోపింపజేయురీతి. ఈశ్వరుడు తనలో లయించిన సమస్త విశ్వమును జీవుల కర్మ ననుసరించి వ్యక్తపరచుచున్నాడు. 'పున స్తిరోభావయతి స్వాత్మన్యేవాఖిలం జగత్। ప్రాణికర్మక్షయ వశాత్ సంకోచిత పటో యథా॥' (6. 184) మడత పెట్టబడిన వస్త్రమురీతి జీవులకర్మ క్షయింపగా, అఖిల సృష్టిని దనయందు మరల లయింపజేయును. ఆ కారణముచే నిందు ఆరంభ పరిణామ వాదములు అన్వయింపనేరవు (6.186). అతడు, పూర్వముండిన జీవ, కర్మ సంస్కారముల మాత్రము వ్యక్తపరచునుగాని సృజింపడు, తాను పరిణమింపడు. సృష్టికి, ప్రకృతి జడత్వమును దాల్పగ, నందు చేతనాంశముగ చిదాభాసుడై యుండును (6. 187). పృథివ్యాది సర్వము నతనినుండియే జనితము (6. 191). 'మాయా సృజతి విశ్వం' (6. 197) మాయోపాధికుడైన ఈశ్వరుడు విశ్వమును సృజించెను అని గ్రాహ్యము. ఈ విధముగ ఈశ్వరుడు అంతర్యామిత్వాది లక్షణ లక్షితుడై విరాజిల్లును.

పై విధముగ 'ఆనందమయ విజ్ఞానమయావీశ్వర, జీవకౌ। మాయయా కల్పితావేతౌ తాభ్యాం సర్వం ప్రకల్పితం॥' (6. 212, 7.3) ఆనందమయ విజ్ఞానమయకోశ స్థితులైన ఈశ్వర, జీవులు ఇరువురును, మాయాకల్పితులు వారిరువురిచే సర్వ సృష్టి కల్పింపబడియున్నది. ఎట్లన 'ఈక్షణాదిప్రవేశాంతా సృష్టిరీశేన కల్పితా। జాగ్రదాదివిమోక్షాంతస్సంసారో జీవకల్పితః॥' (6.213) సంకల్పాది ప్రవేశమువరకు ఈశ్వరకల్పితమై యుండ, జాగ్రదాది మోక్షము వరకు గల సంసారము జీవ కల్పితము. ఈ విషయ నిర్ధారణమున నెల్లరు

భ్రాంతి బొందు చున్నారు (6. 216). వీరిరువురును మాయికులు అయినను విశ్వముకంటె స్వచ్ఛత్వము గలిగియున్నారు (8.61). అందుచే 'మాయా వృత్త్యాత్మకో హీశసంకల్పస్సాధనం జనౌ। మనో వృత్త్యాత్మకో జీవసంకల్పోభోగసాధనం॥' (4. 19) జగత్ సృష్టి కార్యమున, మాయావృత్తి స్వరూపముగాగల ఈశ్వర సంకల్పము సాధనమగుచున్నది. మనోవృత్త్యాత్మకమైన జీవ సంకల్పము భోగసాధనమగుచున్నది. ఈవిధముగ 'జీవాత్మా పరమాత్మా చేత్యాత్మా ద్వివిధ ఈరితః' (14. 6) ఆత్మయేజీవ పరమాత్మ భేదమున ద్వివిధముగ దెలుపబడుచున్నది. అందు బరాత్మయో 'సచ్చిదానందస్తాదాత్మ్యం నామరూపయోః। గత్వా భోగ్యత్వమాపన్నః' (14. 7) సత్యజ్ఞానానంద స్వరూపుడగును. నామ రూపాదికములో దాదాత్మ్యమును బొంది' భోగియై జీవుడనబరగును.

ఈవిషయమును వివరింప, జిత్రదీపమున, విద్యారణ్యుడు 'కూటస్థో బ్రహ్మ జీవేశావిత్యేవం చిచ్చతుర్విధా। ఘటాకాశ మహాకాశౌ జలాకాశాభ్రఖే యథా॥' (6. 18) ఘటాకాశ, మహాకాశ, జలాకాశ, మేఘాకాశముల వలె, గూటస్థ, బ్రహ్మ, జీవేశ్వరుల చతుర్విధముగ జిత్రించియున్నాడు. ఇందు 'ఘటా వచ్ఛిన్న ఖేనీరం య త్తత్ర ప్రతిబింబితః। సాభ్రనక్షత్ర ఆకాశో జలాకాశ ఉదీరితః॥, (6. 19) ఘటములోగల, ఆకాశమునగల, ఉదకములో బ్రతిబింబించిన మేఘ నక్షత్రాదులతో నున్న ఆకాశము జలకాశము నాబడును. 'మహాకాశస్య మధ్యేయన్మేఘమండలమీక్ష్యతే। ప్రతిబింబితయా తత్ర మేఘా కాశో జలే స్థితః॥. (6. 20) ఘటసంబంధములేని మహాకాశ

మధ్యమున నే మేఘసముదాయము చూడబడుచున్నదో అందలి జలమున ప్రతిబింబితమైన ఆకాశము మేఘాకాశమనబడు చున్నది. ఈ చతుర్విధ ఆకాశములందము చతుర్విధ చైతన్యముచను గలవనియు, నందు 'అధిష్ఠానతయా దేహద్వయా వచ్ఛిన్నచేతనః। కూటవన్నిర్వికారేణస్థితః కూటస్థ॥, (6. 22) స్థూల, సూక్ష్మ, శరీరములతో గూడిన ఆత్మచైతన్యము అధారముగ నుండుటచేత దాగలివలె నిర్వికారముగ నుండువాడు కూటస్థు డనబడును. 'కూటస్థే కల్పితా బుద్ధిస్తత్ర చిత్ప్రతిబింబకః। ప్రాణానాం ధారణాజ్జీవ స్సంసారేణ నసాయుజ్యతే॥, (6. 23) కూటస్థునియందు బుద్ధి కల్పితము. అందు గూటస్థుని ప్రతిబింబము చిదాభాసుడు. అతడు, ప్రాణముల ధరించుటచే జీవుడగును. ఆ జీవుడు సంసారముతో సంబంధమును బొందు చున్నాడు. ఘటాకాశము జలాకాశముచే నెట్లు పరివృతమో, అట్లు జీవునిచే గూటస్థుడు తిరోహితుడగును. ఇదియే అన్యోన్యాధ్యాసము (6. 24) అగుచున్నది.

పూర్వాకాశ చతుష్టయమున గూటస్థ, జీవులకు ఘటాకాశ జలాకాశములన్వయించునట్లు, 'మాయాభాసేన జీవేశౌకరోతీతి శ్రుతౌ శ్రుతం। మేఘాకాశ జలాకాశావివ తౌ సువ్యవస్థితౌ।' (6. 155) మాయాశక్తి, చిదాభాస స్వరూపము చేత జీవేశ్వరులను కల్పించుచున్నదని వేదవచనము. వారిరువురును, జలాకాశ మేఘాకాశములవలె నుందురు. అటులే, ఘటాకాశ మహాకాశములు, ఈశ్వర బ్రహ్మములకన్వయించును. కాని 'మేఘాకాశమహాకాశౌ వివిచ్యేతే న పామరైః। తద్వద్బ్రహ్మేశయోరైక్యం పశ్యంత్యాపాతదర్శినః॥, (6. 194) పామరులచే, మేఘాకాశ మహాకాశ

ములను విభజించి దెలియబడవు. అట్లే ఈశ్వర బ్రహ్మములకు, భేదములే దని విమర్శా బుద్ధిలేని వారు చూచుచున్నాదిరు. 'అసంగం బ్రహ్మ మాయా సృజత్యేష మహేశ్వరః॥, (6. 195) బ్రహ్మమసంగము. కాని, మాయావీ విశిష్టుడైన మహేశ్వరుడు సృష్టి గావించుచున్నాడు. బ్రహ్మము మనో వాక్కులకతీతము (6. 196). ఈవిధముగ మహాకాశ, మేఘాకాశ జలాకాశ చతుష్టయమును, బ్రహ్మ, ఈశ్వర, కూటస్థ, జీవ, చైతన్య చతుష్టయమునకు అన్వయించి, విద్యారణ్యుడు తదర్థగ్రహణము సులభతరము చేసెను.

ఈశ్వర పరిణామము, చిత్రపట దృష్టాంతమునగూడ వివరింపబడి యున్నది. 'యథా చిత్రపటే దృష్టమవస్థానాం చతుష్టయం। పరమాత్మని విజ్ఞేయం తథావస్థా చతుష్టయం॥, (6.1) రంగుల వస్త్రమునందు ఎట్లు నాలు గవస్థలు గలవో అట్లు పరమాత్మయందుగూడ అవస్థా చతుష్టయము కలదు. ఎట్లన 'యథాధౌతో ఘట్టితశ్చ లాంఛితో రంజితః పటః। చిదంతర్యామీ సూత్రా త్మావిరాడాత్మా తథేర్యతే॥, (6. 2) ఎట్లు వస్త్రము ధౌత, ఘట్టిత, లాంఛిత, రంజితమని 'వచింపబడునో, అట్లు బ్రహ్మముగూడ చిత్, అంతరాత్మామి' సూత్రాత్మా విరాట్ అని తెలుపబడుచున్నది. ఆ విషయమును వివరించుచు 'స్వతః శుభ్రోఽత్ర ధౌతస్స్యా ద్ఘట్టితోఽన్నవిలేపనాత్। మష్యాకారైర్లాంఛి తస్స్యాద్రంజితో వర్ణపూరణాత్॥, (6. 3) ఈదృష్టాంత మందు, స్వాభావిక ముగ తెల్లనిదైనవస్త్రము ధౌతమగును. గంజిమొదలగు పదార్థములతో బిగా యడినదిఘట్టితమగును. మశితో, నాకారముల జిత్రింపలాంఛితమగును. రంగుల

వద్దుటచే రంజితమగుచున్నది. అట్లే "స్వతశ్చిదంతర్యామీ తు మాయావీ సూక్ష్మసృష్టితః। సూత్రాత్మా స్థూలసృష్ట్యైవ విరాడిత్యుచ్యతే పరః॥" (6. 4) స్వతస్సిద్ధమైన బ్రహ్మము చిత్తనబడును. మాయతోకూడిన, అంతర్యామి యనబడును. అపంచీకృత భూతసృష్టి సంబంధమున సూత్రాత్మ యనబడును. పంచీకృత స్థూల భూతసృష్టి సంబంధమున విరాటని వచింపబడును. ఆబ్రహ్మస్తంబపర్యంత సృష్టి చిత్రపటమునగల వర్ణముల బోలుచున్నది.

'మాయాయాం సర్వసంభవాత్' (6. 159) మాయలో అఖిలము గలుగ వకాశముండుటచే, ననగా నా మాయ అఘటనాఘటన సామర్థ్యము గలిగియుండుటచే, జీవేశ్వరుల సృజించుటయేగాక, ఈశ్వరు నాశ్రయించి, నతని జగద్యోనిగ జేయుచు (6. 182), ఆకాశాదిక సృష్టిని గల్పించి (2. 34), వాని బంచీకృతము జేయుచున్నది. (1. 26), ఈ పంచీకృత ప్రపంచమునకు భోక్తగనుండ "కృత్వా రూపాంతరం జైవం దేహే ప్రావిశదీశ్వరః" (4, 10) ఈశ్వరుడు జీవసంబంధమైన రూపాంతరమును సృజించి, అందు బ్రవేశించెను అనియు, నీశ్వరుడే జీవరూపమును ధరించినట్లు విద్యారణ్యుడుతెలిపెను. ఇక జీవస్వరూప విషయము యోచించెదముగాక!

## జీవుడు

'జీవాత్మా పరమాత్మా చేత్యాత్మా ద్వివిధ ఈరితః। చిత్తాదాత్మ్యాత్త్రిభిర్దేహైః జీవస్సన్ భోక్తృతాం వ్రజేత్॥' (14. 6) ఆత్మ, జీవాత్మ,

పరమాత్మ యని ద్వివిధముగ వచింపబడును. శరీర త్రయముతో చైతన్య ము యొక్క అనగా ఆత్మయొక్క తాదాత్మ్య భ్రాంతిచే జీవుడగుచు, భోక్తృ త్వమునుగూడ బొందును. పరమాత్మ సచ్చిదానందరూపుడగుచుండ, "తాదాత్మ్యం నామరూపయోః। గత్వా భోగ్యత్వమాపన్నః" (14. 7) నామరూప తాదాత్మ్యమును బొంది, భోగ్యత్వమును జీవాత్మ పొందును. అనగా "పరమాత్మాఽద్వయానందః పూర్ణః పూర్వే స్వమాయయా। స్వయ మేవ జగద్భూత్వా ప్రావిశజ్జీవరూపతః।' (10. 1) పూర్వము అద్వయా నందుడై, పరిపూర్ణుడైన పరమాత్మ, స్వీయ మాయామహిమచే దానే విశ్వ రూపము దాల్చి, జీవస్వరూపమున అందు ప్రవేశించెను. ఈ విషయమే "కృత్వారూపాంతరం జైవం దేహే ప్రావిశ దీశ్వరః" (4. 10) జీవునిగ రూపాంతరమును గల్పించి, ఈశ్వరుడు ఆదేహాదికమున బ్రవేశించెననియు దెలుపబడియున్నది. తమః ప్రధానమైన పరమాత్మ, సర్వశరీరములకు గారణమగుచుండ, "చిత్ప్రధానశ్చిదాత్మనాం" (6. 188) చైతన్య ప్రధా నుడగు పరమాత్మచేతనులైన జీవులకు గారణమగును.' ఏషజీవానాంకారణం' కపేత్ (6. 187) ఈశ్వరుడే జీవులకు గారణమగును అని మరియొక వాక్యతాత్పర్యము. జీవ, బ్రహ్మ, తారతమ్యమును బ్రస్తావించి, 'అంతఃకర ణసాహిత్యరాహిత్యాభ్యాం విశిష్యతే। ఉపాధిర్జీవభావస్య బ్రహ్మతాయాశ్చ నాన్యథా।' (7. 85) జీవ, బ్రహ్మముల ఉపాధిత్వము, అంతఃకరణముతో గూడుటచేతను, గూడకుండుటచేతను భేదించుచున్నదవి స్పష్టపరుపబడెను.

అనగా 'యదామలినసత్త్వాం తాం కామకర్మాపి దూషితాం। ఆదత్తే తత్పరం బ్రహ్మ త్వంపదేన తదోచ్యతే॥' (1.45) ఎప్పుడా పరబ్రహ్మముమలిన సత్త్వ ప్రధానమును కామకర్మ కలుషితమునునైన మూలప్రకృతిని స్వీకరించునో, అప్పుడదిత్వం పదవాక్యమైన జీవత్వమును వహించును అనియు విశదము.

ఈశ్వర ప్రస్తావన సందర్భమున దెలుపబడినట్లు. ఈశ్వరత్వ జీవత్వములు రెండును, "ఉపాధిత్వకల్పనం" (3. 37) శుద్ధ మాయ అశుద్ధమాయా కల్పనములు. మాయావృత్త్యాత్మకుడు ఈశ్వరుడై యుండ, మనోవృత్త్యాత్మకుడు జీవుడు (4. 19). మాయయే జీవేశులను జిభానులనుగా గావించి, వారిచే నీ విశ్వమును గల్పించుచు (7. 3), వారిరువురికి విజ్ఞాన మయ ఆనందమయముల నుపాధులుగా నొసంగి, 'మాయాఖ్యాయాః కామధేనోర్వత్సౌ జీవేశ్వరావుభౌ।యథేచ్ఛం పిబతాం ద్వైతం తత్త్వం త్వద్వైత మేవ హి॥' (6. 236) తా కామధేనువై, జీవేశ్వరులనబడు దూడలకు ద్వైత క్షీరమును యథేచ్ఛగ నొసంగుచున్నది. ఆ విధముగ వారు మాయా కల్పితులు. కాని పారమార్థికముగ అద్వైత పరబ్రహ్మము ఒక్కటియే యగుచున్నది.

ఇట్లు అఘటనా ఘటన సామర్థ్యముగల మాయ, అసంగకూటస్థుడైన ఆత్మను, ప్రపంచ స్వరూపునిగా జేసి (6. 133), మరల నా జీవుడు తా కూటస్థుడనని యెరుంగునట్లు చేయుచు (6. 25), స్థూల, సూక్ష్మ, దేహద్వయముతో దాదాత్మ్యము గలుగజేసి, "తదాహం సంసారీత్యేవం జీ

వోఽభిమన్యతే"(7.7) అంత నేను సంసారినను అభిమానము గలవానిగా జేయుచున్నది. ఈ విధముగా గూటస్థసహిత చిదాభాసుడే భోక్తయగు చున్నాడు (7. 197). ఈ భోక్తయే "స్వస్యైవ భోగాయ పతిజాయాది మిచ్ఛతి" (7. 201) స్వార్థ భోగమునకు భర్తృ భార్యాదిక పరికరముల గోరుచున్నాడు. ఇట్లు, దేహేంద్రియాది సహితుడై యున్నను. జీవుడు పారమార్థికముగ గూటస్థుడే అయి యున్నాడు (8. 48).

పూర్వోక్తవిధాన, "సన్నిరుద్ధస్తత్ర మాయయా అన్యః" (6. 197) ఈశ్వరభిన్నుడైన జీవుడు. మాయచే నీ విశ్వమున విరోధింపబడ, ప్రాణా ధారమున జీవుడై సంసారమున బంధింపబడుచు (6.23), త్రివిధ శరీర బద్ధుడగుచున్నాడు. అంతస్థూల దేహ సంబంధమైన కోట్లకొలది వాత, పిత్త, శ్లేష్మ, జన్మ, వ్యాధి గ్రస్థుడై (7. 224), అటులే సూక్ష్మ శారీరకమైన కామ, క్రోధ, లోభ మోహ, మధ మాత్సర్య, దంభ దరాసూయాది దుర్గు ణములచే బట్టుబడి (7. 225), కారణ దేహస్థమగు అజ్ఞానముచే ఆగామి కర్మబీజములచే మథింపబడుచునుండును. అనగా ఈ శరీర త్రయమునగల పంచకోశముల నిరికి (3. 41), వానితాదాత్మ్యమునగల పంచకోశముల నిరికి (3. 41, వాని తాదాత్మ్యమున నహంభావమును బొంది. మనస్సును గరణ ముగ స్వీకరించి, బాహ్యాంతర వృత్తులచే సలంకృతుడై 10.6) యొప్పా దును. ఆ ప్రవృత్తుల ననుసరించి జీవునకు సర్వేంద్రియ ములు, వాని విషయములైన భూతాదికము గల్పింపబడెను (1. 18-24). ఇటుల బంచ కోశ విచారణముచేతమాత్రమే జీవుని గ్రహించి, యందధిష్ఠానమైన బ్రహ్మ మును దెలియ సాక్షాత్కారము (3.1

ఈశ్వరుని మాయాశక్తిచే నిట్లు మోహితుడై (4. 12), 'స్వయ మేవ జ్వరామాతి మన్యతేహి కుటుంబివత్' (7. 232) శరీరత్రయ జ్వర ములచే బాధితుడై సంసారివలె జీవుడు తపించుచుండును. అంత బుణ్య పాప ద్వంద్వమున గట్టుబడును (7. 212). అపుడు "చిత మత్త్వాచ్చేత నోఽయ మిచ్ఛాద్వేష ప్రయత్నవాన్। స్యాద్ధర్మాధర్మయోః కర్తాభోక్తా దుఃఖాది మత్త్వతః॥" (6. 91) ఈ యాత్మ ఇచ్ఛాద్వేష ప్రయత్నములు గలవాడై జ్ఞానచేతనుడై, ధర్మాధర్మాచరణమున సుఖదుఃఖములు కలవాడై, పుణ్యాపాపఫల భోక్తయుగూడ నగును. ఈ విధముగ నేర్పడిన "జీవద్వై తంతు శాస్త్రీయ మశాస్త్రీయ మితిద్విధా। ఉపాదదత శాస్త్రీయ మాతత్త్వ స్యావ బోధనాత్॥" (4. 43) జీవుని ద్వైతప్రపంచము శాస్త్రీయ అశాస్త్రీ యముగ ద్వివిధము. తత్త్వగ్రహణరూపము శాస్త్రీయము. అశాస్త్రీయము మంద తీవ్రములుగ ద్వివిధమై కామక్రోధాదికము తీవ్రము కాగ సంతత విషయధ్యానము మందము అగును. సత్వరజస్తమోగుణ విశిష్టత్వమున "వైరాగ్యశాంతి ఔదార్య'ము లనెడు సత్వగుణములచేతను, 'కామ క్రోధ లోభ యత్నాదు' లనబరగు రజోగుణముల చేతను, 'ఆలస్య 'భ్రాంతి' రూప తమోగుణముల చేతను (2, 14, 15) ముంచి వేయబడుచున్నాడు. సత్వగుణముచే బుణ్యము, రజస్సుచే పాపము, తమస్సుచే రెండును గలు గును. ఈ రీతి "తే పరాగ్దర్శినః ప్రత్యక్తత్వబోధ వివర్జితాః। కుర్వతే కర్మ భోగాయ కర్మ కర్తుంచభుంజతే॥" (1.29) 'నద్యాం కటా ఇవావర్తా దావ ర్తాంతరమాశుతే। వ్రజంతే జన్మనో జన్మ లభంతేనైవ నిర్వృతిం॥" (1.30)

బాహ్యవస్తుదృష్టిమాత్రమే గలిగి, అంతర్దృష్టి దమ నైజము యొక్క జ్ఞానము లేనివారై బహువిధ పుణ్య పాపకర్మలను సుఖదుఃఖానుభవము నకై చేయుదురు. ఈ కర్మవశులైన జీవులు నదియందుబడిన కీటకములు ఒక సుడినుండి మరియొక సుడిలోనికి అతి శీఘ్రముగ బడుచుండు రీతి ఒక జన్మమునుండి మరియొక జన్మమునకు బోవుచున్నవారై శాంతిని బొందరు.

వ్యావహారికముగ నిట్లున్నను పారమార్థికముగ జూచుచో "సుఖ దుఃఖైకకర్మకార్యే త్వౌదాసీన్యం స్వభావతః (11. 93) జీవుని సుఖదుఃఖ ములు కర్మాధీనములైయుండ, అతని స్వభావ సిద్ధ లక్షణము ఉదాసీనత్వమే యగును. బుద్ధి చాంచల్యమున సాక్షియైన తానే కర్మాచరణము గావించునట్లు దోచును (10. 19). సూక్ష్మబుద్ధితో 'కోశోపాధి వివక్షాయాం యాతి బ్రహ్మైవ జీవతాం' (3.41) పంచకోశాది ఉపాధుల విచారింపగ బ్రహ్మమే జీవవ్యవహారమును బొందుచున్నట్లు విదితమై, "మాయాఽవిద్యే విహాయైవ ఉపాధీపరజీవయోః। అఖండం సచ్చిదానందం పరంబ్రహ్మైవలక్ష్యతే॥" 1. 48) జీవేశ్వరులకు ఉపాధులగు మాయా అవిద్యల విడిచి అఖండమైన సచ్చిదానందస్వరూపమైన పరబ్రహ్మమే గురుతింప బడుచున్నది. 'ఏక ఏవహి భూతాత్మ భూతే భూతే వ్యవస్థితః। ఏకధా బహుధా చైవ దృశ్యతే జల చంద్రవత్॥" (15. 7) పరమాత్మ ఏకమై యుండియు, ప్రతి శరీరము నందు నుండి, జలమున బ్రతిబింబించు చంద్రునివలె ఒక్కడుగను, అనేక ముగను కనుగొన బడుచుండుట విదితముగదా. బ్రతిబింబదృష్ట్యా అనేక ము, బింబరూపమున నేకముగదా. అందుచే పారమార్థిక దృష్టికి "న

నిరోధో నచోత్పత్తిర్న బద్ధో న చ సాధకః। న ముముక్షుర్న వై ముక్త ఇత్యేషా పరమార్థతా॥" (6. 235) నాశోత్పత్తులు లేవు. బద్ధుడు లేడు. సాధకుడు లేడు. ముముక్షువుగాని ముక్తుడుగాని లేడు. ఇదియే పరమార్థ స్థితి అని సర్వవేదాంత తాత్పర్యమును విద్యారణ్య యతిసార్వభౌముడుస్పష్టపరచియున్నాడు.

# సృష్టి

"తాభ్యాం సర్వం ప్రకల్పితం" (6. 212) విజ్ఞానమయ స్వరూపులైన ఈశ్వర జీవులచే సర్వప్రపంచము కల్పితము. "ఈక్షణాది ప్రవేశాంతా సృష్టిరీశేన కల్పితా। జాగ్రిదాది విమోక్షాంతస్సంసారో జీవకల్పితః॥" (6. 213) సంకల్ప మాదిగా గలిగి, ప్రవేశమంతముగ గల సృష్టి ఈశ్వర కల్పితము, జాగ్రత్తునుండి మోక్షపర్యంత సంసారము జీవకల్పితము. ఈ సర్వ వ్యావహారిక సృష్టిని ఈశ్వరుడు కల్పించుటచే నతడు, "జగద్యోని" (6. 182) అనబడుచున్నాడు. కాని యిందు ఈశ్వరుని స్వార్థమావంతయు లేక, నీ సృష్టి సర్వము, "తద్భోగాయ పునర్భోగ్యభోగాయతన జన్మనే॥" (1. 26) ఆ జీవుని అనుభవముకొరకై, మరల భోగ్యములు దేహమునకు, ఆకాశాదికమును ఈశ్వరుడు సృజించుచున్నాడు. ఇట్లు ఈశ్వర నిర్మితములు, "ఈశనిర్మితమణ్యాదౌ వస్తున్యేకవిధే స్థితే। భోక్తృధీ వృత్తినానాత్వాత్తద్భోగో బహుధేష్యతే।" (4. 20) ఒకే విధముగ నుండక, అను

భవించెడివారి వృత్తిభేదముచే, వాని అనుభవము విభిన్నమై అనుభవింప బడుచున్నది. వానిచే నొకనికి ఆనందము, మరియొకనికి దుఃఖమును, యితరుని కౌదాసీన్యత్వమును గలుగుజేయుచుండుటయు గలదు (4. 22).

ఈ జీవేశ్వర కల్పితమైన సృష్టి, జీవుల సంస్కారముల చేతను పుణ్య పాపకర్మలచేతను (6. 188) గల్పింపబడుచున్నది. "ఆవిర్భావ యతి స్వస్మిన్ విలీనం సకలం జగత్। ప్రాణికర్మవశాత్—" (6. 183) ఈశ్వరుడు తనలో లీనమైయున్న సకల ప్రపంచమును. జీవ కర్మవశాను సారముగ ఆవిర్భవింపజేయును. అటులే, "పునస్తిరోభావయతి స్వాత్మన్యే వాఖిలం జగత్। ప్రాణికర్మక్షయవశాత్—" (6. 184) జీవుల కర్మ క్షయము కాగా అఖిల విశ్వమును, స్వాత్మయందే మరల లయింపజేయు చున్నాడు.

సృష్టికి ప్రారంభమున, పంచభూతోత్పత్తి జరిగెను. ఈ పంచ భూతముల వివేకమువమాత్రమే సృష్టి రహస్యము, దాని కాధారమైన బ్రహ్మవిషయము బోధితము కానేరదు (2. 1) "శబ్దస్పర్శౌ రూపరసౌ గంధో భూతగుణా ఇమే। ఏక ద్విత్రిచతుః పంచగుణా వ్యోమాదిషు క్రమాత్॥" (2. 2) ఆకాశాదిగ భూత పంచకమునకు, శబ్దాది గుణములు" క్రమముగ నొకటి, రెండు, మూడు, నాలుగు, అయిదుగ, నేర్పడుచున్నవి. అందుండియే "శ్రోత్రం త్వక్చక్షుషీ జిహ్వాఘ్రాణం చేంద్రియపంచకం. (2. 6) అను పంచేంద్రియములు, శబ్దాదుల గ్రమముగ గ్రహింపు కొనుటకేర్పడియున్నవి. అటులే "వాక్పాదపాణిపాయూపస్థ" (2. 11)

లును గర్మేంద్రియములుగ గలిగినవి. "మనోదశేంద్రి యాధ్యక్షం హృత్పద్మేగోళకేస్థితం" (2. 12) పై దశేంద్రియముల కధ్యక్ష రూపమున మనస్సు హృదయ పద్మములోనున్నది. దీనికి "సత్వం రజస్తమ శ్చాస్య గుణా" (2. 13) సత్వరజస్తమో రూపమున మూడు గుణములు. సత్వమునకు వైరాగ్యాదిక సద్గుణములుండి పుణ్యమును, రజస్సునకు గ్రామ క్రోధాదులగు దుర్గుణములుండుటచే పాపమును, తమస్సునకు ఆలస్య గామ భ్రాంత్యాది వికారములుండి పుణ్యపాపములును గలుగుచున్నవి. అటులే జీవునకు భోగ్యజాతము లన్నియు నీ వియదాది పంచకము చేతనే గలుగుచు నతనికి సుఖదుఃఖముల ననుభవింప జేయుచున్నవి. ఈ విధముగ గల్పింప బడిన విశ్వము "నామరూపాత్మకం" (13. 62) అగుచున్నది. కాని యీ సృష్టి యంతయు మిథ్యారూపమే. ఇది జీవేశ్వరులకంటె స్థూలము మలినము అగును (8. 61).

ఈ సృష్టియంతయు అనగా "వియదాదే నామరూపే మాయయా సుకల్పితే' (2. 34) ఆకాశాది నామరూపాత్మక విశ్వము మాయచే గల్పింపబడినదని పూర్వము గ్రహించి యుంటిమి. "మాయా మేఘో జగన్నీరం వర్షత్యేవ యథాతథా।" (8. 75) ఈ మాయామేఘము జగత్తు నా ఉదకమును ఎట్లో యట్లు వర్షించుచునే యున్నది. స్వప్న కారణమగు నిద్రాశక్తివలె "బ్రహ్మణ్యేషా స్థితా మాయా సృష్టి స్థిత్యంతకారిణీ" 13. 86) పరబ్రహ్మము నాధారముగాగల మాయాశక్తి ఉత్పత్తి స్థితి లయముల "అనేకా ననృతాన్ సృజేత్...." (13. 85) ననేకముగ వాస్త

వమున లేనివాని బుట్టించును. కూటస్థాంగమైన ఆత్మనే జగద్రూపునిగ మాయ చేయుటయం దాశ్చర్యమేమి ? అదియే జీవేశులనుగూడ గల్పించు చున్నదిగదా ! (6. 133). అది ఐంద్రజాల శక్తి వంటిదని (13.10) పూర్వమే చూచియున్నాము. చిత్రపటమునకు బ్రసారణ సంకోచముల గలుగజేయునటుల నీ విశ్వమునకు "సత్త్వమసత్త్వం చ జగతో దర్శయ త్యసౌ॥" (6. 131) ఆ మాయయే ఉనికి లేముల జూపించు చున్నది. అందుచే "స్పష్టంభాతి జగచ్చేద మశక్యం తన్నిరూపణం। మాయామయం జగత్తస్మా దీక్ష స్వాపక్షపాతతః' (6. 142) ఈ జగత్తు స్పష్టముగ జూడబడుచున్నది కాని· దాని నిరూపణము అశక్యము. కాన ఏ పక్షపాతమును లేక నది మాయామయముగ దెలిసికొనవలెను.

యథార్థమును విచారింప నది 'అద్వితీయ బ్రహ్మతత్త్వే స్వప్నో ఽయమఖిలం జగత్। ఈశజీవాది రూపేణ చేతనాచేత నాత్మకం॥" (6. 211) జడ చేతనరూపమై జీవేశ్వర సహితమైన ఈ అఖిల సృష్టి యంతయు ద్వైతరహితమైన బ్రహ్మమునందు స్వప్నమేసుమా ! అద్దమున ఆకాశము ప్రకాశించునట్లు బ్రహ్మమునందు యీ జగము తోచుచున్నది. అంతయు గల్పితమే ( 6. 46). ఈ ద్వైత కల్పనమంతయు "అచింత్యా మిథ్యా తేనేంద్రజాలవత్' (6. 255) నింద్రజాలము చందము మిథ్యా భూతమై అచింత్యముగదా! అట్టి అచింత్యముల దర్కముచే యోచించి ప్రయోజనమేమి ? (6. 150). "అచింత్య రచనారూపం మనసాఽపిజగత్తను" (6. 150) మనముచేగూడ యోచింపరాని ప్రపంచము అచింత్య

కల్పనము. అందుచే "మనోరాజ్యా ద్విశేషఃకః క్షణధ్వంసిని లౌకికే అతోఽస్మిన్భాసమానేఽపి తత్సత్యత్వ ధియం త్యజేత్॥" (13. 98) క్షణ కాలముండి నశించు ఈ లోకమున, మనోరాజ్యముకంటె ఏమి విశేషము గలదు ? రెండునుగూడ క్షణికములే. నశ్వరములే. ఆ కారణమున, ఈ ప్రపంచము భాసించుచున్నను, దాని సత్యత్వ బుద్ధిని త్యజింపవలెను. 'తదా స్తిమితగంభీరం న తేజో న తమస్తతం। అనాఖ్యమనభివ్యక్తం సత్కించి దవశిష్యతే॥" (2. 40) అపుడు నిశ్చలమై గంభీరమై, వెలుగునీడలు కానిదై. వ్యాప్తమై. అనామకమై, ఇంద్రియాతీతమై , అనిర్వచనీయమగు సత్ బ్రహ్మమే శేషించును. ఇదియే దృష్టిగోచర సృష్టియొక్క యథార్థ స్వరూపము. తదన్యమంతయు నయథార్థము. కాన నీ పరమార్థ రహస్యము నెరుంగుటయే ముఖ్య తాత్పర్యముగా, విద్యారణ్య మునిచంద్రుని మతము.

## సాధన

"అనాదిమాయయా భ్రాంతౌ జీవేశౌ సువిలక్షణౌ।మన్యంతే తద్వ్యుదాసాయ కేవలం శోధనం తయోః॥" (6.223) అనాది మాయా ప్రాబల్యము నొందినవారు., జీవేశ్వరులకు వాస్తవ భేదము గలదని భ్రాంతిచే దలంచు చున్నారు. ఆ జీవేశ్వర విభేద నివృత్తికొరకు, ఆ యిరువురి పరిశోధనము ముఖ్యమగుచున్నది. ఇటుల జీవేశ్వరత్వమునుగూర్చియేగాక, "అచింత్య రచనారూపం మాయైవ సకలం జగత్। ఇతి నిశ్చిత్య వస్తుత్వమద్వైతే

పరిశేష్యతాం॥" (6.246) అచింత్య కల్పనా స్వరూపముగల సకల ప్రపంచ మును, మిథ్యయే యని నిశ్చయించి, అద్వైతమందు వాస్తవత్వము శేషింప బడుగాక! అందుచేత, "సదా విచారయేత్తస్మాత్ జగజ్జీవపరాత్మనః । జీవ భావజగద్భావబాధే స్వాత్మైవ౽ శిష్యతే॥" (6.12) జగత్తు, జీవ, పరమా త్మలగూర్చి ఎల్లప్పుడును పరిశీలింపవలయును. జీవ, జగద్భావములు నివా రింపబడగా, స్వాత్మయే శేషించుచున్నది. ఈ సాధనా విధానమే అద్వైత వాదమున, బరమ తాత్పర్యముగనున్నది.

పై నుదాహరింపబడిన భ్రాంతికి గారణము "చిత్తమేవహి సంసారః' (11.113) చిత్తనుటచేత దానిని, "తత్ప్రయత్నే న శోధయేత్" (11.113) ప్రయత్న పూర్వకముగ శోధింప వలెననియు నా దేశము. ఎందుచేనన, "చిత్తస్య హిప్రసాదేన హంతి కర్మ శుభాశుభం। ప్రసన్నా త్మాత్మని స్థిత్వా సుఖమక్షయ్యమశ్నుతే॥" (11.114) చిత్త నిర్మలత్వ మున, సుఖదుఃఖ ప్రదమైన కర్మ సంచయము నశించును. అట్టి ప్రసన్నాత్ముడు స్వస్వరూపమున స్థితుడై, నశింపని సుఖమును బొందు చున్నాడనియు ఫలము గోచరము. కాన ధీరుడగువాడు, "ధీరత్వమక్ష ప్రాబల్యే౽ప్యానందాస్వాదవాంఛయా। తిరస్కృత్యాఖిలాక్షాణి తచ్చింతాయాం ప్రవర్తనం॥" (11.124) ఇంద్రియములు ప్రబలముగనున్నను ఆనందా స్వాదన వాంఛచే, నఖిలేంద్రియముల దిరస్కరించి, బ్రహ్మానుసంధానము నందు బ్రవర్తించుట యను ధీరత్వమును బ్రదర్శించి, ప్రవర్తించుట ఉచితమనియు విద్యారణ్యుని ఉద్బోధ.

కాన, బై విధానమున, "మనో దశేంద్రియాధ్యక్షం" (2.12) దశేంద్రియాధ్యక్షత్వమును వహించునదియై, 'న జాతుకామః కామానాముప

భోగేన శామ్యతి" (7.147] కామము, కామోపభోగమున నశింపక నభివృద్ధి గాంచుచున్నను, ఆశ్విషయముల, నా యింద్రియముల బ్రవర్తింపజేసి, ఆత్మ దూరువి జేయుచుండుటచే, నా చిత్తమును దుదముట్టింపజేయవలయును. ఈ మనోనాశము లేమిచేగదా "తగా దుఃఖైర్నలిప్యేరన్నలరామయుధిష్ఠిరాః నల, రామ, యుధిష్ఠిరాదులు మహాదుఃఖముల ననుభవించిరి? [జీ. ప్ర. 2ప్ర] కాన దాని నెదుర్కొని, 'కామ జానామి తే మూలం సంకల్పాత్కిల జాయసే। న త్వాం సంకల్పయిష్యామి సమూలస్త్వం వినంక్ష్యసి॥ [జీ. ప్ర. 3ప్ర] ఓ కామమా! నీ మూలము తెలిసినది. నీవు సంకల్పమువలన బుట్టు చున్నావు. అట్టి సంకల్పమును నేనిక జేయను. అంత నీవు సమూలముగా నశించెదవు, అను ధీరోదాత్తత వహించి, "వాసనాక్షయవిజ్ఞానమనోనాశా మహామతే।" [జీ. ప్ర. 2 ప్ర] వాసనాక్షయ, తత్త్వజ్ఞాన, మనో నాశములే, మోక్షఫల కారణములగుటచే, సాధకుడు వాసనా క్షయముకంటె బరమ పదము అభావమని [4. 65] గ్రహించి, వాసనాక్షయరూప మానోనాశము నకై యత్నింపవలెను. అనగా మనో జయము నార్జింపవలెను.

కాని యీ మనోజయ సిద్ధి సులభ సాధ్యముకాదు. "ఉభయంతత్త్వ బోధాత్ప్రాజ్నివార్యం బోధసిద్ధయే। శమ స్సమాహితత్వం చ సాధనేషు శ్రుతం తతః॥' [4.50] బ్రహ్మ జ్ఞానాభ్యాసమునకు బూర్వము, జ్ఞానసిద్ధి కొరకు ద్వివిధ మానస ప్రపంచము నివారింపబడవలెను. అవియే నిషిద్ధ, ద్వైత ప్రవృత్తులు. అందుచే, సాధనచతుష్టయమునందును, శమసమా ధానములందును ప్రవేశము లభించును. అందుచే 'వైరాగ్యం శాంతి

గాచార్యమిత్యాద్యాస్సత్వస్యంభవాః। కామక్రోధా లోభ యత్నావిద్యాద్యా
రజ సోత్థితాః॥' [2.14] 'ఆలస్యభ్రాంతి తంద్ర్యాద్యా వికారాస్తామసోత్థితా।'
(2. 15) వైరాగ్య క్షాంతి, యౌదార్యాది సద్గుణపుంజము, సత్త్వగుణముచే
జనించు ననియు, కామ క్రోధ లోభయత్నాదికము రజస్సుచే బుట్టొందు
ననియు, నటులే ఆలస్య భ్రాంతి నిద్రాదిక దుర్గుణములు తామస జనితములని
యు నెరింగి, ద్వితీయ, తృతీయ గుణములు పాప అయుక్షీణ జనకములగు
చుండ, ప్రథమమైన సాత్త్వికగుణముచే బుణ్యము ప్రవర్ధమానమగుననియు
(2. 16) గ్రహించి, వైరాగ్యబోధోపరతులు మోక్షసాధనహేతువు అగుటచే,
వాని వార్జింప యత్నించవలెను. 'దోషదృష్టిర్జిహాసా చ పునర్భోగేష్వదీనతా,
అసాధారణహేత్వాద్యా వైరాగ్యస్య త్రయోవ్యమీ॥' (6. 278) విషయములం
దోషదృష్టియు, పరిత్యాగమును, మరల వానిపై ననిచ్ఛయు, వైరాగ్యమునకు
ప్రబల కారణములు. ఈ వైరాగ్యము, బోధరూప తత్త్వజ్ఞానము, ఉపరతి
వాటకు యమాదికము, 'మహతః తపసః ఫలం' (6. 282) అనేకజన్మ
సముపార్జిత పుణ్యఫలములు. 'బ్రహ్మలోకతృణీకారో వైరాగ్య స్యావధిః'
(6. 285) బ్రహ్మలోకాదికమును తృణసమముగ జూచుట వైరాగ్యమున
కవధి. 'పతతి నియమవాన్ యమేష్వ సక్తః' (జీ. ప్ర. 3 ప్ర) యమాదిక
పాలనములేక నియమముల ననుష్ఠించువాడు, పతితుడగు ననురీతి వైరాగ్య
మును సేవించి, అహింసాదిక బాహ్యేంద్రియ జయము ప్రథమతః అవస
రము. అందులకు పై రచింపబడిన మనోజయమునకై చిత్తముయొక్క
రెండు భాగములను భోగములకును, ఒక భాగమును శాస్త్రాధ్యయనము

నకును, ఒక భాగము గురు శుశ్రూషకొరకును ప్రథమమున నియోగింప వలెను. అంత కొంతకాలమునకు ఒకభాగమును భోగములకును, రెండు భాగముల గురుశుశ్రూష కొరకును, ఒక భాగమును విచారణమునకు మన యము క్తపరుప వలెను. చివరకు వివేకము నార్జించి, భోగములద్రోసి. సంపూర్తి వై రాగ్య సంపన్నుడై, రెండు భాగముల శాస్త్రవిచారణమునకును, రెండు భాగముల గురుశుశ్రూషకొరకు నుపయోగింప వాసిష్ఠ రామాయణ వచనముల జీవన్ముక్తి ప్రకాశిక అనువదించినది (3. ప్ర). కాన గురుసన్నిధానమున, జీవ విచారణమున, మనోగ్రహణము, తన్నిరోధము ముఖ్యమని గ్రాహ్యము.

దానికై "కోశాన్పంచ వివిచ్యాంతరస్తు దృష్టిర్విచారణా।' [12.57] పంచకోశ విభజన గావించి, వాని యంతరమున గల ప్రత్యగభిన్న బ్రహ్మ వస్తువుయొక్క అనుభవమే విచారరణయగుట చేత, వాని "అన్వయ వ్యతిరేకాభ్యాం" (1. 37) అన్వయ, వ్యతిరేక విధానమున, "వివేకతః" [3. 1] వివేకముతో, "పంచకోశపరిత్యాగే సాక్షి బోధావశేషతః। [3. 22] పంచకోశముల ననాత్మగ నిశ్చయింపగ, ప్రత్యగాత్మ జ్ఞాన ముదయించును. ఈ విచారణా ఫలితముగ "నిర్వృతింపరాం" [1. 32] నిరతిశయ మోక్షసుఖమును సాధకుడు పొందుచున్నాడు.

ఇందులకు గర్మోపాసనములనుపయు క్తములు. ఎందుచేనన "కర్మో పాస్తి అనుష్ఠేయా వినిర్ణయాత్।" [9. 26] అనుష్ఠాన యోగ్యములగు కర్మోపాసనములు అనిశ్చయములు. మూర్తి ధ్యానాదికము కంటె నిర్గుణో

యని వేదాంత శాస్త్రవిదుల వచనము. అట్టిచో నిక, "యావద్విజ్ఞానసామీప్యం తావత్ శ్రేష్ఠ్యంవివర్ధతే॥" (9. 122) ఎంతవరకు జ్ఞానసామీప్యము నొందునో, యంత శ్రేష్ఠత్వమభివృద్ధిగాంచు ననురీతి, నతనిలో నెట్టి విషయ ప్రవృత్తులు నుండజాలక, నా జ్ఞాని సర్వశ్రేష్ఠుడై విరాజిలుచుండును.

## సిద్ధుడు

'ధీరత్వ మక్షప్రాబల్యేఽప్యానందాస్వాద వాంఛయా। తిరస్కృత్యాఖిలాక్షాణి తచ్చింతాయాం ప్రవర్తనం ॥' (11.124)శ్రోత్రాదీంద్రియములకు విషయాభిముఖముచేత బురుషు నాకర్షించెడి సామర్థ్యమున్నను స్వస్వరూపానుసంధానము నందుగల యిచ్ఛచేత నాసకల ఇంద్రియముల నిగ్రహించి, యానందానుసంధానమునందే ప్రవర్తించుచుండుటే ధీరత్వలక్షణము. అట్లు కర్మప్రవృత్తులు నిరోధింపబడగ, 'వాసనానేక కాలీనాదీర్ఘకాలం నిరంతరం ।....' సాదరం చాభ్యస్యమానే సర్వథైవనివర్తతే॥' (13.84) చిరకాలము సర్వదా శ్రద్ధతోదత్త్వ జ్ఞానమభ్యసింపబడగా బహుకాలస్థితములైన వాసనాచయముగూడ నివర్తించును. అంతనతనికి బ్రహ్మానందానుభూతికలుగును. 11.132). ఎందుచేత? 'సంగీహి బాధ్యతే లోకైర్నిస్సంగస్సుఖమశ్నుతే॥. (6. 274) సంగముగలవాడు లోకముచే బాధింపబడుచుండ సంగరహితుడు

సుఖమును బొందుచున్నాడు. పూర్వమితనికి ఐహికాముష్మిక సుఖాపేక్షతో చేయ, వనేక కర్మలు గలవుగాని, జ్ఞానసిద్ధి యనంతరము అవి యన్నియు నభావము (7.253). అదియే కృతకృత్యము అనియు దెలియదగును (7.254). మరియు "వద్వైతం భాసతే నాపి నిద్రా తత్రాస్తి యత్సుఖం । న బ్రహ్మానంద ఇత్యాహ భగవానర్జునంప్రతి॥" (11.100) ఎప్పుడు ద్వైతము స్ఫురింపదో, సుషుప్తియు లేదో, అప్పుడు సుఖము గలదనియు, నదియే బ్రహ్మానందమనియు నర్జునునకు శ్రీకృష్ణపరమాత్మ బోధించియున్నాడు. సార్వభౌమాది బ్రహ్మపర్యంతముగల పదవులన్నియు యీ స్థితికి దక్కువయే యనియు దాత్పర్యము (14.33). అప్పుడు "చిత్తస్య హి ప్రసాదేన హంతి కర్మ శుభాశుభం। ప్రసన్నాత్మాత్మని స్థిత్వా సుఖమక్షయ్యమశ్నుతే॥" (11.114) చిత్తనిర్మలత్వముచే, శుభాశుభకర్మల నశింపజేయుచున్నాడనుట ప్రసిద్ధము. ఆ స్వస్వరూపానుసంధానము నార్జించిన ఆత్మజ్ఞాని, అక్షయమైన సుఖమును బొందుచున్నాడు.

ఇంధనములు లేని అగ్ని నశించునట్లు, వృత్తిశూన్యమగు చిత్తము, తనంత నుపశమించుచున్నది (11.111). అట్లు వృత్తిశూన్యము నొందిన చిత్తము "తిష్ఠతి మూకవత్" (4.63) మూగవానివలె నిలచియుండును. అచట "ధ్యాతృధ్యానే పరిత్యజ్య క్రమాద్ధ్యేయైకగోచరం। నివాతదీపవచ్చిత్తం సమాధిరభిధీయతే॥" (1.55) ధ్యాతృ ధ్యానముల వర్జించి, క్రమరీతి ధ్యేయమందే, నివాతదీపమువలె చిత్తముండ, సమాధి యనబడుననురీతి త్రిపుటి యంతరించును. ఈ విషయమే గ్రంథాంతమున బ్రస్తావింపబడి,

"నిరుపాధిబ్రహ్మతత్త్వే భాసమానే స్వయంప్రభే। అద్వైతే త్రిపుటీనాస్తి భూమానందోఽత ఉచ్యతే॥" (15.33) స్వయంప్రభతో ప్రకాశించు నిరుపాధిక బ్రహ్మతత్త్వమునందు, అద్వైతమునందు జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయము లనబడు త్రిపుటి అభావము. అందుచే నా స్థితి భూమానందమనియు చెలువబడియున్నది. కాని, "స్వస్వరూపం స ఏవస్యాత్ శూన్యత్వం తస్య దుర్ఘటం॥" (3.22) అది స్వస్వరూపానుభూతి యగుటచే దానికి శూన్యత్వము నాపాదించుట దుర్లభము. అట్టి అపరోక్షజ్ఞాన స్థితియే, పూర్వము సాక్షాత్కారమని యనబడియున్నది (6. 16). దీనిచే జ్ఞానరక్షణము' తపమ్ము, విసంవాదాభావము, దుఃఖనివృత్తి, సుఖప్రాప్తి గలుగునని జీవన్ముక్తి ప్రకాశిక తెలుపుచున్నది (ప్ర. 3). 'స ఏవ ముక్త ఇత్యేవం వేదాంతేషు వినిశ్చయః॥' (8. 54) అతడే ముక్తుడని వేదాంతములలో నిశ్చయింపబడినది. అతని బ్రహ్మవిదుడని యనక, 'బ్రహ్మైవాయమితి ప్రాహుర్మునయః పారదర్శినః। (4. 67) సాక్షాద్బ్రహ్మమే యని వేదాంత శాస్త్రపారంగతులగు మునులు వచింతురు,

ఆ విధముగా, 'భూతభౌతికమాయానాం సమత్వేఽత్యంత వాసతే। అద్వైతబుద్ధ్యైషా ధీర్వివర్త్యేతి న క్వచిత్॥' (2. 98) భూత భౌతిక బ్రహ్మాండమంతయు, మాయాసమము అని దృఢ చిత్తము గలుగుచుండ, అద్వైత స్థితియందున్న చిత్తము ఎప్పుడును విపర్యయము నొందదు. అచింత్య రచనారూపమాయయే యీ సకల జగత్తుగ నిశ్చయించిన, అద్వైత భావమున చిత్తము స్థిరత్వము నొందును (6. 246). అనగా 'నాప్రతీతి స్తయో

కింతు మిథ్యాత్వనిశ్చయః।' (6. 13) జీవ, జగత్తుల అప్రతీతి
ంగాక, నట, వాని మిథ్యాత్వ నిశ్చయమే గలుగుచున్నది. కాదే ని
స్థితిలో నెల్లరకు, అద్వైతసిద్ధి అప్రయత్నముగ గలుగునుగదా!
జీవజగన్మిథ్యాత్వ నిశ్చయముతో బాటు, 'పరమాత్మావశేషోఽపి
స్వ వినిశ్చయః। న జగద్విస్మృతిర్నో చేజ్జీవన్ముక్తిర్న సంభ
(6. 14) పరమాత్మ సత్యత్వ నిశ్చయముగూడ గలుగును.
స్మృతిమాత్రము కాదు. కాకున్న జీవన్ముక్తి స్థితియే అసంభవము
మనోకల్పిత స్వప్నరాజ్యము నందువలె, లౌకికమున అసత్యత్వ
పబలియుండును (13. 98). అతడు 'నీరోగ ఉపవిష్టోవారుణ్ణో
'న్ భువి। మూర్ఛితో వాత్యజ త్వేష ప్రాణాన్ భ్రాంతిర్న
।' (2. 106) వ్యాధిరహితుడై కూర్చున్నవాడైనను, వ్యాధిగలవా
భూమిపై బొర్లాడుచున్నను, మూర్ఛను బొందియున్నను, ప్రాణా
ంలమువంద్రైన, ఎవ్విధమునవైన, ద్వైత భ్రమను బొందడు. 'అ
సాధకం ద్వైతమీశ్వరనిర్మితం।' (4. 42) ఈశ్వర నిర్మిత ప్ర
, జ్ఞానబాధకముగాక సాధకమగుచుండును. దాని వివారింప దుశ్శ
"ఇత్యాస్తాం తద్ద్వేష్యతేకుతః।।' (4. 42) అందుచే వది యుండు
దాని నెందులకు ద్వేషింపవలెను? అది నశింపకున్నను, 'తస్య
క్మతాం। బుధ్వా బ్రహ్మాద్వయం బోద్ధుం శక్యం వస్త్వైక్య వాతినః।।'
)) దాని మృషాత్వమును గ్రహించి, అద్వైత బ్రహ్మమునుగూర్చి
సటకు, అద్వైతవాదికి శక్యమగు చున్నది. 'అనంతోఽండాదయో
తద్భానేఽపిహా న క్షతిః।।' (2. 97) బ్రహ్మాండాదులు అసత్తుగ దోచి

నను, అవి దోచుచున్నను, అద్వైత జ్ఞానమునకుహాని ఏమి? ఏమియు లేదు.

అయిన నట్టివాని ప్రవర్తన మేరీతిగ నుండును? 'శాస్త్రాణ్యధీత్య మేధావీ అభ్యస్య చ పునః పునః। పరమం బ్రహ్మవిజ్ఞాయ ఉల్కావత్తాన్యథోత్సృజేత్॥' (4.45) బుద్ధిమంతుడు శాస్త్రాధ్యయనమును బునః పునః ఆచరించి, పరబ్రహ్మమును గ్రహించి, అంత ఆ శాస్త్రచయమును కొరివి కట్టెనువలె బరిత్యజింపవలెననురీతి, నతడు శాస్త్రమును, 'వాచో విగ్లాపనం' [4. 47] వాక్కునకు శ్రమగ బావించి, విసర్జించుచున్నాడు. అయినను, 'విద్యాభావాన్నబాలస్య దృశ్యతేతి ప్రసంజనం।' (9. 106) బాలునకు విధిశాస్త్రమభావముగాన నతనికి శాస్త్రాతిక్రమణ దోషము వాటిల్లదుగదా! ఇక, విధిశాస్త్రమవసరములేని జ్ఞానికెట్లు ఆ దోషము కలుగును? ఇతడుగూడ బాలుని చందము ఆలోకికుడుగదా! "వర్ణాశ్రమవయోఽవస్థాభి మానో యస్య విద్యతే।" [9. 100] ఎవనికి వర్ణాశ్రమ వయోవస్థాభిమానములు గలవో వానికేవిధి నిషేధములన్వయములు. అవి యన్నియు మాయాకల్పితములని నిశ్చయించి, జ్ఞాని త్రోసి వుచ్చెనుగదా! (9.101). అతనికి వాసనాక్షయమతయినది గాన, "నైష్కర్మ్యేణ న కస్యార్థ స్తస్యార్థో ఽస్తి న కర్మభిః।" (9. 103) కర్మత్యాగముచేగాని, కర్మలచేగాని ప్రయోజనమావంతయులేదు. అంతియగాక "వసమాధాన జప్యాభ్యాం" (9.104) సమాధిచేగాని, జపధ్యానములచేగాని లాభమింతయులేదు. ఈ కర్మజాతమంతయు జ్ఞానోత్పత్తికి బూర్వమాచరింప బడియుండెను గాని ప్రస్తుతము లేదు (7. 253). అతడు కృత కృత్యుడై "తృప్యతి నిత్యశః (7.254) నిత్యతృప్తి జరించును. కోరిక లేమిచే దనకు సంసారము లేదనియు (7. 255), స్వర్గాదుల గాంక్షించు

వారికి గర్కయగును గాని తనకు అభావమనియు (7. 256) స్థిరపడును. నిద్రాభిక్షాస్నానశౌచే నేచ్ఛామిన కరోమి చ।" (7. 258) నేను, నిద్రా భిక్ష స్నానశౌచాదుల గోరుటలేదు, ఆచరించుట లేదు. ఇతరులకట్లు గోచరించిన నాకేమి అనియు, ముముక్షువులు శ్రవణాదికము నవలంబించెదరు గాక ముక్తు డనా కవియేల? నేను మనుష్యుడనను వ్యవహారము కల్పింపబడుచున్నది అనియు, నతడు భావించును. "ఆరబ్ధకర్మణి క్షీణే వ్యవహారో నివర్తతే" (14. 50) ప్రారబ్ధము క్షయింపగ, నీ మనుష్య వ్యవహార మంతమొందును గదా! దాని గురించి నే యోచింపను (14. 51). "విక్షేపోనాస్తి యస్మాన్మే నసమాధిస్తతో మమ॥" (14. 52) నాకు విక్షేపము శూన్యము గాన నాకు సమాధియు లేదు. అది మనస్సునకు సంబంధిగదా! అనుస్థితప్రజ్ఞుడై యతడొప్పారును. ఆతడు వేయించబడిన విత్తనమువలె భాహ్యమునకు బ్రవృత్తుడుగ దోచి, అంతరమున నిర్లిప్తుడై యుండును (జీ. ప్ర. 2 ప్ర, 7. 164)

అందుచే "నిందితః స్తూయమానో వా విద్వానజ్ఞైర్న నిందతి। న స్తౌతి కింతు తేషాం సాద్యథా బోధ స్తథాచరేత్॥" [7.289] ఆ జ్ఞాని అజ్ఞానులచే నుతింపబడినను, నిందింపబడినను తాను స్తుతినిందల నాచరింపడు, ఆ యజ్ఞానులకు బోధగలుగు విధముగ జరించును. అట్లు అజ్ఞానుల బోధకై, ప్రవృత్తికంటె నతనికి కార్యమొందు లేదు [7.290]. "ప్రవహత్యపి నీ రేధఃస్థిరా ప్రౌఢశిలా యథా।" [13.100] జలము ప్రవహించుచున్నను, క్రింద పాషాణము ఎట్లు స్థిరముగ నుండునో, అట్లు నామరూపాదులు గోచరించుచున్నను, గూటస్థునివలె నచలుడై యతడుండును. ప్రవృత్తి నివృత్తులచే నతనికి రాగద్వేషముల గానము. 'న ద్వేష్టి సంప్ర

వృత్తాని న నివృత్తాని కాంక్షతి।' (6.269) దుఃఖప్రాప్తికై ద్వేషము గాని, సుఖనివృత్తమున కాంక్షయుగాని లేక, "ఉదాసీనవదాసీనః" (6. 269) ఉదాసీనునివలెనుండును. శిలాకాష్ఠములవలె నచేతనముగగాక, దేహేంద్రియాదికము సర్వసమర్థములయ్యును ఉదాసీనప్రజ్ఞ నతడుండును. లేకున్న నది వ్యాధియేగదా (6.270). జడభరతాదులు స్థాణువులచందము నుండలేదుగదా (6.273). భోజనాది కార్యములు బ్రహ్మభావమునకు బ్రతిబంధకములు కావు గాన, వాని నతడు ప్రవర్తించినను దోషములేదు (7.125). అచట ఆత్మవిస్మృతి అనర్థముకాదు (7.126). అట్టి బాహ్య కర్మలచే నతడు సదా నిర్లిప్తుడు (7.269). ఆ నిర్లిప్తునకు "శక్యం సమ్య గ్రాజ్యాది లౌకికం॥' (9.114) రాజ్యపాలనాదిక లోకవ్యవహారముగూడ సాధ్యమే యగును. దృఢజ్ఞానము గలవాడు లౌకిక వ్యవహారమును జేసినను నిర్లిప్తుడగుటచే బాధలేదు (9. 88). ఆ వ్యవహారము ప్రపంచమునకు వస్తుత్వమును గలుగ జేయదు (9. 89) చేయకూడదను నిషేధముగాని, చేయవలెనను 'విధిశాస్త్రంచేన్న తత్త్వ విదం ప్రతి' (9.19) విధి గలుగు నని యంచేని తత్త్వజ్ఞానికి అది అభావమని విద్యారణ్యుడు నొక్కి వక్కా ణించును.

'ఆరబ్ధకర్మణి క్షీణే వ్యవహారో నివర్తతే। కర్మక్షయే త్వసౌ నైవ శామ్యేద్ధ్యాన సహస్రతః॥' (14.50, 7.263) ప్రారబ్ధము క్షయింప వ్యవ హారము నశించును. అట్లుకాక, సహస్ర ధ్యానములచేతనైన నీ వ్యవహా నివర్తింపదు, ఎందుచేతన బ్రారబ్ధమునకాధారమగు చిదాభాసుడు ప్రారబ్ధ క్షయముతోడనే అంతర్హితుడగును (6.53). అనగా చిదాభాసుడు అంత

రించినగాని ప్రారబ్ధము అంత మొందదని భావము. అట్టుల జీదాభాను తున్నంతకాలము జీవన్ముక్తుడు, జీవిత వ్యవహారమున నుండునని చీన తెలియును (2.243). రజ్జుజ్ఞాన ప్రాప్త్యనంతరముగూడ భ్రాంతిసమయ జనిత భయ కంపనాదులు కొంతకాలముండునట్లు, 'ఏవ మారబ్ధభోగోఽపి శనైః శామ్యతి నో హఠాత్॥' (7.245) ప్రారబ్ధ కర్మోపభోగముగూడ మెల్లగ ఉపశమించుచున్నదిగాని వెంటనే నంతమొందదు. కాని యింత మాత్రముచే "న తత్త్వజ్ఞానం వినశ్యతి" (7.246) తత్త్వజ్ఞానము నశింప దవియు, అట్లు "భోగేన శమయిత్వైతత్ప్రారబ్ధం ముచ్యతే తథాః" (7. 250) ప్రారబ్ధము అనుభవముచేతనే నశించి, విడువబడుచున్నదని విద్యారణ్య తాత్పర్యము. దీని దప్పింప నీశ్వరునికిగూడ గాదనియు నతని విశ్వాసము (7.154).

ఈ ప్రారబ్ధము "ఇచ్ఛానిచ్ఛాపరేచ్ఛా చ ప్రారబ్ధం త్రివిధం స్మృతం॥" (7.152) ఇచ్ఛా అనిచ్ఛా పరేచ్ఛా రూపమున త్రివిధము· ఫలితము నెరింగి ప్రవృత్తులగుట "ఇచ్ఛా ప్రారబ్ధమగుచున్నది (7.153) ఇచ్ఛ జనింపకున్నను ప్రారబ్ధవశమున గొన్ని కార్యముల జేయుట అనిచ్ఛా" ప్రారబ్ధము. (7.161) అట్టులే పరదాక్షిణ్యాది ప్రోద్బలముచే, సుఖదుఃఖానుభూతి లోకమున సామాన్యము. అది "పరేచ్ఛా" ప్రారబ్ధముగ విదితము.

ఇట్లనుభవించుచున్నను, పూర్వోక్తచందము తత్త్వజ్ఞాన లోపము గలుగక (7.246) అచింత్య రచనమై, ఇంద్రజాలము పగిది (7.174),

మిథ్యాత్వముగల జగద్వ్యవహారము జ్ఞానికి నశింపక, మృషారూపముగ నుండును (7.175). అద్వైతజ్ఞాన, ప్రారబ్ధములు పరస్పర వ్యతిరేకములు కావు (7.176). జ్ఞానికి విషయములు దోచినను, వాని సత్యత్వదృష్టి పోవుచుండగ, మిథ్యాత్వదృష్టి దృఢమై యుండుటచే. భ్రాంతిజన్య సుఖ దుఃఖాదిక అనుభూతి అతనికి ఉండనేరదు (7. 177 - 180).

కావున, "మిథ్యాత్వవాసనాదార్ఢ్యే ప్రారబ్ధక్షయ కాంక్షయా, అక్లిశ్యంతః ప్రవర్తంతే స్వస్వకర్మానుసారతః॥" (7. 131) జగన్మిథ్యాత్వ దృష్టిదార్ఢ్యత గాంచి, ప్రారబ్ధనాశన మునకై దుఃఖాద్యనుభవములేనివారై ప్రారబ్ధ కర్మానుసారముగ జ్ఞానులు ప్రవర్తించెదరు. జ్ఞాని అజ్ఞానితో బాటు ప్రారబ్ధము ననుభవించుచుండువట్లు దోచినను, "న క్లేశో జ్ఞానినో ధైర్యాన్మూఢః క్లిశ్యత్యధైర్యతః" (7. 133) ధైర్యమువలన జ్ఞానికి క్లేశములేకుండ, అజ్ఞాని అధైర్యముచే దుఃఖమును బొందును. వస్తు సత్యత్వమే సుఖదుఃఖాదికమునకు [illegible], అసత్యత్వదృష్టి అట్టి అనుభూతికి హేతువుకాదుగదా? (7. 166). భిక్షాహారాది లౌకిక వ్యవహారముగాని, జపధ్యానాది శాస్త్రీయ ప్రవృత్తిగాని, "మమాకర్తురలేపస్య యథారబ్ధం ప్రవర్తతాం॥" (7. 267, 14. 54) కర్తృత్వ భోక్తృత్వములు లేని నాకు ప్రారబ్ధవశతః గలిగిన [illegible]! అను నిశ్చయ బుద్ధి జ్ఞానియందుండును. ఈ భోగముల మిథ్యాత్వనిశ్చయము గలిగి "భుంజానోపి న సంకల్పం కురుతే వ్యసనం కుతః" (7.170) ప్రారబ్ధము ననుభవించుచున్నను కర్తృత్వము వహింపడు. ఇక నతనికి వ్యసన మెక్కడిది? అతడు "భవిష్య న్నానుసంధత్తే నాతీతం

చింతయత్యసౌ। వర్తమాన నిమేషం తు హసన్నే వానువర్తతే॥" (జీ. ప్ర. 2 ప్ర.) ఇట్లు, ప్రారబ్ధ ప్రాప్తమగు కర్మలను ఆచరించువేళ, భవిష్య ద్విషయముల జింతింపడు. భూతమును యోచింపడు. వర్తమానము ననాద రమున నాచరించును. ఈ రీతి "తదిత్థం తత్త్వవిజ్ఞానే సాధనానుపమర్దనాత్ జ్ఞానినాచరితుం శక్యం సమ్యగ్రాజ్యాది లౌకికం॥" (9. 114) తత్త్వజ్ఞానము గలుగ, లౌకిక వ్యవహార సాధనములగు మనస్సు మొదలగునవి నశింప మిచే, జ్ఞానిచేత రాజ్యపాలనాది లౌకిక కర్మముగూడ శక్యమగునని విద్యా రణ్య విశ్వాసము. అందులకు దృష్టాంతముగ జనకాది రాజర్షులు గ్రహింప బడిరి. (7. 130). కాన జ్ఞానులు ప్రారబ్ధవశతః అనేక కర్మల మెలంగు దురుగాక! అయినను జ్ఞానముచేతనే ముక్తియను శాస్త్రము అసత్యము కానేరదు (6. 287). అందుచే "స్వస్వకర్మానుసారేణవర్తతాంతే యథా యథా। అవిశిష్టస్సర్వబోధస్సమా ముక్తిరితి స్థితిః॥" (6. 288) జ్ఞానులు, తమ తమ ప్రారబ్ధానుసారముగా, దమ యిష్టప్రకారము ప్రవర్తింతురుగాక! అయినను సర్వజ్ఞానుల యొక్క అహం బ్రహ్మేతి జ్ఞానమున విభేదము లేదనియు, ముక్తి సమానమనియు, వేదాంత నిర్ణయముగ విద్యారణ్య మునీంద్రుని నిర్ణయము.

ఈ విధముగ, "ముక్తిస్తు బ్రహ్మతత్త్వస్య జ్ఞానాదేవ నచాన్యథా" (6. 210) ముక్తి బ్రహ్మముయొక్క తత్త్వజ్ఞానము వలననేగాని యితర ముచే గలుగనేరదు. "స్వరూపేణ స్థితి ర్ముక్తిరితీర్యతే" (10. 4) అ

ముక్తి స్వస్వరూపస్థితియే యగుచున్నది, అతడు "బ్రహ్మైవ భవతి స్వాయం। బ్రహ్మణో నాస్తి జన్మాతః పునరేష న జాయతే॥" (3. 43) బ్రహ్మమే స్వయముగ నగుచున్నాడు. బ్రహ్మమునకు జననము లేదు కాన బ్రహ్మవిదుడు మరల పుట్టొంచడు. మరియు నతడు, "కల్పాంతే చ విముచ్యతే" (9. 146) కల్పాంతమున, సర్వలయమున ముక్తుడగును. అనగ జీవన్ముక్తుడు ప్రారబ్ధక్షయానంతరము విదేహ ముక్తినొంది, కల్పాంతమున నితర ముక్తులతో సమిష్టిముక్తి నొందునని తాత్పర్యము. దీనినే సర్వముక్తి యనియు నందురు.

## ఆత్మ

"స్వస్వరూపం స ఏవ స్యాత్ శూన్యత్వం తస్య దుర్ఘటం" (3. 22) ముక్తుడు తన స్వరూపమే యగుచుండుటచే, నతనికి శూన్యత్వము ఘటింపదు. కాన యింతవరకు, "పరానందః పరప్రేమాస్పదం మతః" (1. 8) నిరుపాధిక, ప్రేమైక విషయమై పరానందమని వ్యవహరింపబడుచున్న ఆత్మతో, నతడు ఏకత్వమును గ్రహించును. వ్యవహారకాలమున, ఇతరముపై బ్రసరింప జేయబడుచుండిన ప్రేమ, యథార్థముగ నాత్మార్థముగ జేయబడుచున్నది (1. 9). ఈ యాత్మ 'అవేద్యోఽప్యపరోక్షోఽతః స్వప్రకాశో భవత్యయం। సత్యం జ్ఞానమనంతం చేత్యస్తీహ

బ్రహ్మలక్షణం॥" (3. 28) యింద్రియ గోచరము కాకున్నను, అప రోక్షముగ ప్రకాశించుచున్నాడు. అందుచే నతడు స్వప్రకాశుడు. సత్య జ్ఞానమనంతాది బ్రహ్మలక్షణములన్నియు నీ యాత్మయందు గలవు. బాధా రాహిత్యమే సత్యత్వము (3.29). "సర్వబాధే న కించిచ్చేద్యన్న కంచిత్త దేవ తత్ (3. 31) సర్వజగత్తు మిథ్యాభావము నొంది నివారింపబడ, నింకేమియు లేదనెడి జ్ఞానమే అది. ఈ ఆత్మను వర్ణింప, భాష అసమర్థము సుమా! (3. 31). సర్వనిరాకరణ మొనరించి, శేషించి నిలుచునదియే ఆత్మ (3.33) మరియు 'న వ్యాపిత్వాద్దేశతోఽంతో నిత్యత్వాన్నాపి కాలతః। న వస్తుతోపి సార్వాత్మ్యాదా నంత్యం, బ్రహ్మణిత్రిథా॥" (3. 35) వ్యాపిత్వముచే దేశబద్ధత్వము, నిత్యత్వముచే కాలబద్ధత్వము సర్వాత్మత్వముచే వస్తుబద్ధత్వములు, బ్రహ్మమున లేవు,

"ఏక ఏవ హి భూతాత్మా భూతే భూతే వ్యవస్థితః। ఏకధా బహుధా చైవ దృశ్యతే జలచంద్రవత్॥' (15. 7) ఒక్కడైయున్న పరమాత్మ, భూతభూతముల, అనేక జలముల బ్రతిబింబించు చంద్ర ప్రతిబింబమువలె గనబడుచున్నాడు. స్వయంజ్యోతియైన యీ యాత్మ "పురోఽస్మాద్భాసతే ఖిలాత్।" (3. 16) అఖిల సృష్టికి బూర్వమే యున్నాడు. మరియు "తమేవ భాంతమన్వేతి తద్భాసాభ్భాసతే జగత్" (3. 16) ఈ స్వయం ప్రకాశమగు ఆత్మనే ఆశ్రయించి, సర్వప్రపంచము ప్రకాశించు చున్నది. అత డఖిలము నెఱుంగునుగాని నతని నెరుంగ జాలువా డెవ్వడును లేడు (3.18). ఈ ఆత్మ యెట్టిదనిన, 'ఈ దృక్త్వానాస్తి తత్రహి। యదసీదృగ తాదృక్చ తత్స్వ

రూపం వినిశ్చినుః" (3. 26) అచట నిటువంటిదనుటకవకాశములేదు. ఇటు వంటిదనిగాని, అటువంటిదనిగాని వచింప సాధ్యముకాని స్వరూపమే, ఆత్మగా నిశ్చయించుకొనుము అని పంచదశి వాక్యము. అందుచే నతడు 'స్వతోవాగ్బుద్ధ్యగోచరః" (10. 23) స్వయముగ వాగాదీంద్రియములకును, బుద్ధికిని అగోచరుడని, వాకొనబడినది. అతడు కేవలమపరోక్షస్వరూపుడని గ్రాహ్యము. కాన బ్రహ్మవిదుడు జీవన్ముక్తి విదేహముక్తి స్థితులలో నతడుగ రూపొందునని పరమ తాత్పర్యము.

# అద్వైతమ్

"మాయాఖ్యాయాః కామధేనోర్వత్సౌ జీవేశ్వరావుభౌ। యథేచ్ఛం పిబతాం ద్వైతం తత్త్వం త్వద్వైతమేవ హిః' (6. 236) మాయ యను కామధేనువునకు, జీవేశ్వరులను వత్సలుభయులు యిష్టప్రకారము ద్వైత క్షీరమును బానము చేయుదురుగాక! అయినను బరతత్త్వము అద్వైతమే. దృష్టిగోచరమైన "అచింత్య రచనారూపం మాయైవ సకలం జగత్' (6. 246) అచింత్య రచనారూప మాయయే యీ సకల విశ్వము. ఈ పర మార్థమును గ్రహింప, జ్ఞానాదేవ న చాన్యథా' (6. 210) జ్ఞానముచే సాధ్యముగాని అన్యముచే గాదు. ద్వైతస్థితిలో నా బ్రహ్మమే విష్ణ్వాది దేవతల బ్రవేశించి ఉపాస్యులుగను, మర్త్యాదికమున బ్రవేశించి ఉపాసకులు గను నగుచు (10. 2), "స్రష్టేః ప్రాక్తదేవాద్య చోపరి ముక్తావపి—'

(6. 238) సృష్టికి బూర్వము సృష్టి కాలమందును, అంతరమునను, మోక్షదశయందును ఏకాకారముగనున్నది.

అందుచే యథార్థమున, 'న నిరోధో న చోత్పత్తిర్న బద్ధో న చ సాధకః। న ముముక్షుర్నవై ముక్త ఇత్యేషా పరమార్థతా॥' (6. 235, 8) 71) జననమరణములుగాని, బంధ మోక్షములుగాని, సాధక ముముక్షువులు గాని లేరు. ఇదియే పరమార్థము. అచ్చట సుఖముండుటగాక 'సుఖమద్వైత. మేవ హి।' (11. 23) అద్వైతమే సుఖస్వరూపము. అది భాషా తీతమే.

అయినను 'కాలవాసనయా యుతం। శిష్యం ప్రత్యేవ తేనాత్ర ద్వితీయం న హి శంక్యతే॥' (2. 38) కాలాది వాసనలతో గూడియున్న శిష్యునికొరకు నిది వచింపబడినదిగాని, అచ్చట ద్వితీయమభావము. 'చోద్యం వా పరిహారో వా క్రియతాం ద్వైతభాషయా। అద్వైతభాషయా చోద్యంనాస్తి నాపి తదుత్తరం॥' (2. 39] ఈ చోద్యమైనను, పరిహారమైనను ద్వైత వ్యవహారమున జేయబడుగాక! అద్వైతదశ చేజోద్యములేదు, ప్రత్యుత్తరము గూడ నాస్తి.

# సమాప్తి

ఇంత, శ్రీవిద్యారణ్య తాత్పర్యసమీక్ష, అతి క్లుప్తసరళి ముగిసినది. విద్యాసాగరతుల్యమైన యీ విద్యారణ్యమును జొచ్చి, అందుగల అమూల్య

అద్వైతౌషధీగణముల గణింప నేరికి సాధ్యము॥ అని అసంఖ్యాకములు అనంతములు. శ్రీవిద్యారణ్య మునీంద్రుడు కేవలము విద్యావిధిమాత్ర మేగాక, సన్న్యాసియై, శృంగేరిపీఠాధ్యక్షుడై, విజయనగర సామ్రాజ్య స్థాపనా చార్యుడై, అమాత్యుడై ' అధినేతయై, నాటి వాతావరణమున సర్వవిధముగ సర్వతోముఖముగ ప్రవేశించి, ఆదర్శ ప్రాయుడై యొప్పారుటయు గాన నగును. అట్టి నిగూఢతత్త్వ సంపన్నుని, ఆకాశపదనంత విశాలస్వభావుని, అపారుని, పఠించి. రచించుట సామాన్య సాధ్యముకాదు. అతని రచన కృతులు గవేషణీయములు. మన 'సౌరభ, కృషి, అందులకు నాంది పాఠ మనియే విశ్వాసము. పాఠకుల దృష్టి విద్యారణ్య కృతులపై ప్రసరింపజేసి నచో, యీ రచన సార్థకమని 'సౌరభ' తాత్పర్యము.

--o--

# శ్రీ వాచస్పతి మిశ్ర

## ప్రశస్తి

The most remarkable instance of this philosophical equanimity is that of Vachaspati Misra, who wrote standard treatises on each of the six systems except Vaiseshika, adopting, of course, the peculiar point of each, and excluding for the time being alien tenet 66. తత్కాలమునకు నన్యసిద్ధాంతముల దూరమునముంచి, ఒక వైశేషికమునకుగాక షడ్దర్శనములలో ప్రతియొక్క దానిపై, నా యా ప్రత్యేకవాదము నవలంబించుచు, ప్రామాణిక వ్యాఖ్యానముల రచించిన వాచస్పతి మిశ్రునిదే యీ తాత్త్విక సమత్వమున నత్యద్భుత ఉదాహరణము, అని Cowell కావేల్ తన "సర్వదర్శన సంగ్రహ", పీఠికలో వాచస్పతిని గొనియాడియున్నాడు. ఈ విషయమునే తన Indian Philosophy భారతీయ తత్త్వశాస్త్రమున రాధాకృష్ణ పండితుడుగూడ ప్రస్తావించి, Vachaspati Misra, who commented on almost all the systems of Hindu thought, wrote on each, as if he believed in its doctrines 67. చాలవరకు హైందవ సిద్ధాంతముల నన్నింటిని వ్యాఖ్యానించియున్న వాచస్పతి మిశ్ర, ఒక్కొక్కదాని దా విశ్వసించునట్లు రచించెనని, యీ అసాధారణ ప్రజ్ఞానిధుని యొక్క

---

66 pror .E. B. Cowell & A. E. Godugh: Sarva Darsana Sangraha Preface.

67. Dr. S. Radhakrishnan : Indian philosophy, Vol. 2, preface.

సమరస స్వభావమునకు జోహారు లర్పించియున్నాడు. గ్రంథపఠనముల గావించి. పాండిత్యమును గడించుట గష్టసాధ్యము కానేరదుకాని, వాని సక్రమవిధాన గ్రహించి, అందుగల యుత్కృష్టాంశముల స్మరించి, ప్రదర్శింపుట మిగుల దుర్లభము. తన కభిమాన సిద్ధాంతమును మాత్రము పరమార్థముగ విశ్వసించి, సర్వేతరములు అసందర్భములనియు, నాస్తికములనియు, నిశిత తర్క-ఖడ్గమున ఖండించుటయేగదా సామాన్య పండిత ధోరణి ! తామొక దాని నమ్మి 'అవలంబించినంత మాత్రమున, బరముల ద్వేషించి, నిరసించు నవసరము కానరాదు. తన తల్లిమీద గల అపారప్రేమ, యితరుల తల్లులపై ద్వేషముగ రూపొందుటకు హేతువు కారాదుగదా! అందుచే బరమత ఖండనము, ఆ పరమత గ్రహణ లోపమును దెలియజేయునుగాని, తన సిద్ధాంత శ్రేష్ఠత్వమును బ్రదర్శింప నేరదని విజ్ఞుల విశ్వాసము. ఆ విధముగ సర్వశాస్త్రములు, సర్వసిద్ధాంతముల, విష్పాక్షికబుద్ధి జొచ్చి, పరిశీలనాబుద్ధి విమర్శించి, వానిపై నా యా సిద్ధాంతులకే ప్రమాణములుగ రూపొందగలిగిన వ్యాఖ్యానముల నిర్మించి, సర్వ కాలములకు, ముఖ్యముగ, పాషండత్వము అనేకవిధముల బ్రపంచమున దాండవమాడుచున్న యీకాలమునకు, మహోత్కృష్టా దర్శమును జూపించి యున్న వాచస్పతి మిశ్రుని ఎంతని కొనియాడ గలము? అట్టి ఆదర్శమూర్తి ఒక భారత తాత్త్విక ప్రపంచముననేగాక సర్వప్రపంచ తాత్త్వికలోకమునకు ఒకమహదలంకారము. ప్రస్తుతము అతడు, శ్రీశంకర భగవత్పాదాచార్యునిచే బహుళ ప్రచారము నొందిన అద్వైత సిద్ధాంతమును గూర్చి ఏమి రచించెనో గ్రహించుట 'సౌరభ' కర్తవ్యము. అతడు శ్రీశంకరాచార్య

నిర్మిత బ్రహ్మసూత్ర భాష్యమునకు 'భామతి' అను పేర రచించిన వ్యాఖ్యానము అసాధారణమై, తర్వాత అనేక పండితుల నాకర్షించి, అనేక వ్యాఖ్యల బొంది, నాటికి నేటికిగూడ, నొక బృహద్గ్రంథముగ, జటిల రచనముగ, ప్రఖ్యాతి గాంచియున్నది. దాని బ్రవేశించి, మధించి, అందం తట నిమిడియున్న అద్వైతామృతమును సంపూర్ణముగ బహిర్గత మొనరిం చుట, సామాన్యప్రజ్ఞకతీతము. అంతియగాక నది మరియొక విశ్వ రూప మును గాల్చును. ఆ కార్యము ప్రస్తుత 'సౌరభ తాత్పర్యము కాకుండుటచే, నిట నితర సుప్రసిద్ధ అద్వైత సిద్ధాంతులతో బాటు, వాచస్పతి పండితుని తాత్పర్యమును గూడ క్లుప్తముగ జూడ యత్నించెదము గాక!

## జీవిత విశేషములు

"న్యాయసూచీ నిబంధోఽ సావకారి సుధియాంముధ్యే। శ్రీవాచస్పతి మిశ్రేణ వస్వంక వసువత్సరే॥" (898) అని తన న్యాయసూచీ నిబంధ గ్రంథ శ్లోకమున, వాచస్పతి తన కాలమును, విక్రమ శకమున 898 సంవ త్సరముగ సూచించి యున్నాడు. అనగా నా రచనము, క్రీ. శ. 841-842 ప్రాంతముల జరిగి యుండునని పండితాభిప్రాయము 68. అటులే 'భామతి' రచనమున, భాష్య వివరణ సందర్భమున, 'లోకవత్తు లీలాకైవల్యం"

68. Prof. SS. Suryanasayana Sastry: The Bhamali, p. ix.

(2. 1. 33) వేదాంత సూత్రమున సృష్టికార్యమున, నీశ్వరుని నిర్నిమిత్త నిస్స్వార్థ లీలామాత్ర ప్రవృత్తిని వివరించుచు, 'లీలామాత్రముగ 'మహా ప్రాసాద ప్రమదవన'ముల నిర్మించిన 'శ్రీమన్నృగనరేంద్రా—"ది ప్రభువుల నుదాహరించెను. మరియు "భామతీ' గ్రంథమున జివరకూడ. 'తస్మిన్మహీపే మహనీయకర్తా శ్రీమన్నృగేఽకారి మయా నిబంధః" (4. 4. 22) అనియు నృగ రాజాఖ్యుని స్మరించి యున్నాడు. 'నృగ ఇతి రాజ్ఞ ఆఖ్యా' అనియు నచ్చట "వేదాంత కల్పతరు' కర్త అమలానందుడు వచించెను. అందుచే వాచస్పతి మిశ్ర యీ రాజేంద్రుని కాలము వాడనియు, నీనృపతి ఎవరైనదియు నింక దెలియకున్నది యని కొందరు 68 విమర్శ కులు వాకొన్నను. క్రీ. శ. 962 సంవత్సర ప్రాంతముల బాలించిన మిథిల ప్రభువు నాన్యదేవునికి బూర్వుడీరాజు అనియు, నతడును మిథిలా దేశ పాలకుడేయనియు, పండిత గంగానాధ ఝా విశ్వాసము. 69 అంతియగాక వాచస్పతి యొక్క "న్యాయవార్తికా తాత్పర్యటీక"కు "పరిశుద్ధి" అను అనువ్యాఖ్యను రచించిన ఉదయనాచార్యుడు క్రీ. శ 984 ప్రాంతము వాడగుటచే నితనికిని నతనికిని ఎక్కువ కాలవ్యత్యాస ముండుట సంభావ్య మగుటచే వాచస్పతి మిశ్రుడు క్రీ. శ. 831 సంవత్సర ప్రాంతమువాడని ఎల్ల పండితుల విశ్వాసము.

"నిఖిలతంత్ర పరతంత్ర ప్రతిభః" అని పండిత గంగానాధునిచే 69 గొనియాడబడిన వాచస్పతి 'సకలశాస్త్ర పారావార పారీణః" "విచక్షణ

69. Prof. Ganganath Jha : Sankhya Kaumudi, Preface.

70. Pandit Ranade Purushotham Sharma : Patanjala Yogasutrani Preface.

మూర్ధన్యః” “పరమదార్శనికః” అని పండిత పురుషోత్తమునిచే నుతింప బడిన వాచస్పతి, 70 మిథిలదేశీయుడనియే నెల్లర నమ్మకము. “మిశ్ర పదేన గౌడ” అని కొందరును, “మైథిలో బ్రాహ్మణ ఇతి” మైథిలబ్రాహ్మ ణుడని కొందరునునందురని రానడే పురుషోత్తమశర్మ తన పతంజలి యోగ సూత్రగ్రంథపీఠికలో రచింప 70 నితడు మైథిల బ్రాహ్మణుడని నిశ్చయ మనియు, నీమిథిలదేశమున “భామా” “భామతీ’ అని పేరుగల నగర మొండుండెననియు, నచట భామతీ నామమున నొక జలాశయముగూడ నుండెననియు, మిథిలాధిపతియగు నృగుని నామస్మరణమును వాచస్పతి గావించి యుండుటచేతను ఇతడు మైథిలేయుడేయని యీ పండితుని నిర్ణ యము. ఈ విషయము నింకను సమర్థింప, “న్యాయసూత్ర”కర్త గౌతముడు మైథిలు డనియు, నటులే “న్యాయవార్తిక” కారుడైన ఉద్యోతకరాచార్యుడు మైథిలుడనియు, మరియు “వార్తిక తాత్పర్య”పరిశుద్ధి కర్త ఉదయనాచార్యు డును మైథిలుడనియు, మధ్యలోగల యీ వాచస్పతి మిశ్రుడు అన్యదేశీయుడై యుండుట అసంభావ్యమనియు గంగానాథుడు వాచస్పతిచే రచింప డిన “సాంఖ్యకారికా”వాఖ్య “తత్త్వకౌముది” పీఠికలో తెలిపియున్నాడు. అంతియగాక న్యాయశాస్త్రాధ్యయనము మిథిల దేశమునగాక నన్యదేశమున బహుళముగ జరుగలేదనుట సుప్రసిద్ధమనియు నతని వాదము. కాని యీ వాదములు విచిత్రములు, ఊహాజనితములనిఎస్. ఎస్. సూర్యనారాయణ శాస్త్రి తన ‘భామతీ చతుస్సూతీ” గ్రంథ ఉపోద్ఘాతమున విమర్శించి. ఎటులైనను వాచస్పతి తన గ్రంథములలో బలుమారు అవనూనెను బ్రస్తా

వించుచుండుటచే, దాని నెక్కువగ నుపయోగించు బీహారు బెంగాలు దేశము లలో నొకట యతని మాతృభూమియై యుండునని వచించెను. 71 కాని యితడు మిధిల దేశస్థుడనియే పండితలోకమున ప్రతీతి యని గ్రాహ్యము ఈ యనుశ్రుతి సత్యమై యుండనోపును.

శ్రీ శంకర బ్రహ్మసూత్ర భాష్యమునకు వాచస్పతిచే రచింపబడిన "భామతీ" నామక వ్యాఖ్య నామముపై ననేక ఊహోహలు ప్రజాలోకములో నేర్పడియున్నవి. అందు పండితులు కొందరు ఈ విధముగ జెప్పి కొందురు. వాచస్పతి వివాహకాలమున, నాటి యాచారము ననుసరించి పండితసదస్సు జరిగి యుండెను. అందు పండితులు శాస్త్రవిచారణము గావింప, శ్రద్ధగా నాలకించిన వాచస్పతి మిశ్రుడు వారి వ్యర్థ అసమగ్ర పాండిత్యమునకు వగచి, దర్శనములపై ప్రామాణిక వివరణ గ్రంథముల దా రచింప గంకణము ధరించి, పరిణయానంతరము ఆ బృహత్కార్య మునకు గడంగెను. అంతలకు సాధ్వియైన భార్యయు సంతసించి, త్యాగ నిరతయై భర్తృ కార్యమున కుచితరీతి నోడ్పడుచు నుండెను. ఇట్లు స్థిర సంకల్పమున గృషిసల్పు ఆ అప్రతిహత పాండితీపరునకు దన కార్య సమాప్తియగు నప్పటికి ఆ దంపతులు ప్రాయముదాటి వృద్ధులైరి. అప్పటికి దాను దన భార్యను సక్రమరీతి సామాన్య గృహస్థువోలె గౌరవింప లేదని తలంచి, సతీలలామ యొక్క స్వార్థ త్యాగమునకు సేవాపరతికి నానంద మొంది, తన చిట్టచివరి గ్రంథమైన శ్రీ శంకర భాష్యవ్యాఖ్యానమునకు తన

71. Prof. S. S. Suryanara yana Sastry: The Bhamati, Preface.

యర్ధాంగి సహధర్మచారిణియైన 'భామతి' నామమునే యుంచి, ఆమెనామ మును జిరస్థాయి గావించెనట. ఆమె తన సంతతి మూలమునగాక నీ యుద్గ్రంథమున నంతర్గతమై యుండవలెనని అతని సంకల్పము. ఈ గాథయే సత్యమైనచో, భార్యను నిర్లక్ష్యము గావించినందులకు వాచస్పతి యొక్క ప్రశ్చాత్తాప విధానముగూడ నప్రతిహత పాండిత్య ధోరణి ననుసరించి, అతని అసాధారణ ప్రజ్ఞావైఖరిని జూపెట్టెను. ఆ "భామతీ" గ్రంథమున, వాచస్పతి మిశ్రుని అపార పాండితీ గరిమయు, భామతియొక్క అసాధారణ త్యాగపటిమయు అభివ్యక్తమై, వివేకవైరాగ్యములకాలవాలమై అద్వైత స్థితికి మార్గదర్శకములై యొప్పారుట మహద్విశేషము.

ఈ కథనము రూపాంతము నొంది, మరియొక విధముగగూడ ప్రశస్తము. చిన్ననాటనే యుద్వాహమునొందిన మిశ్రుడు, విద్యాసముపార్జనా దీక్షాపరతుడై, నాటికి బాలికగన్న భార్యను వదలి, కాశీక్షేత్రమునకు బారిపో యెను. ఆ వారణాసి నగరమున, నొక పండిత యతీశ్వరుని ఆశ్రయించి, అమానుషమైన, అమోఘమైన వైదుష్యము నార్జించి, సకలశాస్త్ర పారంగ తుడై, అసమాన పండితవరేణ్యుడని కీర్తిగాంచెను. అంతగురుపనుపున సర్వ దర్శనములకు వ్యాఖ్యల రచింప నుద్యుక్తుడై నిర్వహించుచుండెను. అందుచే నతని కీర్తి దశదిక్కుల ప్రసరించి, యతులకుకూడ నలభ్యమైన గౌరవము సంఘమున నతడు ఆర్జించెను. అట్టి గౌరవమర్యాదల ననుసరించి, చాతుర్మాస్యకాలమున, పండిత సంఘములు దీక్షాయుతనినాహ్వానించుచు, నా దీక్షాకాలమున నతనివద్ద భాష్యశ్రవణాదికము నొనరించుచుండిరి

ఈవిధముగ, నొక వత్సరము, ఒక గ్రామమున, జాతుర్మాస్యదీక్షకై యాహ్వానింపబడి, యరుదెంచి, తన భాష్యపాఠముల ద్వారమున నెల్లర సంతోషవార్నిధి ముంచుచుండ, దిలకించి, సమ్మోదమొప్ప నొక పవిత్రాల లామ, వాచస్పతి పండితుని భిక్షకై యాహ్వానించెను. అందులకియ్యకొని, యాతడు యటకు భిక్షకై యరిగి, ఆసీనుడై యుండు, నామెయు, హస్తో దకము నొసంగ నెదుటికి వచ్చియు, నిరక నుండుటయు, అందులకాశ్చ ర్యమున నతడు ఆమె ముఖమును దిలకింప, నామెకన్నీటిని వదలుచుండు టయు నవలోకించి, చకితుడై, కారణ మారయ నామె నాతడు ప్రశ్నించెను. ఆమెయు, దనకుదెలియని ప్రాయమున వివాహమగుటయు, దన భర్త తా నెరుంగనప్పుడు దేశమును వదలి ఎటకో వెడలెననియు బూర్వగాధను వచించి, విలపించుచు. తన భర్తయొక్క జాడ తెలియరాదని వగచెను. వాచస్పతియు నచ్చరువంది, బాల్యమున దాపరిత్యజించిన భార్యను గుర్తింప సాధ్యముకాకున్నను అనుమానించి, ఆమెయొక్క భర్త నామమును ప్రశ్నించి, తన నామమునే ఆమెతెలుపుటచే నామె తన భార్యగ నెరింగి, కర్తవ్యమును యోచించితన తన నైజము నామెకు వ్యక్తపరచెను. అంతి యగాక, యింతకాలముతనకొక భార్యయు గలదని పైన దోచనిస్థితిలో నుండి, తన విధ్యుక్తధర్మమును నిర్వహింపనందులకు, ఆమెకొక వరప్రదానమొసం గెను అందులకామెయు, సామాన్య స్త్రీచంచముపుత్రభిక్షనర్థింప, నతడమిత సంక్షోభము నొంది. ప్రస్తుతము తనకు గృహస్థ అనుభవము అసమంజసమ గుటచే యోచించి, వల్లెయని, 'శాశ్వతకీర్తిమంతుడా? అశాశ్వతుడా యని మరల వాచస్పతి తన సమయస్ఫూర్తి నుపయోగించి ప్రశ్నింప,

నామెయు శాశ్వత, సుప్రసిద్ధునే కోరెను. అంతనా పండితప్రకాండుడు నాటి వాతవరణమును ఆవరించి, పండిత వరేణ్యునికాలవాలమైన శ్రీశంకర భగవత్పాదాచార్యుని బ్రహ్మసూత్ర భాష్యమునకు, సమగ్రమైన, అద్భుత వ్యాఖ్యానమునువిరచించి, దానికి తన యర్ధాంగియొక్క నామ మైన 'భామతి' నుంచి, యామెకర్పించెను. అందుచే నీ గ్రంథరాజము, వాచస్పతి, మిశ్రుని రచనములలో శిరోభూషణమైన సర్వోత్తమ రచనము 'భామతీ' యని, అసాధారణ, శాశ్వత, ప్రఖ్యాతి నార్జించినది. ఇందును వాచస్పతి పండితుని అద్భుత శేముషీపటిమ, భామతీ నెపమున బహిర్గతమై, స్వప్రకాశస్వరూపము దాల్చి, భాస్వరపతిమై వెల్గొందినదనుట కెట్టి సందియమును లేదు.

ఈ యతిక్లుప్త వివరములకంటె నధికముగ, మిశ్రుని జీవిత విశేషములు తెలియరావు. కానిఅతని కీర్తి యద్గ్రంథముల రూపమున దేశము నల్గడల బ్రసరించి, ఎదరు జిజ్ఞాసువులకో యుపయుక్తమై, మార్గదర్శి యైనదనుటయు సముచిత మేయగును. తత్త్వార్థులు సదా పండితభాస్కరునికి గృతజ్ఞులేగదా!

# రచనములు

'యన్న్యాయకణికా తత్త్వసమీక్షా తత్త్వబిందుభిః యన్న్యాయసాంఖ్యయోగానాం వేదాంతానాం నిబంధనైః॥' (భామతి. 4. 4. 22) మంతన

మిశ్ర 'విధివివేక' అను గ్రంథమునకు 'న్యాయకణిక, యను వ్యాఖ్యను: మండనమిశ్ర 'బ్రహ్మసిద్ధి'కి 'బ్రహ్మతత్త్వ సమీక్ష' అను వ్యాఖ్యానమును: భాష్యార్థసంబంధమునుగూర్చి "తత్త్వబిందు" ను: ఉద్యోతకరుని "న్యాయ వార్తిక"కు "న్యాయవార్తికా తాత్పర్య టీక"నా వివరణమును: బహుశః దానికనుసంధముగ"న్యాయసూచీనిబంధ" మును: ఈశ్వరకృష్ణుని "సాంఖ్య కారిక" లకు "సాంఖ్యతత్త్వకౌముది" అనువృత్తిని; వ్యాసుని యోగ సూత్రబాష్య మునకు "తత్త్వవైశారది" అను వ్యాఖ్యను: శంకరుని శారీరక మీమాంసా భాష్యమునకు "భామతి" అను వివరణ గ్రంథమును ప్రశస్తిగ వాచస్పతి మిశ్రుడు రచించెను. ఈగ్రంథరచన మూలమున "సమస్తైషం మహత్పుణ్యం తత్ఫలం పుష్కలంమయా। సమర్పితమథై తేన ప్రీయతాం పరమేశ్వరః॥" దనకు పుష్కలముగ లభ్యమైన మహత్పుణ్యము నాచే సమర్పింపబడగ, పరమేశ్వరుడు సంతసించెడుగాక! అనియు భామతీ సమాప్తవచనముగ వాచస్పతి, సర్వసమర్పణము పరమేశ్వరునకు గావించి ధన్యుడయ్యెను.

ఇందు నితర కృతులెట్లు, ప్రఖ్యాతములై యున్నను, సుప్రసిద్ధ భామతీ రచనము మేధానంపన్నుల నాకర్షించి. లోంచి, అమూల్య వ్యాఖ్యా పుష్పముల స్వీకరించి, అద్వైతశాస్త్రమునకే గాక, భారతీయ తత్త్వశాస్త్ర మునకుగూడ నొక యలంకారమై, భారతీయ మేధాసంపత్తిని ఉన్నత శ్రేణికి గొంపోయినదని చెప్పక తప్పదు. అట్లు వెలిసిన భామతీ వ్యాఖ్యాని లో నగ్రగణ్యము 13 వ శతాబ్దమునకు జెందిన, అనుభవానంద గురువర్యుని శిష్యుడైన అమలానందుని "వేదాంత కల్పతరువు" దీనికి సుప్రఖ్యాతుడైన

అప్పయ దీక్షితుడు, "కల్పతరు పరిమళ" అనియు, "అభోగ" యని లక్ష్మీనరసింహుడును రచించిరి. మరియు 'భామతీ వాఖ్య' అనియు 'ఋజు ప్రకాశిక' అనియు నాబడు గ్రంథమును అఖండానందుడను శ్రీరంగనాథుడును, "భామతీ తిలక" యనియు, "భామతీవిలాస" అనియు ననేక వ్యాఖ్యానములు యీ 'భామతీ' గ్రంథమునకు వివరణములుగ వెలుగొందెను. పై విషయము ననుసరించి తిలకించిన, వాచస్పతి మిశ్రుడు రచించిన యీ భామతి, ఎంతటి కీర్తినార్జించినదో తెల్లము.

## వాచస్పతి తాత్పర్యము

The thoughtful student of Vachaspati may, perhaps, find little that is original in him. For the distinctive aspects of his teaching, he owes much, as has been said, to Mandana. Where he differs from Mandana, he elects to follow Shankara 71. వాచస్పతిని గ్రహింప యత్నించు విచారశీలుడైన విద్యార్థి, అతనిలో నెట్టి స్వతఃసిద్ధ లక్షణముల గాంచ జాలడు. పూర్వోక్తమురీతి నతడు, తన సిద్ధాంతములోని ప్రత్యేక లక్షణములకొరకు, బహుళముగ మండనునికి ఋణపడియున్నాడు. మండనునితో భేదించి నప్పుడు అతడు, శంకరుని అనుసరింపగోరును. కాని But there have been very few to excel or rival Vachaspati in the versality and the extent of his sholarship, his

71. Prof. S. S. Suryanarayana Sastry : The Bhamati. Preface.

vigour of style, and clarity of presentation 71, అతని బహుముఖ సిద్ధత్వమున, అతని పాండిత్య విశాలత్వమున, అతని శక్తి వంతమగు శైలిలోన, సువిస్పష్ట భావప్రదర్శనమున, నతని మించిన వారు గాని, సమానులుగాని చాల అరుదుగ నుందురు అని "భామతీ చతుస్సూత్రీ" అనువాద కర్త సూర్యనారాయణ శాస్త్రి వచనము. అప్పను, వాచస్పతి స్వకీయ సిద్ధాంత లోపములను గ్రహించినవాడై యుండనోవు, దా ప్రత్యేక ప్రకరణ గ్రంథమును రచింపక, గేవలము పూర్వ ప్రఖ్యాత గ్రంథముల, ముఖ్యముగ దర్శనములపై వ్యాఖ్యానముల రచించుటయందే సంతృప్తి గాంచి, అందును అందరకు మిన్నయై యొప్పారి యుండెను.

ఆయినను, యథాతథ దృష్టి వ్యాఖ్యానముల రచించుట గాక, Bound as the writers, no doubt, felt themselves to be by the doctrines of the Vedanta Sutras as interpreted by Shankara, they yet show considerable variation and originality in tackling the various problems in detail 72 శంకర వివరణము ననుసరించి, వేదాంతసూత్ర సిద్ధాంతముల వ్యాఖ్యానింప నియమితులైనట్లు రచయితలు గ్రహించియున్నను, వివిధ విషయ వివరణముల మిగుల వ్యత్యాసములను, స్వతఃసిద్ధత్వమును వారు ప్రదర్శించిరి. అని సూర్యనారాయణశాస్త్రి తన "సిద్ధాంత లేశ సంగ్రహ' పీఠికలో వచింప, ఓం కారానందస్వామి హిందూ పత్రికలో, The great Acharya was in turn followed by brilliant disciples who modi_

72. Prof. S. S. Surpanarayana Sastry : Siddhanta Lesa Sangraha, p. 5.

fied and re-adopted the outwork of the system with skill and originality with a view to vindicate its excellence over other rival systems 73. శ్రీ శంకరాచార్యవర్యుడు, అద్భుత మేధాసంపన్నులైన శిష్యవర్గముచే ననుసరింపబడెను. వారు, ప్రతివాద సిద్ధాంతములపై, నీ యద్వైత సిద్ధాంతము యొక్క శ్రేష్ఠత్వ స్థాపనమునకై, కౌశల్యము స్వతఃసిద్ధత్వములతో నా సిద్ధాంతమును వారు సవరించి, సమన్వయించిరి. అని తెలిపి యున్నాడు. ఆ సందర్భమున మరల నతడు, In the philosophical tradition of this country, we notice that inspite of the great respect and admiration which the pupil had for the teacher, the latter was not often an exact copy of the former 73. ఈ దేశ తాత్త్విక సంప్రదాయమున, గురువుపై శిష్యునకెంత గొప్ప భక్తి గౌరవములున్నను, శిష్యుడు గురువు యొక్క కేవల ప్రతిమాత్రము కాదు అని వచించెను. ఈ విషయము నుదాహరించుచు New significances were discovered and expressed in original form by brilliant disciples like Padmapada, Sureswara Vachaspati, Chitsukha and Appaya who also at times framed novel concepts and arguments with great critical awareness 73 పద్మపాద, సురేశ్వర వాచస్పతి, చిత్సుఖ అప్పయాది అద్భుత శిష్యవర్గము నూత్న విశిష్టత్వముల గనిపెట్టి, స్వతఃసిద్ధ స్వరూపమున వ్యక్తపరచిరి అనియు నతడు వివరించెను,

ప్రస్తుత విషయమైన వాచస్పతి మిశ్ర, పూర్వోక్త చందము మండనుని అనేక విధముల ననుసరించి' "భామతీ" రచనము గావించియున్నను

73. Swami Vimalananda : The Hindu, 30-3-1938.

The name of the Bhamati is identified with one of the [illegible] main streams of Sankara interpretation. But as the views starting with Padma-pada are known as the tenets of the Vivarana-Prasthana, the views that started with Mandana passed current as the tenets of the Bhamati — Prasthana 74. శంకర భాష్యముయొక్క ముఖ్య [illegible] ప్రవాహములలో నొక దానితో "భామతీ' నామము ఐక్యపరుప [illegible]. పద్మపాదునితో ప్రారంభించిన భావములు "వివరణ ప్రస్థానము" [illegible]. మండనునితో ప్రారంభించినవానిని 'భామతీ ప్రస్థాన" మని [illegible] పిల్వబడినవి. అయినను వాచస్పతి, మండనునిపై నాధారపడి [illegible] అంతి[illegible]క వాచస్పతి చాలవరకు సురేశ్వరుని అనుసరించి [illegible]. [illegible] అతని సిద్ధాంతము సురేశ్వర, పద్మపాదులకు మధ్యే [illegible] సత్స్వరూపానందుని అభిప్రాయము. 75 ఈ [illegible] ప్రస్తావించి, యీ భావధార, సూత్రముల ప్రారంభించి, 'పరి[illegible]తో సంపూర్తి [illegible]నంటుంటే, వేదాంతశాస్త్రమున 1) సూత్ర 2) భాష్య 3) [illegible] 4) కల్పతరువు 5) పరిమళములగుచున్నవని మధుసూదన [illegible] వాక్కు[illegible] వి. సుబ్రహ్మణ్యశాస్త్రి, లక్ష్మీనరసింహాని కల్పతరు [illegible] ఆరోగమునకు సమీక్షలో నుడివియున్నాడు. 76 మరియు a Master of the six darsanas షడ్దర్శన పారంగతుడైన [illegible] [illegible]నుసరించినను, కొన్ని స్థానముల, భాష్యమునకు

---

74. [illegible] S. S. Suryanarayann Sastry : Siddhanta Lesa— [illegible]
p. xi

75. Swami Satswarupananda : The History of Vedantic [illegible]

76. Pandit V. Subrahmanya Sastry: The Hindu. 9-12-1956

స్వతంత్ర మార్గము ననుసరించెననియు, నందులకు, 'ప్రకటార్థవివరణ" కర్త మొదలగు సన్న్యాసులు, గృహస్థుడైన వాచస్పతి రచనమునకు సమ్మతింపక, నతనిపై గొన్ని నిందల మోపిరట వాచస్పతికి అసమగ్ర సంస్కృత భాషాజ్ఞానము గలదనియు, ఈశ్వరాస్తికతను గుర్తింపలేదనియు, నైయాయికులవలె అన్యథాఖ్యాతిని బలపరచెననియు, అనాది భావరూప జ్ఞానమునకు సమ్మతింపలేదనియు, బరస్పర విరుద్ధ ప్రకటనల గావించె ననియు వారి వాదముకాగ, భామతికి కల్పతరు నామక వ్యాఖ్యను నిర్మించిన నాసిక్ వాసి అమలానందుడు, అత్యంత సమర్థముగ నా వాదముల ఖండించెననియు సుబ్రహ్మణ్యశాస్త్రి తెలిపియున్నాడు. 76 పై అభిప్రాయ ముల ననుసరించి చూడ, వాచస్పతి మిశ్రుడు కేవల వ్యాఖ్యాతగ మాత్రము పరిగణింపబడక, దన అసాధారణ ప్రజ్ఞావిశేషముచే, నపార పాండిత్య గరిమచే, ననుపమ రచనా నైపుణ్యముచే నాటి, నేటి, తాత్త్విక లోకమున నొక ప్రత్యేక ప్రముఖ స్థానము నార్జించి, అలంకరించి, అగణిత జిజ్ఞాసువుల నాకర్షించి, ఆదర్శమై, అద్వైత సిద్ధాంత ప్రపంచమున మాత్రముగాక, సర్వతాత్త్విక విశ్వమున నొక మహనీయ దినమణివలె బ్రకాశించుచున్నాడని విదితము. అందుచే నతని భావవిధానమును గొంత చూచెదము గాక!

76. Paniit V. Subrahmanya Sastry: The Hindu, 9-12-56

# బ్రహ్మము - సృష్టి

అనిర్వాచ్యావిద్యా ద్వితయసచివస్య ప్రభవతో
వివర్తాయస్యైతే వియదనిలతేజోఽబవనయః।
యతశ్చాభూద్విశ్వం చరమచరముచ్చావచమిదం
నమామ స్తద్బ్రహ్మాపరిమితసుఖజ్ఞానమమృతం॥

(భామతి. I)

ప్రభువునకు అమాత్యులవలె ద్వివిధ అనిర్వాచ్య అవిద్యయు, వివర్తరూపమున వియదనిల తేజోజలభూములును, చరాచరాత్మకమును, ఉచ్చనీచములును అగు నీ విశ్వము ఎవని నుండి ఆవిర్భవించెనో, అట్టి అపరిమిత సుఖజ్ఞానస్వరూపు డగు నా అమృత బ్రహ్మమునకు నమస్కరించెదను అని, వాచస్పతి భామతీ గ్రంథ మంగళాచరణ శ్లోకమున, దన సిద్ధాంత తాత్పర్య సంగ్రహమును వెలిబుచ్చి యున్నాడు. ఇందు అతని బ్రహ్మము, అపరిమిత సుఖజ్ఞాప అమృతుడగుటచే సచ్చిదానందు డనియు స్పష్టమగుచున్నది. కాని ఆ బ్రహ్మమునుండి ద్వివిధా విద్యయు, పంచ మహాభూతములును, చరాచరాత్మక విశ్వము జనించినట్లు తర్వాత వాక్యము తెలుపుచుండుటచే, నతని బ్రహ్మము సగుణమా, నిర్గుణమా అను సందియము పొడసూపును. కాని వాచస్పతి భావముల నిసుమంత తరచినచో బ్రహ్మ, జీవేశ్వర విశ్వముల మాయాసంబంధము విదితమగును.

"జన్మాద్యస్య యతః" (వే. సూ. 1. 1. 2) సూత్ర భాష్య వివరణమున, "జన్మాది" శబ్దమునకు వేదభాష్య కర్త యగు యాస్కుడు

కేవలము జన్మ స్థితుల మాత్రమన్వయింప, శంకరుడు 'యతో వా ఇమాని భూతాని జాయంతే యేన జాతాని జీవంతి యం ప్రయంత్యభిశంవిశంతి" అను తైత్తిరీయక శ్రుతి ప్రమాణము నాధారముగ గొని, "జన్మస్థితిభంగ సమాసార్థః" అని సమన్వయించి, "జన్మస్థితిభంగం యతః సర్వజ్ఞాత్సర్వ శక్తేః కారణాద్భవతి, తద్బ్రహ్మేతి" జన్మ స్థితి భంగములు, ఏ సర్వజ్ఞ సర్వశక్తి కారణమునుండి ఏర్పడుచున్నవో అదియే బ్రహ్మము అని వ్రాక్కుచ్చియున్నాడు. 'యా ఉత్పత్తి బ్రహ్మణః కారణాత్, తత్రైవ స్థితిః ప్రళయశ్చ" ఏ కారణ బ్రహ్మమునుండి ఉత్పత్తియో అచటనే స్థితి లయములుగూడ నుండును అని శంకర నిశ్చయము. ఈ వాక్యముల వివరించుచు భామతీకారుడు, పై ఉత్పత్తి స్థితి భంగములలో "వృద్ధి పరిణామాపక్షయ" ములుగూడ నన్వయించునని తెలిపి, వృద్ధి యన అవ యవాభివృద్ధి యనియు, బరిణామము ధర్మలక్షణ అవస్థాలక్షణరూపమున ద్వివిధమైఉత్పత్తియే యగుచున్నదనియు, అపక్షయము అవయవక్షీణమై, నాశరూపమనియు నన్వయించి, అందుచే బ్రహ్మమే సృష్ట్యాదికమునకు మూలకారణమనియు వివరించియున్నాడు. అనగా కేవలము ఉత్పత్తి స్థితులు మాత్రమే యన్వయింపబడుచో ఉత్పత్తి స్థితులు నిమిత్తమునకు గూడ సామాన్యముగాన, ఉపాదానత్వము అందు సూచనముకాదుగాన, బ్రహ్మమునకు ఉపాదానకారణత్వము సంఘటింపజేయుటకై శ్రుతి, లయ ప్రస్తావనముగూడ గావించియున్నదని వాచస్పతి తాత్పర్యము (భామతి. 1. 1. 2). "లయాధారత్వాదేవోపాదానత్వం లభ్యతే," 'ఉపాదానత్వ

సిద్ధ్యర్థం లయాశ్రత్వముక్తం అనియు, కల్పతరుకారుడైన అమలా నందుని వివరణము.

ఈ విషయమును వివరించుచు, సిద్ధాంత లేశ సంగ్రహ కర్త "తథా చైకమే వేదం లక్షణమభిన్న నిమిత్తోపాదనతయా ద్వితీయం బ్రహ్మోవలక్షయతి—ఇత్యాహుః (సి. లే. సం. 1. 2. 12) అట్లు యీ నిర్వ చనంఏకమై, నిమిత్తో పాదాన విభేదములేని లక్షణము గలదియై, వాని నుప లక్షణములుగ గలిగియున్నదని వచించెను. అనగా సద్వయ బ్రహ్మము సత్యలక్షణములు గలదిగ మాత్రముండజాలదు. అట్లైనచో దాని అద్వ యత్వమునకు భంగ మేర్పడును, కాన సృష్ట్యాదికము యథార్థ విశేషణ ముగగాక, కేవలముపలక్షణమాత్రముగ నున్నదని తాత్పర్యము. అనగా దేవదత్త గృహమును గుర్తింప, దానిపై దాత్కాలిముగనున్న కాక ముపయుక్తమై. ఆ సమయమునకా కాకము గృహమునకు ఉపలక్షణమై యున్నట్లు బ్రహ్మమునకు సృష్ట్యాదికార్యము నిత్యము కాదని గ్రాహ్యము

పూర్వోక్త ఉపాదానత్వము, అద్వితీయ కూటస్థ చైతన్య రూప మున, అణు ప్రకృతులందువలె బరిణామరూపముగాక, "కిం త్వవిద్యయా వియదాదిప్రపంచరూపేణ వివర్త మానత్వ లక్షణం' (సి. లే. సం. 1. 2. 21) ఆకాశాది భూతాత్మక విశ్వరూపమున వివర్త రూప లక్ష ణము గలదనియు, వస్తువుతో సమ సత్తాకముగలది పరిణామమై యుండ, దానితో అసమసత్తాకమున నున్నది వివర్తమనియు, ననగా కారణలక్షణములతో నన్యథా గోచరించుట పరిణామమై యుండ, కారణ విలక్షణత్వ మున నుండునది వివర్తమనియు, మరియు భిన్న కారణా

భిన్నత్వమున నున్న కార్యము పరిణామముకాగ, కారణాభిన్నమై కారణ వ్యతిరేకముగ దుర్వాచ్యమైన కార్యము వివర్తమనియు, పరిణామ, వివర్తముల, నప్పయ్య దీక్షితులు వాచస్పతి భావముల వివరించెను (సి. లే, సం. 1. 2. 21). అందుచే వాచస్పతి భావమున బ్రహ్మము వివర్తోపాదానమగుచు, దానెట్టి మార్పును జెందక, కేవలమధిష్ఠానముమాత్రమగుచున్నాడు. అతనికి కూటస్థ నిత్యత్వము గలదుగాని, పరిణామ నిత్యత్వములేదని భావము. ఎందుచేనన, "పరిణామనిత్యతా హి న పారమార్థికీ ।" (భామతి. 1. 1. 4) పరిణామినిత్యత పారమార్థికము కాదు. దీనిని జర్చించి, భేదాభేదాది వాదముల నిరసించి, "తస్మాత్ కూటస్థ నిత్యతైవ పారమార్థికీ, న పరిణామినిత్యతేతి సిద్ధం" (భామతి. 1. 1. 4) అందుచే కూటస్థ నిత్యత్వమే పారమార్థికముకాని, పరిణామ నిత్యత్వము సిద్ధముకాదు అని వాచస్పతి నిశ్చయము.

## మాయ - సృష్టి

అట్లయినచో, నిక నీ సృష్టి పరిణామమెట్లు ? దీని ప్రత్యక్ష కారణ మెద్ది ? ఈ సమస్యా నివారణార్థము వాచస్పతి, భామతీ మంగళాచరణ శ్లోకమున "అనిర్వాచ్యావిద్యా ద్వితయః" అని వాకొనియున్నాడు. దీని కల్పతరువు, 'విహ్యావిద్యా అనాదిర్యావహాపా (దేవతాధికరణే 1. 3. 26-33) వక్ష్యతే.... తదవిద్యాద్వితయం. సత్వాసత్వాభ్యామనిర్వాచ్యం"

31)

(1. 1. 1) అవిద్య ఏకమై, అనాదియై, భావరూపముగ వచింపబడెను, అది ద్వివిధమై, సత్వ, అసత్వముగ, ననిర్వాచ్యమై యున్నదని వివరణము. మహాప్రళయ కాలమున సంతఃకరణాదులు వృత్తులు "స్వకారణేఽనిర్వాచ్యం అవిద్యాయాం లీనః' (1. 3. 30) స్వకారణమును, అనిర్వాచ్యమును అయిన అవిద్యలో లీనమగునని వచించుచు, భామతి ఆ నిర్వాచ్యత్వమును అవిద్యకు మరల నొసంగియున్నది. ఈ ద్వివిధమైన అవిద్య, కారణావిద్య యనియు కార్యావిద్య అనియు నాబడినది. కారణావిద్య సత్వ ప్రధానమై, మూలావిద్య యనబడుచు వాసనాయుక్తమై యుండ, దీనిపై నాధారపడుచు, కార్యావిద్య బహుముఖమై, నానాత్వమున కార్యావిద్య లనియు తూలావిద్యలనియు నాబడెను. తూలావిద్యలు సమసత్తాక భ్రాంతులచే నివారితమగుచుండ, ననగా భ్రాంతి సర్పజ్ఞానము, భ్రాంతి దండజ్ఞానముచే నివారింపబడి నట్లుండ, మూలావిద్య, పరమార్థ దర్శనముతోడ మాత్రము నిరాసమొందునుగాన బ్రహ్మజ్ఞానపర్యంతము అది యుండును.

ఇట్లభివర్ణితమైన మాయ, యీ సృష్టికి కారణమగునని వాచస్పతి. ఎట్లు ? "వాచస్పతి మిశ్రాస్తు-జీవాశ్రిత మాయా విషయీకృతం బ్రహ్మ స్వత ఏవ జాడ్యాశ్రయ ప్రపంచా కారేణ వివర్తమానత యోపాదానమితి మాయా సహకారి మాత్రం, న కార్యానుగతం ద్వారకారణం" (సి. లే. సం. 1. 2. 234) వాచస్పతి మిశ్ర అభిప్రాయమున జీవాశ్రయము గల్గి విషయముగ గోచరించు మాయను గలిగిన బ్రహ్మముపాదాన కారణమగును. ఆ బ్రహ్మమే వివర్తరూపముగ నుపాదానమై జడత్వమునకాశ్రయమైన ప్రపంచాకారము దాల్చును. అందుచే మాయ సహకారికారణము

మాత్రమే అగును గాని, కార్యాంతర్గతమైన కారణముకాదు అనగా నుపాదానము కాదు అని అప్పయదీక్షిత వాదము. ఈ రీతి కార్యరూపమైన విశ్వము బ్రహ్మమునకనన్యమై, అనగా బ్రహ్మ వ్యతిరేకసత్తా శూన్యమై యుండునని, (సి. లే. సం, 1. 5. 232), అనగా నిట ననన్యత్వమునకర్థము అభేదము కాదనియు వివరించి, సృష్టికి బ్రహ్మాభిన్నత్వమును నిరసించి, బ్రహ్మ సృష్టులకు సమానసత్తా నొసంగక, "తాత్పర్యేణ శుక్తిరజతయోరివ ప్రాతీతికాభేదాభ్యుపగమేఽపి విరోధాభావాత్' శుక్తి రజతములకువలె నాభాసమాత్ర అభేదత్వమునకు విరోధ మభావమని అప్పయదీక్షిత వివరణము. ఈ విషయమును వాచస్పతి (2. 1. 14) సూత్రభాష్యమున జర్చించి యున్నాడు. ఈ విధముగ, మాయ, మూలా తూలా విద్యారూపముగ ద్వివిధమై, తూలావిద్య జీవాశ్రయమై యుండ, మూలావిద్య బ్రహ్మాశ్రయమున సృష్టికి సహకారికారణముగుచు ననగా బ్రహ్మమును, చీకటి, ఆశ్రయ మొసంగిన గృహమును మరుగుపరచునట్లు మరుగు పరచి, సృష్టిని గోచరింపజేయుచున్నది. అందుచే, సత్యమున జీవ, మాయల సంయోగమే సృష్టి కారణమని గ్రాహ్యము. మరియు నీ మాయ, "అవిద్యా చ స్వభావత ఇవ, కార్యోన్ముఖీ న ప్రయోజనం అపేక్షతే॥" స్వప్రయోజనమపేక్షింపకయే స్వభావతః కార్యోన్ముఖత్వము గలిగియుండునవియు భామతి తాత్పర్యము.

ఇక నీ సృష్టిలోని జడత్వమునకు గారణమేది? అను సందియము గలుగును. "జగత్యనుగతజాడ్యం న కారణగుణః కింతు జగత

ఏవ స్వాభావికం। అత స్తస్సిద్ధయే మాయాయా ఉపాదానత్వ కార్యానుగతి ద్వారకారణత్వం వా న కల్పనీయం" జగముయొక్క జడత్వమునకు గారణము, జగత్కారణమునగాక, దాని స్వభావమున మాత్రము కలదు. ఈ జడత్వ కారణముగ మాయకుపాదానత్వ కల్పనమవసరము గానము అని భామతి వాదము. ప్రకృతియొక్క జడత్వము, కారణమున గాక గార్య మున గలదని తాత్పర్యము. కార్యలక్షణములు కారణమున నుండ నవసరము లేదు గదా, అనియు ప్రశ్నము (భామతి). అందుచే, గారణము శుద్ధమైయుండ, గార్యమశుద్ధముగ నుండునని వాచస్పతి వచనము. అట్లు, సృష్టి వివర్తరూపముగ బ్రహ్మమునందేర్పడినను, బ్రహ్మము పరిశుద్ధమై యుండును.

ఈ విధముగ నేర్పడిన సృష్టికార్యము, భ్రమ యనియే సర్వ అద్వైత తాత్పర్యమై యున్నను, యీ భ్రాంతి నిర్వచన, వివరణముల భావభేదములు గోచరము. ప్రతిబింబ స్వప్నదృష్టాంతములు వివరణమున గైకొనబడి, అవి సత్యాసత్యములకన్యము అనియు, నందుచే నా భ్రాంతులు అనిర్వచనీయములగుటచే నది అనిర్వచనీయఖ్యాతి యనియు అద్వైతుల భావము. అసలు లేనిదాని వ్యవహారమే గలుగదుగాన నది అసత్తుకాదు. కాక సత్తే యగునో సదృశ్యముకాదు గాన నా భ్రాంతి రూపము సద సత్తుల కన్యమై, అనిర్వచనీయముగ జనితమని వివరణము. కాని యీ భావము సర్వాంగీకార్యముగాక, స్ఫటిక రక్తకుసుమ దృష్టాంతము నాధా రణముగ, సన్యథాఖ్యాతి వాచస్పతిచే బేర్కొనబడినది. పీని సోపాధిక భ్రమలని వచించి, అన్యదేశ్య మైన అప్పి లక్షణములు ప్రత్యక్ష

ఉపాధిపై గోచరించుటయే అన్యథాఖ్యాతి అని తెలుపబడినది, 'స్వరూపేణ మరీచ్యంభో మృషా వాచస్పతేర్మతం। అన్యథాఖ్యాతిరిష్టాస్యేత్యన్యథా జగృహుర్జనాః॥" (కల్పతరు. 1, 1. 1) మృగతృష్ణలోగల జలము మృష యని వాచస్పతి మతముగ, నమలానందుడు వాచస్పతిని సమర్థించెను. ఈ విషయము నుదాహరించుచు వాచస్పతి (1. 1. 1) సూత్ర భాష్యమున, "పీతః శంఖః" "తిక్తో గుడః' అను రెండు విషయముల స్వీకరించి, పైత్యరసమున గల పీత వర్ణము నేత్రమునుండి బయల్వెడల, శుద్ధ తేజోకిరణములతో సంబంధించి, పైత్యమునుండి ఎడబాసి శుక్ల శంఖము నావరించి పచ్చగ గోచరింప జేయుచున్నది. అటులే చక్కెరకు జేదుగుణ మిన్వయించుట యని వివరించెను. ప్రతిబింబభ్రాంతి, ద్విచంద్ర దర్శనము, అలాతచక్రము, గంధర్వనగరము మొదలగు నుదాహరణ ముల నతడు, ఆ సందర్భమున గైకొనియున్నాడు. ఈ విషయమును భామతీకారుడు వివరించుచు, 'న ప్రకాశమానతా మాత్రం సత్త్వం, యేన దేహేంద్రియాదేః ప్రకాశమానతయా సద్భావోభవేత్" ప్రకాశ మానమైన మాత్రమున సత్త్వము, అనగా సత్యత్వము వస్తువునకేర్పడ జాలదు. అటులైనచో, స్వరూప గోచరములైన దేహేంద్రియాదులు సత్యములగును. "న హి సర్పాదిభావేన రజ్జ్వాదయో వా స్ఫటికాదయో వా రక్తాదిగుణయోగినో న ప్రతిభాసంతే, ప్రతిభానమానా వా భవంతి తదాత్మానస్తద్ధర్మాణో వా" సర్పరూపమున గోచరించు రజ్జువు, రక్త వర్ణమున జూపడు స్ఫటికాదికము గలవు గదా! అట్లగుపించునవి, ఆ స్వరూపములుగ మారుటగాని, ఆయా ధర్మముల బొందుటగాని జరిగి

వదా ? అట్లైనచో మృగ తృష్ణలో మందాకినీ గంగను భావించి, అవలో
కించువాడు అందు దాహశాంతిని బొందవలెను. అందుచే నీ తీర్మానము
అసంతృప్తిగ నున్నను, 'ప్రకాశమానస్యాప్యారోపితస్య న వస్తుసత్త్వ
మభ్యుపగమనీయాత్" (భామతి. 1. 1. 1) ఆరోపితము స్వరూపవంత
మయి యున్నను, దానికి వస్తుత్వము వచింపరాదు అని వాచస్పతి
నిశ్చయము. అట్టి భ్రాంతివస్తువులు అనుభవయోగ్యమగుచున్నను, సత్య
వస్తువులవలె సంపూర్ణ అనుభవ యోగ్యములుగావు. అనగా దృష్టికి
గోచరించు మృగ తృష్ణ జలము దాహశాంతి నొసంగనేరదు. అటువలె
నితరములు గూడ. ఇట్లు "ఇదం" రజ్జుస్వరూపమునై. 'సర్పం" ఆకార
ధర్మము లారోపించి, అన్యథాగోచరమగుటచే నిది అన్యథాఖ్యాతి యగు
నని వాచస్పతి మతము. కాని అమలానందుడు తన కల్పతరువులో
వాచస్పతిని అనిర్వచనీయవాదిగనే సమర్థించెను (కల్పతరు. 1. 1. 1)
ఈ విధముగ సృష్టి అవిద్యా జనితమై, భ్రాంతిరూపమని తాత్పర్యము.

## జీవుడు

'వాచస్పతి మిశ్రాస్తు-జీవాశ్రిత మాయా విషయీకృతం బ్రహ్మ
స్వత ఏవ ..." (సి, లే. సం. 1. 2. 234) అను అప్పయ వాక్య
మున మాయ జీవాశ్రితముగ వచింపబడి యున్నది. జీవాశ్రితమైన ఈ
మాయ కేవలమభావముగాక, అనిర్వాచ్యతత్త్వమై, అనాదిగతముగ

నొప్పారుచున్నది. "నా భావో నామ భావాదన్యః కశ్చిదస్తి, అపి తు భావ ఏవ భావాంతరాత్మనా అభావః స్వేనరూపేణ తు భావః' (భామతి. 1. 1. 1) అభావమనగ మరియొక భావవస్తువుతో బోల్చబడి నభావవస్తువగును. కాన భావాంతరముగ వచింపబడిన నీ అభావ వస్తువు, స్వరూపతః గోచర మగుచున్నది అని భామతీకారుని వివరణము. మరియు, అజ్ఞానమన, "న సత్, నాసత్, నాపి సదసత్ పరస్పరవిరోధాత్, ఇత్యనిర్వాచ్యం....' (భామతి. 1. 1. 1) సత్తుగాక, అసత్తుగూడగాక, పరస్పర వైరుధ్యము గాన సదసత్తునుగాక, అనిర్వాచ్యమైనదని భావము. అభావము దృశ్య మానము కాదుగదా ! కాని మాయా దృశ్యములు గోచరములు. మరియు "నాకు తెలియదు" అను అజ్ఞానము గ్రహింప బడుచు, "నాకు తెలిసినది" అను జ్ఞానముచే నివారింపబడు చుండుటచే నీ అజ్ఞానమను మాయ, భావ రూపమై అనిర్వాచ్యముగ స్వీకరింపబడుచున్నది. పూర్వోక్త విధాన నీ మాయ, మూలా, తూలారూపముల ద్వివిధమై, ప్రస్తుత జీవునకు తూలా విద్యగ భాసించుచు నతనికి గారణ మగును. కాని యీ తూలా విద్యయునేకము గాక, 'ప్ర తి జీ వ మ వ్ిద్యాభేదమభ్యుపగమ్యైవ త ద ను వృ త్తి నివృత్తిభ్యాం బంధమోక్షవ్యవస్థాం.... " (సి. లే. సం. 1. 2. 3224) ప్రతి జీవునికి, నొక్కొక అవిద్యను సమ్మతించి, ఆ వ్యష్టిరూప అవిద్య కలిమిచే బంధము, నివారణముచే మోక్షము అను వ్యత్యాసము నా వచనముచందము, జీవ, జీవునకు అవిద్యలు గలవు. 'న వయం ప్రధానవదవిద్యాం సర్వజీవేష్వేకామా చక్ష్మహే' ప్రధానము, ఏకముగ సర్వ జీవులకాధారమనునట్లు అవిద్యను ఏకముగ తెలుపుటలేదని వచించి. "అవిద్యోపాధిభేదాధీనో జీవభేదః

జీవభేదాధీనశ్చావిద్యోపాధిభేద ఇతి పరస్పరాశ్రయాదుభయాసిద్ధిరితి – సాంప్రతం, అనాదిత్వాద్బీజాంకురవదుభయసిద్ధేః।" (భామతి. 1. 43.) అవిద్యోపాధిచే జీవభేదమును, జీవభేదముచే అవిద్యా భేదము గలిగి, పరస్పరాశ్రయములై, బీజాంకురములవలె ననాది సిద్ధములై యున్నవని వాచస్పతి వివరించెను. అనగా ఎందరు జీవులో, అన్ని అవిద్యలు గలవు. "జీవావిద్యయోర్బీజాంకురవద్దేతుమత్త్వే జీవానిత్యత్వం స్యాత్, తస్మాదుత్తరోత్తరజీవాభివ్యక్తీనాం పూర్వపూర్వభ్రమ నిమిత్తకత్వమాత్రోక్తం। అనాదిస్త్వవిద్యా జీవోపాధిః........' (కల్పతరు. 1. 2. 8). జీవావిద్యలు బీజాంకురములవలె నున్న, జీవత్వమునకు అనిత్యత్వము వాటిల్లును. అందుచే ఉత్తరోత్తర జీవత్వమునకు, పూర్వపూర్వభ్రమ కారణమగుచున్నది. ఆ భ్రమరూపమైన అవిద్య అనాదియై, జీవునకుపాధియగును అని అమలానందుడు వివరించెను. A distinctive feature of Vachaspatis advaita is the recognition of a Plurality of nesciences 77. అవిద్యా నానాత్వమును గుర్తించుటయే వాచస్పత్య అద్వైతమున గల ప్రత్యేకత అని, ఆచార్య సూర్యనారాయణశాస్త్రి వాకొనెను. అవిద్య ఏకమై జీవసృష్టి కారణమైనచో, నొక జీవుడు అవిద్యా నిరాసమొనర్చి ముక్తి గాంచినచో, సర్వ సృష్టి యదృశ్యమై, సర్వజీవులు ముక్తి నొందెదరు. అంత ముక్త బద్ధ విభేద మభావము. కాని అది శాస్త్రవిరోధము, అనుభవబాహ్యము. అందుచే జీవనానాత్వము సమ్మతము. దీనిచే నొక జీవుడు ముక్తి గాంచిన, నతనికే ముక్తిగాని

77. Prof. S. S. Suryanarayana Sastry: The Bhamati, p. xxx.

యితరులకు లేదు. అతనికి ప్రపంచము అభావముగాని. యితర జీవులకు గలదు. ఇట్లు నానాత్వమునగల అవిద్యలు జీవుని ఆశ్రయించి యున్నవి. పరిశుద్ధ బ్రహ్మమున నీ అపరిశుద్ధత్వమెట్లు ఇమడగలదు ? అవిద్యా గ్రస్తుడైన జీవుడేగదా బోధింపబడుట, జ్ఞానార్జనము గావించుట, అవిద్యా నివృత్తినొంది ముక్తినొందుట ! జ్ఞాన మెచట అవిద్యను నిరసించెనో అచటనేగదా అవిద్యా స్థానము. అది జీవుని స్థానమే యగును. "అహం అజ్ఞః' అను అజ్ఞానము జీవునిలోనిదే యగును. అది జీవాంతఃకరణ గతమై, శుక్తము నందు రజతభ్రాంతి దోపించురీతి, నది బ్రహ్మము నాచ్ఛాదించి, ప్రపంచాకారమును జూపడజేయును. జీవకారణమైన అవిద్య, జీవాశ్రయము నెట్లు పొందును? కాని జీవావిద్యలు అనాదులు, అవినా భావములు. అది అనిర్వాచ్యము. "తదేవ అవిద్యానాం అవిద్యాత్వం" అని వాచస్పతి వాదించును.

అయిన జీవస్వరూపమెట్టిది? జీవబ్రహ్మసంబంధమెట్టిది ? Vachaspati does not hold that the jivas are literaily reflections.... Vachasqati,s own conception of the relation of the jiva to Brahman is that of finitisation of the infinite 77. జీవులు, కేవలము ప్రతిబింబములని వాచస్పతి సమ్మతింపడు. అఖండము ఖండమగుటయే బ్రహ్మ జీవుల సంబంధముగ, వాచస్పతియొక్క స్వకీయాభిప్రాయము. ఆకాశము అనంతము, వ్యాప్తము

77. Prof. S. S. Suryanarayana Sastry : The Bhamati. p. xxx.

[illegible] అది ఘటములో నిండి యున్నట్లు గోచరముగదా! ఘటమును [illegible] తద్గతాకాశముకూడ జలించినట్లుండును. అటులే బ్రహ్మ చైతన్యము అంతఃకరణముచే నవచ్ఛేదింపబడి, జీవత్వము నొందుచున్నది [illegible] వచ్ఛేదాంశము [illegible], నిక జీవ బ్రహ్మ వ్యత్యాసము శూన్యము ఈ [illegible] వచ్ఛేదాంశము ద్వివిధము. ఈశ్వరకారణ మొకటి, జీవకారణము రెండవది. అందుచే బ్రహ్మము ప్రథమతః ఈశ్వరునివలె బ్రతిబింబింప, [illegible] జీవులు ఈ యీశ్వర ప్రతిబింబములుగాక, మరియు, ఈశ్వరుడు [illegible] బ్రహ్మ ప్రతిబింబమై, జీవులు అశుద్ధమాయా బ్రహ్మ ప్రతిబింబములుకూడ గాక, అవచ్ఛిన్న బ్రహ్మచైతన్యములని వాచస్పతి మతము.

ఈ వాదమును 'సిద్ధాంత లేశ సంగ్రహ' కర్త ప్రస్తావించి (I. 2. 313 [illegible]) వివరించియున్నాడు. రూపా నుపాహిత ప్రతిబింబోన [illegible] సీరూపే" రూపరహితమైన దానికి బ్రతిబింబ మసంభ [illegible] వస్తువునకు అసలే అసంభవము. 'భామతీ' గ్రంథముకూడ [illegible] ప్రవ్యమతి వ్యాచ్ఛతయా రూపవతో ద్రవ్యాంతరస్య తద్వివేకేన [illegible] గృహ్ణీయాత్, (అధ్యాస. I.I.I) రూపవంమై [illegible] వస్తువు రూపవంతవస్తు ప్రతిబింబమును తదన్యమైయున్నను [illegible]. '[illegible] సీరూపో విషయా న విషయచ్ఛాయా ముద్గ్రిహాయి [illegible]" [illegible]త్మమైన, అరూపమగుటచే విషయ ప్రతిబింబమును [illegible] అని వివరించి, 'శబ్ద గంధ రసాదీనాం కీదృశీ ప్రతిబింబతా, [illegible] రసాదులకు బ్రతిబింబత్వము గలదా అని భాట్టులతో నేకమై

ప్రశ్నించెను. ఆకాశ ప్రతిబింబ దృష్టాంతమున, గగనవ్యాప్త సూర్యకిరణ ప్రతిబింబమును ఆకాశప్రతిబింబమని భ్రమగలుగుచున్నది గాని అట గగనము ప్రతిబింబించుట లేదు. ప్రతిధ్వనియు సత్యమున శబ్దప్రతిబింబ ము కాదు. పంచీకరణము ననుసరించి మృదంగ, సముద్ర శబ్దములు, మృజ్జల శబ్దములై యుండ, ప్రతిధ్వని నాబడునది ఆకాశశబ్దమై యున్నది. అందుచే నది అన్యశబ్ద ప్రతిశబ్దము కాజాలదు. కావున "ఘటాకాశవదంతః కారణా వచ్ఛిన్నం జీవః, తనవచ్ఛిన్నం ఈశ్వరః" ఘటాకాశమువలె నంతః కరణావచ్ఛిన్న చైతన్యము జీవుడై యుండ, దానిచే ననవచ్ఛిన్నమైన చైత న్యము ఈశ్వరుడగుచున్నాడు. అటులైన విశ్వమునగల చైతన్యమంతయు, సంపూర్తిగ నంతఃకరణావచ్ఛిన్నమై జీవులై యుండ, నిక అంతఃకరణా వచ్ఛేదరహితుడైన ఈశ్వరుడు, యీ విశ్వమున నుండ నవకాశము లేదు గాన పరముడై యుండవలెననియు, నంత నీతని యంతర్యామిత్వమునకు భంగమేర్పడుననియు వాదించుట జెల్లదు. అటులైన ఉదకాంతర్గత వస్తు ప్రతిబింబము నీటియందేర్పడజాలనియట్లు, యీయంతఃకరణాంతర చైతన్య మునకు ప్రతిబింబమేర్పడ నేరదు. అనగ ప్రతిబింబకారణ బింబము బాహ్యము. అటులే ఈశ్వరుడు బాహ్యము. మరియు, ఘటజలమునందు ఆకాశమంతర్గతమైనట్లు జీవచైతన్యములందు ఈశ్వరచైతన్యమంతరమై యున్నది. "తస్మాత్ సర్వగతస్య చైతన్యస్యాంతఃకరణాది నావచ్ఛేదోఽ వశ్యం భావీతి అవశ్యకత్వాత్ అవచ్ఛిన్నో జీవః ఇతి పక్షం రోచయంతే" (సి. లే. సం. 1.2.313) అందుచే, సర్వగత చైతన్యము అంతఃకరణా వచ్ఛిన్న చైతన్యమగుట అవశ్యకము. అందుచే నా అవచ్ఛిన్నుడే జీవుడు అను వాచస్పతి భావముల "సంగ్రహ" కర్త వివరించెను (1. 2. 313).

అంతియగాక, అజ్ఞానజనిత ప్రాతిభాసిక రజతము వ్యష్టి అజ్ఞానములచే జనించి. ఆ యా వ్యక్తులకు వివిధరీతుల దోచుచందము, "అవిద్యాకృతో వియదాది ప్రపంచః ప్రతిపురుషం భిన్నః" (సి. లే. సం. 1. 2. 32242) అవిద్యాకృత పంచభూతాత్మక ప్రపంచము, ప్రతిపురుషునకు భిన్నభిన్నముగ ననుభూతము. కాని "ఐక్యభ్రమమాత్రం" అది అందరికి నేకమనుకొనుట భ్రాంతిమాత్రమనియు వాచస్పతి వాదము.

## ఈశ్వరుడు

"నిఃశ్వసితమస్య వేదా వీక్షితమేతస్య పంచ భూతాని। స్మితమేతస్య చరాచరమస్య చ సుప్తం మహాప్రళయః ॥2॥ షడ్భిరంగైరుపేతాయ వివిధైరవ్యయైరపి। శాశ్వతాయ నమస్కుర్మో వేదాయ చ భవాయ చ ॥3॥ మార్తాండ తిలక స్వామి మహాగణపతీన్ వయం। విశ్వవంద్యాన్నమస్యామః సర్వసిద్ధి విధాయినః ॥4॥" (భామతి) వేదములతని నిఃశ్వాసములు, పంచభూతములు వీక్షణములు, చరాచరములతని చిరునవ్వు, అతని నిద్రయే మహాప్రళయము. శాశ్వతములైన షడంగములతోడను, వివిధమగు అవ్యయములతోడను సంబంధించియున్న వేదములకును భవునకును నమస్కరించుచున్నాము అని ద్వితీయ, తృతీయ, మంగళాచరణ శ్లోకములం సగుణ బ్రహ్మమును స్తుతించి, నమస్కరించి,

యింకను దృష్టిగాంచక భవునకు ప్రణమిల్లి, యంత మార్తాండునకు, గార్తి కేయునకు, మహాగణపతికి సర్వసిద్ధి విధాయకులగుటచేత, విశ్వవంద్యు లగుటచే నమస్కరించుచున్నానని, కేవల సగుణ బ్రహ్మమైన పరమేశ్వరుని మాత్ర మేగాక అర్చామూర్తులకుగూడ వాచస్పతి జోహారులర్పించియున్నాడు. అయినను కొందరు విమర్శకులు వాచస్పతిని నాస్తికునిగ అనగ ఈశ్వర వాదిగాదని వచించుటచే, కల్పతరు కారుడైన అమలానందుడు. పలుమారు వాచస్పతిని ఈశ్వరవాదిగ సమర్థించెనని పండితాభిప్రాయము. అందుచేత this is all the more difficult to comprehend in the case of Vachaspati, who begins his work with due invocation to Bhava, Kartikeya and Ganapati, and throughout his work betrays little trace of the atheism that is apparent conclusion 77. తన గ్రంథమును భవ, కార్తికేయ, గణపతుల స్తుతు లతో ప్రారంభించి, తన రచనమున తన నిర్ణయముగ నాస్తిక లేశమునైన జూపెట్టని వాచస్పతిని గ్రహించుట, కఠిన తరముగనున్నది అని పండిత సూర్యనారాయణ శాస్త్రి వచించెను. అనగా సిద్ధాంతచర్చలో, నీశ్వర స్థితి వివరణమున వాచస్పతి, పారమార్థిక దృష్టితో వచించియుండుట యీ కలవర మునకు గారణమై యుండనోపు. అదెట్లో చూచెదముగాక.

'అనిర్వాచ్యావిద్యా ద్వితయ ....' అవిద్య అనిర్వాచ్యమై ద్వివిధ ముగనుండి, పూర్వోక్తరీతి కార్యరూపమున జీవ కారణముగను, నీశ్వర

77, prof. s s. suryanarayana Sastry : The Beamati, p. xxx

కారణముగ నయ్యెనని తన ప్రథమ శ్లోకమున, వాచస్పతి తన వాదమును వ్యక్తపరచినట్లు చూచియున్నాము. అవిద్యా వ్యవహార స్థానము జీవుడై యుండ, దాని అధిష్టానము ఈశ్వరుడని వాచస్పతి 'నాయజ్ఞానము అని జీవుడు చెప్పికొనుచుండినను, యథార్థమున నతడు ఆ యజ్ఞానాధీనుడై యుండునుగా దాని నియమింపజాలడు. అనగ అవిద్యాబద్ధుడు. కాని అవిద్యకధిష్టానముగను ఆశ్రయముగను నున్న యీశ్వరుడు, మాయా నియంతయై, దాని శాసిం పాలించును, ఈయవిద్యను విశ్వముగ రూపొందించు మాయకుడు ఈశ్వరుడు. జీవుల అవిద్యలు వివిధములై యున్నను వానియన్నింటి యాశ్రయము ఈశ్వరుడుడొక్కడే. అందుచే జీవేశ్వరత్వములు పరస్పరా పేక్షకములై, జీవత్వముతో నీశ్వరత్వముగూడ రూపొంది, అవినాభావ సంబంధమున నీ ద్వయము వ్యవహరించుచుండును. ఇరువురికి నవిద్యయే మూలకారణము. అవిద్య సమగ్రముగ నశించునంతవరకు జీవేశ్వరు లిరువుర కలిమి ఆవశ్యకము. ఒక జీవుడు ముక్తి గాంచినను, బద్ధజీవు లుండుటచేత నీశ్వరుడుండవలెనని తాత్పర్యము. అయినను, "న చ కర్మాపేక్ష యామీశ్వరస్యైశ్వర్యవ్యాఘాతః" (భామతి) బద్ధజీవుల అవిద్యా ఫలిత సుఖదుఃఖాదికములు, అవిద్యాశ్రయుడైన ఈశ్వరునికేమాత్రము నంటవు. అవిద్య తన యధీనుల బాధించును గాని, తన ప్రభువును అంటనేరదుగదా! అతడు సర్వజ్ఞుడే, సర్వశక్తుడే, అయి యుండును (సి.లే.సం. 1. 4. 5). కాన వాచస్పతి తత్త్వమున నీశ్వరుడు, యథాతథముగ సర్వ భూతములతో నున్నాడని గ్రాహ్యము.

# సాధన

జ్ఞానకర్మ సముచ్చయమును ప్రస్తావించి, సిద్ధాంత లేశ సంగ్రహ కర్త "అత్ర భామతీమతానువర్తిన ఆహుః" (3. 1. 1) వేదాంతదర్శన ప్రథమసూత్ర శంకరభాష్యమునకు, భామతీ వ్యాఖ్యను అనువదించెను. అందు 'తస్మాత్ యది శ్రుత్యాదయః ప్రమాణం యది వా పరమర్షిం సూత్రం సర్వాథా యజ్ఞాది కర్మసముచ్చితా బ్రహ్మోపాసనా విశేషణత్రయ వతీ అనాద్యవిద్యా తద్వాసనా సముచ్ఛేదక్రమేణ బ్రహ్మసాక్షాత్కారాయ మోక్షపరనామ్నే కల్పిత ఇతి తదర్థం కర్మాణ్యనుష్ఠేయాని." (భామతి. 1. 1. 1.) అందుచే శ్రుత్యాదులుగాని, వ్యాస సూత్రముగాని ఏది ప్రమాణమైయున్నను, యజ్ఞాది కర్మలతో సముచ్చయమై, "స తు దీర్ఘ కాల నైరంతర్య సత్కారాసేవితో దృఢభూమిః' (యో. సూ, 1. 14) అను యోగసూత్రాధారముగ దృఢముగ, దీర్ఘకాలము, నిరంతరము సత్కార యుక్తముగ జేయు సాధన యుపయుక్తమనుచందము, యీ త్రివిధ లక్షణముల నార్జించి జేయబడిన బ్రహ్మోపాసనము, అనాద్య విద్య, తద్వా సనాక్షయము గావించి, మోక్షమనాబడు బ్రహ్మసాక్షాత్కారము ప్రసా దింప సమర్థము అనియు, నందుచే కర్మాచరణమవసరమనియు దెలుప బడినది. కాని యీ కర్మలు బ్రహ్మజిజ్ఞాసకు ప్రతిబంధనిరాసమునకై ఏర్పడినవి. అంతియ గాని అవి మోక్షకారకములు మాత్రము కానేరవు. అయినను దీర్ఘకాలగతధ్యానోపానాదులు, బ్రహ్మజ్ఞాన సముపార్జనమున

కవసరమనియు, గేవలము, శ్రుతిశ్రవణము కాదనియు వాచస్పతి వాదము. శ్రవణముమాత్రము అనుపయుక్తమను యీ భావము వాచస్పతికి మండనుని నుండి వచ్చినదని కొందరి నమ్మకము. 77.

జ్ఞానసహకారియగు కర్మ, వర్ణాశ్రమోచితమై యుండనగును. మరియు "జపాదిరూపవర్ణమాత్రధర్మాణామపి విద్యోపయోగస్య కంఠతోక్తేః (సి. లే. సం. 3. 1. 321) వర్ణాశ్రమాదుల కన్వయించుచు. ప్రత్యేక వర్ణము నన్వయింపని జపాది రూప కర్మలును విద్యోపయుక్తము లనియు దెల్లము. అనాశ్రములైన వారికిగూడ జపాదికమన్వయించుననియు "సంతి హి తేషామనాశ్రమిత్వేఽపి జపోపాసన దేవతారాధనాదినికర్మాణి" (భామతి. 3. 4. 36) అనియు, భామతీకారుడు వచించెను. అందుచే the desire to know can be brought about by through engaging in ritual anp this in due course fulfils itself through knowledge and release....It is a remote auxialiary and as such requires to be duly observed in season. 77 కర్మానురక్తిచే జిజ్ఞాస జనింప, నంత గ్రమముగ నది జ్ఞా మోక్షములచే సఫలత్వము నొందును. అది ఆరాదుపకారకముకాన నైమిత్తికముగ నాచణయోగ్యము.

మరియు, వాచస్పతి 'వేదాంతశ్రవణేన న బ్రహ్మ సాక్షాత్కారః। కింతు మనసైవ" (సి. లే. సం. 1. 1. 137) బ్రహ్మసాక్షాత్కారము వేదాంతశ్రవణమాత్రమున గానేరదు. అది మనస్సుద్వారమున గలుగును. "మనసైవానుద్రష్టవ్యం" అనిగదా శ్రుతి ! అందుచే శ్రవణము నిస్సం

77. Prof. S. S. Suryanarayana Sastry : The Bhamati. p. xxx.

నిస్సంశయరూప పరోక్షజ్ఞానార్థము. గాంధర్వశాస్త్రజ్ఞానియే షడ్జమాది స్వర విభేదమును గ్రహింపగల్గుచందము "ఏవం వేదాంతార్థజ్ఞానాభ్యాసహిత సంస్కారో జీవస్య బ్రహ్మభావమంతఃకరణే నేతి" (భామతి. 1. 1. 1) జీవుడు వేదాంత వాక్య మనన జనిత సంస్కారముతో గూడిన అంతఃకరణ ముచే, స్వకీయ బ్రహ్మభావము ననుభవించునని సమర్థించెను. ఈ రూపముగ "శ్రవణమననధ్యానాభ్యాసా ద్వివేకవిజ్ఞాన"ముల ఫలితముగ, "కేవలాత్మరూపసాక్షాత్కారఃస్వరూపేణాభినిష్పత్తిః" ఆత్మసాక్షాత్కారము, స్వరూపసాఫల్యము లభించును (భామతి. 1. 3. 19). "యథా కతక రజ సలిలేన సంయుజ్య పూర్వసంయుక్త రజోంతర విశ్లేషం జనయత్ స్వవిశ్లేషమపి జనయతి" ఎట్లు చిల్లగింజ గంధము, మలినోదక మున గలిసి పూర్వ మలినముతో బాటు తాను గూడ నీటిని వదలునట్లు, "తథాత్మన్యధ్యస్యమానం బ్రహ్మజ్ఞానం పూర్వాధ్యస్తసర్వప్రపంచం నివర్త యత్ స్వాత్మాన మపి నివర్తయతి" (సి. లే. సం. 3. 7. 1) బ్రహ్మ జ్ఞానము బ్రహ్మము నభ్యసించియు, పూర్వాధ్యస్త సర్వ ప్రపంచమును నివర్తింపజేసి, తా గూడ నివర్తించును అని భామతీ వివరణము. ఇందు లకు సర్వశ్రుతులు ప్రమాణములుగాక, "తాత్పర్యవత్ శ్రుతిః ప్రత్యక్షాత్ బలవతీ న శ్రుతిమాత్రం" పై తాత్పర్య యుక్తమైన శ్రుతిమాత్రమే యగుననియు, ప్రత్యక్షముగూడ గాదనియు వాచస్పతి వాదము (సి. లే. సం. 2. 2. 2.). ఈ విధముగ వాచస్పతి తాత్పర్యమున, వర్ణాశ్రమాది

[illegible] జ్ఞాన జిజ్ఞాసకారకమైన దనెప్పు, జపాదికకర్మ జ్ఞానసహకారియై బ్రహ్మ జ్ఞాన[illegible]న సఫలత నొందుచున్నటుల వ్యక్తము.

## ముక్తి ఢం

"తస్మిన్నపి [illegible] ప్రాప్తమప్యానందమప్రాప్తమివ ప్రాప్తం భవతి; [illegible]పి శోక దుఃఖాద్యత్యక్త మివత్యక్తంభవతి' (భామతి. 1. 1. 4) [illegible] నిత్యప్రాప్తమైయున్న ఆనందరూపత్వము సిద్ధము [illegible]ంచును. శోకదుఃఖాదులు నిత్యత్యక్తములై యున్నను, త్యజింప [illegible]త్యజింపబడును అని వాచస్పతియుక్త స్థితిని వివరించి [illegible]. బ్రహ్మజ్ఞానసిద్ధిఫలితముగ బారోచక్తభ్రాంతినివర్తించుచున్నది. [illegible]ంచుచు, 'నన్వనవచ్ఛిన్నానందః ప్రత్యగూపత్రియా నిత్యమేవ ప్రాప్తః। సత్యం: నిత్యప్రాప్తోఽవ్యనవచ్ఛిన్నానందస్తమావృత్య తద్విపరీత [illegible]ం ప్రదర్శయంత్యా అవిద్యయా సంసారదశాయాం అసంకల్పత్వం [illegible]తాయాన్నివర్తితాయాం చ తస్యాం నిరస్తనిఖిలానర్థవిక్షేపే [illegible]తకనకాభరణవత్ ప్రావృత ఇపేత్యౌపచారికీ తస్య ప్రాప్తిః' ([illegible]. సం. 4. 3. 1) ప్రత్యగాత్మ తత్త్వమైన అనవచ్ఛిన్నానందము. నిత్యప్రాప్తమై యున్నది. సత్యము. అద్దాని నాచ్ఛాదించి [illegible] కాంపు ఆ విద్యాజనిత సంసారదశలో నిత్యప్రాప్త [illegible]నివలె జూపడును. అందుచే అప్రాప్తమువలె నది దోచును.

ఆ యవిద్యా నిరాసమున సకలానర్థ విక్షేపములు అంతరింప, స్వీయకంఠమున నున్న ఆభరణమును మరచి, గుర్తించి, పొందినట్లు భావించురీతి, నా యానందము పొందబడినదానివలె నగును. అందుచే నీముక్తి కేవలమోపచారికమేగాని సత్యముగాదను వాచస్పతి భావమును అప్పయ దీక్షితుడు వివరించెను.

అట్లు, భ్రాంతి నిరాకరణమైన జీవుడు ముక్తుడై, అహంమమాది దేహాత్మభ్రాంతి విదూరుడై యుండును. ఇతడు ఈశ్వరైక్యము నొందియు, కులాల చక్రన్యాయమున నిర్ముక్త శరమువలె దేహమును గలిగి ప్రవర్తించును. విడువబడిన యంబును, గమ్యము చేరునంతవరకు వెనుద్రిప్ప నేరముగదా! అందు ప్రారబ్ధజనిత శరీరాదికము, ముక్తునికి ప్రారబ్ధము నశించునంతవరకు ఉండును. ఇట్టి వారలే అద్వైత సిద్ధాంత ఉపదేష్టలై యుందురు. వారే అద్వైత, అనుభవరహస్య బోధకర్తలుగాని యితరులు కానేరరు. అద్వైత తాత్పర్యము వారికి నిత్యాపరోక్షము. వీరినే జీవన్ముక్తులందురు.

## సర్వముక్తి

The notion of Sarva-Mukti is not elaborated anywhere by Vachaspati, but he does refer to it in the commentary on 2-3-40. It is legitimate to infer that the whole superstructure raised by Appaya is not untrue to the foundations in Vachaspati's own teaching 77. సర్వముక్తినిగూర్చి వాచస్పతి ఎచ్చటను వివరించి యుండ

77 Prof. S. S. Suryanarayana Sastry : The Bhamati. p. xxx.

లేదు. కాని (2. 3. 40) సూత్ర భాష్యమును సూచించి యున్నాడు. అప్పయ్య నిర్మించిన సిద్ధాంతమంతయు వాచస్పతి మత తాత్పర్యములకు అవిరుద్ధమనుట న్యాయము, అని, వాచస్పతి సర్వముక్తిభావము గలిగి యున్నట్లు ఆచార్య సూర్యనారాయణ శాస్త్రి వచించెను. అచ్చట భాష్యమున ఎట్లు వఢ్రంగి ఉపకరణ సహితుడై. శ్రమచే దుఃఖినని భావించి, స్వగృహమును చేరి పరికరముల బ్రక్కనుంచి, స్వస్థుడై సుఖినని తలంచునో, అట్లు ఆత్మీయ స్వప్న జాగ్రత్తులచే దుఃఖియయి, వాని దూర మొనరించి, స్వాత్మమైన బ్రహ్మమును జేరి, సుషుప్తిలో సుఖము నొందునని శంకరుడు వివరించుచోట, వాచస్పతి 'న పరమాత్మనో ముక్తి సంసారే తస్య నిత్యముక్తితాత్' పరమాత్మకు సంసార, మోక్షములు లేవు, అతడు నిత్యముక్తుడగుటచేనని వచించి, అచేతనములగుటచే బుద్ధ్యాదీంద్రియములకుగూడ నీ ద్వయమభావము అనియు దెలిపి, బుద్ధ్యాదిసంముచే నేకమగు ఆత్మ భిన్నమైనట్లు దోచి, అంత బుద్ధ్యాదులుపశమింప ముక్తుడని వ్యవహారముకాని నైజమున "నైకముక్తౌ సర్వముక్తి ప్రసంగః" సర్వముక్తి ప్రసంగముచే ఏకముక్తి లేదని వచించుటయు, "ఈశ్వరస్యాత్సంసారే తస్యావిద్యా ప్రవిలయే ముక్తాస్సర్వే ముచ్యేరన్న విశేషాత్ తతశ్చ సర్వసంసారోచ్ఛేదప్రసంగః॥" పరమైన ఈశ్వరుడు సంసారియైన, అతని అవిద్యా ప్రవిలయమున సర్వముక్తులు ముక్తి నొందెదరు. అంతటనే సర్వసంసార వినాశమగును అనియు యిందు దాహృతము.

ఆయన యీ సర్వముక్తి తాత్పర్యమేమి? తన, తమ భావమున, నెల్ల జీవులు క్రమముగా [illegible] అవిద్యాబంధముల నుండి విడివడి ముక్తి

నొందుట తథ్యము. కాని ఎంతకాలము బద్ధజీవుడుండునో, అంతవరకు నీ మాయ సంపూర్తిగ నశింపక నుండుటచే, ముక్తి నొందినటుల భావించు ముక్త జీవులపై గూడ దీని ప్రభావముండుటచే అది సంపూర్ణముముక్తి కానేరదు. అనగ ముక్తి వ్యష్టిగతముకాక సమిష్టికి జెందినది. సర్వజీవులు ముక్తి నొందువరకు బరబ్రహ్మైక్యముక్తి ఎవరికిని అభావము. అంత దనుక ముక్తజీవుడు ఈశ్వరైక్యమునొంది యుండును. ఆ ముక్తులు ప్రత్యేకముగ ఈశ్వర స్వరూపములుగాక, నొకే ఈశ్వరునిలో లయించె దరు. ఈశ్వర కార్యముల నిర్వహించెదరు. అంత కాలాంతరమున, నెల్ల జీవులు మాయవిమోచనమును సాధించి, ఈశ్వరైక్యమును గడింప, నంత నీశ్వర జీవులవినాభావులగుటచే జీవులు ముక్తినొంద, నిక ఈశ్వరస్థాన మదృశ్యమై, పరబ్రహ్మమువందేకమగును. ఈశ్వరునితో నింతకాలము ముక్తులై యున్న జీవులుగూడ పరబ్రహ్మైక్యము నొందుదురు. ఇది సర్వ ముక్తియని శాస్త్రతాత్పర్యము.

ఈ విధానము ననుసరించి, ఈశ్వరుడు బ్రహ్మముయొక్క శుద్ధ మాయా ప్రతిబింబమై యుండ, జీవులు అశుద్ధమాయలోని ఈశ్వర ప్రతి బింబములై సంసారియుందురు. ముక్తుడు ప్రతిబింబకారణ తూలా విద్యనుండి విముక్తుడై, తనకు బింబ రూపమైయున్న ఈశ్వరునిలో లయించును, ఎంతవరకు తూలా విద్యలుండునో, అంతవరకు ప్రతిబింబము లుండవలెగాన నీశ్వరుడుండవలెను. సర్వతూలావిద్యాక్షయమున సర్వ ప్రతిబింబము అంతరింప, బింబావసరము లేదుగాన, మూలావిద్యయు నశింప, నీ ఈశ్వరప్రతిబింబము, తనకు బింబమైన బ్రహ్మమున లయిం

చును. అనగా ఈశ్వరుడు బ్రహ్మప్రతిబింబమైయుండ, జీవులు ఈశ్వర ప్రతిబింబములని గ్రాహ్యము. అవచ్ఛేదవాదమునగూడ, వ్యష్టి అవిద్యలచే బ్రహ్మావచ్ఛిన్నములు జీవులై యుండ, సమిష్టి అవిద్య అనగ మాయవలన బ్రహ్మావచ్ఛిన్నము ఈశ్వరుడగుచున్నాడు. అవిద్య లనేకములై, అనేక జీవకారణము లగును. ఒక్కొక్క జీవుడు ముక్తి నొంద, ఈశ్వరునిలో నశడు లయించును.

కాని యీ సర్వజీవముక్తి ఎప్పుడు ? అది సాధ్యమా ? కావున, యది కేవలము ఊహాజనితమనియే తోచును. కాని అది సాధ్యమే యని పండితాభిప్రాయము.

ఈ విధమున వాచస్పతి మిశ్రుడు, భాష్యగ్రంథము లకు వ్యాఖ్యాలి రచించినను, వివరణమున కేవలము వారి భావముల ననువదించి సంతృప్తి నొందక, తన వ్యక్తిగతాభిప్రాయములనందందు చొప్పించి, సమర్థించి, చూపియున్నాడు. అందుచే నద్వైత సిద్ధాంత చారిత్రమున నతనికి బూర్వోక్త చందము ఒక ప్రత్యేక స్థానమేర్పడి, భామతీప్రస్థానమను పేర నొక సంప్రదాయమే యేర్పడియుండుట గమనార్హము. సర్వసిద్ధాంత సావ నార్థమతడెట్టి ప్రకరణ గ్రంథమును విరచింపకున్నను, యిట్టి ప్రముఖ స్థానము నందుకొనుట అతని పాండితీ సమగ్రత్వము, భావఔన్నత్యములే కారణములని చెప్పక తప్పదు. అతని మూర్తి భారతీయ తత్త్వ చారిత్ర మున శాశ్వతమనుట సిద్ధము. అట్టి అమానుష శేముషీధురీణుల సర్వతో

ముఖకృషిచేత భారతీయ విజ్ఞానలక్ష్మి అద్వితీయ భావభూషణాలంకృతయై, అత్యంత శోభాయమానముగ విరాజిల్లియున్నది. అట్టి పరమాదర్శ, పరవిద్యానిధుల మార్గము సదా మనకవలంబనీయమై, సర్వవిద్యాపారమునకు మనలజేర్చునుగాక!

—o—

# శ్రీ సాధు నిశ్చలదాసు

## జీవిత సంగ్రహము

The most unique and effective book during three centuries ... 78. 'మూడు శతాబ్దములలోనతి యద్వితీయమును, సర్వోపయుక్తమును అను గ్రంథరాజమని వివేకానందునిచే సంస్తుతింపబడిన "విచారసాగర" మను ఉత్కృష్ట గ్రంథమును రచించి, శాశ్వతకీర్తి గాంచి యున్న నిశ్చలదాస సాధువరేణ్యుడు, అద్వైత విచారసాగరమున నొక అద్భుతమూర్తి, అతడు హస్తినాపుర సమీపమునగల కిహడౌలి అనుగ్రామ మున ననగ బంజాబురాష్ట్రమున, క్రీ. శ. 1792-93 లో జనించెను. చిన్నతనమువనే విరాగియై, అంతకు బూర్వము క్రీ. శ. 1544 సంవత్స రము అహమ్మదాబాదులో జనించి, అరువదివత్సరముల తన జీవితకాలమున చిరప్రఖ్యాతుడై, పరబ్రహ్మ సంప్రదాయమని పేర్వడసిన సన్న్యాస సంప్ర దాయమును నెలకొల్పిన దాడు సాధువర్యుని సంప్రదాయము నవలంబించెను. ఇది కొంతవరకు వైష్ణవ లక్షణములగలిగి, కబీరుపంథాను అనుసరించుచు, కనూజ్ ఉజ్జైన్ ప్రాంతముల విశేషముగనుండుచు, జయపుర సంస్థానమున గల నారాయణ పర్వతమున మూలకేంద్రమును గలిగియున్నది. హరి ద్వారమువగూడ నొక ప్రధాన కేంద్రమును గలిగి పంజాబు, రాజస్థాన,

78. Swami Vivekananda : Indian Sadhus, of Prof S. S. Ghurye, p. 225.

గుజరాతు రాష్ట్రముల వీరు వ్యాప్తము. హిందూ మహమ్మదీయ సఖ్యతకై, దాడు సాధు పుంగవుడు మిక్కిలి కృషిసల్పెను. ఇతడు కబీరు శిష్యుడు కాకున్నను, అతని స్తుతించును. కబీరువలెనే విగ్రహారాధనము, నియమ నిష్ఠలు, తపోయాత్రలు యితనికి గిట్టవు. ఇతడు రచించిన గ్రంథముల, "హరడేవాణి" "అంగబధు" అను పేర దాడుద్వారములనబరగు వారి మఠము లలో నిత్యము పూజించెదరు. పై వచింపబడినచందము వీరు వైష్ణవ తత్త్వము గలవారై యున్నను, వారు అద్వైత వేదాంతావలంబకులై, యోగ మునుగాని, భక్తినిగాని అనుసరింపక, "సహజ"యోగము ననుసరించెదరు. దశరథుని పుత్రుడని యన్వయింపక బరబ్రహ్మమునుగ శ్రీరాముని వీరు ప్రార్థించెదరు.

ఈ దాడు సంప్రదాయము, మూడు శాఖలుగ నున్నది. అందు గృహస్థులు విస్తారధారులనబడుదురు. నాగులు ద్వితీయ శాఖ. వీరు యుద్ధ కౌశలులు. విరక్తులు సౌమ్యులు. విరక్తులు సొరకాయబుర్రల చేత ధరించి దాస, శరణ నామముల గలిగి చరించెదరు. ఈ విరక్తులకు, నాగులకు అన్యముగ నొక శాఖీయులు, ఖాకీ వస్త్రముల, నల్లని వస్త్రముల ధరించుచు, అద్వైత సిద్ధాంతమునకు సన్నిహితులై, ఆనంద నామమును గలిగి, తిలక, మాలాదిక చిహ్నముల నెవ్వియులేక యుందురు. కాలక్రమమున వీరు ఏకాదశి ఉపవాసములుండుచు, వసంత పంచమి, శ్రీరామనవమి, జన్మాష్టమి, దసరా, దీపావళి, హోళి మొదలగు పండుగలగూడ జరుపుకొనుచున్నారు. కాలక్రమమున నీ విరక్తులు, నాగుల మాత్రముగాక, కాలశరు, ఉత్త

రాదులు, శాకిపస్త్రధారులు అను మువ్వురతో పంచవిధములుగా నీ దాదు పంథా విభజింపబడి యున్నది.

ఈ సంప్రదాయ సన్న్యాసులు, సాధారణముగ విద్యావంతులై యుందురు. వీరి పాఠశాలలు ప్రశస్తములు. ఈ సంప్రదాయమునకు జెందిన వాడు ప్రస్తుత నిశ్చలదాస సాధు పుంగవుడు. ఇతడు బుండిరాష్ట్ర ప్రభువైన రామసింహాని ఆదరణమును బొంది అతని పనుపున 1848వ సంవత్సరమున నీ "విచారసాగర మహాగ్రంథమును రచించినట్లు వినికిడి. అతడు యీ గ్రంథమును ప్రథమశిక్ష గ్రంథముగ విరచించి, యంత ప్రౌఢగ్రంథముగ "వృత్తిప్రభాకర" ఉత్తమ గ్రంథమును నిర్మించినట్లును సంప్రదాయము. విచారసాగరము జటిల గ్రంథముగను, వృత్తిప్రభాకరము గడ్డు గ్రంథముగను తజ్ఞుల వచనము. ఈ గ్రంథములు హిందీభాషలో రచితములైనను దేశవ్యాప్త సుప్రఖ్యాతి నార్జించి, ముఖ్యముగ విచారసాగరము, భారతీయ సకల దేశభాషల ననువాదముల నొందుటయేగాక, ఆంగ్లమున గూడ ననువృత్తమై, బహుళ వ్యాప్తిని కీర్తిని ఆర్జించియున్నది. సంస్కృత భాష కేవలము పండితభాషయై, సామాన్య ప్రజానీకమునకందు బాటులో లేనిదగుటచే, నీ సాధువ రేణ్యుడు దూరమాలోచించి, సంస్కృత తత్త్వ సాహిత్య సాగరమును సంపూర్తిగ మథించి, అందలి అమృతమును యీ గ్రంథద్వయ రూపమున ముముక్షులోకమునకందించెననిన సమంజసము. తా నార్జించు విద్యాధన, అనుభూతి, సంపత్తుల దనయందే యిమిడ్చికొని యుండుట సాధుధర్మముకాదుగదా! ఆ అనుభవసుధ స్వహృదయావధుల నధిగమించి, పొంగిపొరలి, వెల్లువయై, తత్త్వపిపాసాగ్రస్తులయిన ముముక్షు

పులకుపశాంతి నొసంగవలెనుగానిలో నింకిపోవుట వ్యర్థముగదా! అప్పుడే ఆ విద్య పార్థక్యము నొందును. అందుచే నీ మునికులావతంసము, సర్వ ముముక్షు లోకమునకు అపారముగ దోడ్పడి, విద్యాదాతయై, పండిత పామర సంస్తుతుల కాకరుడై, క్రీ. శ. 1862-63వ సంవత్సరమున, తన డెబ్బది యవయేట జ్ఞానవార్థక్యముతోబాటు వయో వృద్ధుడుగూడనై, శరీరము జాలించి, బ్రహ్మైక్యము నొందెను. శరీరము స్థూలముగ నదృశ్యమై యున్నను, అతని విద్యా ప్రకాశము దశదిక్కుల వ్యాపించి, తత్త్వజిజ్ఞాసువుల జిత్తసీమల నావరించి, నిత్యోత్సాహమును, నిత్యప్రకాశమును బ్రసాదించుచు, విరాజిల్లుచునే యున్నది. అందులకెల్లరు ఆ మహామునికి గృతజ్ఞులే యగుదురుగాక! ఆ దివ్య తేజోప్రసారములు, సర్వముముక్షువుల అజ్ఞానాంధమును బూర్తిగ బారద్రోలునుగాక!

# రచనలు

పూర్వము వచింపబడినరీతి, నితని రచనము లెన్నియుండెనో అజ్ఞాతముగావి, "విచారసాగర" "వృత్తిప్రభాకర" గ్రంథ ద్వయమే వెలుగును జూచి నెల్లరకు వెలుగునిచ్చుచున్నవి. ఈ రెండింట బ్రౌఢమగుటచే, సామాన్య ప్రజ్ఞావిదూరమై "వృత్తి ప్రభాకరము" తన తోబుట్టువువలె భాషా వ్యాప్తి, దేశవ్యాప్తి, సర్వజనహృదయ వ్యాప్తి నొందక, గొన్ని ముఖ్య స్థానములమాత్రమే బ్రసరించి యుండిపోయినది కాని విచారసాగరము, తన విద్యాసాగరమున నెల్లర ముంచివైచినదనుట యుక్తము. ఉత్తర

దేశమున ననేక మతముల నిది పాఠ్య గ్రంథముగ నుండుచు, ప్రాధాన్య మును గడించియున్నది. దీని విశేషమెట్టిది? చూచెదముగాక!

## విచారసాగరము

ఈ గ్రంథ నామము ననుసరించి యిందధ్యాయములు తరంగము లనబడినవి. సప్తసాగరములవలె నీ తరంగములు సప్తకము. ప్రథమ తరంగము మంగళాచరణశ్లోకముతో ప్రారంభించి, అధికారి, విషయ, ఫల, సంబంధములనెడు అనుబంధ చతుష్టయము ప్రధాన గ్రంథములకవసర మగుటచే వానితో ననుగమించుచు, ప్రథమతః అధికారి నిర్ణయము గావించినది. వివేకాది సాధనచతుష్టయ సంపన్నునికి అధికారము అని నిశ్చయించి, మహావాక్యముల ప్రస్తావించినది. ద్వితీయ తరంగము పూర్వ భాగమునకు పూర్వపక్షముతో ప్రారంభమై, అనుబంధముల దృఢపరచి నది. ఇంతదనుక గ్రంథముపోద్ఘాతముగ నడచి, తృతీయ తరంగముతో అసలు గ్రంథము ప్రారంభమగును. కాని యీ తరంగముగూడ గ్రంథ శ్రవణమునకవసరములగు గురుశిష్య లక్షణముల వివరించి, శిష్యచిత్త మును గ్రంథాధ్యయన, మనన, ఉన్ముఖము గావించి యున్నది. తర్వాత చతుర్థ తరంగము కథారూపముగ శుభసంతతి రాజుతో నాందిని బాడి, రజ్జుసర్పన్యాయ వివరణము గావించి, తత్త్వదృష్టి, అదృష్టదృష్టి, తర్క దృష్టి, నామక రాజపుత్రుల మువ్వుర ప్రవేశమొనరించి, వారి తత్త్వా

స్వేషణమే యీ చతుర్థ, పంచమ షష్ఠ తరంగములుగ గావించి, సప్తమ మున వారికి సార్థక్యమును బ్రసాదించినది.

అందు జత్పూమ్ము, మోక్షేచ్ఛను బ్రస్తావించి, శుభ సంతతి మహారాజు యొక్క పరివేదనను. వివరించుచు అష్టైశ్వర్య సంయుక్తుడై యుండియు పుత్రవంతుడై యుండియు, నాతనికి నైహికములందుదృప్తికానరాదయ్యెను. అందుచే బరితపించి, పశ్చాత్తప్తుడై, తత్వదృష్టి, అదృష్టదృష్టి తర్కదృష్టి ముప్వురు పుత్రులకు, అమాత్యవర్యులకు దన స్థితి నెరింగించి, రాజ్యము వారికొప్పగించి, తా నడవుల తపముల మున్గగోరెను. విషయము నాలించిన పుత్ర త్రియము ఏకాంతముగ జేరి పరస్పరము చర్చించుకొనిరి. ప్రప్రథమమున జ్యేష్ఠుడు తత్త్వదృష్టి తమ్ములజూచి, తన స్వార్థమునకై తండ్రి తమకు దుఃఖరూపమని ?.?ఁన సంసార న దనపుత్రుల ద్రోసిపోవుచుండుట అన్యాయమని వివరించి, విషణ్ణహృదయుడై యుండెను. అంత మధ్యముడైన అదృష్టదృష్టి, సోదరుల సంబోధించి, జీవులు కర్మబద్ధులనియు, నందుచే దండ్రి తమను సంసారమున ద్రోయుచున్నాడనుట భ్రాంతి యనియు చెప్పి, తండ్రికి అశుభకర్మ నివారించినదనియు బలికి, ప్రారబ్ధము నెవరు తొలగ ద్రోయగలరు అని పలికెను. ఇరువురి ప్రసంగముల నాలకించుచుండిన కనిష్ఠుడు తర్కదృష్టి దూరదృష్టియు నగుటచే, భవిష్య ద్విషయ విచారణము గావించి, తండ్రిమాటలాలించి, పాలించిన దుర్గతి యనియు, వాని దిరస్కరించిన్ఞ జెరసాల ప్రాప్తియనియు, నందుచే నగరమును వీడి, దేశాంతరమున

సత్యాన్వేషణమున మునుంగ సలహా నొసంగెను. అందులకియ్యకొని మువ్వురు, రాత్రి సన్న్యాసవేషముల ధరించి పలాయనమైరి.

అటుల విరక్తచిత్తముల గ్రుమ్మరుచు, నా సోదర త్రయము వారణాసి కేతెంచి. పవిత్ర గంగాస్నానమాచరించి, సర్వ చిత్త అధివాసు విశ్వనాథు దర్శించి, అందందుగల మహాత్ముల దర్శించుచు బర్యటించుచుండిరి. అదృష్టవశమున, నొకచో నొక వట వృక్షము నాశ్రయించి, భస్మోద్ధూళిత శరీరుడై, అనేక శిష్య పరివృతుడై వేదాంతోపదేశము గావించుచు, నపర శివునివోలెనొక మహాపురుషుడు వారికి గోచరించెను. నమ్రశిరముల నాసోదరులాతని జేరి, సాష్టాంగ ప్రణామముల నాచరించి, ఆ సద్గురు సేవారతిలో నారుమాసములందే గురు చరణసన్నిధి నుండిరి. అట్లు సేవారతినున్న శిష్యుల వీక్షించి, తృప్తిగాంచి, అనుగ్రహింప నొక దినమున ప్రశ్నించి వారికి వేదాంత విషయ రహస్యముల బోధించెను. అందులకు ప్రథమమున ఉత్తమదృష్టి శ్రేష్ఠుడగుటచే గురుముఖమున తత్త్వము గ్రహింప బ్రశ్నింప [illegible] చతుర్థ తరంగమున తత్త్వదృష్టికిని గురువర్యునకు జరుగు సంభాషణమే యుండును. ఇందు జ్ఞానోపదేశము ప్రధానముగ నుండును. భ్రాంతి వివరణమున, రజ్జు సర్పదృష్టాంతము గైకొనబడి, ఖ్యాతి నిర్వచనము వివరణము ఇందు విపులముగ గావింపబడెను. చతుర్విధాకాశముల ప్రస్తావించి, చతుర్విధ చైతన్యముల నీ తరంగము తెలియ బరచును. అవచ్ఛేద, ఆభాసవాదముల వివరించి, ఆభాసవాద శ్రేష్ఠతను జూపెటి, యంత

పరోక్షాపరోక్షముల వ్యక్తము చేయును. ఈ ప్రకరణమంతయు ఉత్తమా ధికారికొరకై ప్రబోధితము.

పంచమ తరంగము అదృష్టదృష్టి ప్రశ్నముతో ప్రారంభము. అత డద్వైతసిద్ధినే యనుమానించెను. అందుచే నిట సత్తాత్రయ విచారము, సంసారోత్పత్తిక్రమము, మాయాస్వరూప ప్రతిపాదనము, జీవేశ్వర స్వరూపములు, విశ్వాది చతుర్విధ జీవ వివరణము, సాయుజ్యమోక్ష వర్ణనము, మొదలగు అనేక విషయములు స్వపక్ష పరపక్షవాదములతో చర్చింపబడి. నిశ్చయింపబడినవి.

ఈ విచారణమునకు, తర్కదృష్టి వాదింప నుద్యుక్తుడగుటతో షష్ఠమ తరంగము ప్రారంభము. జాగ్రత్స్వప్నసామ్యత్వ విచారణముతో ప్రారంభమై, దృష్టి సృష్టివాదము, ఆత్మేశ్వర వివరణము, జ్ఞానసాధనములు, లక్షణాత్రయ విచారముతెలుపబడినవి. సక్షిప్తమమున్న జ్ఞానియొక్క బాహ్యాంతరస్థితులను వివరించి, సమాధిస్థితి, దాని విఘ్నములు, ప్రారబ్ధము, జీవన్ముక్తి విదేహముక్తులు చర్చింపపబడినవి. అన్య సిద్ధాంత విచారణమును ఖండనముల గావించి, తత్త్వదృష్టి అదృష్ట దృష్టియు జ్ఞానులై, శరీర త్యాగము గావించి యుండుటచే, నొక్క తర్కదృష్టియే దేశముల గ్రుమ్మరి, తండ్రి యగు శుభసంతతిని జేరును.

ఈ విధముగ నీ గ్రంథరాజము, అతి నిగూఢ విషయముల ప్రస్తావించి, కథాకల్పనములతో వివరించి, సంభాషించి, సర్వసంశయ విచ్ఛేదకమైయున్నదనుటకెట్టి సంశయమునులేదు. అందుచేతనే నీసుప్రసిద్ధ గ్రంథము

దేశవ్యాప్తి గడించి, నేటికిని జిజ్ఞాసువుల నాకర్షించుచుండుట గమన్హము. శ్రీజనార్దన స్వామి చైతన్యులచే నిది యాంధ్రములోనికి అనువాదితమై దేశమున మిగుల ప్రయోజనకారియైనది.

## వృత్తి ప్రభాకరము

పూర్వము వచింపబడినరీతి, ప్రౌఢ గ్రంథమైన వృత్తి ప్రభాకరము ఎక్కువ తర్కభూయిష్టమై,సామాన్య ప్రజ్ఞామూరమై యుండును. విచార సాగరమునదరంగములుచితమై వటుల, వృత్తి ప్రభాకరమున ప్రకాశములు యుక్తముఅందుచే నీ గ్రంథముఅష్టప్రకాశములతో! వెలుగొందుచున్నది. ప్రథమముప్రత్యక్షప్రమావిచారముగావింప, ద్వితీయమునుఅనుమానమును జర్పించును.తృతీయము శబ్దప్రమాణమును నిరూపింప, చతుర్థము ఉపమానమును బోధించును. పంచమము అర్థాపత్తిని బ్రస్తావింప షష్ఠమము అనుపలబ్ధి ప్రమాణమును విరివిగ దెలుపును. సప్తమము ప్రథమమున బ్రస్తాపితమైన వృత్తి విషయమును గైకొని, అధ్యాసను గైకొని, ఖ్యాతుల రూపించి, అనేక పరసిద్ధాంత ఖండనముల గావించి, అనిర్వచనీయ ఖ్యాతిని బలపరచును. తర్వాత అష్టమ ప్రకాశమున వృత్తిప్రయోజనము, జీవేశ్వరనిరూపణమున ఆభాస అవచ్ఛేదవాద వివాదకథనము సాగించి, అనేకరచయితల బ్రకటించి, నిశ్చయింపబడినది. అందు అధికారము, శ్రవణాదిక సాధనములు, సన్న్యాస సాక్షాత, పురుషార్థముల వివరింపబడియున్న విచారసాగము కంటె

నిందు అన్యసిద్ధాంత ప్రసంగములేగాక ,అనేక పండిత రచయితలగూడ ప్రస్తావించి, ఖండన మండనముల గౌరవించి యుండుటచే, నీ గ్రంథము కొంచెము జటిలమనిపించును. కాని విచార సాగరమును ప్రథమతః పఠించి, తర్వాత దీని గ్రహించినచో సులభసాధ్యమే యగును. ఈ ఉత్తమ గ్రంథమును శ్రీ వాడపల్లి పట్టాభిరామశర్మగారు ఆంధ్రమున కనువదించి ప్రకటించి యున్నారు. కాని అది ప్రస్తుతమలభ్యము.

ఈ విధమున సుప్రసిద్ధ గ్రంథ ద్వయమును నిర్మించి, నిశ్చల దాస సాధువర్యుడు, ఎట్లు సిద్ధాంతముల గావించెనో తెలియుట ముఖ్యము. ఆ విషయముల నొకించుక గాంచెదము గాక !

## శ్రీ నిశ్చలదాస సిద్ధాంత తాత్పర్యము

శ్రీ నిశ్చలదాస మహాశయుడు సర్వశాస్త్ర పారంగతుడై, ముఖ్యముగ నద్వైతసాగర మథనము గావించి, పై గ్రంథములలో తన కృషి ఫలిత సుధారసమును వెదజల్లెను. అద్వైత వాదముల గల వలు తారతమ్యముల గమనించి, చర్చించి, వివరణప్రస్థాన, భామతీ ప్రస్థానములలో వివరణ ప్రస్థానమును గ్రహించి, ప్రతి పాదించినట్లు దోచును. అందుచేత నీతడు వాచస్పతిని అందందు విమర్శించుచు, అతని అవచ్ఛేదవాదమును ఖండించియున్నాడు. అయిన, నాతని దృఢసిద్ధాంత మెయ్యదియో క్లుప్త పరశి గ్రహింతము.

# బ్రహ్మము

సర్వ సృష్టికి బాహ్యాంతరములందు, మహాకాశ సదృశముగ సర్వ వ్యాప్తమైయుండు సంపూర్ణ చైతన్యము బ్రహ్మముగ నిర్వాచ్యము, అది, [illegible] వస్తువిశేష రహితము, ఆ బ్రహ్మము కేవలము ఉపాదానకారణము [illegible] ఆపేక్షిక వ్యాపకతనుమాత్రము గ గియుండక, నిరపేక్షిక వ్యాప [illegible] మున్నది. అనగనది కార్యరూపమున నున్న విశ్వమునకు ఉపాదాన కారణభావమున తదంతర్గతమై, వ్యాప్తమై మాత్రముండక. కార్య [illegible]తీతమై, సర్వవస్తు నిరపేక్షికమైన వ్యాప్తిని గలిగి యున్నదని [illegible] కావ నిర్గుణ బ్రహ్మము సర్వనిరపేక్షిక సత్తామాత్రమై యొప్పారి [illegible] తాత్పర్యము. అందుచే నది అనిర్వాచ్యమై, కేవలము లక్ష్యార్థమై, [illegible] మున్నదనియు గ్రాహ్యము. దీని వివరింప విద్యారణ్య [illegible]తోబాటు వివట చతుర్విధాకాశములు, తత్తత్సంబంధ చతుర్విధ చైతన్యములును ప్రతిపాదింపబడి, జల, ఘట, మేఘ, మహాకాశములలో, [illegible]. జీవ కూటస్థ ఈశ్వర బ్రహ్మ చైతన్య ములలోని బ్రహ్మ [illegible] [illegible]యింపబడినవి. ఆకాశము ఎట్లు పరిశుద్ధమై నిరవధికమై, వ్యాప్తమై అనంతమై యున్నదో, అట్లు బ్రహ్మ చైతన్యమున్నది అని [illegible]కను (వి. 119, 114. వృ-190).

# ఈశ్వరుడు

కాని [illegible]సృష్టికి సర్వకారణమై, ఉపాదాన రూపమున సర్వమున [illegible] వ్యాపకత గలిగి, మాయావిశిష్ట చైతన్యము నా పేర్వడసి, స్వర

కల్పనలకాధారమై, సగుణబ్రహ్మమొండుగలదు. దానినే ఈశ్వరుడని వచింతురు. ఆ బ్రహ్మము లక్ష్యార్థ సూచికమై యుండ, నీశ్వరుడు వాచ్యార్థమై యొప్పునని వివరించి ఈశ్వర బ్రహ్మ శబ్దములు ఏకార్థ బోధకములని తెలిపి. పురాణముల నభేదార్థమున నుపయుక్తమనియు, నందుచే నిది కేవల శబ్దమాహాత్మ్యమే అని వాకొనియు (వి. 119), క్రమముగ బ్రహ్మేశ్వర విభేదము బహుళముగ విచారసాగరమున దెలుపబడినది.

చతుర్విధ చైతన్యములలో నీశ్వరుడు మూడవవాడై, మేఘాకాశము నకన్వయింపబడెను. ఆకసమున గల మేఘము మహాకాశమున నెంత పరిమిత ఆకాశమును ఆక్రమించునో దాని మేఘాకాశమందురు. ఆ మేఘము జలబిందుమయ మనుటయు, జలము సహజముగ దన యెదుటగల రూపముల దనలో బ్రతిబింబింప జేసికొనునుగాన, నా మేఘ జలము బాహ్యాకాశమును తనయందు బ్రతిబింబింప జేసికొనును. అందుచే నా జలబిందు సంచయమున, మహాకాశ ప్రతిబింబ మేర్పడుచున్నది. అద్దాని మేఘాకాశమందురు. ఆ విధముగ శుద్ధ చైతన్యమైన బ్రహ్మము నాశ్రయించియున్న మూల ప్రకృతి నాబడు శుద్ధమాయలో బ్రహ్మచైతన్య ప్రతిబింబ మేర్పడి, ఈశ్వరత్వమును బొందుచున్నది (వృ. 187). ఈతడు గూడ చిత్ యొక్క ఆభాసమాత్రుడగుటచే, జిదాభాసుడని వాకొనబడెను. విశాలమైన మేఘసమానుడగుటచే వ్యాప్తుడై, యంతర్యామి నాబరగును. ఆతడు ఆవరణాదికము లేనివాడై, నిత్యముక్తుడై, శుద్ధసత్త్వ ప్రధానుడై యుండును (వి. 118). శుద్ధ సత్వగుణ సహితమైన మాయయు

మాయాధిష్ఠాన చైతన్యము అనగా బ్రహ్మము, ఆ మాయయందు చైతన్యము యొక్క ఆభాసయు జేరి ఈశ్వరుడగును. ఈ త్రయములోనేది లోపించినను ఆభాసమే లేక ఈశ్వరుడే యుండదు.

ఈశ్వరుడు శుద్ధసత్త్వ ప్రధానుడుగాన, సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, సర్వస్వతంత్రుడై యున్నాడు. అందుచేత నితడు జగత్కర్తయు గూడునై యున్నాడు (వి. 265). ఎట్లు ?

జగత్తు అచేతనమగుట నది స్వతఃసిద్ధము కాదు. చేతనాపేక్షతో డనేగదా జడవస్తువు ప్రవృత్తమగును ? జగత్తునకు ఉపాదానకారణమును గ్రహించి, కర్త దాని నిర్మింపవలెను. ఘటమును నిర్మింప మృత్తులక్షణము గ్రహింప నవసరముగదా ! మృత్తును గ్రహించినవాడు తత్కార్యమైన ఘటతత్త్వమును సమగ్రముగ దెలిసియుండుచందము, ఈశ్వరుడు జగత్సృష్టికి ఉపాదానమైన మాయ నెరింగి సృజించియుండుటచే, సృష్టి రహస్యమంతయు నతదెరింగియుండును. అందుచే నతడు సర్వజ్ఞుడనబడును. ఇంత జగత్తును సృజించుటచే నతడు సర్వ శక్తిమంతుడుగూడనై యున్నాడు. మరియు నతడు, నీ సృష్టి నిర్మాణమున కనంతరమున స్వార్థము లేక జీవ కర్మానుసారము రాగద్వేషశూన్యుడై, సృష్టిని గావించుచున్నాడు (వి. 175) కాన స్వతంత్రుడు, నిత్యుడునై యుండును (వి. 266).

సృష్టినిర్మాణమున, నిమిత్తోపాదానకారణద్వయము అవసరము. ఘటోత్పత్తికి, కులాలుడు నిమిత్తకారణమును, మృత్తిక ఉపాదానకారణమైనట్లు, ఈ సృష్టికి ఈశ్వరుడొక్కడే నిమిత్తోపాదానకారణమునై

యుండును. లోకమున సాలెపురుగు ఉన్నదిగదా! అది తననుండియే దార మును దీసి, గూడు నిర్మించి, యంత నాదారమును దనయందే మరల లయింపజేసి కొనుచున్నది. అట్లు ఈశ్వరుడు యీయనంతసృష్టికి దానే నిమిత్తకారణమై, తనకన్యముగ వస్తువేద్దియు లేమిచే, దానే ఉపాదానకార ణముగూడనై సృజించుచున్నాడు. మరియు స్వప్నమును జిత్తము సృజించి, పోషించి, మరల తనయందే లయింపజేయుచున్నదిగదా! అనగ స్వప్న దృశ్యములకు పురుషచిత్తమే, నిమిత్తమై ఉపాదానముగూడనై యుండుట సర్వజనానుభవము (వి. 173). ఆ విధముగ నీశ్వరుడు సర్వసృష్టికి గర్త యగును. జీవుని కర్మసంచయ మెప్పుడు భోగప్రవృత్తి రహితమై, యుదా సీనమై యుండునో, ఆ స్థితి ప్రళయము నాబడును. అప్పుడు సర్వ వస్తు సమూహమంతయు సంస్కారరూపమై, మాయయందు లయించియుండును. పునః ఎప్పుడు ఆకర్మ భోగ మొసంగ నున్ముఖమగునో అప్పుడు, ఈశ్వరు నకుసృష్టి జేయువిచ్ఛ జనించి సృజించును (వి. 176).

## కూటస్థ ఆత్మ

చతుర్విధాకాశములలో మూడవది ఘటాకాశము. అటులే నా చైతన్య చతుష్టయమున దృతీయము కూటస్థుడు. మహాకాశ ఘటాకాశము లకు తత్త్వతః వ్యత్యాసము లేక, పరిమితిలో గలిగినట్లు బ్రహ్మ ఆత్మలకు నినుమంతమాత్ర విభేదము గలదు. ఘటరూపము మహాకాశమున నెంత

భాగము నావరించెనో, దాని ఘటాకాశమందురు. అటులే జీవచైతన్య స్వరూపమునకు గారణమైన బుద్ధియొక్క, అనగా వ్యష్టి అజ్ఞానముయొక్క అధిష్ఠాన చైతన్యమును కూటస్థుడందురు. బుద్ధి అనగా నంతఃకరణ సహిత చైతన్యమే జీవుడగుచుండ, నాబుద్ధికి అధిష్ఠాన చైతన్యము కూటస్థుడనబరగును. కూటస్థజీవుల పరిమితి యొక్కటియై, బుద్ధిసమానము గలిగియున్నను, కూటస్థుడు తత్త్వతః బ్రహ్మచైతన్యమైయుండ, జీవుడు తదాభాసమాత్రుడై యుండును. జీవుడు చిదాభాసరూపమున జననమరణాదుల నున్నను, గూటస్థుడు తదతీతుడు. వాడే జీవుని లక్ష్యార్థమై యుండును. అతడే ప్రత్యక్కు అనగా ప్రత్యగాత్మ యనియు, నిజరూపమనియు, సాక్షి యనియు బలువిధముల వచింతురు (వి. 116).

ఈయాత్మ తత్త్వతః బ్రహ్మాభిన్నుడగుటచే నొకడేగాని నానా గాదు. అతడు వ్యాపకుడే యగుచున్నాడు. మహాకాశము పరిచ్ఛిన్నమై ఘటాకారమున భాసించునట్లు, అపరిచ్ఛిన్న బ్రహ్మచైతన్యమే అంతఃకరణావచ్ఛిన్నమై కూటస్థునివోలె భాసమానమగుచున్నాడు. అట్టివానిపై ఘటాకాశమున జలాకాశ మేర్పడినట్లు బుద్ధిధర్మాధ్యాస గలిగి, చిదాభాసత్వము జనించి, జీవుడు గలుగుచున్నాడు (వి. 257). కాని అధ్యాసరూపుడైన జీవునివలె నితడు అనిత్యుడుగాక, త్రికాలాబాధ్యమై సత్తుగానుండును (వి.258). అటులే నితడు చిద్రూపుడు. అందుచే సర్వప్రకాశకుడై, చిత్తుగా జ్ఞానస్వరూపుడై నతడుండును (వి. 259). ఆనందరూపుడుగూడ నతడే (వి.260). సచ్చిదానందములు పరస్పరభిన్నములుగాక, ఏకముగ నుండును. నివృత్తిశూన్యుడగుటచే

సత్తనియు, జడభిన్నుడగుచేచిత్తనియు, దుఃఖరహితుడగుట ఆనందమనియు నతని నందురు. ఈవిధముగ ఆత్మ, బ్రహ్మములకు అనన్యత్వము వచింపబడును. ఏ చైతన్యము సర్వసృష్టికిని, శుద్ధమాయకును, అధిష్ఠానమై యున్నదో అది బ్రహ్మము నాబడును. అదే చైతన్యము వ్యష్టిఅవిద్యకును, వ్యష్టి దేహాదికమునకు అధిష్ఠానమై, ఆత్మ నాబరగును. అందుచేతనే తత్త్వమసి విచారణమున 'తత్' పదమునకు బ్రహ్మము లక్ష్యమై యుండ, "త్వం" పదము ఆత్మకు లక్ష్యము. అటులే 'తత్ పదమునకు ఈశ్వరసాక్షి లక్ష్యము కాగ, జీవసాక్షి "త్వం"పద లక్ష్యము. జీవేశ్వరులు ఆభాసరూపులై యుండ, ఆత్మ బ్రహ్మములు చైతన్యరూపులని యర్థము. ఉపాధితః విభేదముగలిగి తత్త్వతః అభేదమున నుందురు (వి. 261). బ్రహ్మమువలె నాత్మ అసంగుడుగూడ నగును, కాని యితడే జీవాధిష్ఠానమై చిదాభాసరూపమున జీవుడగును.

## జీవుడు

ఘటాకాశమున నున్న జలమునందు ప్రతిబింబించిన ఆకాశమును జలాకాశమని యందురు. ఇది యథార్థమైన ఆకాశము గాక ప్రతిబింబాకాశము. అది ఆభాసమాత్రము. అటులే జీవ చైతన్యముగూడ కూటస్థ చైతన్యమునకు బ్రతిబింబ రూపమై ఆభాసమాత్రమై యొప్పారును. ఘటాకాశము అందుగల జలమున ఆకాశప్రతిబింబము ఎట్లు జలాకాశము నాబరగునో, అట్లే కూటస్థుడు అతని బుద్ధి ప్రతిబింబము జీవచైతన్య మనం

బడును. రూపరహిత ఆకాశమునకువలె, రూపరహిత శబ్దమునకువలె నీ రూపరహిత కూటస్థ చైతన్యమునకు వ్యష్టి అజ్ఞానమున బ్రతిబింబమేర్పడి జీవచైతన్య మేర్పడుచున్నది (వి. 112). అందుచే కూటస్థునితో గూడిన చైతన్య ప్రతిబింబమును జీవుడందురు. అనగా నంతఃకరణము, చిదాభాసుడు, కూటస్థుడు యీ మువ్వుర సమ్మేళనమునకు జీవుడందురు. ఇందు ఏది లోపించినను జీవత్వ మభావమే. అనగా అంతఃకరణమే లేకున్న కూటస్థ ప్రతిబింబమందేర్పడదు. అటులే కూటస్థుడు లేకున్న ఎవరి ప్రతిబింబ మేర్పడును ? అంతఃకరణ కూటస్థులున్నను ప్రతిబింబరూప చిదాభాసుడే ఏర్పడకున్న నిక జీవత్వమేది ? కాన నీ త్రిపుటియే జీవుడని తాత్పర్యము (వి. 117). ఇదే విధముగ బ్రహ్మ చైతన్యముయొక్క ప్రతిబింబము మాయలో ననగా సమష్టి అవిద్యలో నేర్పడ నది ఈశ్వరుడగుచున్న దని పూర్వముచూచియున్నాము. చైతన్యము రూపరహితమైయున్నను రూపరహిత శబ్దము రూపరహితాకాశమున బ్రతిబింబించుచున్నట్లు, రూపరహిత అంతః నేర్పడిన జీవకరణమునందు బ్రతిబింబించునని గ్రాహ్యము (వి,117). ఈ విధముగ ధర్మములు కూటస్థుని కన్వయింపక, సాభాసబుద్ధి యందు గలవు. అందుచే గూటస్థుడు అసంగుడై నిర్మలుడై చెల్వొందును. సర్వవికారము లను కల్పిత జీవచైతన్యమునకే యగును.

పై తాత్పర్యమునందు కొన్ని విశేషములు గలవు. అంతఃకరణ ముచే నుపహితమై యందు ఆభాస మేర్పడగ, ద్వివిధ చైతన్యము లేర్పడుచున్నవి. సాభాస అంతఃకరణ విశిష్ట చైతన్యమనియు, సాభాస

ఉపహిత చైతన్యమనియు ద్వయము ఏర్పడును, అంతఃకరణ
ఏ ఆభాస చైతన్యమునకేర్పడునో దాని ప్రమాత యనియు,
నగ ఆ లక్షణములులేక విలక్షణముగ నున్న సాభాస అంతః
్యము సాక్షిమాత్రమగును. అనగ ఉపాధిమాత్రముగ నంతః
ై కాని సాక్షిగను, అంతఃకరణ ధర్మముల గ్రహించి సాభాస
డుగను అగును. తారతమ్యము లక్షణముల గ్రహించుట
ం.

వస్వరూప ప్రతిపాదన సందర్భమున ఆభాస, అవచ్ఛేద వాద
ం విచారసాగరము ప్రతిపాదించి, ఆభాసవాదము ననువదించు
డు వాదము లకును అంతఃకరణము సమానమై యున్నను,
ు సమానమై యున్నను, అంతఃకరణమునందు చైతన్యము
బింబమేర్పడి అంతఃకరణము ఆభాస సహితమై యుండును,
ు. కాని అవచ్ఛేద వాదమున ఆభాస యుండదు. ఈ రెండింట
భాష్యకారులైన శంకరాదులుపయోగించుటచే, దాని శ్రేష్ఠ
సముని ప్రతిపాదించును (వి. 144). అవచ్ఛేదవాదమును
లగువారభిమానించి యుండిరి. ఈ రెండు వాదముల వ్యత్యా
షములు, స్థానాంతరమున గాంచెదముగాక!

## సృష్టి కథనము

కర్మోపభోగ నిమిత్తము, ఈశ్వరునికి జీవకర్మానుసార సృష్టి
జనించుననని పూర్వము చూచియున్నారము. ఈ సృష్టి

విధానమున నేదేని క్రమముండునా ? యనినచో స్వప్న కల్పనమున నెట్లు క్రమమభావమో అటుల నీ సంసారోత్పత్తికి గ్రమము శూన్యము (వి. 165). ఛాందోగ్యమున అగ్ని జల పృథ్వీ క్రమసృష్టియు, తైత్తిరీయక మున ఆకాశాదిక పృథ్వీపర్యంత పంచభూత సృష్టియు వచింపబడి, రెండును వ్యత్యస్తముగ జూపడునుగాని సత్యమున జగత్తుయొక్క మిథ్యాత్వ ప్రతిపాదనార్థమే వేదవచనములుగాని, జగత్తు సత్యముగ జనిం చినట్లు గాదు. జగదుత్పత్త్యాదికము మిథ్యగ నిషేధించి, అద్వైత బ్రహ్మ బోధతాత్పర్యమున వేదము ప్రవృత్తము (వి. 165). ఉత్పత్తి ప్రసంగము గాక, ఉత్పాదిత వస్తు సంచయమును, దత్తత్కారణలయము గావించుచు, లయచింతన విధానమున బర్యవసానమైన బ్రహ్మమును, జిజ్ఞాసు దృక్పథ మునకు దెచ్చుటయే శాస్త్ర తాత్పర్యము (వి. 166).

సృష్టి, యసంగమైన సర్వాతీత బ్రహ్మముచే సృజింపబడక, బ్రహ్మ చైతన్యము నాశ్రయించుకొని, జీవేశ్వరులకు స్వరూపకారణమై యున్న మాయాకారణమున జనితము. ఈశ్వర సంకల్పమున సర్వ జీవ సంస్కా రముల ధరించి యున్న సత్వప్రధాన మాయ, తమోగుణయుక్తయై, ఆకా శాది పంచభూతముల సృజించుచున్నది ఈ భూతగుణములు శబ్ద, స్పర్శ రూప, రస, గంధములు వాని వాని ప్రత్యేక గుణములై, ఒకదానివలన దర్వాత భూతముద్భవించుటచే బూర్వ భూతగుణముల బొందుచున్నవి. అట్లు ఆకాశమున శబ్దగుణమొక్కటిమాత్రముండ, పృథ్వీభూతమున నైదు గుణములుండునని గ్రాహ్యము. ఈ భూతములందు ఈశ్వరుని

చైతన్యము, మాయయు, నంతర్గతములై యున్నవి. ప్రపంచముయొక్క సత్తాస్ఫూర్తి చైతన్యాంశమునకు జెందియుండ, దాని మిథ్యాత్వ లక్షణము మాయకన్వయించియుండును (వి. 117).

ఈ పంచభూతముల సమష్టి సత్వాంశమూలమున నంతఃకరణము జనింప, నది జ్ఞానహేతువగుచు, పంచ జ్ఞానేంద్రియములకు నది జ్ఞానార్జమున సహకారి యగుచు, దేహాంతర స్థితి గలిగియుండుటచే నంతఃకరణము నాబడుచు, సత్త్వప్రధానమై యుండుటచే సత్వమనియు నాబరగుచున్నది. ఈ యంతఃకరణ పరిణామరూపము వృత్తి నాబడి, వస్తువుల మంచి చెడ్డల నిశ్చయించునప్పుడు బుద్ధి యనియు, సంకల్ప వికల్పా నాత్మకమగుచు మనస్స నియు, చింతనవృత్తిగలిగి చిత్తమనియు, అభిమానముచే నహంకారమనియు జతుర్విధముల పేరొంది యున్నది (వి. 178).

అటుల, బంచభూతముల సమష్టి రజోగుణము ప్రాణోత్పత్తి అయి నదియై, క్రియా స్థాన భేదములచే ప్రాణ, అపాన, సమాన, ఉదాన, వ్యానముగ ననబడినది. ప్రాణమునకు హృదయము స్థానమై, ఉఛ్వాస పానలు కర్మలగును. అపానమునకు గుదము స్థానమై, మలమూత్రాధోన యనము కర్మము. నాభి స్థానమై, భుక్తపీతాన్నజలముల సమీకరణము కర్మగ, సమానమునకు గలదు. కంఠము స్థానమై, ఉచ్ఛ్వాస నిశ్వాసములు కర్మగలిగి ఉదానమొప్పును. వ్యానము సర్వశరీరమునందుండి, రసమేళనము కర్మగ గలిగి యున్నది (వి. 179).

మరల, పంచభూతముల వష్టి అంశములచే దశేంద్రియోత్పత్తి గలిగినది. జ్ఞానేంద్రియములు, ఆ యా భూత సత్వములచే జనింప, వాని వష్టి రజో అంశములచే కర్మేంద్రియములు జనితము. ఆకాశ, వాయు, తేజో, జల, పృథ్వులకు గ్రమముగ శ్రోత్ర త్వక్చక్షు జిహ్వా ఘ్రాణములు ధీంద్రియ పంచకమును, వాక్పాణిపాదపాయూపస్థలనెడు కర్మేంద్రియ పంచకమును గలిగినది. ఈ ఇరువది నాలుగు తత్త్వములను సూక్ష్మ సృష్టి యందురు. అంతఃకరణము నేకముగ గొనినచో సూక్ష్మ సృష్టి, ఇరువది ఒక్క తత్త్వములతో నుండును (వి. 181).

పూర్వోక్త పంచభూతములు, పరస్పరము క్రమరీతి మేళవించి స్థూల భూతము లగును. మూలభూతాంశము సగము గలుగ, అవశేష భూత చతుష్టయ అష్టమాంశముమాత్రము ఒక్కొక్కటిగలిగి, సగమై, ఒక స్థూల భూతముగ నేర్పడుచున్నది. దీనినే పంచీకరణమందురు. ఇందుండి యీ పంచ మహాభూతముల నాధారముగగొని, అఖిల బ్రహ్మాండములు జనించి, చతుర్దశ భువనరూపమును దాల్చి, జీవులకు భోగస్థానమై, భోగయోగ్యమై స్థావర జంగమాది జీవశరీరముల బొంది, యీ సృష్టియంతయు నావిర్భవించెను (వి. 183).

ఈ యనంత విశ్వమును భోగ్యముగ గావించి, అనుభవించు భోక్తను జీవుడందురు. అతనికి దతనుగుణ అవయవాది పరికరములున్నగాని భోక్త కాజాలడు. అందుచే నతనికి గారణ, సూక్ష్మ, స్థూల శరీరములని మూడు శరీరములు గలవు. మలిన సత్వగుణసహిత అవిద్యాంశము అతని గారణశరీరము. భవిష్యచ్ఛరీరములకారంభకమైన వంచ సూక్ష్మభూతములు

అంతఃకరణ చతుష్టయము, ప్రాణపంచకము, జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ దశకము గలిసి యిరువది నాలుగు తత్త్వములతో సూక్ష్మశరీరమేర్పడును. స్థూలభూత నిర్మితమైన స్థూలదేహము, జీవుని స్థూలదేహము. ఈశరీరము లందు పంచ కోశములు వచింపబడియున్నవి. కారణశరీరము ఆనంద మయకోశము నాబడ, విజ్ఞానమయ, మనోమయ, ప్రాణమయములు, మూడును గలిసి సూక్ష్మశరీరముగను, అన్నమయము స్థూల శరీరముగను అగుచున్నవి (వి. 184). ఈ కోశములు ఆత్మగాక అన్యమై, భ్రాంతి సిద్ధములనియే నిశ్చయము (వి. 185-194).

# మాయ-అవిద్య

ఇంతదనుక వివరింపబడిన జీవేశ్వర, కూటస్థ, విశ్వస్రష్టలకంటె టికిని ముఖ్య కారణముగ, మాయ యను నొక విచిత్ర తత్త్వము గలదు. అచింత్య శక్తిగలదియైనను యుక్తిచే సంహరింపబడుటచే దీని మాయ యందురు. అటులే విద్యవలన నశించుటచే నవిద్య యనియు నందురు. బ్రహ్మ స్వరూపమును ఆచ్ఛాదించుటచే నజ్ఞానమనియు నందురు (వి. 172). ఆటులే ప్రభాకరమునగూడ నిర్వచింపబడినది. ఆవరణ, విక్షేపశక్తిసహిత అనాది భావ పదార్థము అజ్ఞానమనియు, ప్రపంచమునకుపాదానమైనందున ప్రకృతి యనియు, దుర్ఘటమును గావించుటచే మాయ యనియు, స్వతంత్రత లేనిదిగుటచే శక్తియనియు, దీనికి నామాంతరములు (వ్య.185). ఆ మాయ జీవేశ్వరాది భేదరహితమైన శుద్ధ బ్రహ్మచైతన్యము నాశ్రయించుకొని

యుండును. అది అనాదియై, ఉత్పత్తిరహితమై యున్నది. అనగా నది తనవలన గలిగిన జీవేశ్వర జగత్తులవలన జనింపనేరదు. ఆటులే శుద్ధ బ్రహ్మచైతన్య జనితముగూడ కానేరదు. అటులైన బ్రహ్మము వికారవంత మగునుగదా! అంతియగాక మోక్ష దశయందుగూడ నిది పునరుత్పన్నమ గుటకవకాశమేర్పడును. ఇట్లు విచారింప మాయ ఉత్పత్తి శూన్యమై, అనాదిగ నున్నదని నిశ్చయము. ఇది ఏకముగ నుండును. అనాదియై యుండియు జ్ఞానోద్భవమున నంతర్హితమగుటచే సాంతము, అంతవంతమగుచున్నది. త్రికాలాబాధ్యమైన బ్రహ్మము సత్తనబడగా, నిది అంతవంతమగుటచే సత్తు కానేరదు. కాని శశవిషాణ, వంధ్యా పుత్రచందము అభావమై, అసత్తుకూడ కానేరదు. అందుచేనిది సద సద్విలక్షణమైనదని వాకొనబడినది. ఈ రీతి గానే ధర్మముచేతను అజ్ఞానమును నిరూపింప సాధ్యముకాకుండుటచే, నది అనిర్వచనీయమనియు నాబడును (వ్య. 185). నే నెరుంగను అను రీతిగ జాగ్రదవస్థయందును, భ్రాంతిదృశ్యములకుపాదానకారణముగ స్వప్నమునందును, అజ్ఞానరూపమున సుషుప్తియందును నీ మాయ, సర్వావస్థల నంతర్గతమై జీవుని ఆవరించియున్నది. ఇది శుద్ధ బ్రహ్మము నాశ్రయించి, ఆ బ్రహ్మమునే ఆచ్ఛాదించినట్లుండును. గృహము నాశ్రయించిన అంధకారము గృహము నాచ్ఛాదించునుగదా! (వి. 167–168).

అజ్ఞానము జీవుని ఆశ్రయించియుండి, బ్రహ్మమును విషయము జేయుచు, నా బ్రహ్మముపై జీవభోగ్యముగ, సృష్టిని గల్పించుచున్నది అని

వాచస్పత్యము. ఎందరు జీవులు గలరో అన్ని అజ్ఞానములనియు, నందుచే ననంతములను నా సిద్ధాంతమునకు నిశ్చలదాసు సమ్మతింపడు (వి. 170). అతనికి స్వాశ్రయ, స్వవిషయ పక్షము అంగీకారము. అనగ మాయ జీవాశ్రితముగాక, బ్రహ్మమునే యాశ్రయించి, జీవేశ్వర జగత్తుల గల్పించు చున్నది. బ్రహ్మ, మాయల సంబంధము అనాదియైనది. అందుచే జీవత్వ, ఈశ్వరత్వములుగూడ ననాదులే యగుచున్నవి. ఆ మాయ బ్రహ్మము నాశ్రయించి, అతని నాచ్ఛాదింపగ, అజ్ఞానావృతరూపుడై తత్కార్యముగ జీవుడుద్భవించును. ఈ విధముగ అజ్ఞానము స్వాశ్రయమై స్వవిషయముగ నున్నదని నిర్ణయము (వి. 171).

ఈ ప్రకారముగ అజ్ఞానము ఏకమై, జ్ఞానముచే నివర్తిల్లును. ఎవని యంతఃకరణమున జ్ఞానముద్భవించునో, అతని యంతఃకరణావచ్ఛిన్న చైతన్యమందుండు అవిద్యాంశము ఉపశమించును. అంత నతడు ముక్తుడగును. అతనికి మాయ నివారణమైనది. మరియు, నీ యజ్ఞానము 'నేను బ్రహ్మమునెరుగను' అను రూపమున నావరణశక్తియై యున్నది. ఈ యావరణాంశము 'బ్రహ్మము నెరుగను' రీతి అసత్త్వాపాదకముగను, 'బ్రహ్మము లేదు' అనుచందము అభాసాపాదకముగను ద్వివిధమై, ఆవరణము నాబడును. ఈ సంసారరూప అజ్ఞానమునే, భ్రాంతి యనియు నందురు. అదియే శోకముగూడ నగుచున్నది (వి. 125, 126). "బ్రహ్మము లేదు" అను అభాసాపాదక భ్రాంతి 'బ్రహ్మము గలడు' అను పరోక్షజ్ఞానముచే నివారింప, బ్రహ్మము నెరుగనను అసత్త్వా పాదక

అజ్ఞానము "బ్రహ్మమును నేనే" అను అపరోక్ష జ్ఞానముచేనివర్తించును (వి. 127).

ఈ అజ్ఞానకార్యము, జీవునిపై నెట్లు ఉద్యమించునో దశము కథను ఉదాహరణముగ వచించి, అ సప్తావస్థల వివరించెదరు. అందు మొదటిది అజ్ఞానము, రెండవది ఆవరణము, మూడవది భ్రాంతి, నాలుగవది పరోక్షజ్ఞానము, ఐదవది అపరోక్షజ్ఞానము, ఆరవది శోకవినాశము, ఏడవది అతిహర్షము అనబడును. దశముడు, తానే దశముడై యున్నను గుర్తింపకుండుట అజ్ఞానము. దశముడు లేడనుకొనుట ఆవరణము. మరణించెనని దుఃఖించుట భ్రాంతి. ఉన్నట్లు గ్రహించుట పరోక్షజ్ఞానము శోకము నాపుట భ్రాంతినాశము. అనగ దుఃఖ నివృత్తి. తానే దశముడనని గ్రహించుట అతిహర్షము, అదియే పరమానందప్రాప్తి. అటులే జీవత్వమునుండి ముక్తస్థితివరకు, నీ సప్తావస్థలు జీవునికి గలవు. 'బ్రహ్మము లేదు' నే గాను దశనుండి 'అహం బ్రహ్మాస్మి' స్థితికే లెంచి, దుఃఖోపశమనమును పరమానందప్రాప్తిని, యీ యవస్థలు క్రమముగ గలుగజేయును. ఇది యంతయు, ఘటనాఘటనపటీయసి అయిన మాయా ప్రభావమేగదా!

పై విషయముల సూక్ష్మదృష్టి నారసినచో, నీ జీవేశ్వర జగత్తులు కేవలము కల్పితములై, భ్రాంతి జనితములని నిర్ణయమగును. దీని నిరూపించు కర్తవ్యమున శాస్త్రములు, అనేక భ్రాంతి ఉదాహరణముల జూపించి, వాని సాకల్యముగ విచారించి, విమర్శించి, భ్రాంతిదృశ్యము సద

ద్విలక్షణత్వమున ననిర్వచనమై అయథార్థమై యున్నదని తీర్మానించినవి.
ఆ విషయమును కొంచెము తిలకించదముగాక !

# అధ్యాస స్వరూపము

ఈ భ్రాంతి వివరణకార్యమున శాస్త్రము ముఖ్యముగ రజ్జు సర్ప, స్థాణు పురుష, శుక్తి రజత భ్రాంతుల నెక్కువగ వినియోగించినది. మందాంధకారమున నెదుటగల రజ్జువును దిలకించి సర్పభ్రాంతినొంది భయ మొందుట సామాన్యము. ముందున్న రజ్జుస్థానమున సర్పదృశ్యము ఎట్లు భాసించుట ? మరల వెలుగుతో నాసర్ప మదృశ్యమై యథార్థరజ్జువు ఎట్లు గోచరము ? తత్కాలమున దోచు నీ సర్పము సత్యసర్పమువలె నెట్లు భయ భ్రాంతుల గలుగజేసెను ? ఈ విచారణము అతి తీవ్రమై జటిలమై సర్వ సిద్ధాంతవ్యాప్తమై సమస్యల నతిక్లిష్టత్వములకు గొంపోయినది. ఈ భ్రాంతిని అధ్యాస యనియందురు. అధిష్ఠానముకంటె విషమసత్తగల అవభాసమును అధ్యాస యందురు. మరియు తన అభావముయొక్క అధికరణమందు ఏ అవభాసముగలదో దాని నధ్యాసయనియు నందురు. అనగా, అధిష్ఠానమున కును అవభాసమునకును సత్తావ్యత్యాసముండ నధ్యాస యేర్పడును (వి. 77) పారమార్థిక సత్తయని త్రికాలాబాధ్యమై అభావత్వ మేకాలమున లేనిది యగుచున్నది. వ్యావహారికసత్త ఈశ్వరకల్పితమై బ్రహ్మజ్ఞానపర్యంత

సత్తాగలిగి యుండునది యగును (వి. 160). పంచభూతాత్మక సృష్టియం తయునం దంతర్గతము. మూలావిద్యాకార్యమైన ఈశ్వరసృష్టి జాగ్రత్పదార్థములు వ్యావహారికసత్త లో నిమిడియున్నవి. అనగ జన్మమరణ బంధమోక్ష వ్యవహారరూపమైన సత్తా వ్యావహారిక సత్త నాబరగును. ఇది బ్రహ్మజ్ఞానావతరణమున నంతమగును. అట్లుగాక బ్రహ్మజ్ఞానాపేక్ష లేక, ఏసత్తకు బాధ కలుగునో అది ప్రాతిభాసికము నాబడును. శుక్తిజ్ఞానమున రజత జ్ఞానము, రజ్జుగ్రహణముచే సర్పస్ఫూర్తియు నదృశ్యమగును. అందుచే నీ రజత, సర్పాది భ్రాంతిజ్ఞానములు ప్రాతిభాసికసత్తాయం దన్వయములు, అటులే జీవకల్పిత స్వప్న దృశ్యములునుగూడ ప్రాతిభాసికమునందర్గతము. ఈ పారమార్థిక, వ్యావహారిక, ప్రాదిభాసిక సత్తలలో పారమార్థికము బ్రహ్మజ్ఞానాంతర ప్రాప్తముగాన సామాన్య ప్రజ్ఞావిదూరము. శేషద్వయము సర్వానుభవయోగ్యము. మరియు ననుభవమున సమసత్తయుండవలయునని శాస్త్రము. అనగ వ్యావహారిక సత్తలోగల దేహాదిక సుఖదుఃఖములకు ఆసత్తలోగల వస్తుచయమే కారణముగాని విషమసత్తలో గలవి కానేరవు. వ్యావహారికమున రోగగ్రస్తునికి స్వప్నస్థ భిషగర్యుడుపయుక్తము గానేరడు గదా. అటులే స్వప్నమున గలిగిన రాజత్వము వ్యావహారికమువ ననువయుక్తము గదా! అందుచే ననుభవమునకు సమసత్త యవసరము(వి·160)

కాన అధిష్ఠానముకంటె విషమసత్తగల అవభాసము అని అధ్యాస నిర్వచింపబడినది. ఇచట అధిష్ఠానమగు రజ్జువు వ్యావహారిక సత్తగలిగి యుండ దానిపై దోచు సర్పము ప్రాతిభాసికమై రజ్జుజ్ఞానకాలమున నదృశ్యమగును. అందుచే దాని భ్రాంతి, అధ్యాస అని యందురు. రెండవ నిర్వచ

నమున రజ్జుజ్ఞాన మభావము కాగ, ఆ స్థానమున సర్పము గోచరము. రజ్జు స్ఫూర్తియున్నచో సర్పము అగోచరము. ఈ అధ్యాసకార్యమున, భ్రాంతి జ్ఞానముయొక్క విషయమైన మిథ్యావస్తువు ప్రస్తుతమునకు సర్పము, మరియు భ్రాంతిజ్ఞానము అనగా దాని జ్ఞానమును జేరి అధ్యాస గలుగుచున్నది (వి. 77). దీనిని వివర్తమనియు నందురు.

ఇది అధ్యాసయొక్క సామాన్యలక్షణము. అందు కేవలము మిథ్యా వస్తువు అర్థాధ్యాస యనియు, భ్రాంతిజ్ఞానము జ్ఞానాధ్యాస అనియు నందురు. అందు అర్థాధ్యాస మరల స్వరూపాధ్యాస సంసర్గాధ్యాస అని ద్వివిధము. స్వరూపాధ్యాస యన అనిర్వచనీయ స్వరూపస్ఫూర్తి యగును. శుక్తియందు రజతము అనిర్వచనీయముగ గోచరము గదా. పూర్వసిద్ధ స్వరూపము యొక్క సంబంధమున అనిర్వచనీయ స్వరూపసృష్టి సంసర్గాధ్యాస యగును. ప్రత్యక్షమున ముఖము దర్పణము గలవు. సంబంధము లేని, సామాన్యత్వ ములేని యీ రెండింటి కారణమున అనిర్వచనీయ ముఖప్రతిబింబము ఏర్పడుచున్నది. అటులే స్ఫటికముపై రక్తపుష్పవర్ణ స్ఫురణము.

మరల నీ స్వరూప సంసర్గాధ్యాసలు షడ్విధములైనివి. మొదటిది కేవల సంబంధాధ్యాసము, సంబంధ సహా సంబంధ్యధ్యాసము రెండవది, కేవల ధర్మాధ్యాసము మూడవది, ధర్మసహ ధర్మ్యధ్యాసము నాలుగవది, అన్యోన్యాధ్యాసము అయిదవది, ఆరవది అన్యతరాధ్యాసము. వీని అవాంతర వ్యాఖ్యానము సుసూక్ష్మములు. మూలగ్రంథముల బఠించి గ్రహించుకొనెదరు గాక!

# ఖ్యాతి

అధ్యాస విచారణము గ్రంథముల బహుళముగ గావింపబడి అతి క్లిష్టము గావింపబడియున్నది. ఒక్కొక్క సిద్ధాంతి యొక్కొక్కరీతి నిర్ణయించును. ముఖ్యముగ నీ విచారణాఫలితముగ, అసత్ఖ్యాతి, ఆత్మఖ్యాతి, అన్యథాఖ్యాతి, అఖ్యాతి, అనిర్వచనీయ ఖ్యాతి యను విధానములు శాస్త్రములగలవు. వాని గొంచెము చూచెదముగాక.

రజ్జువునందు గోచరించు సర్పము అసలు అచటలేదు. అది మరెచ్చటను అభావమే. అందుచే నాసర్పము అత్యంతాసత్ అని అసత్ఖ్యాతివాదుల సిద్ధాంతము. దీనిని శూన్యవాదులు అభిమానించెదరు. ఆత్మఖ్యాతి విజ్ఞానవాదుల సిద్ధాంతము. రజ్జువుపై దోచు ఆసర్పము, రజ్జువుపై గాని అన్యదేశమున గాని గాక బుద్ధియందే గలదు అని యందురు. బుద్ధిలోని సర్పము బాహ్యరజ్జువుపై గోచరము అని వీరి తాత్పర్యము. నైయాయిక వైశేషికులు అన్యథాఖ్యాతిని ప్రతిపాదించెదరు. అన్యదేశమున గాంచబడిన సర్పము, అన్యప్రకారమున సమ్ముఖరజ్జువునందు భాసమగునని కథనము. అఖ్యాతివాదులు పై వాదముల ఖండించి, అధ్యాసకార్యము, 'ఇదం సర్పం' అను వృత్తిలో 'ఇదం'త్వము సమ్ముఖమునగల రజ్జువుయొక్క సామాన్యజ్ఞానముగను, 'సర్ప'త్వము పూర్వదృష్ట సర్పముయొక్క స్మృతియు జేర్చి సర్పభ్రాంతి కలుగున్నది. కాని ప్రత్యక్ష రజ్జుజ్ఞానముగాని, పూర్వదృష్ట సర్పజ్ఞానమున గాని యిందు లేదుగాన నిది అఖ్యాతి అని సాంఖ్యావాదుల

ప్రాభాకర మీమాంసికులు వచించెదరు (వి. 85).

కాని యీ ఖ్యాతిచతుష్టయ ప్రతిపాదనము లోపభూయిష్ఠము. అసద్రూపము గోచరించు పక్షమున శశవిషాణ వంధ్యాపుత్రుల దర్శనము కావలయును. అది అసంభవమగుట వలన అసత్ ఖ్యాతి అసంగతము. వైజ్ఞానికుని సిద్ధాంతమున నాత్మ క్షణికము. అట్టి ఆత్మ సర్పరూపముదాల్చిన క్షణకాలసత్తా గలిగి మాత్రముండవలెను. కాని అది భ్రాంతికాల మంతయు నుండును. అంతియగాక, స్వప్నమువలె నీ భ్రాంతి వస్తువు అంతరమున లేదు. బాహ్యమున మాత్రమే గోచరము. అట్లయ్యెను, ఆత్మీయ మైనచో మయి రజతం' 'అహం రజతం' నాది వెండి, నేను వెండి యను ప్రతీతి. కావలయును గాని 'ఇదం రజితం' అని బాహ్య ప్రతీతి యగుచున్నది (పృ. 151). అందుచే నీ యాత్మఖ్యాతియు సమర్థనీయము. అంత నన్యథాఖ్యాతియైనచో నదియు ననుచితము. ముందున్న రజ్జువుగాక నన్యస్థలమునగల సర్పము గోచరింప రజ్జు సర్పముల మధ్యప్రదేశ్ వస్తువులుగూడ గోచరింపవలయును. నేత్రము ప్రత్యక్షమునే గ్రహింపగల్గును గాని పరోక్షవస్తువును గాంచనేరదు గదా! జ్ఞేయానుసార జ్ఞానముండక, అన్యవస్తుజ్ఞానము ఎట్లు గలుగును! ఇచ్చట జ్ఞేయము రజ్జువుగదా. మరియు నఖ్యాతివాదముగూడ దోషయుక్తమే. 'ఇదం' రూప రజ్జువుపై పూర్వదృష్ట సర్పసంస్కారము ఆవరించునని యంగీకార మగుటచే, స్మృతిరూపదృశ్యము భయహేతువు కాగూడదు. అఖ్యాతివాదమున రజ్జువు అఖ్యాతమై తత్స్థాన

మున స్మృతిరూప సర్పము గోచరము. ఆ సర్పము ఎట్లు భీతిని గలిగించును ? అందుచే నదియు నసంగతమే. ఈ నాలుగువాదములు గాక సత్ఖ్యాతి వాదమని వేరొండుగలదు. రజ్జు స్థానమున యథార్థముగా సర్పమే గలదని వారివాదము. కాని వెలుగులో నాసర్పము పోవుచుండ నెవరును గాంచజాలరు. ఆ సర్పముచే నెవరును గ్రస్తులు కాలేరు. అందుచే నీవాదము గూడ దోషబద్ధమే. ఈ పంచవిధ వాదములుగాక వేదాంతసిద్ధాంతము **అనిర్వచనీయఖ్యాతి వాదమును ప్రతిపాదించును.**

ఈ వాదము సూక్ష్మము యుక్తియుక్తము. అంతఃకరణ వృత్తి నేంత్రేంద్రియద్వారమున వెలికరిగి బాహ్యవస్తువును బొందినప్పుడు ఆ విషయముయొక్క అవరణభంగమై తద్విషయ ప్రతీతి యగుచున్నది. అందులకు ప్రకాశము సహాయముగా నుండును, భ్రాంతి కాలమున, అంతఃకరణవృత్తి సహజముగ నేత్రముద్వారమున బయల్వెడలియు, ప్రత్యక్షమున గల రజ్జు సంబంధము నొందియు, మదాంధకార ప్రథమదోషముచే రజ్జ్వావరణభంగము కాలేదు. అందుచే వృత్తియొక్క స్వరూపము రజ్జ్వాకారము పొందజాలదయ్యెను. అందు రజ్జువుయొక్క సామాన్యాంశము మాత్రము వృత్తినందుకొనియుండి విశేషాంశము అగోచరమగుటచే రజ్జువు యొక్క సంపూర్ణ ఆవరణ భంగముగాక రజ్జుప్రతీతికి భంగమేర్పడును. అంత దాని అవిద్య దాని నావరించి సర్పాకృతిని దాల్చి ప్రత్యక్షమగుచున్నది. పూర్వదృష్ట సర్పసంస్కారము దానికి గారణముగ నున్నది. అట్లు ఏర్పడిన సర్పము సత్యమై యున్నచో రజ్జు సంపూర్ణజ్ఞానమున నది అదృశ్యము

కారాదు. కాని సంపూర్ణ రజ్జుజ్ఞాన ప్రాప్తిచే సర్పము అంతర్ధానము గదా. అందుచే నా సర్పము సదంశము కానేరదు. కాన అసత్తని యనుటకుగూడ నవకాశము నున్న. అసద్వస్తు ప్రత్యక్షము ఎందైనా గలదా? ఎందునులేని అత్యంతాసత్తగల రూపములు గోచరింప నేరవు. కాని యిచ్చట సర్పము గోచరము. కాన నది అసత్తుగూడ కాదు. ఈ రెండు స్థితులకు అన్యముగ నుండుటచే దదిసద్విలక్షణముగ బల్కుదురు. అదియే అనిర్వచనీయమని యందురు. రజ్జుస్థానమున అవిద్యాకారణమున అనిర్వచనీయ ఖ్యాతి గలిగినది (వి. 87). ఈ సర్పభ్రాంతి రజ్జుజ్ఞానము కానంతదనుక నుండి, రజ్జుజ్ఞానమున నంతరించును. ఈ విషయము బాహ్యమునకు సులభగ్రాహ్యముగ నున్నటులున్నను. సూక్ష్మముగ యోచించుచో నతి నిగూఢము. దానికై విచార సాగర వృత్తి ప్రభాకరములు పూర్వపక్ష సిద్ధాంతములతో నీ విషయ విమర్శనము గావించియున్నవి. ప్రభాకరము ప్రౌఢగ్రంథముగాన అనేక గ్రంథకర్తలనుగూడ సూచించి వివరించియున్నది.

అధ్యాస ఏర్పడుటకు కొందరు సిద్ధాంతులు అధ్యాససామాగ్రి అని ఆరు కారణముల వచించెదరు. 1) సత్యవస్తు జ్ఞానజన్య సంస్కారము : రజ్జువుపై సర్పభ్రాంతి నొందిన వాడు పూర్వము యథార్థసర్పమును గాంచి యుండి తత్సంస్కారము వలన మాత్రమే యిచట సర్పమును జూడగలుగుచున్నాడు. 2) ప్రమాతృదోషము : భ్రాంతుడు భయాదిదోషములకు బద్ధత్వము నొందియుండును. 3) ప్రమాణదోషము ; నేత్రదోషము

అంధకారదోషములు దీనిక్రింద బరిగణింపబడును. 4) ప్రమేయదోషము: రజ్జునందు సర్పభ్రాంతి గలుగుచున్నది గాని శుక్తమునందు సర్పభ్రాంతి గలుగదుగదా. అందుచే సర్పభ్రాంతికి రజ్జుదోషముగూడ గొంత ఉండవ లయును. 5) అధిష్ఠాన సామాన్యజ్ఞానము : రజ్జుసర్పములకు రెండింటికి గల సామాన్య లక్షణములు. వీని చేతనే యీరెండింటికి అన్యోన్యాధ్యాస వేర్పడుచున్నది. 6)అధిష్ఠాన విశేషరూప అజ్ఞానము : సర్పము కంటె రజ్జువు నకుగల విభిన్న లక్షణముల అగ్రహణము. రజ్జువులోని అచేతనత్వము, మొద లగు ప్రత్యేక ధర్మముల గ్రహించినంతటనే సర్ప మదృశ్యమగును(వి.32.)

కాని నిశ్చలదాసు వీని ఖండించి తన సిద్ధాంతమును వచించెను. (వి. 48). అధ్యాసమునందు సత్యవస్తుజ్ఞానసంస్కారమే అవసరములేదు. ఆవస్తువు అసత్యమైయున్నను దాని సంస్కారముమాత్రము అధ్యాస కారణమగును. అందుచే బూర్వదృష్టవస్తువు అయథార్థమయ్యును భ్రాంతి వస్తుదర్శనమునకు హేతువు అగును. అనగా జ్ఞానజన్యసంస్కారమే ప్రధా నముగాని వస్తువుయొక్క సత్యత్వాసత్యత్వములు గావు. ఆ వస్తువు పూర్వదృష్టము అయియుండవలయును. కావునఅసర్పజ్ఞానజన్యసంస్కారమే సర్పాధ్యాసమునకు గారణము. అటులే ప్రమేయదోషము విచారింపబడును. ఇచట ప్రమేయము రజ్జువు. దానికి సర్పముతో సాదృశ్యలక్షణదోషము వాకొనబడియున్నది. కాని శంఖమునందు పీతత్వము, శర్కరయందు గషాయత్వములు సాదృశ్యత్వము లేకయే జరుగుచున్నవి గదా. స్ఫటిక రక్తపుష్ప భ్రాంతియు నంతియే. మరల ప్రమాతృదోషమున భయాదికము

కారణముగ జెప్పబడినది. కాని భయరహితునికిగూడ సర్పభ్రాంతి గలిగి. సర్పము గోచరింప నగును. వైరాగ్యవంతునికైనను శుక్తియందు రజతము గాననగును. ప్రమాణదోషముగూడ నంతియే. ఏ నేత్రదోషము లేక యే రూపరహితాకాశము నీలముగ గోచరించుచున్నది. అది పట కుటీరాకారముగ గానబడును. అందుచే నేత్రదోషముగాని, మదాంధముగాని కారణముకాదు (వి. 49). ఇట్లు విచారింపగ బూర్వదృష్ట, వస్తుజ్ఞానజన్య సంస్కారము, అధిష్ఠాన సామాన్యజ్ఞానముచే, అధిష్ఠాన, విశేషాజ్ఞాన కారణమున, అధ్యస్త రూపమున గోచరము అని నిర్ణయము.

పై విధానమున, ఆత్మానాత్మలకు గార్యాధ్యాస ఏర్పడి, ఆ అన్యోన్యాధ్యాస మూలమున ఆత్మ రజ్జువువలె నగోచరమై, ఆ స్థానమున సర్పమువోలె అనాత్మరూపములైన దేహేంద్రియాదికములు అధ్యసించి, సంసారమేర్పడినదని తీర్మానము. పూర్వదృష్ట సర్పము సత్యమై యుండ వలెననిన అనాత్మయు సత్యమై యుండవలెను. అందుచే బూర్వదృష్ట వస్తువు అయథార్థమై యున్నను, దాని జ్ఞానజన్య సంస్కారమే ప్రధానముగా వచింపబడియున్నది. కాన ననాత్మ సత్యముకాక, అసత్యమైనచే యగును. అయినచో నా అసత్యవస్తువునకు బూర్వము సత్య వస్తువు ఆధారముగ నుండవలయునను సంశయము గలుగును. కాని, యీ భ్రాంతి పూర్వపూర్వగతమై, ప్రథమధ్యాస అనునది అసంభావ్యమై, అనాది యగును. అందుచే నద్వైతసిద్ధాంతము బ్రహ్మ, ఈశ్వర, జీవ, అవిద్య, భేదసంబంధములనెడు షడనాదుల బ్రతిపాదించినది. ఈ యారింటికి, ఉత్పత్తి

లేదు అనగా బుట్టుకలేదు. ఈ విధముగ అనిర్వచనీయ మాయా విశేష మున, అనాదికాలమున. ఆత్మయందే యనాత్మ భ్రాంతిగ ంగి, సంసారము గలిగినదని, వేదాంత సిద్ధాంత నిశ్చయము. ఈ అనిర్వచనీయ మాయా ప్రభావమున బ్రహ్మము, ఈశ్వర, జీవ, జగద్రూపమున భాసించి, యీ కల్పిత బంధ మోక్ష సంసార నాటకము నాడు చున్నది. బ్రహ్మముయొక్క సన్నిధానమాహాత్మ్యమున, చేతనమువలె మాయ ఆడుచున్నది. ఈ రహస్యమును గురు, శాస్త్రములద్వారమున నెరింగినచో, నా జ్ఞానముచే, బూర్వగత సంసారభ్రాంతి యంతరించి జీవుడు బ్రహ్మమునని గ్రహించి, బ్రహ్మమేయై పరిఢవిల్లును.

## సాధన

విచార సాగరమున, మంగళాచారణ వాక్యమును నుచ్చరించి, అందు ఉత్తమ గ్రంథమున కవసరమైన అనుబంధ చతుష్టయము అధికారి, సంబంధ, విషయ, ప్రయోజనము లనెడి యంశముల బ్రస్తావించి, అందు నా నాలుగింట, అతి ప్రధానమును విశ్వాశమున నైయుండనోపు 'అధికారి'కి ప్రథమ స్థానము యీయబడినది. అందుచే ముముక్షువు కాగోరువానికి గ్రంథ పరిశీలనము మొదలగు వానికంటె, దా బ్రథమతః అధికారము, అర్హతను సంపాదించికొనియుండుట, ఎంత అవసరమో దీన గ్రాహ్యము. కావ 'వధికారి' నొకించుక యోచించెదముగాక!

అంతఃకరణము నాశ్రయించియుండు మల, విక్షేప, ఆవరణరూప దోష త్రయముల నివారించి, వివేకము, వైరాగ్యము, శమాది షట్క,

ముముక్షుత్వముల గలిగినవాడు అధికారి అని నిర్ణయము. జన్మాంతర. పాపము మలము నాబడును. చిత్తచాంచల్యము విక్షేపమగును. తన నైజము నెరుగ నవకాశ మొసంగని స్వరూపాచ్ఛాదనమును ఆవరణ మందురు. నిష్కామ కర్మాచరణముచే మలదోషము నివారితమగును. ఉపాసనాదికముచే విక్షేపము నిరాసమగును. జ్ఞానమాత్రమున ఆవరణము పరిహారమగును. అందుచే జ్ఞానమునకధికారి, మల విక్షేపముల, నిష్కామ కర్మ, ఉపాసనలచే బోద్రోసి, జ్ఞానసముపార్జనమునకు సాధన చతుష్ట యముల నార్జించి, సంసిద్ధుడై యుండునట్టివాడే అని గ్రాహ్యము(వి.4).

కాని, కర్మోపాసనా జ్ఞానములు మూడునుగూడి మోక్షహేతువులని గాని, కర్మోపాసనలు జ్ఞానమునకు రక్షణములనిగాని, పలుకు జ్ఞానకర్మ సముచ్చయవాదము అనంగీకార్యము. కర్తృత్వ భోక్తృత్వములతో జేరి, దేహాత్మభ్రాంతినున్న కర్మ, తద్వ్యతిరిక్త జ్ఞప్తినున్న నముతో నెట్లు సమన్వయించును? అనునదియే ప్రశ్న. కర్తృ కర్మ ఫల భేద ప్రవృత్తి కర్మకు గలదు. జ్ఞానము వానికతీతము. మరియు గర్మకు జాత్యాశ్రమా ద్యవస్థలు అవసరము. తదనుగుణమైనావే కర్మలు. అవి జ్ఞానదృష్టికి, అధ్యస్తములు భ్రాంతులు. అటులే ఉపాసనయు త్రిపుటీ సహితము. ఫల వంతము. భ్రాంతిరూపము. అందుచే నదియు జ్ఞాన విరుద్ధముకాన సముచ్చయమసంగతము. అయినను కర్మోపాసనలకు జ్ఞానోత్పత్తియందు ఉపయోగమున్నది, మోక్షమునందుమాత్రము గానము. కాబట్టి జ్ఞానోత్ప త్తికి బూర్వము కర్మోపాసనల గావించి, మల, విక్షేపములంతరించు

నంతవరకు సాగించి, విశుద్ధ నిశ్చలాంతఃకరణమేర్పడుతోడ గర్మోపాస
త్యాగమాచరించి, జ్ఞానసాధనములైన శ్రవణాదుల ననుంగవలయున
నిశ్చలదాన తాత్పర్యము (వి. 273 . అందుచేత, నిత్యనైమిత్తిక కర్మల
స్వర్గాదిక ఫలప్రాప్తి కలుగునను వేదవాక్యములు జెల్లును. కాని అవి, ఈ
బంధనాశ హేతువులై మోక్షకారణములగుననుట ఘటిల్లదని బావ
(వి. 51)• పూర్వోక్తరీతి బూర్వవాసనారూప మలము సత్సంగముల
నగును. మరియు, బూర్వకర్మ జనితమైన అదృష్టముగూడ భోగమ
నగుచున్నది. అందుచే జ్ఞానావతరణమునకు బూర్వము అని మలవినాశ
గావించి, చిత్తశుద్ధి హేతువులగునని మాత్రమంగీకరింపనగును. ఈ వి
యమును ప్రభాకరముకూడ అనువదించి, మిథ్యానివృత్తికొరకు గర్మయ
యోగము కాదనియు, గేవల గర్మచేగాని, కర్మ సముచ్చిత జ్ఞానముచే గ
అనర్థమైన సంసార నివృత్తి కాదనియు, కేవల జ్ఞానముచేతమాత్రమే ఆ
యనర్థ నివృత్తి కలుగుననయు, నదియే సకలాద్వైతగ్రంథ తాత్పర్యమని
వాకొనియున్నది(వృ 271). అనగ సముచ్చయము, సముచ్చయము, క్ర
సముచ్చయమని ద్వివిధముకాగ, కర్మ జ్ఞానముతో సహచరిమై, మోక్షసా
హేతువనుట సమసముచ్చయము నాబడును. కాక, కర్మ జ్ఞానోపలబ్ధికి సా
మనుచు, జ్ఞానమే మోక్ష కారణమనుటయు, నందుచే ప్రథమతః కర్మాచా
గావించి, చిత్తశుద్ధి గావించి, అంత మోక్షసాధకమగు జ్ఞానము నవలంబ
వలయునను క్రమ సముచ్చయము శ్రుతి స్మృతి శాస్త్రముల తాత్పర్య

నిశ్చలదాసు వివరించెను (వృ. 271). ఈ భావమే శంకరుని రచనముల ప్రసిద్ధమని అతని వాదము.

కర్మముకంటె నినుమంత జ్ఞానమునకు సన్నిహితము ఉపాసన యగును. కాని ఉపాసన అనుటతోడనే, ఉపాసన మెనవనిగూర్చి? ఎట్లు? ఎప్పుడు? ఎచట? మొదలగు ప్రశ్నములసంఖ్యాకములు మనపై లంఘించును. వానికి సమాధానముగ ననేక ఉపాస్య మూర్తులు, విధానములు, కాలములు, స్థలములు ప్రతిపాదింపబడి, ఉపాసనలో నానాత్వమేర్పడియున్నది. అందుచేతనే ఉపాసకునకు దేశకాలాదిక అపేక్ష గలదని వచించి, జ్ఞానికి, అట్టి అపేక్ష అభావమని, దేహత్యాగావసరమునగూడ వాని అవసరావసరముల నిశ్చలదాసు తెలిపియున్నాడు (వి. 336). ఉపాస్యమునుగూర్చి విభేదముల సూచింప గ్రంథాంతమున, వివిధోపాసకుల భావసమూహముల జక్కగా విచారసాగరము వర్ణించియున్నది. వైష్ణవులు విష్ణువే సర్వమని స్తుతించి పరదైవముల నిందింప (వి. 357), శైవులు శివుని గొనియాడి అన్యమూర్తుల దూలనాడుదురు (వి. 358). అంత వినాయకుని బూజించువారు అతని సంస్తుతించి యితరుల నిందింప, శక్త్యారాధకులు నెల్లర కించపరచి, యా దేవిని కీర్తించుచున్నారు (వి 360). అటులే సూర్యోపాసకులును వాదింప నిక ఉపాస్య మెద్దియను సంశయము సాధకుని చిత్తమున దోచును. కాని యా గాథలోని శుభసంతతి మహారాజుచందము సంశయములు అంతరింప, సర్వోపాస్యమూర్తి యగు నా పరమేశ్వరు నుపాసించి, ధ్యానించి, జ్ఞానియై, అంతర్ముఖవృత్తినొంది, తాపోపశమనమునొంద నీ

యయుపాస్యమూర్తులలో నొకని గ్రహించి, నిమగ్నచిత్తమున నుపాసించు టుచితముగాని, పరనింద గావించుట హేయము.

అయినను, ఉపాస్య మూర్తులు సర్వేంద్రియాతీతమైన బ్రహ్మమునతో నభిన్నులుగారు. వీరి రూపము మూర్తిమంతము. వీరు శరీరధారులు. కాని యా శరీరములకధిష్ఠానము బ్రహ్మము అని గ్రాహ్యము. అందును రామ, కృష్ణాది యవతారమూర్తులకును, సామాన్య మానవులకును మరల, హస్తిమశక తారతమ్యము గలదు. జీవుల దేహములు పుణ్య పాపఫలితములై, వాని కధీనములై, భూతకార్యములై యుండ, అవతారవర్యుల తనువులు, ఈశ్వర సంకల్పితములు. జీవకర్మానుసార సృష్టికై ఈశ్వరుడు సంకల్పించి సృజించురీతి, సాధుజనరక్షణ దుష్టశిక్షణములకై, ఈశ్వర సంకల్పబలమున, విశేష నామరూపరహితమైన ఈశ్వరునియందు, రామకృష్ణాద్యవతార నామములు, మూర్తులు ఉద్భవించును. ఆ శరీరములు జీవ శరీరములవలె గార్మాధీనములుగాక తదతీతములు. ఈ మూర్తుల రూపములు నాటి దుష్టజన పాపకర్మముచేతను, సజ్జనపుణ్యకర్మ ఫలముచేతను జనితములుగావి, స్వీయ కర్మవిశేషములుగావు. వారికి స్వీయ కర్మయే లేదు. ఆ శరీరములు పంచభూతాత్మకములుగూడ కానేరవు. ఈ భావముల సమర్థింప, గీతాభాష్యమునుండి శంకరవచనములు గైకొనబడును. కృష్ణ పరమాత్మ జీవుల ననుగ్రహించుటకై మాయాబలమున బ్రతీతము. జీవులకు దేహాత్మభ్రాంతి గలదుగాని రామకృష్ణాదులకు శూన్యము. అందుచే వారు బోధకతీతులు. ఈ సర్వవిధముల నవతారములనబరగు రామకృష్ణాది

మూర్తులుగూడ ఉపాస్యులగుట గాంచనగును (వి. 148). ఈ విధముగ పురాణాంతర్గత విష్ణు శివాది భగవన్మూర్తులగాని, రామకృష్ణాది అవతార మూర్తులగాని, ఉపాసనాలక్ష్యమున నుంచుకొని, స్థూలముగ నుపాసన సాధించినచో, చిత్తము సుసూక్ష్మమై, అతి సూక్ష్మ ఉపాసనారంగమునకు గొంపోవును. క్రమక్రమముగ చిత్తము చంచలత్వమును బాసి, యేకాగ్రమై, జ్ఞానసాధన యోగ్యతను గడించును.

ఈ సూక్ష్మతరమైన ఉపాసనా విధానములుగూడ, నెవనికి మహా వాక్య విచారమును జేసియు, బుద్ధిమాంద్యాదుల వలన ప్రతిబంధకమేర్పడి అపరోక్ష జ్ఞానలబ్ధి గానేరదో, అట్టి వానికై, వీని శాస్త్రముపదేశించినది. ఉపాసనకాధారమైన ధ్యానము, విధి, పురుషేచ్ఛ, విశ్వాస, హఠములకధీనమై యున్నది. దానికి శాస్త్రవాక్యరూప విధి అవసరము. మరియు సాధకుని ప్రబలమైన యిచ్ఛయు నత్యావశ్యకము. అటులే విష్ణుసాలగ్రామ న్యాయమున, నా సాలగ్రామము శ్రీ మహావిష్ణువనియే విశ్వాసము బలీయముగ నున్నగాని, ఫలవంతము కానేరదు. పూర్వోక్త ఉపాసనములలో విష్ణువును, విష్ణువిగ్రహమూర్తిద్వారమున నుపాసింప, నిట సాలగ్రామాది చిహ్నముల ద్వారమున ధ్యానించుదురు. దీనిని ప్రతీకోపాసనమని నుడువుదురు. మూర్తిచిత్రమును ప్రతిమోపాసనమని యందురు. ప్రత్యక్షముగ నేమూర్తినిగాని చిహ్నమునుగాని నుంపక, వైకుంఠలోకాదికమున, శ్రీ మహావిష్ణు మొదలైన మూర్తుల రూపొందించి, ధ్యానించుటయు గలదు. ఇది శ్రుయానుసార ధ్యానమందురు. అచట అన్యరూపముచేత అన్యము యొక్క-

ధ్యానము అభావము వైకుంఠవాసి యగు విష్ణువు ప్రత్యక్షముగ లేడు. అది శాస్త్ర బోధితము. దానిని విశ్వసించి, చిత్రించి, ధ్యానించుట, యందు గాన నగును. ఈ విధముగ నీ ధ్యానోపాసనముల విధి, విశ్వాస, ఇచ్ఛ, హఠములు, నాలుగు నున్నగాని ఉపాసనము గానేరదు (వి. 204).

పై విధముగ మందబుద్ధిగలవాడు, ద్వైతవృత్తి నన్యదైవముల నుపాసించుటయేగాక, వేదశాస్త్రానుసారవిధియందు విశ్వాసముంచి, హఠ ముచే 'అహం బ్రహ్మాస్మి' అను వృత్తిస్థితి రూపముగా ధ్యానించుటను అహంగ్రహోపాసన అందురు. వానికిని గ్రమముగ జ్ఞానద్వారమున, మోక్షము లభ్యమానమగును (వి. 204).

ఈ విధమైన ప్రతీత ఉపాసనములలో శాస్త్రముల నతి ప్రాధాన్యము నొందియున్నది ప్రణవోపాసనము. ఇదియే ఓంకారోపాసనము నుజెల్లును. దీనియందు అహంగ్రహోపాసనా విధానమును జొప్పించి, మేళవించి, మాండూక్యాది ఉపనిషత్తులు ప్రబోధించియున్నవి. మరల నీ ప్రణవోపాస నము సగుణ నిర్గుణ పరముగా ద్వివిధమై, అపర పరబ్రహ్మముల ధ్యేయ ముగ నుంచి, తత్ఫలితముగ బ్రహ్మలోక ప్రాప్తియు, మోక్షమును బొంద జేయును. ఎనగ నిర్గుణోపాసన విధానమే మోక్షము నొందింపజేయును.

సగుణ ప్రణవోపాసనము గావించువానికి కామ్యముండుటచే, ఉపా సనా ఫలితముగ మోక్షమునుగాక బ్రహ్మలోకమునొంది, హిరణ్యగర్భ సమాన భోగముల నుపభోగించి, యంత జ్ఞానము నార్జించి, మోక్షమును

జొందును. అందుచే నీ సగుణ ప్రణవోపాసనము పరంపరగా మోక్షకారణ మగుచు, నిర్గుణోపాసనయందంతర్గతముగ నున్నది. నిర్గుణ ప్రణవోపాసన మున, ప్రథమతః నామరూపవిచారము గావింపబడి, వాని యభేద వృత్తి వివరింపబడి, సర్వసృష్టియు నోంకారమే అని వచింపబడినది. అంత నా ప్రణవము సర్వస్వరూపుడైన బ్రహ్మముతో నేకత ఘటిల్లునట్లొనరించి, అక్షర, బ్రహ్మములేకమొనర్పబడెను. అంత ఆత్మను, విశ్వ తైజస ప్రాజ్ఞ తురీయులుగ అవస్థా చతుష్టయము ననుసరించి విభాగించి, విరాట్టు హిరణ్యగర్భ ఈశ్వర బ్రహ్మములతో నన్వయించి, ఓంకారమున గల అ ఉ మ అర్ధమాత్రలతో సరిపోల్చి, ఏకస్వనము గావించెను. (వి.206–216). బ్రహ్మముయొక్క విరాడాది మూర్తి చతుష్టయమున దొలి మూడును అజ్ఞానజన్యములై, సగుణములై యుండ, చతుర్థమైన బ్రహ్మము పార మార్థికమైనట్లు, ప్రణవమున అ ఉ మలు వ్యావహారికములై, అపరములై యుండ అర్ధమాత్ర మాత్రము పారమార్థికము. అదేవిధముగ నన్వయించి, జీవుని జాగ్రత్స్వప్న సుషుప్తి గత, విశ్వ తైజసప్రాజ్ఞులు అజ్ఞాన కల్పి తులై యుండ. దురీయుడైన ఆత్మమాత్రము శుద్ధ పారమార్థికము అగు చున్నది. అదియే పరబ్రహ్మ స్వరూపము.

ఈ ఉపాసనా విధానము కడు సుసూక్ష్మమై, నిర్గుణమై, అంతరమై, విచారణా పూరితమై యుండుటచే, నది ఎల్ల రకులయుక్తముగాక నొక్క పరమహంసలకే అధికారము నొసంగు చున్నది. దీని ననుసరింప నంత

ర్ముఖులకే యధికారముగాని బహిర్ముఖులకు దూరము. గృహస్థులకు అధి కారము లేదని విశ్చలదాసు మరల వచించి, యీషణవిదూరచిత్తుడైన పరమ హంసకే సంపూర్ణ అధికారమని నొక్కి వక్కాణించి యున్నాడు (వి. 218).

చిత్తోపశమనమునకు పై ఉపాసనా మార్గములేగాక, సమాధ్యాది అష్టాంగములగూడ, విశ్చలదాసు ప్రతిపాదించి యున్నాడు. యమ, నియమ ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సవికల్పసమాధి యను అష్టాంగములు బంతజలినుండి అనువదింపబడెను. వీనిద్వారమున నిర్వికల్పసమాధియు బ్రాప్తించును.

అందు అహింసా, సత్య, అస్తేయ, బ్రహ్మచర్య అపరిగ్రహములు యమము నాబడును. శౌచ, సంతోష, తపస్సు, స్వాధ్యాయ, ఈశ్వర ప్రణిధానములు నియమముగ బరిగణింపబడును (వి. 317). ఆసనములనేక ములు వచింపబడునుగాని, అవి వేదాంత మార్గమునందు ఎక్కువ ఉప యుక్తములుగావని విశ్చలదాస తాత్పర్యము (వి. 318). అయినను ధ్యానా సనముల సిద్ధాసనము ప్రధానమని వచించి, ధ్యానాసనసిద్ధి గడింప నత డుద్బోధించెను. ప్రాణాయామము వివిధముగ నున్నది. కాని వామనాసిక ద్వారమున బూరకము, దక్షిణనాసికద్వారమున రేచకము. నిరోధరూప కుంభకము వాకొనబడినవి. ప్రణవ సహితమైనచో సగర్భకమనియు, రహి తమైన అగర్భకమనియు నందురు (వి. 319). విషయములనుండి సక లేంద్రియముల నిరోధించుట బ్రత్యాహారమనియు, నిరంతరాయ స్థితి నంతః కరణము నుంచుట ధారణ యనియు, అటులే నిరంతరాయ అద్వితీయ

వస్తువునందు అంతఃకరణము ప్రవాహగతి నుండుట ధ్యానమనియు నందురు (వి. 320).

ఈ విధముగ సప్తస్థితుల నధిగమింప, సమాధియు అనుభూత మగును. అది సవికల్ప నిర్వికల్పాత్మకముగ ద్వివిధము. అందునీ సవికల్పము, జ్ఞాతృజ్ఞేయ జ్ఞాన త్రిపుటిగలిగి, బ్రహ్మము నందు అంతఃకరణవృత్తి నిలచియుండు యగును. మరల నీ సవికల్పము శబ్దానువిద్ధమనియు, శబ్ద అననువిద్ధమనియు రెండు రీతులుగ నున్నవి. 'అహం బ్రహ్మాస్మి' అను శబ్దముచే మిశ్రితమైనది శబ్దానువిద్ధము నాబడ, నా శబ్దరహితము అననువిద్ధముగ వచింపబడెను. పై త్రిపుటి లేక, అఖండబ్రహ్మాకార వృత్తివి నిర్వికల్పమందురు (వి. 321).

ఈ సవికల్ప నిర్వికల్పములు కార్యకారణరూపములై, సవికల్ప సాధనా ఫలితముగ, నిర్వికల్పము సిద్ధించును. సవికల్పమున త్రిపుటి అన్య రూపములగాక బ్రహ్మాకారమున బ్రతీతమగును. నిర్వికల్పమున త్రిపుటి ప్రతీతము కానేరదు. అట్లగుట నిది సుషుప్తిగాక తద్భిన్నము. సుషుప్తిలో బ్రహ్మాకారవృత్తి లేమియు, నిర్వికల్పమున దత్కాలిమియు, వ్యత్యాసము. మరియు సుషుప్తిలో వృత్తి రహితాంతఃకరణము లేదు, నిర్వికల్పమున నది గలదు. అందుచే సుషుప్తి నిర్వికల్పము కానేరదు,

మరల నీ నిర్వికల్పము అద్వైత భావనారూపమనియు, అద్వైతా వస్థానరూపమనియు ద్వివిధము. అద్వైతభావనారూప అంతఃకరణవృత్తి సహితము ప్రథమము, ఆ యభ్యాస దార్ఢ్యమున నావృత్తి శాంతింప, వృత్తిరహితసమాధి ద్వితీయము. అనగా వృత్తి రహితమై, బ్రాహ్మిస్థితి

నుండుట యగును. పూర్వవృత్తులన్నియు [నిందు లీనమయి, తదాకారా కారితమై యుండును (వి. 323).

కాని యీ సమాధి సాధనము సులభముకాక, విఘ్న ఆటంకదాయకమై యుండును. లయ, విక్షేప, కషాయ, రసాస్వాదనములని వాని నామములు. అలసటచేగాని, నిద్రచేగాని, వృత్తి అభావముకాగ లయమునాబడును, అది నిద్రావస్థయే యగును. అట్లు విలీనవృత్తిని మేల్కొలిపి, నిద్రాదుల నిరోధించి, వృత్తిజాగరణము బాడుట గౌడపాదుడు వచించినట్లు చిత్తసంబోధనము. సంతతాభ్యాసమున లయమ స్తమించును. విక్షేపమున నంతరము గావింపబడు చిత్తము, బాహ్యవిషయ సాంగత్యాభ్యాసముచే లోపల స్వరూపానందము తక్షణము నొందని కారణమున, వెలికురికి అంతర్ముఖత్వభంగము గలుగజేయును. దాని నివారింప, బ్రహ్మాకారవృత్తి స్థిరమగు పర్యంతము అనుక్షణము, బాహ్యవిషయముల దోషదృష్టి నవలోకించి, అంతర్ముఖస్థితము గావింపవలెను. ఈ యత్నమును గౌడపాదుడు శమమని వచించెను. మూడవది కషాయము. ఇందు అనుభూత రాగాది సంస్కారములు కషాయము నాబరగును. ఇది అంతరము. విక్షేప నిరాసమునవలె విచటగూడ విషయదోష దర్శన, విమర్శనములచే గషాయము అంతరించును (వి. 328). ఇట్లు క్రమించి, బాహ్యాభ్యంతర వృత్తుల నరికట్టి, ఏకాగ్రత గడింప, బూర్వానుభూత దుఃఖశ్రమాదులభావమగుటచే, నొకవిధమైన వ్యతిరేక ప్రశాంతమనుభవమగుచున్నది. దుఃఖనివృత్తి యానందము కాదుగదా! దుఃఖవిరామము వ్యతిరేకానుభూతి యగును కాని

ఆనందము అనుకూలానుభూతి గదా! సామాన్యముగ చిత్తము రెంటినేకముగ భావించి, దుఃఖనివృత్తినే ఆనందముగ నెంచి, అంతే యుండ నిచ్చగించును. బ్రహ్మానుభూతిగల సమాధికి యీ నివృత్తి యాటంకము. అనగా దుఃఖనివృత్తి యను వ్యతిరేక స్థితితోడ, బరమానందప్రాప్తి నాబడు అనుకూలస్థితి ఏర్పడవలెను. ఆ పరమానందప్రాప్తియే సమాధి నాబడును. అందుచే నీ సమాధ్యనుభూతి బొందునంతవరకు ప్రారంభముతో ననుసరించుచు, సదా ఆటంకముల గలుగజేయుచున్న యీ చతుర్విధ అంతరాయముల నివారింప, గడు జాగ్రత్త పడవలయునని విజ్ఞుల హెచ్చరిక (వి. 329).

ఇట్లు ఉపాసనారంగమున శ్రమించి, ప్రతిమ, ప్రతీకములతో బ్రారంభించి, క్రమముగ చిత్తచాంచల్యముల నడంచి, యోగసాధనమునుగూడ నవసరము ననుసరించి, చిత్తవిరోధమును గ్రమ సక్రమపద్ధతుల గావించి, సవికల్ప నిర్వికల్పముల సాధించి, అంత సుసూక్ష్మస్థితినున్న అద్వైత సాధనమునకు సాధకుడు గడంగవలయును.

## జ్ఞాన సాధన

'ఓయి శిష్యుడా! రాగమును బరిత్యజించి, లోభమును ఓడించి, ద్వేషమును మర్దించి, మారుని దూరము చేయుము. రాగాదుల గ్రహణముచే సర్వ రాజస, తామస వృత్తులు నశింప జేయుము. అవి జ్ఞాన విరోధములు' అని శిష్యుని, గురువు జ్ఞాన సాధనోన్ముఖము గావింప ఉద్బో

ధించియున్నాడు (వి. 281). ఈ జ్ఞానసాధనములు వివేక వైరాగ్య, శమాదిషట్కము, ముముక్షుత్వములని నాలుగుగ వచింపబడును. అందు ప్రథమమైన వివేకము ప్రధానము. దాని స్థిరత్వము సాధించినచో, నుత్తర వైరాగ్యాదికము సిద్ధించును.

గ్రంథ మంగళాచరణ వాక్యసందర్భమున, ననుబంధ చతుష్టయముల బ్రతిపాదించి, అందు బ్రథమతః అధికారి నిర్ణయము గావించి యుండుట బూర్వము గాంచియున్నారము. సాధన చతుష్టయముల గలిగి నగాని విచారసాగరాది జ్ఞాన గ్రంథముల నధ్యయనింప నర్హతలేదని తీర్మానింపబడినది (వి. 5). అట బ్రస్తావింపబడిన చందము మల, విక్షేపముల గర్మోపాసనలచే నడంచి, ఆవరణదోష పరిహారార్థమై చిత్తమును నున్ముఖత్వమున గావించినవాడు, ప్రథమతః యీ సాధన చతుష్టయముల యోచించి, తనయందావిర్భవింపజేసికొని, జ్ఞానసౌధ ముఖద్వారమును డాయవలయును. సాధవ సంపన్నునికిమాత్రమే ఆ జ్ఞానసౌధ ద్వారములు తెరువబడునుగాని, అన్యులకు గాదని సర్వ వేదాంత సార సంగ్రహము.

వివేకము అనుటతోడ ఆత్మానాత్మవివేకమానియే గ్రాహ్యము. ఆత్మ అవినాశియైయుండ, అనాత్మ వ్యత్యస్తమై వినాశిగనున్నది. సూక్ష్మముగ నీ దృష్టిని వివేకమనియు, జ్ఞానమనియు నందురు. ఈ భావము స్థిరమైనచో, వైరాగ్యాదికము వెనువెంట ననుసరించును (వి. 6). వివేకాదులు నాలుగు, శ్రవణ మనన నిదిధ్యాసములు మూడు, 'తత్త్వం' పదార్థ శోధనము

అను ఎనిమిదియు జేరి, శాస్త్రముల నంతరంగ సాధనములు నాబడును (వి. 11)· వీనికి వ్యతిరేకమైన యజ్ఞాది కర్మలు బహిరంగములగును. పూర్వగ్రంథమురీతి బహిరంగములు, అంతరంగములకు మార్గమును సున్నితము గావించునని యెరుంగవలెను. ఏ సాధనము శ్రవణముద్వార మున జ్ఞానసిద్ధి నొసంగునో అది అంతరంగమనియు, దద్వ్యతిరేకము బహి రంగమనియు దాత్పర్యము. కాని యీ బహిరంగ సాధనములచే నంతఃకరణ శుద్ధిమాత్రము కలుగును· అందుచేత నివి జ్ఞానమార్గగాములు అని వచింప బడును·

మరియు నీ వివేకాదిక చతుష్టయము, ఉత్తరప్రాప్త శ్రవణాదిక చతుష్టయమునకు బాహ్యమై, బహిరంగముగగూడ వాకొనబడుచున్నది. వివేకాదికము శ్రవణాదికముద్వారమున జ్ఞానహేతువు కాననగునుగదా! ఈ దృష్టిచే శ్రవణాదికము అంతరంగమై, సాక్షాత్ జ్ఞానకారణముగ నుండు టచే, ప్రథమతః వివేకాది చతుష్టయము నినుమంత విచారించెదముగాక!

ప్రపంచమున విషయములతోగల సంబంధముల బరిశీలించి, అందలి సత్యాసత్యముల నిర్ణయించి, వాని నస్థిరములు,ననిత్యములు, వినాశినులుగ దీర్మానించి, వానికంతరమై, అతీతమైయున్న ఆత్మ నిత్యమనియు, సత్య మనియు నిశ్చయమునకేతెంచుట వివేకము నాబరగును (వి. 6). విషయ ములనుండి ప్రాప్తమైన సుఖము అనిత్యము. ఆ క్షణిక సుఖప్రాప్తికి బూర్వము తదిచ్ఛాది దుఃఖముండును. అనంతరమునగూడ విషయసుఖ జనిత వ్యాధి దుఃఖము అవశ్యముండును. అనుభవకాలమునగూడ వ్యయ

భయమువలన దుఃఖముసైతమున్నది. కాన నీ విషయసుఖమన బరగునది దుఃఖరూపమేగాని, సుఖలేశమైనను గాదని గుర్తెరుంగుటయే వివేకము అగును (వి. 42). అంతియగాక, విషయాదిక సుఖము బుద్ధిచాంచల్యమును జనింపజేసి, స్వస్వరూపానంద లేశమునైన జవిజూడనివ్వక, విషయ సుఖ పరంపరలో గంతులు వేయించుచు, సదా చంచలమున, నిత్య అశాంతిలో జీవుని నుంచును. అందుచే విషయాదుల నైజమును గుర్తించి, ఆత్మానందానుభూతికి భంగకారణములని తెలిసికొనుటయే వివేకము (వి. 73).

పై విధయగ విషయములగల దోషపరిశీలన, నిర్ణయములచే, వానిపై నయిష్టత పెంపొంద, వాని కాకమలమువలె ద్యజించుట వైరాగ్యమనబడును (వి. 7). ఆ వైరాగ్యలక్షణముగూడ బ్రధానము. విషయ రాగము అజ్ఞానికి బంధహేతువై యొప్ప, విషయవిరాగము మోక్షధామ సంధాతయై, జ్ఞానిని దరింపజేయును. తాత్కాలిక వివేకముచే అజ్ఞానికి గూడ వైరాగ్యము క్షణకాలమేర్పడినను, అది బ్రయోజనకరము కానేరదు. విషయదోషముల గ్రహించి, ఆ విషయముల మిథ్యాబుద్ధి దిలకింపగలిగి నప్పుడే, అది దృఢవిరాగముగ నగును. కేవలము దోషదృష్టిచే గలుగు విరాగము స్థిరాగముగాక, మరల విషయాపేక్షల గ్రుంకజేయును. అందుచే నా దోషదృష్టిని స్థిరముగావించి, విచారణముచే విషయముల మిథ్యారూపములనుగ నిర్ణయించుకొనివగాని. వైరాగ్య స్థైర్యము ఏర్పడజాలదు. (వి. 283).

వైరాగ్యము స్థిరత్వము నొందిన, యంత శమాదిషట్కముదయించును. శమ, శ్రద్ధ, సమాధాన, ఉపరతి, తితీక్షలు యీ శట్కము. దోషదృష్టి జూడబడిన విషయములపైకి, మరల చిత్తమును బోనీయక బదిలపరచుట శమమందురు. ఇంద్రియముల బాహ్యవిషయములనుండి మరలించి, అంతరమున కాకర్షించుట దమము అగును. వేద, గురువచనముల భక్తి విశ్వాసముల నుంచుట శ్రద్ధ యగును. మనస్సును ఏకాగ్రముగ నుంచుట సమాధానమనబడును. వైరాగ్యముచే విషయముల ద్రోసివను, అప్రయత్నముగ సంప్రాప్తవిషయముల దిరస్కరించుట ఉపరతి యందురు. శీతోష్ణ క్షుత్పిపాసాది ద్వంద్వముల సహించుట తితీక్ష యని వచింతురు. ఈ షట్కము వేరు వేరుగ నున్నను, అన్యోన్యాపేక్షకములగుటచే నొకే సాధనగ బరిగణించి, షట్కముగ నుంచిరి. అట్లు కానిచో, నీయారింటి విడదీసినచో, వివేక విరాగ ముముక్షుత్వములతో నీ షట్కము జేరి, సాధన నవక మేర్పడును. అట్లును గొందరు లెక్కించినను, ప్రాచీన కాలమునుండి సాధన చతుష్టయమునే పెద్దలు గణించుచున్నారు (వి. 9).

పూర్వోక్త లక్షణములచే గణించిన వివేక దృష్టిచే, శాంత వైరాగ్యములచే, ననర్థములై ఆనందభంగదాయకముల నివృత్తికొరకును, పరమానంద ప్రాప్తికొరకును ఆకాంక్షించుట ముముక్షుత్వము అందురు. ఇదియు తీవ్ర మందాది విభేదముచే ద్వివిధముగ నున్నది. మంద ముముక్షుత్వము సర్వజీవులకు సర్వానుభవములలో నంతర్గతముగ నున్నను, గ్రమన్యాయమున వివేకాదికముల, శ్రవణాదుల, యభ్యాస ప్రాబల్యమున గ్రమముగ ముముక్షుత్వము తీవ్రమగును. ఈ విధముగ, నంతరంగ సాధ

నములని వచింపబడిన వివేకాద్యష్టకమును మరల విభజించి, ప్రథమ చతుష్టయమును బహిరంగముగ జూచి, వాని స్థూలముగ జూచియున్నా రము. వీనికంటె సూక్ష్మమై అంతరంగ సాధనములనబరగుచున్న శ్రవణ, మనన నిదిధ్యాసన, మహావాక్య పరిశోధనముల నిక జూచెదముగాక!

## శ్రవణాదులు

శ్రవణాది త్రయముకంటె మరల, 'తత్త్వమస్యాది' మహావాక్య విచారణము అంతరంగ సాధనముగ బరిగణింపబడి, శ్రవణాదుల బహి రంగములగును. కాని శ్రవణాదులు, 'తత్త్వం' పదార్థ శోధనమునకు సాధనమగుటచే నివియు ప్రధానములే. యుక్తిసహాయమున వేదాంతవాక్య తాత్పర్య నిశ్చయమును శ్రవణమందురు. ఇచట యుక్తిచేసిన షడ్లింగ విచారణముగ నిశ్చయము. ఉపక్రమోపసంహారము, అభ్యాసము, అపూ ర్వత ఫలము, అర్థవాదము, ఉపపత్తి యను ఆరును లింగములందురు. ప్రకరణారంభమున నే యర్థము ప్రతిపాదింపబడినదో, ఆ యర్థమునే ప్రక రణాంతమున వచించుటలో ఏకరూపత యుండుట, ఉపక్రమోప సంహార ముల ఏకరూపత యందురు. చెప్పదలచిన యర్థమును దృఢ బోధకొరకు, మరల మరల వచించుట అభ్యాసము అగును. సామాన్య విషయముల గాక విశేషత్వముగలదాని వచించుట అపూర్వత యనబడును. విచారణా ఫలితము ఫలము అని యందురు. ఏ వచనములకు ప్రత్యక్షార్థముపై

తాత్పర్యము లేక అన్యార్థమునందు గలదో దాని అర్థవాదమందురు. అర్థ స్ఫురణముకొరకు అనుకూల దృష్టాంత పూర్వకముగ వివరించుట ఉపపత్తి యగును. ఇట్లు, యీ యారు పద్ధతుల వాక్య తాత్పర్యమును విచారించు టయే శ్రవణకార్యమునందు గల ప్రత్యేకత.

అద్వైత గమ్యమైన జీవబ్రహ్మాభేద తాత్పర్యమునకు నుపయుక్తము లైనవియు, వాని విభేదవాదమునకు నిరోధకమైన యుక్తులచే నద్వితీయ బ్రహ్మచింతనము గావించుట మననమగును. అట్లు విచారించి, అనాత్మా కారవృత్తి పరిత్యాగము గావించి, అనవచ్ఛిన్నముగ బ్రహ్మాకారవృత్తిని నిలుపుట నిదిధ్యాసనము నా వచింపబడును. ఈ స్థితి స్థిమిత మగుటయే సమాధి యగును. అనగా నిదిధ్యాసనాభ్యాసము క్రమముగ సమాధిలబ్ధి నొసంగును అని గ్రాహ్యము (వి. 13).

ఈ శ్రవణాదిక త్రయము సాక్షాత్సాధనముగ, జ్ఞానోపలబ్ధికి ఉప యుక్తము కానేరదు. అయినను బుద్ధిలోగల అసంభావన యనబడు సంశ యమును, విపరీతభావన యనబడు విపర్యయమును, నిర్మూలించు శక్తిని గలిగియుండును. ప్రథమితః ప్రమాణ సంబంధములైన అసంభావమును శ్రవణముచే నివారింపబడును. అనగా వేదాంతవాక్యములు, అద్వితీయ శుద్ధ బ్రహ్మ ప్రతిపాదకములా, కావా అను సందేహము, ప్రమాణ వాక్యముల గల్గుట ప్రమాణాసంభావన యగును. అది గురుసన్నిధానమున, నంతత వేదాంత శ్రవణముచే నిరాసమగును. మననముచే బ్రమేయాసంభావన నశించును. జీవబ్రహ్మముల భేదాభేద సత్యత్వములగూర్చిన శంక, ప్రమేయా

సంభావన యందురు. దేహాదికము సత్యమనియు, జీవబ్రహ్మములు అన్యము లని భావించుట యను విపరీత భావన, నిధిధ్యాసనముచే నివారించును. ఈ విధముగ సంశయ, అసంభావన, విపరీతభావనములు నా అనర్థ భావనా త్రయము, శ్రవణ మనన నిదిధ్యాసనములచే నివృత్తినొంది, జ్ఞానమార్గ మును సున్నితము గావించును, అందుచే నీ శ్రవణాదులు సాక్షాత్ జ్ఞాన హేతువులుగాక పరంపరగా నగునని మున్ను వచింపబడియున్నది(వి.14).

## మహావాక్య విచారణము

జ్ఞానార్జనమునకు, వేదాంతవాక్య శ్రవణమే సాక్షాత్సాధన భూతము. ప్రత్యేకముగ జీవుని, బ్రహ్మమును బోధించు వాక్యములు అవాంతరవాక్య ములనియు, జీవబ్రహ్మముల యైక్యతను ఉపదేశించు వచనములు మహా వాక్యములనియు, వేదాంతవాక్యములు ద్వివిధములుగ నున్నవి. ఈ ద్వివిధ వాక్యములచే బరోక్ష, అపరోక్షజ్ఞానములు గలుగును. అనగా అవాంతర వాక్యములు పరోక్షజ్ఞానమును నార్జింపజేయ, మహావాక్యములు అపరోక్షజ్ఞానమును బ్రసాదించుచున్నవి. బ్రహ్మము గలదని గ్రహించుట మాత్రము నొసంగి అవాంతరవాక్యములు పరోక్షజ్ఞానమును గలుగజేయ, "బ్రహ్మము నేనే" అను జీవబ్రహ్మాభేదమును జూపి, మహావాక్యములు అపరోక్ష జ్ఞానమును సిద్ధపరచుచున్నవి. అపరోక్షజ్ఞానము యింద్రియజన్య ముగా నగుట కవసరములేక నిచట శబ్దముద్వారమున నగును. బ్రహ్మము

యింద్రియముల కవిషయి యగుటచే, ఇంద్రియాపేక్షిత ప్రత్యక్షజ్ఞానముచే బ్రహ్మము ప్రత్యక్షము కానేరదు. అయినను దశము చారిత్రమున 'త్వం దశమోసి' నీవే దశముడవు అని తెలుపబడినతోడనే ఆ శబ్దమహిమచేత మాత్రముననే యింద్రియ సంబంధ ప్రత్యక్ష లేశములేకయే, ఆ వాక్య శబ్ది జ్ఞానమాత్రమున దశమ జ్ఞానము ప్రత్యక్షమగుచున్నది. అదియే యపరోక్షము. స్వేతరములగు 'అది, వాడు, ఆ' మొదలగు శబ్దములు పరోక్ష జ్ఞానమును మాత్రము గలిగింప, ఈ 'ఇవి, నీవు నేను' అను శబ్దములు ప్రత్యక్షము నుద్భవింపజేయును. అదియే అపరోక్షము నాబడుచున్నది. ఈ పరోక్షాపరోక్షజ్ఞాన విచారణము వృత్తి ప్రభాకరమున, నింక జటిలముగ అష్టమ ప్రకాశమున గావింపబడియున్నది. అందుచే స్వేతరవాక్యములు పరోక్షజ్ఞానమును కలిగింప, 'త్వం బ్రహ్మ' అను వాక్యశబ్దము అచార్యుల ద్వారమున, కర్ణముల సోకు క్షణమున 'అహం బ్రహ్మాస్మి' అను అపరోక్ష జ్ఞానము శ్రోత కగును (వి.15). కాని గొందరు వాక్యశ్రవణము పరోక్షజ్ఞానమును జనింపజేయ, నంత మననిదిధ్యాసనాదులచే నపరోక్షజ్ఞానము సిద్ధించునని తలంచెదరు. వాక్య శ్రవణము పిమ్మట, వృత్తి ప్రవాహరూపమున నుండ నపరోక్షత్వము సిద్ధించునని వారి మతము. శ్రవణముచే పరోక్షత్వము మాత్రము జనించునని వారి విశ్వాసము వృ. 304). కాని నిశ్చలదాస సిద్ధాంతమున వాక్యజన్య జ్ఞానానంతరమునందు ప్రసంఖ్యానము అపేక్షితము గాదు. ఒక్క మహావాక్యము చేతనే, శ్రవణమాత్రముననే, అద్వైత బ్రహ్మ సాక్షాత్కారరూప అపరోక్షజ్ఞానము గలుగునున్నదని అతని మతము (వృ. 306). అవ్యవహితమైన, అనగ దగ్గరగల వస్తువుయొక్క అస్తి

త్వమును బోధించు వాక్యము పరోక్షజ్ఞానము గలుగజేయుచుండ, ఆ ఎదుటి వస్తువును 'అహంతా, తత్త్వా, ఇదంతా' రూపముల చేత నేను నీవు ఇది రూపములచే నెరిగింపబడ వెంటనే పరోక్షజ్ఞానాపేక్షలేకయే నపరోక్ష జ్ఞానము సిద్ధించునని తాత్పర్యము. ఇక బ్రహ్మము, సర్వ జీవులకు అత్యంతావ్యవహితము కావున, మహావాక్య శ్రవణముచే బరోక్షజ్ఞానముగాక నపరోక్షజ్ఞానమే గలుగునని ముఖ్యముగ గ్రాహ్యము.

## లక్షణా వృత్తి

కాని, వాక్యార్థ గ్రహణము, తలంచునంతటి సులభసాధ్యము కానేరదు. శబ్దశ్రవణమున నా పదమునకు, తత్సంబంధమైన అర్థమునకు గల వృత్తికారణముగ, నా పదమునకు ఆ అర్థము స్ఫురించుచున్నది. ఆ వృత్తియైనను శక్తిరూపవృత్తియనియు, లక్షణారూపవృత్తి యనియు ద్వివిధమై యున్నది. ఏ పదమునకు ఏ యర్థమునందు సామాన్య సంబంధముండి, తదర్థ స్ఫురణమును గావించునో, దాని శక్తివృత్తి యందురు. అప్పుడు ఆ పదమునకు ఆ యర్థము, వాచ్యము నాబడును. దానినే శక్యమనియు నందురు (వృ. 34). అట్లుగాక పద శ్రవణమున శక్తివృత్తిచే అర్థావబోధనముగాక, శక్యముతో అనగా అర్థముతో సంబంధము గలిగి, పరంపరా సంబంధమున నర్థస్ఫురణము గావించునది లక్షణావృత్తి యనబడును. అందుచే, ఎచ్చట పదమునకు, సాక్షాత్సంబంధరూప శక్తివృత్తి

సంభవించుట లేదో, ఆచట పరంపరా సంబంధరూప లక్షణావృత్తి అంగీకారము (వృ. 39).

మరియు వాక్యార్థబోధనమ్మునకు గౌణవృత్తి, వ్యంజనావృత్తియు గలవు. 'సింహో దేవదత్తః' అను వాక్యమున, సింహ శబ్దము గౌణవృత్తిచే బురుషునకన్వయించుచున్నది. ఇచట సింహ శబ్దమునకు శక్యమై శూరత్వాదికగుణకము ఆ శబ్దమునకు అశక్యమైన దేవదత్తునన్వయించి, సింహ శబ్దమునకు గౌణీవృత్తి గలుగజేయుచున్నది. అటులే వ్యంజనావృత్తియు నగును. 'సూర్యోఽస్తంగతః' సూర్యుడస్తమించుచున్నాడు అను వాక్యమున శక్తివృత్తివలన గలుగు అన్వయార్థము సామాన్యము కాని, ఆ సమయమునకు వివిధ కార్యమగ్నత బొందవలసిన వారికై, ఆ వాక్యముచ్చరింపబడుటచే నచట శక్తి ననుసరించు సామాన్యార్థము ప్రధానముగాక, ఆ యా కార్యనిమగ్నతకొరకు హెచ్చరిక అన్వయమున స్ఫురించుచున్నది. దీనిని వ్యంజనావృత్తి యందురు. ఈ రెండువృత్తులుగూడ లక్షణలో నంతర్గతముగ గొందరి తాత్పర్యము (వృ. 40).

వీని యన్నింటిలో లక్షణావృత్తి కడు ప్రధానమై, వేదాంత వాక్యార్థ అన్వయములకు ముఖ్యమై యుండుటచే, శాస్త్రముల బహుళముగ బ్రయోగింపబడి, వివరింపబడి, అన్వయింపబడి యున్నది. దాని గ్రహించెదముగాక!

పదముయొక్క అర్థముతో సంబంధము వృత్తి యని మున్నె వచింపబడినది. పదమునకు ఆ యర్థస్ఫురణము ఈశ్వరేచ్ఛచే నేర్పడుటచే, నా యర్థమునకు శక్తి యందురనియు గ్రహించితిమి. పదమునకు అర్థావ

బోధ సామర్థ్యమునవే శక్తి యని వచింతురు. అనగ ఘట శబ్దమునకు అర్థముగ ఘటాకృతి స్ఫురించునుగాని పటము గానేరదు. అందు ఘట మను యర్థమును స్ఫురింపజేయు సామర్థ్యము 'శక్తి' యనబడినది. అట్లుగాక పదమునకు యే యర్థముయొక్క జ్ఞానము, శక్తివృత్తిచే గానే రదో, లక్షణావృత్తిచే నగునో, దాని లక్ష్యార్థ మందురు. శక్తివృత్తిచే నయినచో శక్యము, శక్యార్థము, వాచ్యము, వాచ్యార్థము అని వివిరరీతుల వచింపబడుచున్నది. అందుచే, నెక్కడ శక్యార్థమునందు వక్తకు దాత్ప ర్యము గానమో అక్కడ లక్షణావృత్తిని అంగీకరించి, పదమునకు లక్ష్యార్థమును అంగీకరింపవలెను (వృ. 39).

ఈ లక్షణ, జహల్లక్షణ అజహల్లక్షణ జహదజహదల్లక్షణ యని త్రివిధము. జహదజహల్లక్షణను భాగత్యాగలక్షణ యనియు వాకొందురు. ఎచట వాచ్యార్థమును సంపూర్ణముగ విడిచి, వాచ్యార్థసంబంధియొక్క గ్రహ ణము చేయబడునో అచట జహల్లక్షణ చెప్పబడినది. ఎట్లన 'గంగాయాం ఘోషః' అను వాక్యమున, గంగలోని పల్లె అనుచోట, గంగా పదమునకు వాచ్యార్థము జలప్రవాహమైనచో, నందు పల్లె యుండుట అసంభవము. అందుచే నా గంగాశబ్దమునకు జలప్రవాహమను వాచ్యార్థమును త్యజించి, అన్వయమై, వాచ్యసంబంధియైన తీరమును గ్రహించుట, జహల్లక్షణ యగును. వాచ్యమును 'జహతి' త్రోసి పుచ్చి, వాచ్య సంబంధమును గ్రహించుట లక్షణగాన, నీ రెండు నేకమై జహల్లక్షణ యయినది. వాచ్యార్థ సహితమైన వాచ్యార్థ సంబంధియొక్క గ్రహణము ఏ పదముచే నగునో,

అచట హాజల్లక్షణ వచింపబడును. 'శోణో ధావను' రక్తము పరుగెత్తు చున్నది అను వాక్యమున, శోణ పదమునకు వాచ్యార్థమైన రక్తము గ్రహింపబడ, రక్తవర్ణముగల అశ్వము స్వీకరింపబడినది. అచట శోణ పదమునకు, రక్తవర్ణ అశ్వమునకు అజహల్లక్షణ ఏర్పడినది. ఆ రక్తమైన గుణమునకు, గుణియైన గుర్రముతో దాదాత్మ్య సంబంధమేదిగలదో అది లక్షణకాగ, రక్తముయొక్క వాచ్యము త్యజింపబడక, అధికార్థము గ్రహించుటచే అజహతి యగుటచే అజహల్లక్షణ ఏర్పడినది. ఇచట వాచ్యత్యాగము గాక, అధికార్థగ్రహణము ప్రధానము. అటులే ఎనట పదముయొక్క వాచ్యార్థమునుండి ఒక భాగముయొక్క త్యాగము, ఒక భాగముయొక్క గ్రహణము గలిగిన అది జహదజహల్లక్షణ యనియు, భాగత్యాగలక్షణ యనియు నాబడినది. "సోయం దేవదత్తః" అతడే యీ దేవదత్తుడు అను వాక్యమున, బూర్వకాల దూరదేశమున్న "సః" అని వచింపబడి, వర్తమానము సమీపతశమున గలవాడు "అయం" అని తెలుపబడినది. అందుచే భూతకాలిక పరదేశస్థుడైన, ఏ దేవదత్తుడు గలడో, వాడే సమీప దేశమున ప్రస్తుతకాలమున నున్న దేవదత్తుడు అని అర్థము. అతీత కాలమునకు, వర్తమానమునకు విభేదము గలదు. అన్య దేశమునకు, ప్రస్తుత దేశమునకు వ్యత్యాసము గలదు. అవి వ్యతిరేకములు. అందుచే నీ "సః" "అయం" పద ద్వయమున గల దేశ కాల వాచ్యమైన, దేశ కాలముల ద్రోసి, ఒక్క దేవదత్తుని మాత్రము గ్రహించుట యిందు గానవగును, ఒక యంశము త్యజింపబడి, ఒక యంశము గ్రహింపబడియున్నది.

ఇదియే జహదజహల్లక్షణ యనియు, భాగత్యాగ లక్షణ యనియు శాస్త్రముల, బహుముఖముల వివరింపబడి యున్నది (వి. 206).

పై వచింపబడిన లక్షణా త్రయమున, జహల్లక్షణగాని, అజహల్లక్షణగాని, మహావాక్య విచారణమున నన్వయింపవు. "తత్త్వమసి" అను మహావాక్యమున, మొదట "తత్" పదార్థమును చూచెదము. సర్వ శక్తిమంతుడు, సర్వజ్ఞుడు, వ్యాపకుడు ఈశ్వరుడు, స్వతంత్రుడు, పరోక్షుడు, మాయి అను ఈశ్వర చైతన్యము "తత్" పదమునకు వాచ్యార్థము(వి.297) అటులే పై ధర్మములకు విభిన్నధర్మములు గల జీవచైతన్యము "త్వం" పదమునకు వాచ్యార్థము. ఇట్టి పరస్పర వ్యత్యస్త లక్షణములు గల ఈశ్వర జీవులకభిన్నత్వ ప్రతిపాదము యీ వాక్యమున గావింపబడినది. ఈశ్వరుడు ఆ దృష్టికి జీవుడు గాడు. అటులే జీవుడు ఈశ్వరుడునుగాడు. అయినచో నిక నన్వయమెట్లు? వాచ్యార్థమున అర్థము సమన్వయింపదు. అందుచే, నిచట లక్షణ నన్వయించి అర్థమును గ్రహింపనగును. జహల్లక్షణ నంగీకరించినచో, వాచ్యత్యాగము గావింపవలెను. అనగ తత్పదము యొక్క వాచ్యార్థమైన చైతన్యమును బరిత్యజించుచో, దానికి విభిన్న అసత్, జడ, దుఃఖముల స్వీకరించినచో, నిక బురుషార్థసిద్ధి ఎట్లు? అందుచే నా జహజల్లక్షణ యిట జెల్లదు. అజహల్లక్షణ నన్వయించెదమా యనిన, నట వాచ్యార్థమును సమగ్రముగ గ్రహించి, యింక నధికార్థమును గ్రహింపవలెను. కాని మహావాక్యమున వాచ్యార్థములు పరస్పర విరోధములు. అందుచే వాని యథాతముగనుంచి, అధికార్థమును గ్రహింపనవకాశము

లేదు. కాన నహజల్లక్షణకూడ నీ మహావాక్య అర్థగ్రహణమున నవ్వ యింపదు. అందుచే దృతీయమైన భాగత్యాగలక్షణ అంగీకార్యము. తత్, త్వం, పదముల వాచ్యములైన ఈశ్వర జీవులకు బరస్పర వైరుధ్యము గోచరముగదా! ఆ వైరుధ్య పరిత్యాగ మొనరించి, ఈశ్వర జీవులకు అధిష్ఠానముగనున్న చైతన్యమునుమాత్రము స్వీకరించుట ఉచితము. అట్లు గావించుటయే భాగత్యాగలక్షణ యగును. జీవేశ్వరులకు ఎట్టి విభేదముల, గ్రంథములు వాకొనుచున్నను, మహావాక్య అన్వయమునకు నీ భాగత్యాగ లక్షణయే శరణ్యము.

మాయయు, మాయయందాభాసయును, మాయాధిష్ఠానచైతన్యము మూడునుగూడి, సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వ సర్వవ్యాపకత్వాది లక్షణములు గల ఈశ్వరుడు 'తత్త్వమసి' వాక్యమున దత్పద వాచ్యార్థము. అటులే వ్యష్టి అవిద్యయు, దానియందాభాసయు, తదధిష్ఠాన చైతన్యము మూడును గూడి ఈశ్వరధర్మ వ్యతిరేకలక్షణములుగల జీవుడు 'త్వం' పదమునకు వాచ్యుడు. ఇట్టి విరుద్ధ లక్షణలక్షితులైన యిరువురికి, అభేదము బోధింప బడియున్నది. వాచ్యార్థమున బ్రస్ఫుట వ్యతిరేకత గాననగును. అందుచే నిట ఆభాససహితమగు మాయను, సర్వజ్ఞత్వాది ధర్మముల ద్యజించి కేవల చైతన్యమును, తత్పదమునకు భాగత్యాగలక్షణ గావింపవలెను. అదేవిధముగ నాభాససహిత అవిద్యాంశమును, తత్కల్పిత కించిజ్ఞత్వాది లక్షణముల బోనాడి, తదధిష్ఠాన చైతన్యాంశమును స్వీకరించి, 'త్వం' పదమునకు భాగత్యాగలక్షణ చేయవలెను. అందుచే వ్యత్యస్తాంశములు పరిత్యజింపబడి,

అధిష్ఠానాంశమైన చైతన్యమునే గ్రహించుటచే, మహావాక్యార్థ స్ఫురణము నక్రమరీతి నగుచున్నది. ఇదేవిధముగ 'అయమాత్మా బ్రహ్మ' అను వాక్యమున 'ఆత్మ' పదమునకు, 'బ్రహ్మ' పదమునకు నీశ్వరుని అన్వయించి, జహదజహల్లక్షణను జోడించి, అర్థము గ్రహింపవలెను. 'అహం బ్రహ్మాస్మి' వాక్యమున "అహం" పదము జీవపరము, "బ్రహ్మ" పదము ఈశ్వర పరముగ గ్రాహ్యము. అటులే "ప్రజ్ఞానం బ్రహ్మ" యందును అన్వయించుకొనవలెను. ఈ విధానము మహావాక్యార్థ గ్రహణమున మాత్ర మేగాక, సత్ జ్ఞానానంద ధర్మముల బోధించు అవాంతర వాక్యములగూడ ఈశ్వరత్వ జీవత్వ ధర్మముల ద్యజించి, తత్తదధిష్ఠాన చైతన్య గ్రహణమును, భాగత్యాగలక్షణద్వారముగ గావింపవలయును. శుద్ధబ్రహ్మము ఏ పదమునకు వాచ్యము కాకున్నను. విశిష్టమైన సుగుణ బ్రహ్మమునకు అనేక వాచకములు అనగా పదములు గలవు! అన్నింటి బై విధాన నన్వయింపవలెను.

ఈ విధముగ జ్ఞానసాధనములలో, నంతరంగములనబరగు శ్రవణాదుల ఫలరూపమైన, పరమాంతరంగ సాధనమైన మహావాక్య విచారము గావించి, లక్షణచే నన్వయించి, "అహం బ్రహ్మాస్మి" యని స్థిరత్వమున నుండుటయే అద్వైతసిద్ధాంత తాత్పర్యము. ఈ విధముగ జగత్తునకు ఉపాదానకారణమైన అజ్ఞానము, కర్మాది సాధనములగాక, అజ్ఞానమునకు వ్యతిరేకమైన జ్ఞానముచేతనే నిరాసమొందును (వి· 106). చివరకు అనగ అవిద్యానివృత్తితో నింతవరకు నా అజ్ఞానము నడంప, దీర్ఘకాలము శ్రమించిన త త్ఃజానముగూడ నదృశ్యమగును. బురదనీట నింపబడిన చిల్లగింజ

గంధము, ఆ వృత్తితో దానును జలమును వీడి క్రిందికి దిగునుగదా! (వి. 301.

ప్రథమమున ఆకాశ చతుష్టయమును దెలిపి, దార్ష్టాంతికమున బ్రహ్మ కూటస్థ ఈశ్వర జీవచైతన్యములు భేర్కొనబడి యున్నవి. అందు జీవచైతన్యమైన అభాసరూపుడు, పైవిధాన సాధనల బ్రవేశించి, క్రమమున మహావాక్యార్థ గ్రహణము గావించి యున్నాడు. అయినచో నీ 'అహం బ్రహ్మాస్మి' అను జ్ఞానము అభాసరూపుడైన జీవునికా, లేక తదధిష్ఠానమైన కూటస్థునికా అను సంశయము వొడమును. కాని ఆ జ్ఞానము ప్రథమతః ఆభాసునకే అయినదై, ఆభాసుడు కూటస్థునితో జేరి, ఆత్మయని గ్రహించి "అహం" శబ్దవాచ్యుడు కూటస్థుడని యెరింగి, కూటస్థుడు సదా బ్రహ్మముతో నభేదమని కాలక్రమమున నేర్చి, యంత దా బ్రహ్మమని తెలియుచున్నడు. కూటస్థునికిని బ్రహ్మమునకును నిత్యాభేదము గలదు. అందుచే వానికి ముఖ్య సామాధికరణ్య ముండును. అట్లుగాక చిదాభాసుడు మాత్రము, తన ఆభాసను వీడిగాని, అనగా బాధ నొందించిగాని బ్రహ్మముతో నభేద వృత్తి నుండడుగాన, దాని సాధాసామా నాధికరణ్యము అని వాకొందును. అందుచే గూటస్థుడు, ముఖ్యసామానాధికరణ్యమున బ్రహ్మముతో నభేదమై యుండ, చిదాభాసుడుమాత్రము బాధాసామానాధికరణ్యమునమాత్రమే నభేదత్వమును బొందునని గ్రాహ్యము (వి. 133).

అందుచే, దానకర్ణుడు కుంతీసుతుడై యుండియు, నజ్ఞానమున గానని దలంచినట్లు, సదా నిత్య శుద్ధ ముక్త బ్రహ్మమవై యుండియు, జీవభ్రాంతి దుఃఖముల గ్రుంకనేలః "నేనేబ్రహ్మము" నని ఎరింగి, దుఃఖనివృత్తినొంది

తత్కాలమున బరమానంద ప్రాప్తి బొంది, "ధన్యోహం" ధన్మోహమస్మి" అని యుండుమని, నిశ్చలదాస మునీంద్రుని ఉత్తమ సాధకలోకమునకు ఉచిత ఉద్బోధ.

అట్లుగాక, మందాధికారివైనచో నధైర్యముల బడక, ఉత్తమాధి కారులకు శ్రవణాదికమైనచో, మధ్యమాధికారులకు, నిర్గుణ బ్రహ్మవిషయ అహంగ్రహోపాసనముషయుక్తముగా గ్రహించి, సాధింప, మరల యతీం ద్రుని ఉపదేశము (వృ. 303).

"అందులకుగూడ నశ్వత అభావమైనను జింతిలవక, సగుణోపా సనము గావింపుము. అదియు శక్యముగానిచో నిష్కామకర్మ ద్వారమున బరమాత్మ భజనము గావింపుము- అదియు గాదేని సకామ శుభకర్మము నాచ రింపుము". అని విశాల హృదయుడైన నిశ్చలదాస సాధుపుంగవుడు, సాదక లోకముపై గరుణాదృష్టుల జూచి, బోధించి, ఉద్బోదించి, ధైర్యోత్సా హముల బురిగొల్పి, మార్గమున సాధకులకు నిశ్చలత్వమును బ్రసాదించి యున్నాడనుటకెట్టి సందియము లేదు. ఆ సాధువర్యునికి సర్వసాధకుల ప్రణామసహస్రములు!

## జీవన్ముక్తి

స్థూల, సూక్ష్మ, కారణశరీరములకంటె భిన్నమైన తన స్వరూ పము సాక్షాత్పరబ్రహ్మముగానున్నది. ఈ ప్రకారము అహం బుద్ధిచే

బరబ్రహ్మ స్వరూపముయొక్క అపరోక్షజ్ఞాన మెవనికి గలిగినదో వాని ముక్తుడందురు అని నిర్వచనము (వి. 43). అట్టివాని దృష్టికి యీ ప్రపంచము, ఆకాశ కుసుమచందముగ నుండును. అందుచే దీనికి ఈశ్వరుడను కర్త లేడు. దీని వీక్షించు సాక్షియు అభావము. దృగ్దృశ్యములను గానము. బంధ మెచ్చటిది? అట్టిచో మోక్షము ఎచట? అజ్ఞానమే లేనిచో జ్ఞానముగూడ శూన్యము అను దృఢ నిశ్చయమున ముక్తుడుండును (వి. 198). అతడు సంతత ఆత్మానందమున నుండి, విషయానందదూరుడై యుండును [వి. 73]. అహం బ్రహ్మాస్మి అను వృత్తికి విషయమైన బ్రహ్మముతో సంబంధమేర్పడి, బ్రహ్మజ్ఞానము అతనికి ప్రత్యక్షమై యెప్పారును [వి. 153]. అట్టి వానికి గర్తవ్యతాబుద్ధి ఎట నుండును? అనగ ఏది చేయవలెనను కర్తవ్యత్వముండదని భావము. [వి. 199]. అయినను జ్ఞాని, నివృత్తుడుగమాత్రమే యుండవలయునను నియమములేదు. ప్రవృత్తి, నివృత్తుల జ్ఞానికి విధించు వేదశాసనము గానము. అందుచే నతడు ప్రవర్తనమున నిరంకుశుడుగనే యున్నాడు. వాని వ్యవహారము ప్రారబ్ధబలమున నగుచున్నది. భిక్షాభోజనమాత్ర ప్రవృత్తిహేతువైన ప్రారబ్ధముగలవానికి, అట్టి ప్రవృత్తియే యుండును, అధిక ప్రవృత్తికి ప్రారబ్ధమున్నచో నతనికి నధిక ప్రవృత్తి కలుగును. అధిక ప్రవృత్తుని జ్ఞానికాదనుటకు అవకాశములేదు. యాజ్ఞవల్క్య, జనకాదులిట ఉదాహరింపబడిరి. ప్రథమమున యాజ్ఞవల్క్యుని ప్రారబ్ధము అధిక భోగమునకునై యుండి, తర్వాత క్షీణమై, త్యాగమున కుద్యుక్తుని గావించి, సన్న్యాసమునకు దారితీసియున్నది. అటులే శుక్ర, వామదేవాదులు. వారికి సర్వదా న్యూనభోగమున కను గుణ

ప్రారబ్ధము గలదు. ఈ విధముగ వివిధరీతుల, విలక్షణముగ, వ్యవహారము జ్ఞానులకు వచింపబడియున్నది. అయినను వారి జ్ఞానమున గాని, మోక్షప్రాప్తియందుగాని, అసమానత్వముండనేరదు. ప్రారబ్ధవిశేష మునమాత్రమే బాహ్యమునకు యీ వ్యత్యాసము చూపబడును (వి. 331).

ఆయినను వీరిలో, ఒక తారతమ్యము గోచరము. బాహ్యప్రవృత్తి జీవన్ముక్తి విరోధికాకున్నను, జీవన్ముక్తి సుఖమునకు మాత్రము విరోధిగ నుండును. జీవన్ముక్తి సుఖము అతనికి దూరమగును. ఎందుచేతనన, ఏకాగ్రతారూపాంతఃకరణ పరిణామమువలన జీవన్ముక్తి సుఖము గలుగును. ఆ ఏకాగ్రతా పరిణామము బాహ్యప్రవృత్తిచే నశించును అని గ్రహింప వలెను. అందుచే జ్ఞాని జీవన్ముక్తుడయ్యును ప్రారబ్ధహేతువుచే బాహ్య ప్రవృత్తుడై, జీవన్ముక్తికి భంగము రాకున్నను తద్గత సుఖానుభూతివి మాత్రము బాయునని నిర్ణయము (వి. 333). అయినను మందప్రారబ్ధుడై, బాహ్యప్రవృత్తుడైన జ్ఞాని, వేదాంత చింతనమును గాలము గడుపుమగాని, కర్మోపాసనముల గర్తవ్యము నుంపడు (వి. 275). కర్మోపాసనములతనికి అనుపయోగములు. తన జ్ఞానరక్షణార్థము, కర్మోపాసనా ప్రవృత్తి అతనికి అనావశ్యకము (వి. 274).

ఈ విధముగ జీవన్ముక్తులయినవారిలో గొందరు మాత్రము ఆచార్య స్థానము నలంకరింపగలుగుదురు. వేదార్థమును సక్రమముగ గ్రహించి, జీవ బ్రహ్మైక్యతా నిశ్చయము నున్నవాడై, ఆ స్థితినున్నవాడే ఆచార్యస్థానమున

అధీతవేదుడై, అనగా వేదాధ్యయన తాత్పర్యపరుడై జ్ఞాననిష్ఠలేనివాడు, ఆచార్యపదవికనర్హుడు. అటులే జ్ఞానియయ్యు, అధీతవేదుడుకానివాడు గూడ నా స్థానమున కయోగ్యుడే యగును. జ్ఞాని యగుటచే దా ముక్తి నొందగలడుగాని శిష్యులకు బోధింప నసమర్థుడు. అందుచే శ్రోత్రియత్వ బ్రహ్మనిష్ఠత్వములు గలవాడే ఆచార్యస్థానమునకర్హు డని తాత్పర్యము (వి. 54).

అంత ప్రారబ్ధశేషముగూడ నంతరించి, ప్రపంచ సంబంధముల నన్నింటి ద్రుంచి, పరిపూర్ణజ్ఞానయైనవాడు, అజ్ఞాన నివృత్తితో దత్త్వ జ్ఞానమునుగూడ బోద్రోసి, మౌనియై యుండును (వ్ర. 301). అంత నతడు విదేహముక్తికి నంసిద్ధుడై, అధికారియై యుండును. విదేహముక్తి పరలోక గమనమున ఘటిల్లదు. అతనికి బరలోక గమనములు లేవు. జ్ఞానముచే నజ్ఞాన నివృత్తియై, ప్రారబ్ధ శేషానంతరమున స్థూల, సూక్ష్మ, శరీరా దులు, తమ తమ కారణములైన భూతముల ద్వారమున మూలాజ్ఞాన మున లయించును. ఈ విధముగ జ్ఞానికి విదేహమోక్షము లభించును. శరీర త్యాగమునకుగూడ జ్ఞానికి దేశకాలాద్యపేక్ష లేదు. అనగా నే దేశ మందైనను, కాలమందైనను విదేహముక్తి నాతడు పొందగలడు.

విదేహముక్తి నొందిన జీవుడు ఏమగును? పూర్వము జీవస్వరూప నిర్వచన సమయమున గాంచినట్లు, జీవేశ్వరులిరువును చైతన్య ప్రతిబింబ ములు. జీవుడు, తనకుపాధియైన అంతఃకరణరూప అజ్ఞానమును నిరాస మొనరింప, నుపాధితోబాటు అందుగల ఆభాసయు నంతరించును. బింబ

ప్రతిబింబ సంబంధమున, ప్రతిబింబము అదృశ్యమై బింబములో మాత్రమే అయించుటచే, ఇచటగూడ జివాభాస స్వరూపుడైన జీవుడు, తన ఆభా సత్వమును గోల్పోయి, తన కధిష్ఠానమైన బింబములో ననగా బ్రహ్మ చైతన్యమున లీనమగును. అందుచే ముక్తజీవులకు బ్రాప్యము పరబ్రహ్మ చైతన్యమగుగాని ఈశ్వరుడుకాడు. ఈశ్వరుడుగూడ ప్రతిబింబమే గదా! కాన జీవుడు ముక్తదశలో శుద్ధబ్రహ్మ చైతన్యముతో నైక్యమగును అని గ్రాహ్యము (వృ. 188). ఈ విధముగ నవిద్యా ప్రాభవమున గల్పిత మైన సంసారనివృత్తియే. మోక్షముగ నగుచున్నది. కల్పిత నివృత్తి అధిష్ఠానరూపము. అందుచే బ్రహ్మరూపమే మోక్షమని సిద్ధించుచున్నది [వృ. 343]. ఇచట కేవలము దుఃఖాభావముమాత్రమేగాక, పరమానంద ప్రాప్తియే ముఖ్యముగ నుండును. అందుచే నీ పరమపురుషార్థము సుఖమై యున్నది. అనగ సమస్త కల్పితమునకు అధిష్ఠానరూప బాధగలిగి, నిర్ద్వైత స్వరూప, పరమానందరూప, పరమపురుషార్థము మోక్షమై యున్నది [వృ. 353].

ఈ విధముగ నిశ్చలదాస సాధుపుంగవుడు, తన సుప్రసిద్ధ విచార సాగర, వృత్తిప్రభాకర, గ్రంధముల మూలమున, ధన అద్వితీయ శాస్త్ర జ్ఞానముచే, శుద్ధాద్వైతసిద్ధాంత వాద ప్రతిపాదనము గానించి, పరసిద్ధాంత ముల నిర్వీర్యమొనరించి, అకుంఠితాద్వైతసిద్ధాంత ప్రతిష్ఠ గావించి, అగణి స్తుతి పాత్రుడై యున్నాడు. అతని అప్రతిహత రచనావిధానము అసామా న్యము, అద్భుతము. ఆర్ష సంస్కృతవాణి యందర్గతమై, సామాన్య

ముముక్షువులకలభ్యమైన పరమాద్వైతసిద్ధాంతమాధుర్యమును నెల్లరముఖ ముల కందించి, రుచిజూపి, ఆ పరమానంద సాగరమున నితడు ముంచి యుండుట దీన గాననగును. సేకించి, పఠించి, సాధించి, అనుభవించిన అమూల్య అద్వైతానందసుధా రసాయనమును సర్వసామాన్య ముముక్షు లోకమునకందించి ఆనందింపజేసిన యీ యతివరేణ్యుడు, ఎల్ల రకు పూజ్యుడు. ఆ జ్ఞానమూర్తికనేక సహస్ర సాష్టాంగవందనముల నర్పించెదము గాక!

# పరిసమాప్తి

'ఏకదేశేన సదృశముపమానం న సర్వథా' (3.10.12) ఉపమానము ఒక విషయమున నన్వయించునుగాని సర్వ విధముల గాదను యోగవాశిష్ఠ రామాయణ వాక్యము ననుసరించియు, నదే తాత్పర్యమును వివరించుచు, 'న హి దృష్టాంత దార్ష్టాంతికయోః క్వచిత్కంచిద్వివక్షితమంశం ముక్త్వా సర్వసారూప్యం కేనచి ద్దర్శయితుం శక్యతే సర్వసారూప్యే హి దృష్టాంత దార్ష్టాంతిక భావోచ్ఛేద ఏవ స్యాత్' (బ్ర.సూ.భా. 3.2.20) ఎచ్చటనైన దృష్టాంత దార్ష్టాంతికములకు వివక్షింపబడిన యెద్దియే నొక యంశమును విడిచి, సర్వసారూప్య మెవ్వనిచేతను జూపింప నశక్యముగదా! సర్వ

విధములచే సారూప్యము గలుగునో, దృష్టాంత దార్ష్టాంతిక భావమే విచ్ఛేదమగుచున్నది అను శ్రీ శంకర భాష్యసూక్తియు, సూక్ష్మదృష్టి జరి శీలింపబడియే యున్నచో నద్వైత సిద్ధాంత సాహిత్యమున నింత విభిన్న భావములకు అవకాశముండి యుండెడిది కాదు. ప్రతిబింబవాదమున, బింబ ప్రతిబింబములకనన్యత్వమున్నను, ప్రతిబింబము ఆభాసమై, అయథార్థమైన సత్యమును ప్రతిపాదకులు చిత్తముల ధరించి వచింప, నా ప్రతిబింబ హేతుత్వమును దర్శించి, బింబ ప్రతిబింబములతో ప్రతిబింబకారణమైన దర్పణాదికమును జూపి, అద్వైతభంగమును, ప్రతిబింబము బింబబాహ్య మగుటచే, అనంతత్వభంగము మొదలగు దోషాభాసముల నా ప్రతిబింబ వాదమున జూపెట్టి, దాని నవచ్ఛేదవాదులు అపవాద మొనర్చుచు ననేక ఉద్గ్రంథముల సృజించిరి. అటులే అఖండత్వమున, నిరవయత్వమున ఖండత్వ అవయవత్వములను, స్వగతభేదమును, అంశాంశిత్వ ములను జూపరచి, నిర్వికారత్వము వికారత్వములచే అద్వైత బ్రహ్మమునకే ఈ అవచ్ఛేదవాదముగ ప్రతిబింబవాదులు దీని ఖండించిరి. ఈ విధముగ యోచించుచో 'యద్వాచాన భ్యుదితం యేన వాగభ్యుద్యతే' తదేవ బ్రహ్మత్వం విద్ధి .. ..ఏది వాక్కుచే జెప్పబడక, వాక్కున కాధారభూతమో అదియే బ్రహ్మత్వముగ గ్రహింపుమను కేనోపనిషద్వా క్యము, 'అన్యదేవ తద్విదితా దదొ అవిదాత ధి' ఆ బ్రహ్మము తెలియ బడినదానికన్యమై, తెలియబడనిదానికతీతము అను మొదలగు అసంఖ్యాక శ్రుతి తాత్పర్యమునకు వ్యతిరేకముగ, దాని వచించి, వర్ణించి, వివరించి,

బోధింపయత్నింప, నిన్ని వ్యత్యాసములు బాషలో నుత్పన్నములై, సిద్ధాంత ప్రతిపాదనమున సంక్షోభమును గలిగించినవి. Which is indifinable is God. ఏది అనిర్వాచ్యమో అది బ్రహ్మమును వివేకానంద వాణి ఎంత ఉచితమోగదా! అటులే an understood God is no God at all గ్రహింపబడిన భగవంతుడు భగవంతుడేకాడను Jacobi జకోబి వాక్యము ఎంత సారభూతము! ఈ పరపు క్లిష్టత్వమును గమనించియే, Truth canot be expressed in words, and when words are used, even by Sankara, acute minds can always find a loop-hole for attack. సత్పదార్థము నిర్వాచ్యముకాదు. దాని వచింప శంకరుచేనైన పదములుపయోగింపబడినచో, సూక్ష్మబుద్ధులు ఖండింప, నందు లోపముల సర్వదా కనుగొనగలరు అని దగ్లసు ఆన్స్లీ డఫ్ వాక్యములు ఎంత యదార్థములు! అనిర్వాచ్య బ్రహ్మమును అనిర్వాచ్యమని వచించుటగూడ నిర్వచించుటయే గదా! అనామకమైన ఆ తత్త్వమునకు బ్రహ్మము నా సాంకేతికమును వాడుటయు నామకరణమొనరించుట యగును గదా! అది గలదని తెలుపుటయు, నా వగ్రాహ్యమును గ్రహించి సంకుచితపరచుట యగుచున్నది! అందుచే నవ్యవహార్యము, నవ్యపదేశముగ. మౌనముద్రకంటె వేరుగత్యంతరమభావమా? అవును, అనుభవమున నంతియే. పారమార్థికముగ ననిర్వాచ్యాదిక పదజాలములన్నియు నన్వయములగును, కాని వ్యావహారికమున నది సంకుచితము, కలుషితము.

అందుచే, నద్వైతశాస్త్రమున నీ సమన్య ప్రస్ఫుటము. అయినను శాస్త్రము శాస్త్రజ్ఞులు, అనుభవము అనుభవవేత్తలు, పారమార్థిక సత్య

మును వ్యావహారిక సత్యమునకు దించి, అజ్ఞోద్ధరణమున
వివరింప, విన్ని దోషములందున్న విధాన దోచునుగాని,
అసలు సత్పదార్థమున నుండజాలదు. తెలియబడనిదానిగు
ఎంత వంచించినను అది తెలియబడినట్లు అగునా? దోషవ
ననంఖ్యాక దోషముల నాపాదింపజేసినను అది దోష
అది సర్వదా, సర్వధా అతీతము, అవాఙ్మానసగోచరము
మెన్ని విధముల దానిని వర్ణించినను, జ్ఞానులు దాని వివిధ
జూచినను, దాని అద్వైతస్థితికి, దాని సర్వాతీత సంస్థితు
మేర్పడదని సుస్పష్టము.

అయినను పూర్వోక్తరీతి, బ్రహ్మానిర్వచన ప్రయత్న
దోషములు ఆపాదింపబడిన చందము, ఆ యనిర్వాచ్యము
మును, ఛాత్రగ్రహణమునకై ఉపమానముల ద్వారమున
దేశింప యత్నింప, నా యుపమానముల నెట్లు అన్వ
గ్రహింపవలయునో, ఆ నియమముల నతిక్రమించి, అ దృష్టాం
నన్వయించి, విమర్శించి, శాస్త్రజ్ఞులు అనేక క్లిష్టత్వము
తెలియనిదాని గ్రహింప దానిబోలు దెలిసినదాని జూపి, స
ముల వివరించి, విశేషాంశ గ్రహణమునకు దారిజూపు
చారము. సింహబలుడను ఉపమానమున, సోమదత్తునకు సిం
కోరలు, కూ్రరత్వములుగూడ నుండవలెను గదా అనుట
జనము! సోమదత్త సింహములకు బల లక్షణమునగదా సా
గాక కూ్రరత్వాది విశేషాంశములగూడ నన్వయించు ఎంత

ఈ విధముగ శాస్త్రనియమముల బాటింపక, శ్రీ శంకరానంతర అద్వైత వాదులు, ఉపమానోపమేయ విషయముల నన్వయించుటలో, ప్రతిబింబ అవచ్ఛేదవాదముల సమన్వయించుటలో, అద్వైత సిద్ధాంతమును అతి క్లిష్టత్వమగు అగాధమున ముంచిరని తోచును. ఇట్లు వీరు, ఉపమానముల ప్రధానముగ గైకొని, అందద్వైతసిద్ధాంతభంగము వాటిల్లకుండుటకు, పరస్పర ఖండన మండనముల గావించి, స్వర్ధుష్ట అద్వైతవాద ప్రతిష్ఠాపన మునకై యత్నింప, అద్వైతేతర సిద్ధాంతులు యీ యపమార్గమునవే ద్రొక్కి, అద్వైత వాదమున ద్వైత్వమును జూపించి, శ్రీ శంకరాద్వైత సిద్ధాంతముననే పరిహసించి, అపవాదమొనరింప యత్నించిరి విషమస్థలలో గల మాయా బ్రహ్మములు వారికి ద్వైతముగ దోచెను! అనగ సదసత్తులకు వీరిదృష్టిలో బొందిక కలిగి ద్వైతము స్ఫురించెను! వెలుగునీడలకు వ్యవహారమున బొందిక కలుగునట్లు గోచరముగాని యథార్థమున వానికి స్నేహమెచ్చట! ఉన్నవానికి లేనివానికి మైత్రి ఎట్లు? ఇటులే యీ దృష్టాంతముల ద్వారమున బ్రహ్మనిర్వచనము అనేక విధముల, శాస్త్రవిచారణమున సంక్షోభమును రేకెత్తించి, అపమార్గముల ద్రొక్కించి, శాస్త్రమునకే అన్యాయమొనరించి యున్నదని దీని విదితము.

దీని గూఢంకషముగ విచారించిన సాధు నిశ్చలదాసు, తన వృత్తి ప్రభాకరమున. వార్తికకారుడును, శ్రీ శంకరసాక్షాత్తు శిష్యుడును అయిన సురేశ్వరుని, 'సిద్ధాంత ముక్తావళి' కర్త యగు ప్రకాశానందుని భావముల ప్రమాణముగ స్వీకరించి, ప్రతిబింబ, అవచ్ఛేదవాదముల నపవాదములుగ బోద్రోసి, కుంతీపుత్రుడైన కర్ణుని దృష్టాంతమును గైకొని, కర్ణుడు రాధా

సుతుడగుట మిథ్యావ్యవహారమై యథార్థము కానట్లు, అనాద్యవిద్యామహిమచే స్వకీయ బ్రహ్మభావముయొక్క ఆవరణముచే జీవత్వ భ్రాంతి గలుగుననియు, నదితత్త్వమస్యాది మహావాక్య శ్రవణముచే నివారితమనియు, యథార్థమున నా బ్రహ్మము నిత్య శుద్ధ బుద్ధ ముక్తస్వరూపమనియు స్పష్టపరచి, యిదియే ఆరూఢ విద్వాంసుల నిశ్చయముగ నొక్కి వక్కాణించియున్నాడు. అవును, ఆరూఢత్వమున, ప్రౌఢత్వమున నెట్టి సంశయములు లేవుగదా! అదియే పరమార్థము. అయ్యదియే పరమ సిద్ధాంతము.

ఈ విధముగ శాస్త్రాధ్యయనమును, శాస్త్రసమ్మతిని మించక, శాస్త్ర నియమముల బాటించుచు, యథార్థ శాస్త్రతాత్పర్యమును గ్రహించి ధన్యులమగుదుముగాక!

ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే॥

హరిః ఓం తత్ సత్

) ం (

స్థాపితము : 1951.

# శ్రీ అనుభవానంద గ్రంథమాల

ఉద్దేశ్యము : ఈ గ్రంథమాలలో శ్రీ అనుభవానంద స్వాములవారి, శ్రీ మాతాజీ త్యాగీశానందులవారి మరియు ఇతరులచేతను రచితములైన భక్తి జ్ఞాన వైరాగ్య ప్రబోధక గ్రంథములు ప్రకటింపబడును.

విధానము : సంవత్సరమున మొత్తమునకు రెండువందల పుటలుగల గ్రంథములు వెలువడుచుండును.

విరాళము : 1] రు. 1116/- మించు విరాళమొసంగువారు మహారాజ పోషకులు. వీరి ఫొటో ఒక ముఖ్య గ్రంథమున ప్రకటింప బడును.

2] రు. 516/- మించు విరాళమొసంగువారు రాజపోషకులు. [సంవత్సరమున 10 వాయిదాలలో పైకము చెల్లింపవచ్చును]

* గ్రంథమాల పుస్తకములను వీరు ఉచితముగా బడయుదురు.

---

గ్రంథమాల మహోద్యమమునకు ఎల్లరు ఉచితరీతి దోడ్పడుదురుగాక!

---

* వి. పి. ద్వారా పుస్తకముల కోరువారు, పుస్తకములఖరీదు పైకమును ముందుగా పంపవలెను.

** పోస్టేజ్, ప్యాకింగ్ ఛార్జిలు ప్రత్యేకము.

*** ఉత్తర ప్రత్యుత్తరములకు రిప్లైకార్డు వ్రాయవలెను.

# ప్రచురణములు



## 1. సాధన రహస్యము (8 వ ముద్రణ) (Revised - Edition)

ముముక్షువులు సాధన ఎలా చేయాలి ? దాని ఫలితములు, ఆధ్యాత్మికాభివృద్ధికి మార్గములు, చక్కని వ్యావహారిక భాషలో తెల్పిన అశేష ప్రజాదరణ పొందిన మహోత్కృష్ట గ్రంథరాజము. 22-00

[సంస్కృతము, ఇంగ్లీషు, హిందీ, మరాఠి, తమిళ, కన్నడ, మళయాళ భాషలలో అనువదింపబడి ప్రచురింపబడనున్న గ్రంథము.]

## 2. సాధన మకరందము (2 వ ముద్రణ)

సాధన విషయము లేకాక, అనేక నిత్యావసర విషయముల విచారణ మిందుకలదు. శ్రీ స్వాములవారి జీవితమున జరిగిన కొన్ని సంఘటనలు యిందున్నవి. 5-00

## 3. సాధనసుధ (3 వ ముద్రణ) (Revised - Edition)

సాధనలో దగులు ఆటంకముల నివారింప అమూల్యమగు సలహాల నొసంగు గ్రంథము. శ్రీ స్వాములవారి జీవితమున జరిగిన కొన్ని సంఘటనలు ఇందు కూర్చబడినవి. [ఇందులోని కొన్ని తత్త్వములు "స్టీరియో కేసెట్" రూపమున వెలువడినవి.]

## 4. అనుభవ రహస్యము

సాధనానుభవములు పొందుటకు సాధకులకు మార్గదర్శి యగు "సాధనరహస్య" అనుబంధ గ్రంథరాజము.

5. మన రామకృష్ణుడు (3 వ ముద్రణ)

జగద్గురు శ్రీ రామకృష్ణుని అద్భుతాదర్శ, సాధన వివరముల తెలుపు మహత్తర గ్రంథము. 5_00

6. మన శారదామాయి (3 వ ముద్రణ)

జగన్మాత శ్రీ శారదామాయి జీవితోపదేశముల వివరించు ఉత్సాహ పూరిత గ్రంథము, 5_00

7. మన వివేకానందుడు (3 వ ముద్రణ)

వేదాంతకేసరి శ్రీ వివేకానందుని జీవితాదర్శముల ప్రబోధించు ఉత్కృష్ట గ్రంథము. 5_00

8. శాంతి సామ్రాజ్యము (2 వ ముద్రణ)

శాంతినిగోరు నేటి ప్రపంచమునకు శాంతిప్రబోధగావించు ఉత్తమ గ్రంథము. 2_00

9. శ్రీ రామకృష్ణాదర్శము (3 వ ముద్రణ) (Revised – Edition)

శ్రీ రామకృష్ణుని సాధన, సిద్ధుల రహస్యముల వివరించు ఉత్తేజకర గ్రంథము. 2_00

10. శ్రీ శారదాదర్శము (2 వ ముద్రణ) (Revised–Edition)

ఇందు శ్రీ శారదాదేవి గొప్పదనము మన హృదయముల గదిలించును. 2-00

11. శ్రీ వివేకానందాదర్శము (3 వ ముద్రణ) (Revised – Edition)

శ్రీ వివేకానందుని ఆదర్శము ఇందు ప్రస్ఫుటముగా విరచితము. 2_00

12. శ్రీ అనుభవానందాదర్శము

ఇందు శ్రీ అనుభవానందుల ఆదర్శానుభవములు గోచరము.

2-00

13. మాండూక్యరసాయనము (2 వ ముద్రణ)

మాండూక్య ఉపనిషత్తుకు 108 ఉపనిషత్తుల ముఖ్యమంత్రముల, గౌడపాద కారికలతో శ్రీ అనుభవానందుల అద్భుత వ్యాఖ్యానము గల గ్రంథము.

5-00

14. ప్రాచీన భగవద్గీత (2 వ ముద్రణ) (Revised - Edition)

745 శ్లోకములు గల గీత. ఇది భోజపత్ర వ్రాతప్రతినుండి గ్రహింపబడి, శ్రీ అనుభవానందులచే పీఠిక వ్రాయబడినది. తాత్పర్యము కలదు.

15. శ్రీ రామకృష్ణ పూజ (2 వ ముద్రణ)

(Revised – Edition)

శ్రీ రామకృష్ణ సహస్రనామము, శ్రీ రామకృష్ణ, శ్రీ శారదా, శ్రీ వివేకానంద, శ్రీ అనుభవానందుల అష్టోత్తర శత నామములు యిందు కలవు. శ్రీ రామకృష్ణ అష్టోత్తర శతమునకు ఉపనిషత్ మంత్రములతో శ్రీ త్యాగీశానందుల చక్కని వ్యాఖ్యానము కలదు.

6-00

16. శ్రీ రామకృష్ణ లీలాసంకీర్తనము (6 వ ముద్రణ)

(Revised – Edition)

భక్తి, జ్ఞాన, వైరాగ్య ప్రబోధక కీర్తనలు. 169.

[ఇందులోని కొన్ని పాటలు "శ్రీ రామకృష్ణ గానసుధ" రూపమున 'స్టీరియో కేసెట్' గా విడుదల అయినవి. మరి కొన్నిపాటలు 'కేసెట్'రూపమున వెలువడనున్నవి.]

6-00

17. శ్రీ రామకృష్ణ-వివేకానంద కథాగానములు

శ్రీ రామకృష్ణ, వివేకానందుల జీవితములు ప్రదర్శించుటకు అనుగుణ్యముగా శ్రీ స్వాములవారిచే విరచితము. ఆంధ్రదేశమున 100 ప్రదర్శనలకు పైగా యీయబడినవి.

18. యుగావతారము

శ్రీ రామకృష్ణ గాన కథామంజరి ["స్టీరియో కేసెట్" రూపమున వెలువడ నున్నది.]

19. పరమహంస (Pocket Size Book)

"స్టీరియో కేసెట్" రూపమున విడుదల కానున్నది.] 0-50

20. స్వామి వివేకానంద (Pocket Size Book)

["స్టీరియో కేసెట్"గా విడుదల కానున్నది.] 0-50

21. శ్రీ రామకృష్ణాంజలి (5 వ ముద్రణ)

శ్రీరామకృష్ణ తత్త్వమునుగూర్చి భక్తి, ఉత్సాహపూరిత శతకము-వివరణములతో. 1-50

22. శ్రీ దక్షిణేశ్వరీ స్తవము (4 వ ముద్రణ)

శ్రీ కాళికాదేవినిగూర్చి భక్తితో తత్త్వవిషయముల బోధించు శతకము-వివరణములతో. 1-50

23. చిత్తప్రబోధ (4 వ ముద్రణ)

సాధకులకు అనేక అమూల్య రహస్యములను, మనోతత్త్వమును గూర్చి బోధించు శతకము - వివరణములతో. 1-50

24. అనుభవానందము (4 వ ముద్రణ)

అద్వైతానంద విభూతి వ్యక్తపరచు, అద్భుతానుభవ శతకము.
(A Master-piece in the Vedanta Literature.) 0-75

25. ఉపనిషత్ వైభవము

108 ఉపనిషత్తులగూర్చి సులభశైలిలో ప్రత్యేకముగా పుస్తకములు.

# సర్వసిద్ధాంతసారభవము (12 సంపుటములలో)

[మన భారతీయ సంస్కృతి, వాఙ్మయమునుగూర్చి,పరిశోధనాత్మక (Re-search) గ్రంథములు. (An Encyclopaedia of Indian Philosophy) సుమారు 4,500 పుటలలో.

26. సాంఖ్య, యోగములు (3 వ ముద్రణము)

సాంఖ్య యోగ విషయములతో శ్రీ కపిల, పతంజలి మహర్షుల జీవితకాల విశేషములు, సిద్ధాంతములు యిందు విరచితము. 20-00

27. వైశేషిక, న్యాయములు (2 వ ముద్రణ)

శ్రీ కణాద, గౌతమ మహర్షుల జీవితకాల విశేషములు వైశేషిక, న్యాయ సిద్ధాంతములు పండితాభిప్రాయములతో చర్చితము. 20-00

28. మీమాంస, వేదాంతములు (2 వ ముద్రణ)

జైమిని, వ్యాసమహర్షుల జీవితకాల సిద్ధాంతములు ఆధుని పండితాభిప్రాయములతో రచితము. 20-00

29. శ్రీ శంకరపూర్వాద్వైతము (2 వ ముద్రణ)

వేదములనుండి శ్రీ శంకరులవరకు ప్రవహించు అద్వైత రస ప్రవాహమును తెలుపు విపుల గ్రంథము. అద్వైత సిద్ధాంతమునకు ఆధునిక భౌతిక విజ్ఞానమునకు సమన్వయము జూపును. 20-00

30. శ్రీ శంకరాద్వైతము (2 వ ముద్రణ)

శ్రీ శంకర జీవితకాల విశేషములు, అద్వైత సిద్ధాంతము విస్తృతముగా వివరింపబడినవి. సన్న్యాస ప్రాశస్త్య, అధికా వివరములును కలవు. 20-00

31. శ్రీ శంకరానంతరాద్వైతము (2 వ ముద్రణ)

శ్రీ సురేశ్వర, విద్యారణ్య జీవితకాల విశేషములతో అద్వైత సిద్ధాంతములిందు చర్చితము. 20-00

32. విశిష్టాద్వైతము (2 వ ముద్రణ)

వేదములనుండి వైష్ణవ సిద్ధాంత జనన చారిత్రము, శ్రీ రామానుజ జీవిత సమీక్ష, విశిష్టాద్వైత సిద్ధాంత వివరణములిందు ప్రస్ఫుటము. 20-00

33. వైష్ణవము (2 వ ముద్రణ)

శ్రీ మధ్వాచార్యునినుండి శ్రీ కృష్ణచైతన్యుని వరకుగల వైష్ణవాచార్యుల జీవిత సిద్ధాంత విషయములు సమీక్షింపబడినవి. 20-00

34. శైవాద్వైతము (2 వ ముద్రణ)

వేదముల రుద్రాధ్యాయ జనితమైన శైవసిద్ధాంతము, వీరశైవము వరకు ఎట్లు పరిణమించియున్నదియు నిట స్పష్టము. నాయనారుల జీవితములు కలవు. 20-00

35. శాక్తాద్వైతము (2 వ ముద్రణ)

వేదాంతర్గత దేవీసూక్త అదితి ప్రస్తావనతో ప్రారంభమై, దక్షిణ వామాచారరూపమున సర్వత్ర ప్రఖ్యాతి నొందిన శాక్తసిద్ధాంత సాధనములతో వివరింపబడినవి. 20-00

36. బౌద్ధము

బౌద్ధసిద్ధాంతము - ప్రాముఖ్యత, శ్రీ బుద్ధభగవానుని, జీవిత విశేషములు పరిశీలనాత్మకముగా వివరింపబడినవి.

37. సర్వ సిద్ధాంత సౌరభ సారము

సులభశైలిలో "సౌరభము"ను గూర్చి వివరణాత్మక గ్రంథము.

38. శ్రీ రామకృష్ణ గానసుధ (స్టీరియో కేసెట్)

మధురమైన భక్తిపాటలుగల స్టీరియో కేసెట్.

వెల. రు. 40-00 లు రిజిష్టర్ పోష్టులో రు. 44-00 లు

39. భారతీయ సంస్కృతి (స్టీరియో కేసెట్)

భక్తిపాటలతో భారతీయ సంస్కృతినిగూర్చి శ్రీ మాతాజీ త్యాగీశానందుల అనర్గళ ఉపన్యాసములుగల స్టీరియో కేసెట్.

వెల రు. 30-00 లు రిజిష్టర్ పోష్టులో రు. 34-00 లు

*పై రెండు కేసెటులు తీసుకొనేవారికి పోస్టేజి ఉచితము*

40. స్టిక్కర్లు (Stickers), ఒక్కొక్కటి 4 రంగులలో, సైజు 7" × 5".

1) ఓంకారము, 2) శ్రీ రామకృష్ణ పరమహంస, 3) శ్రీ శారదామాయి, 4) శ్రీ వివేకానందస్వామి. ఒక్కొక్కటి .... 1-50

*అముద్రితములు*

1) శ్రీ అనుభవానందస్వామి జీవితచరిత్ర, 2) శ్రీ అనుభవానందుల లేఖావళి, 3) శ్రీ అనుభవానందుల ఉపన్యాసములు, 4) అనుభవామృతము, 5) మన భారతీయ సంస్కృతి, 6) శక్తి పూజా విశిష్టత, 7) మంత్ర శాస్త్రము, 8) తంత్రశాస్త్రము, 9) శాక్తేయము - శ్రీ రామకృష్ణుడు, 10) పరమహంస ప్రబోధము, 11) శ్రీ శారదా సందేశము, 12) శ్రీ వివేకానంద విజయభేరి, 13) శ్రీ త్యాగరాజ హృదయం మొ॥.

* శ్రీ అనుభవానంద స్వాములవారు చిత్రించిన 'ఓంకారము', శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదామాయి, శ్రీ వివేకానంద స్వామి ఫొటో కాపీలు కాబినెట్ మరియు ఫుల్ సైజులో మన గ్రంథమాలలో లభించును. *

## ★ భారతీయ ఆధ్యాత్మిక విజ్ఞాన సర్వస్వము ★

మానవ లక్ష్యము అద్వైత గమ్యమైన ఆనందానుభవము. దానిని పొందుటకు మానవుడు 'కోహం?' నేను ఎవడను అని ప్రశ్నించుకొని, 'నాహం' యీ నామరూప విశిష్టమై, పంచభూతాత్మకమైన స్థూల ప్రపంచమును నేను కాను అని ధ్యానించుకొని, 'సోహం' సర్వాతీతమై, సకలాధారమై, సర్వాంతర్గతమై యుండునదియే నేననియు, అదియే 'ప్రజ్ఞానం బ్రహ్మ' 'విజ్ఞాన మానందం బ్రహ్మ' అను ఆనందమని గ్రహించి సమాధి సంస్థితుల నుండుటకు దానికి గురువు అత్యంతావసరము. అందువలననే 'అస్మదాచార్యపర్యంతాం వందే గురుపరంపరాం' అని గురుపరంపరలో తన గురువుకు నమస్కరించుట మన సంప్రదాయము.

శ్రీ శంకరుని అనంతరము ఆ యద్వైతము జిజ్ఞాసుముముక్షువుల పెన్నిధిగ జేసి, ఆ యద్వైత వృక్షమును శాఖోపశాఖలుగ విస్తరింపజేసి, ఆ యద్వైత జ్ఞాన సౌరభమును నలుదిక్కుల ప్రసరింపజేసి, ఆ యద్వైత మహాస్రవంతిని సర్వత్ర ప్రవహింప జేసినవారు శ్రీ శంకరుని శిష్యులేగాక, ఆ సిద్ధాంతముల తమ మేధాశక్తిని మేళవింప జేసి, మెరుగుపెట్టినట్టి బ్రహ్మసూత్రభాష్యవ్యాఖ్యానాది బహుగ్రంథరచయిత శ్రీ వాచస్పతి మిశ్ర, 'పంచదశి' మొదలగు గ్రంథముల ప్రసాదించిన శ్రీ విద్యారణ్యమునీంద్రుడు, 'విచారసాగరము' మున్నగు గ్రంథముల ప్రకటించిన శ్రీ సాధునిశ్చలదాసాది మహాత్ములు. వారి జీవిత విశేషములు, వారి గ్రంథరచనా విధానములు, వారి ప్రబోధాత్మకములు ఈ గ్రంథమున కలవు. ఇదియే శ్రీ శంకరానంతరాద్వైతము.

ఈ భాగమున శంకరానంతరాద్వైత వివరములు కలవు.

★ *An Encyclopaedia of Indian Philosophy* ★